# సారంగధరీయము

## త్ర్యర్థి కావ్యము



కృతి కర్త

'కవిసింహ' శ్రీ పోకూరి కాశీపత్యవధానులు

తెలుగు విశ్వవిద్యాలయం,

హైదరాబాదు - 500 004.

# సారంగధరీయము

త్ర్యర్థికావ్యము

కర్త:

'కవిసింహ' శ్రీ పోకూరి కాశీపత్యవధానులు





ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

కళాభవనం, సైఫాబాదు

హైదరాబాదు-500004

సారంగధరీయము
కృతికర్త 'కవిసింహ' శ్రీ పోకూరి కాశీపత్యవధానులు
తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ . 93

మే 1990

ప్రతులు · 1000

**వెల : రు. 38-50**

ప్రాప్తిస్థానం :
**తెలుగు విశ్వవిద్యాలయం**
ప్రచురణల విభాగం
కళాభవనం, సైఫాబాదు
హైదరాబాదు 500 004

ముద్రణ ·
**మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్**
1-1-581, గాంధీనగర్
హైదరాబాదు - 500 380

**ఆచార్య సి. నారాయణరెడ్డి**
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

# భూమిక

తెలుగు భాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖ వికాసానికీ, వికసనానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ చేసిన చట్టం ప్రకారం 1985 డిసెంబరు 2 వ తేదీన రూపుదాల్చిన విశిష్ట విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. బోధన, పరిశోధన, ప్రచురణలతోపాటు విస్తరణసేవ, రాష్ట్రేతర రాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పన వంటి బహుముఖీన కార్యక్రమాలనుకూడా విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది పూర్వంవున్న సాహిత్య, సంగీత, నృత్య, నాటక, లలితకళా అకాడమీలు, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు కేంద్రం విలీనం కావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాల, కేంద్రాల, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తోంది.

తెలుగుజాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధానాశయాలలో ఒకటి విశ్వవిద్యాలయంలో విలీనమైన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవిశ్రాంత కృషిద్వారా దేశ సాహిత్య రంగంలో విశిష్టస్థానం సంతరించుకుంది. 1957 ఆగస్టు 7 వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఈ అకాడమి దేశంమొత్తంమీద ప్రప్రథమ రాష్ట్రస్థాయి అకాడమి కావడం విశేషం. ఈ అకాడమి ప్రామాణికమైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనా సాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవితచరిత్రలు, అనువాదాలు మొదలైనవి అనేకం ప్రచురించింది.

సంగీత, నృత్య, నాటక, లలితకళా అకాడమీలు తమ ఆశయాలకూ, లక్ష్యాలకూ అనుగుణమైన గ్రంథాలను ప్రకటించాయి. అంతర్జాతీయ తెలుగు సంస్థ ఇతర ప్రాంతాలలో నివసిస్తున్న తెలుగువారికి పెక్కు గ్రంథాలను అందించింది తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వ సంపుటాలను ప్రచురించింది.

తెలుగు విశ్వవిద్యాలయం ఈ ప్రచురణ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తూ, ఇంతవరకు 92 గ్రంథాలు వెలువరించింది.

ప్రస్తుత ప్రచురణ 'సారంగధరీయము' విలక్షణ గ్రంథం ఇది త్ర్యర్థి కావ్యం ప్రబంధ యుగం తరువాత తెలుగులో వచ్చిన త్ర్యర్థికావ్యాలు చాలా అరుదు సుప్రసిద్ధ పండితకవి శ్రీ పోకూరి కాశీపతిగారు పార్వతీకళ్యాణం, తారాశశాంకం, సారంగధర కథ - ఈ మూడింటినీ కలిపి, ఉత్తమ రచనా శిల్పంతో కావ్యంగా కూర్చారు మూడు కథలు స్ఫురించేటట్లు ఈ గ్రంథానికి 'సారంగధరీయము' అని నామకరణ చేయడం శ్రీ కాశీపతిగారి ప్రతిభకు తార్కాణం గద్వాల సంస్థానాధీశ్వరులు శ్రీ సీతారామ భూపాలరావుగారు ఈ కృతిని అంకితం పొందారు మహారాణి శ్రీమతి ఆదిలక్ష్మి దేవమ్మగారి ఆదేశానుసారం 1933లో ప్రథమ ముద్రణ వెలువడింది. తెలుగు విశ్వవిద్యాలయం తెలుగు పాఠకుల సౌకర్యార్థం ఈ గ్రంథాన్ని తిరిగి ముద్రిస్తోంది గ్రంథ ద్వితీయ ముద్రణకు అంగీకరించిన శ్రీ కాశీపతిగారి కుమారులు శ్రీయుతులు సుబ్బరామయాచారి, లక్ష్మీనారాయణాచారి, సిద్ధయాచారి, చంద్రమౌళ్యాచారి, విజయాచారి గార్లకు మా కృతజ్ఞతలు.

ఉత్తమ గ్రంథాలను అందించాలనే తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పానికి ఈ గ్రంథం ఒక నిదర్శనం ఇది తెలుగు పాఠకుల అభిమానాన్ని చూరగొంటుందని విశ్వసిస్తున్నాను

హైదరాబాదు
మార్చి 1990

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

# సారంగధరీయము

(త్ర్యర్థికావ్యము)

## అవతారిక

### సవ్యాఖ్యానము

శా॥ శ్రీసన్మార్గవిలోలుఁడై కువలయ • క్షేమ ప్రదోద్యత్కళో
ల్లాసుండై కలధౌత ధాముఁడయి లీ • లాసోముఁడై ప్రత్యర
త్రాసుండై గతదోషుఁడై బుధగురు • త్వఖ్యాతి శోభిల్లు రా
జౌ సారంగధరుండు మత్కృతిపతిన్ • సామోదునిం జేయుతన్. 1

ఈ పద్యమందు సారంగధరుండు మత్కృతిపతిన్ అనుటచే గ్రంథము త్ర్యర్థికావ్యమగుట వలనను, సారంగధర నామము శివుని యందును చంద్రునియందును సారంగధరునియందును వర్తించుటవలనను ఈ మువ్వురే కథానాయకు లగుటవలనను, నా కృతిభర్తయగు శ్రీమద్విద్వద్గద్వాల సంస్థానాధీశ్వరులగు శ్రీమన్మహారాజ ముష్టిపల్లి శ్రీ సీతారామ భూపాలరావు బలవంత్ బహద్దరు వారిని సంతోషయుక్తునిగాఁజేయుగాత యని అర్థత్రయము గలుగున ట్లాశీర్వదింపఁ బడినది

టీక శ్రీ = సంపద్యుక్తమగు, సన్మార్గ = మంచిమార్గమందు, విలోలుడై = మెలఁగువాఁడై, అని శివుని పరముగను, సన్మార్గ = నక్షత్ర మార్గమందు ఆకాశమం దనుట, మెలఁగువాఁడై అని చంద్రుని పరముగను, సన్మార్గ = పండిత మార్గమందు, మెలఁగువాఁడై అని సారంగధరుని పరముగను అంతట నిట్లే గ్రహించునది, సత్ = నక్షత్రము. శ్రేష్ఠము పండితుఁడు అనుటకు ని. సన్నక్షత్రే విద్యమానే సత్యాఽభ్యర్హితసాధుషు, అని విశ్వము కువలయ = భూవలయమునకు, క్షేమ = శుభములను, ప్రద = మిక్కిలిగా నిచ్చుటకు, ఉద్యత్ = లేవనెత్తబడిన, కళోల్లాసుండై = విద్యాసంతోషముఁ గలవాఁడై, అని శివసారంగధరుల పరముగను కువలయ = కలువలకు, క్షేమప్రద = శుభముల నిచ్చుటకు, ఉద్యత్ = యత్నించెడు, కళొల్లాసుండై = కాంతులచె ప్రకాశించువాఁడై అని చంద్రపరమగును, కలధౌతధాముఁడయి = వెండియిల్లు గలవాఁడై అని శివునకును, వెండివంటి శరీరముఁ గలవాఁడై అని చంద్రునకును, బంగారువంటి శరీరముఁగలవాఁడై యని సారంగధరునకును వర్తించును ని కలధౌతం రౌప్య హేమ్నోః. అని విశ్వము ని ధామే దేహే గృహే రశ్మి, అని విశ్వము లీలాసోముఁడై విలాసకరుఁడగు సోమనామముఁ గలవాఁడై అని శివ 'ంద్రులయందును, లీలా = విలాసమందు, సోముఁడై = చంద్రుఁడై అని సారంగధరుని యందును వర్తించును ప్రత్యర్థ్రాసుండై = ప్రతి శత్రువునకు భయంకరుఁడయి అని శివ సారంగధరులకును, ప్రతి చక్రవాకమునకు భయంకరుఁడయి, అని చంద్రునకును వర్తించును అరి శత్రువు చక్రవాక మనుటకు. ని. అరిశ్శత్రు రథాంగో, అని మేదిని గతదోషుఁడయి = గతించిన దోషములుగలవాఁడయి అని శివ సారంగధరులకును పొందిన రాత్రులుఁగలవాఁడయి అని చంద్రునకును వర్తించును బుధగురుత్వఖ్యాతి శోభిల్లు = బుధ దేవతలయందు, గురుత్వఖ్యాతిన్=మహత్వమగు కీర్తిచేత, శోభిల్లు= ప్రకాశించునట్టి అని శివపరము, గను, పండితుల యందు మహత్తరమగు కీర్తిచేతనని. సారంగధరుని పరముగను బుధుఁడనువానికి జనకత్వఖ్యాతి చేతనని అనఁగా బుధునకు తండ్రియను ప్రసిద్ధిచేతనని చంద్రపరమునుగను గ్రహించునది. శోభిల్లు = ప్రకాశించు

నట్టి, రాజో = పతియైన అనఁగా ఈశాన్యమునకు ప్రభుఁడయిన, అని శివ పరంబుగను రాజనామముఁ గలవాఁడయిన, అని చంద్రపరంబుగను, క్షత్రియుఁడయిన, అని సారంగధరుని పరంబుగను వర్తించును. ని రాజా మృగాంకే క్షత్రియే నృపే అని నిఘంటు. సారంగధరుండు = జింకను తాల్చినవాఁడు శివుఁడు అనియును జింకతాల్పరియైన చంద్రుఁడనియును సారంగధర నామముఁగల రాజనరేంద్రుని కొడుకనియును గ్రహించునది మత్కృతిపతిన్ = నాకృతికి వల్లభుఁడయిన సీతారామ భూపాలుని, సామోదునిన్ జేయుతన్ = ఆనందముతోఁ గూడినవానిఁగాఁ జేయుఁగాత అని కృత్యాది పద్యముచే నాశీర్వదింపఁబడినది.

ఉ॥ పాయక రాజమౌళ్యనిశ • పాలితయై మల మన్కియై పరా
జేయ దృఢ స్వరూపమయి • శ్రీహితురాలయి యాశశీనభ
స్థాయి నలర్చుచున్ జగతి • ధాత్రి యనన్ దనరారునట్టి దా
క్షాయణి మాకు నెల్లపు డె • సంగ నొసంగుత కామితార్థముల్॥ 2

ఈ పద్యమందు దాక్షాయణి మాకునెల్లపు డనుటచే పార్వతీ పరముగను భూదేవిపరముగను, అర్థద్వయము నూహించునది అదెట్లనిన ని దాక్షాయణీ భవానీ భూ రశ్వన్యాద్యాశ్చ తారకాః అని నానార్థ రత్నమాల

టీక పాయక = ఎడబాటులేక, రాజమౌళ్య నిశపాలితయై= చంద్రమౌళియగు శివునిచేత, అనిశపాలితయై = నిరంతరము పాలింపఁబడినదై, అని పార్వతీపరముగను ఎడబాటులేక రాజశ్రేష్ఠులచేత సర్వదా పాలింపఁబడినదై అని భూదేవి పరముగను, మల మన్కియై = పర్వతమే యునికి పట్టుగాఁగలదై అని పార్వతికిని. కొండలకు స్థానభూతమై అని భూమికిని, పరాజేయ దృఢస్వరూపయయి = శత్రువులకు జయింపరాని దార్ఢ్యము గల స్వరూపముఁగలదై అని పార్వతికిని ఇతరులకు జయింపగాని బటు

వైన స్వరూపముఁగలదై అని భూమికిని, శ్రీహితురాలయి = లక్ష్మిదేవియొక్క-
హితురాలై అని పార్వతికిని, లక్ష్మిదేవికి మిత్రురాలై అని భూమికిని,
అనఁగా శ్రీదేవి, భూదేవి, విష్ణుభార్యలై మైత్రినుందురని భావము. ఆశశిన
భాస్థాయి నలర్చుచున్ = చంద్ర సూర్య నక్షత్రము లుండునంతవరకు
స్థిరస్థాయిగా నొప్పుచు ఉభయత్ర సమానము. జగతిధాత్రియనన్ దన
రారునట్టి = జగముతల్లి యనఁగా నొప్పారునట్టి అని పార్వతికిని, జగతి,
ధాత్రి, అనునామములతో నొప్పారునట్టి అని భూమిపరముగను, దాక్షాయణీ
భార్థముల్ = పార్వతీదేవియును, భూదేవియును, మాకు అనఁగా కృతిభర్త
కృతికర్తలకనుట నిరంతర మొప్పునట్లుగా కోరిన కోర్కుల నొసంగుగాక
అని అర్థద్వయము గలుగ రచింపఁబడినది ని ధాత్రీజన న్యాయములకీ పసుపు
త్యుపమాతృమ, అనివిశ్వము

చ॥ అనిమిషవర్గమున్ మనుచు • నట్లు సదా భువనంబులన్ భరిం
చి నటుల బాడబాగ్రణి వి • శేషవసూత్కరుఁజేసినట్లు శ్రీన్
గని కరుణారసం బొలుకఁ • గా పశ యుంచును పోషణంబుఁ జే
సినగతి మామమామ సిరిఁ • జేకురఁజేయుత మాకు నిత్యమున్॥ 3

ఈ పద్యమందు మామమామసిరి జేకురజేయుత అనుటచే, విష్ణుని
పరముగను, సముద్రుని పరముగను, అర్థద్వయమును గ్రహింపవలయును.
మామమామన హరియొప్పు శ్రీమహేశ, అని ఆంధ్రనామ సంగ్రహము.

టీక అనిమిషవర్గమున్ మనుచునట్లు = దేవతా సముదాయమునుఁ
బ్రోచునట్లు, అని విష్ణుపరముగను చేపల సముదాయమును బ్రతికించునట్లు,
అని సముద్రపరముగను సదాభువనంబులన్ భరించినటుల = ఎల్లప్పుడును
లోకముల భరించినట్లనియును సర్వదా ఉదకముల భరించినట్లనియును,
బాడబాగ్రణిన్ = విప్రపుంగవునని (అనఁగా కృష్ణావతారమున కుచేలు

ననుట.) బడబాగ్నిపుంగవు ననియును, విశేష వసూత్కారుఁ జేసినట్లు — విస్తారమగు ధన సముదాయముఁగలవానిగాఁజేసి నట్లనియును అధిక కాంతి సముదాయముఁ గలవానిగాఁ జేసినట్లనియును, శ్రీఁగనికరు .. ....., జేసినగతి, శ్రీఁగని = లక్ష్మి దేవినిఁగాంచి, కరుణారసం బొలుకఁగా = దయారస ముప్పతిల్లుచుండఁగా, వశయంచును పోషణంబుఁ జేసినగతి = భార్యయని పోషించునట్లనియును పుత్రికయంచు కన్నతండ్రి యగుటచే పోషించినట్లు అనియును ని వశావంధ్యా సుతాయోషా, అనివిశ్వము. మామమామ = మామయైన సముద్రునకుమామ ( అనగా విష్ణువనుట ) మామయైన విష్ణువునకు మామ ( అనగా సముద్రుఁడనుట ) సముద్రుని కూతురగు లక్ష్మిని విష్ణువున్ను, విష్ణుని కూతురగు గంగను సముద్రుఁడున్ను భార్యగాఁ గైకొనుటచే వారిరువురును ఒకరికొకరు మామయేయగుదురు అట్టి విష్ణువున్ను. సముద్రుఁడున్ను సిరిఁ = సంపదను, చేకురఁ = లభించునట్లు, జేయుతఁ = ఒనర్చుగాక, మాకునిత్యముఁ = కృతికర్త కృతిభర్తలమగు మాకు నిరంతరమున్ను అని అర్థము వశయనిన భార్యయనుటకు శబ్దార్థ చంద్రికలోఁ జూడనగును

ఉ॥ తీరుగ సత్పథాంచిత గ • తిన్ ధరణీ భరణాశ్రయానఁ జె
న్నారుచుఁ జంచలాన్విత వి • హారముతో హరిదివ్య వాహ్యా వి
స్తారమునై మహాభువన • ధాత్రియనఁ దనరారు నాఘన
శ్రీ రహి మాకు నెల్లపుడు • జీవనసంపద లిచ్చి బ్రోచుతఁ ॥ 4

ఈ పద్యమందు ఘనశ్రీరహి మాకు నెల్లపుడు అనుటచే అధికురాలైన లక్ష్మిదేవియనియును మేఘసంపదయనియును అర్థద్వయము గలదని గ్రహించునది.

టీక తిరుగ = చక్కఁగా, సత్పథాంచితగతిఁ = మంచిమార్గ మందొప్పైన నడవడిచేత నని లక్ష్మిపరముగను నక్షత్రమార్గ మందొప్పైన నడవడి చేత నని మేఘ పరముగను అంతట నిట్లే గ్రహించునది, ధరణీ భరణాశ్రయానఁ జెన్నారుచు=విష్ణునియొక్క యాశ్రయముచేత నొప్పారుచు లేక, రాజులయొక్క యాశ్రయముచేత నొప్పారుచు అని లక్ష్మికిని, పర్వతాశ్ర

యముచేత నొప్పారుచునని మేఘమునకును, చంచలాన్వితవిహారముతో = చలనముతోఁగూడిన సంచారముతోనని లక్ష్మికిని మెరుపుతీగెతోఁ గూడిన సంచారముతోనని మేఘమునకును, హరిదివ్యవాహ్య విస్తారమునై = విష్ణుమూర్తియొక్క మనోహరముగా వహించినవానితో నొక్కతెయై అనియును ఇంద్రుఁడు మనోజ్ఞముగా వహించినవానితో నొక్కఁడునై అనియును అనఁగా నింద్రుఁడు మేఘవాహనుఁడని ప్రసిద్ధము మహాభువనధాత్రియనఁ = అధికతరమగు లోకమాతయనఁగా ననియును అధికతరమగు నుదకమును ధరించినది యనఁగా ననియును, తనరారు = ఒప్పారు, అఘన శ్రీరహి మాకు నెల్లపుడు = అయధికురాలైన లక్ష్మీదేవి యానందముతో కృతికర్త కృతిభర్తలమగు మాకు నిత్యమును, జీవన సంపదలిచ్చి ప్రోచుతఁ = జీవనాధారమగు నైశ్వర్యముల నొసంగి రక్షించుగాక అనియును ఉదక సంపద నిచ్చి రక్షించుగాక అనియును (అనఁగా వర్షముల నిచ్చియనుట ) జీవనం భువనమనిన నుదక మనుటకు ని ఆప స్త్రీ సలిలం కమలం జీవనం భువనం వనం, అని అమరము ధాత్రియనిన ధరించునది అనుటకు శబ్దరత్నాకరము చూడుడు

చ॥ అతుల శ్రుతిప్రమోద చతు • రాస్యుఁడనఁ విలసన్మనోజ్ఞ గో
పతి యన నిత్యసత్య పరి • పాలుఁడనంగ విశేషనేత్ర భా
సితుఁ డన వేల్పు పెద్దయన • జీవకృతాద్యుఁ డనం దనర్చు నా
శతధృతి మాకు నెల్లపుడు • సౌఖ్యచిరాయువు లిచ్చి ప్రోచుతఁ ॥ ౬

ఈ పద్యమందు శతధృతి మాకు నెల్లపుడు అనుటచే ఇంద్రుని పరముగను, బ్రహ్మపరముగను, అర్థద్వయముఁ గలదని యూహించ వలయును ని శతధృతిర్ధాతరిందేౕ అని విశ్వము

టీక అతుల శ్రుతిప్రమోద చతురాస్యుఁడనఁ = సమాన రహితమైనట్టియు చెవుల కానందమగునట్టియు చతురమగు వాక్యములు గల వాఁడనఁగానని ఇంద్ర పరముగను వేదములయొక్క సంతో

షముగల నాలుగుమోములు గలవాఁడనఁగాననిి బ్రహ్మపరముగను ఇట్లీ యంతట గ్రహించునది విలసన్మనోజ్ఞగోపతియన = మిక్కిలి ప్రకాశముఁ గలట్టియు మనోహరమగునట్టి స్వర్గమునకు పతియనఁగా ననియును సరస్వతికి పతి, యనఁగా ననియును గో. అనఁగా స్వర్గము సరస్వతి యనుటకు. ని గౌః స్వర్గే వృషభే రశ్మౌ భూ వా గ్వారిషుగౌర్మతా॥ అని విశ్వము నిత్యసత్య పరిపాలుఁడనంగ = నిరంతరము సత్యపరిపాలనఁ జేయువాఁడనఁగా ననియును నిత్యము సత్యలోకమును పాలించువాఁడనఁగా ననియును విశేషనేత్రభాసితుఁడన= ఎక్కువ కన్నులచేత ప్రకాశింపఁబడినవాఁ డనఁగాననియును,(అనఁగా సహస్రాక్షుఁడనుట) బ్రహ్మయో(ఎనిమిది కన్నులుఁ గలవాఁడనుట ) వేల్పుపెద్దయన = దేవతలకు నధిపతియనఁగా ననియును దేవతలలో పెద్దవాఁడనఁగా ననియును ఆ॥వె॥ వేల్పుపెద్దవలుకు వెలదిమగఁడు అని ఆంధ్రనామసంగ్రహము జీవకృత్యాద్యుఁడన=బృహస్పతిచేఁజేయఁబడిన ఆధిక్యము గలవాఁడనఁగాననియును ప్రాణములఁ జేయుటయం దాద్యుఁడనఁగా ననియును తనర్చు = ఒప్పునట్టి, ఆ శతధృతి = ఆ యింద్రుఁడును ఆ బ్రహ్మయును, మాకు నెల్లప్పుడు = మాకు నిరంతరమును, సౌఖ్య చిరాయువు లిచ్చి ప్రోచుతన్ = సుఖమును దీర్ఘాయుష్యమును, ఇచ్చి రక్షించుగాక అని యర్థము. ని జీవః ప్రాణిని గీష్పతౌ, అని విశ్వము

చ॥ అవిరతికోల్లసత్కమల • జాప్తి నట క్కల హంసయానముఁ
సపురుగ నొంది భూ ర్యనిమి • షప్రకరంబరు దంది చూడఁగా
భువనము లెల్లవేళలను • పొంగఁగఁజేయుచు కూర్మిఁగల్గి స
త్కవులకు జీవనం బిడెడు • కాంత సరస్వతి నిఁ భజించెదఁ 6

ఈ పద్యములో సరస్వతి నిఁభజించెదఁ అనుటచే వాగ్దేవి పరముగను సరస్వతీనదీ పరముగను అర్థద్వయముఁ గ్రహించునది.

టీక. అవి. జాప్తి = ఎడతెగక మిక్కిలి ప్రకాశించునట్టి బ్రహ్మ యొక్క కలిమి గల్గుటచే అని సరస్వతి పరముగను ఎడతెగక మిక్కిలి

ప్రకాశించునట్టి పద్మములయొక్కఁ కలిమి గల్గుటచే అని నదీపరముగను అంతట నిట్లే గ్రహింపవలయును. నటత్కలహంసయానమున్ సవురుగ నొంది = నటన చేయునట్టి రాజహంస యొక్క గమనమును సొంపుగా పొందినదియై అనియును నటించునట్టి కలహంసల యొక్క నడకల నందముగా నొంది నదియై, అనియును భూర్యనిమిషప్రకరం బరుదం దిచూడఁగా = విస్తారమగు దేవతా సముదాయ మచ్చెరువంది కాంచఁగా ననియును, విశేషమగు చేపల గుంపు ఆశ్చర్యము నొంది కనుచుండఁగా ననియును భువనము లెల్లవేళలను పొంగఁగఁజేయుచు = సర్వకాలములయందు లోకముల సంతోషింపఁ జేయుచు ననియును ఎల్లప్పుడును నీళ్ళ నుప్పొంగునట్లు చేయుచు ననియును, కూర్మిఁగల్గి = ప్రేమగలదియై అనియును ఆదతాబేలుఁ గలదియై అనియును సత్కవులకు జీవనంబిడెడు కాంత సరస్వతి = శ్రేష్ఠులగు కవీశ్వరులకు జీవనమిచ్చు నోవెలదీ ఓ! సరస్వతీదేవి అనియును మంచివగు జలపక్షులకు నీళ్ళిచ్చు మనోజ్ఞమగు నోసరస్వతీనదీ అనియును, నిన్ భజించెదన్ = నిన్ను స్తోత్రముఁ జేయుదును ని అనిమిష స్సురే మత్స్యే అనియును ని భువనం విష్టపే మహ్యాం సలిలేఽపి వియ త్యపి అనియును ని. జీవనం వర్తనే నీరే అని విశ్వము.

మ॥ భగవన్నామధృతి ప్రకాశితుఁడు స • ర్వజ్ఞుం డహీనాత్మహా
రి గురుం డూర్జితకామజైత్రుఁ డమృత • శ్రీయుక్తుఁ డధ్యాత్ముఁడున్
సుగతుం డాశ్రిత పక్షుఁ డుత్తమకలా • శోభాతిరేకుండు సూ
రి గణస్తుత్యుఁడునౌ వినాయకుఁడు కో • ర్కెల్ దీర్చి మమ్మోముతన్॥

ఈ పద్యములో వినాయకుఁడు కోర్కెల్ దీర్చి మమ్మోముతన్ అనుటచే విఘ్నేశ్వరుని పరముగను బుద్ధదేవుని పరముగను గరుత్మంతుని పరముగను గురుని పరముగను సమన్వయించునట్లు రచింపఁబడినది ని.వినాయకస్తు హేరంబే తార్క్ష్యే విఘ్నే జినే గురౌ అని విశ్వము

టీక. భగవన్నామధృతి ప్రకాశితుఁడు = పరమేశ్వర నామమును వహించుటచేతనని గణపతికిని భగవాన్ నామమును ధరించుటచేతనని బుద్ధున కును, ని భగవాన్ మార జిల్లోకజి జ్జిన అని అమరము. భగవన్నామముఁగల విష్ణుని ధరించుట చేతనని గరుడునకును పరబ్రహ్మనామ ధరణమువలననని గురునకును ప్రకాశింపఁబడిన వాఁడని సమానము సర్వజ్ఞుండు = సర్వజ్ఞ నామముఁ గలవాఁడని బుద్ధునకును ని సర్వజ్ఞస్సుగతో బుద్ధ, అని అమరము. తతిమ్మ మూడింట సర్వముఁ దెలిసినవాఁ డని అహితాత్మహారి = సర్వశ్రేష్ఠ ముల ప్రాణముల హరించినవాఁడని గరుడునకును తతిమ్మ మూడింటను ఘనతరమైన హృదయముచేత మనోహరుఁడైన వాఁడనియును, గురుండు = గురునామముఁ గలవాఁడని గురునకును తతిమ్మ మూడింటను అతిశయుం డనియును, ఊర్జిత కామజైత్రుఁడు = దార్ఢ్యముఁగల మన్మథుని జయించిన వాఁడని బుద్ధునకును, ని మారజిల్లోకజి జ్జిన అని అర్థము తతిమ్మ మూడింటను దృఢమైన కామగుణమును జయించినవాఁ డనియును అమృత శ్రీప్రాప్తుఁడు = సుధాసంపద లభించినవాఁడని గరుడున కును, (అనఁగా సింద్రునిఁ జయించి సుధను గైకొన్న వాఁడగుట.) తతిమ్మ మూడింటను మృతముఁగాని సంపద, అనఁగా నమరత్వమనుట.) లభించినవాఁడనియును లేక మోక్షసంపద లభించిన వాఁడనియును, అధ్యా త్ముఁడున్ = ఆత్మసంబంధమైనవాఁడని నాల్గింట సమానము సుగతుండు = సుగతనామముఁ గలవాఁడని బుద్ధునకును ని. సర్వజ్ఞ స్సుగతో బుద్ధో, అని అమరము. తతిమ్మ మూడింటను మంచి జ్ఞానము గలవాఁడనియును ఆశ్రిత పక్షుఁడు = ఆశ్రయింపఁబడిన ఱెక్కలుఁ గలవాఁడని గరుడునకును తతిమ్మ మూడింటను ఆశ్రయింపఁబడిన వారియందు పక్షపాతముఁ గలవాఁడనియును. ఉత్తమ కలాశోభాతిరేకుండు = శ్రేష్ఠమగు కాంతులవలన ఆధిక్యముఁగలవాఁడని గరుడునకును పరమ విద్యలవలని యాధిక్యముఁ గలవాఁడని తతిమ్మ మూడింటను సూరిగణస్తుత్యుఁడు = సూర్యుఁడే దేవుఁడని గొల్చువారలు, సూరిగణము (అనఁగా బౌద్ధులనుట) వారిచేత నుతింపఁబడినవాఁడని,

బుద్ధునకును తథిమ్ము మ్మూడింటను పండిత సముదాయముచేత నుతింప బడిన వాఁడనియును, ఔ వినాయకుఁడు = అనఁబడి విఘ్నేశ్వరుఁడును, బుద్ధదేవుఁడును, గరుత్మంతుఁడును గురుమూర్తియును, కోర్కెల్ దీర్చి మము మోమ్ముతన్ = అభీష్టములుఁదీర్చి మమ్ము రక్షించుగాక

కొమ్ములు

ఆ॥వె॥ పూషుఁడు నుడుపుఁడును • భూజుండును బుధుఁడు
నురు సుగుణుఁడు గురుఁడు • ను సుకురుఁడును
సూరుసుతుఁడు నుడుపు • సూడు ధూమ్రుఁడు భూపు
శూరు నుసులు పూన్చు • చంద్రు డుమ్ము॥ 8

ఈ పద్యము అన్నివర్ణములును కొమ్ములుఁ గలవిగా గూర్చి నవ గ్రహములను జేర్చి రచియింపబడినది.

టీక పూషుఁడు = సూర్యుఁడును ఉడుపుఁడు = నక్షత్రపతియగు చంద్రుఁడును, భూజుండును = భూమిసుతుఁడగు నంగారకుఁడును, బుధుఁడున్ = సౌమ్యుఁడున్ను, గురుసుగుణుఁడు గురుఁడును = అధిక సుగుణములుఁగల బృహస్పతియును, సుకురుఁడును = శుక్రుండును, సూరు సుతుఁడును = సూర్యుని కుమారుఁడునగు శనియును, ఉడుపుసూడు = చంద్ర విరోధియగు రాహువును, ధూమ్రుడు = కేతువున్ను, భూపు = ధరణీపతిని, శూరు = పరాక్రమశాలిని (అనఁగా కృతిపతియగు రాజునని) ఉసులు పూన్చు చంద్రు డుమ్ము = సౌఖ్యమును పొందింతురుస్తుమీ అని అర్థము.

మ॥ ప్రవరంబై సరసంబునై విమలమౌ • ప్రాచేత సాధిక్యమున్
భవభూతి ప్రతిభన్ పరాశర సుత • ప్రావీణ్యమున్ దండి పా
టవమున్ హీరధృతి ప్రశస్తమును వే • ద్యన్ నే వచశ్శుద్ధికై
స్తవముల్ సేతు మధిన్ సతంబును దిగం • తవ్యాప్తముల్ గావునన్. 9

ఈ పద్యమందు సంస్కృత కవుల మహత్వమునున్ను దిగంత వ్యాప్త ముల్ గావునన్ అనుటచే దిక్పతుల ప్రశస్తమును కొందఱియాశ్వాసబద్ధినట్లు గ్రహించునది ప్రాచేతసుఁడనఁగా వరుణుఁ డనుటకు శబ్దార్థచంద్రిక చూడ నగును.

టీక ప్రవరంబై = మిక్కిలి శ్రేష్ఠమైన, సరసంబునై = రసయుక్తమై, విమలమౌ = కల్మషరహితమైనట్టి, ప్రాచేతసాధిక్యముఁ = వాల్మీకియను కవియొక్క యాధిక్యము ననియును వరుణుఁడను దిక్పతియొక్క యాధిక్యము అనియును భవభూతి ప్రతిభఁ = భవభూతియను కవియొక్క వికాసమగు బుద్ధిని అనియును ఈశానుని యొక్క యైశ్వర్యకరమగు వికాసమైన బుద్ధిని అనియున్ను పరాశరసుత ప్రావీణ్యముఁ = పరాశరుని కుమారుఁడగు వ్యాసునియొక్క ప్రవీణత ననియును, పర = ఉత్కృష్టుఁడైన, ఆశరసుత = రాక్షసకుమారుఁడనిగాని శ్రేష్ఠ రాక్షస రాజనిగాని (అనఁగా నైరుతియనుట) అట్టివాని ప్రవీణత ననియును, దండిపాటవముఁ = దండియను కవీశ్వరుని నైపుణ్యము ననియును యమునియొక్క నేర్పుననియును, హీరధృతి ప్రశస్తమును = హీరుఁడనే కవీశ్వరుని ధైర్యముయొక్క ప్రఖ్యాతి ననియును, హీర ధృతి = వజ్రమునుధరించిన యింద్రునియొక్క ప్రఖ్యాతి ననియును వేడ్కన్నే వచశ్శుద్ధికై = సంతోషముతో నేను వాక్శుద్ధి కొఱకై, దిగంతవ్యాప్త ముల్ గావునన్ = దిక్కుల యొక్క చివరలకు పైవారలయొక్క గుణములు వ్యాపించినవి అగుటవలన, మదిన్ సతంబు = హృదయమందెప్పుడును, స్తవ ముల్ జేతు = స్తోత్రములు సేయుదును.

ఉ॥ ప్రాభవమీకంటుగా జగతి • వాగనుశాసనుఁ డాప్తిఁజేయ వి
ద్యాభృతిఁ గుండలీంద్రుఁడు శి • రోగ్రమునందునఁదాల్చి తీర్ప శ్రీ
నాథుఁడు ప్రోవ రుద్రుఁడు ష • నస్థితిఁజెంపఁగ సోమభాస్కరుల్
మేధ వికాసమీయఁ గృతి • మించెఁ దదాద్యుల భక్తిఁ గొల్చెదన్ 10

ఈ పద్యమందు ఆంధ్రకవుల పర్యాయముగను దెవతా పర్యాయముగను అర్థద్వయముఁ గలుగునట్లు రచియింపఁబడినది.

టీక. ప్రాథమికంబుగా = మొట్టమొదలుగ, జగతిఁ = భూమియందు, వాగనుశాసనుఁ డాప్తిఁజేయ = నన్నయభట్టు కలిగినదానినిగాఁజేయఁగా నని యును (అనఁగా నిర్మించగా ననుట.) భూమిని బ్రహ్మదేవుఁడు నిర్మింపఁగా నని యును, విద్యాభృతిన్ = విద్యాభరణముచేత, కుండలీంద్రుఁడు = కుండలేష్టిఁ జేసి కుండలముల ధరించిన తిక్కనసోమయాజి యనియును, అది శేషుఁడని యును, శిరోగ్రమునందునఁ దాల్చి తీర్ప = శిరసా వహించి తీరుగడ చేయఁగా ననియును ఫణములమీద వహించి చక్కఁజేయఁగాననియును, శ్రీనాథుఁడు బ్రోవ = శ్రీనాథుఁడనే కవీశ్వరుఁడు పోషింపఁగా ననియును విష్ణుమూర్తి పోషింపఁగా ననియును, రుద్రుఁడు ఘనస్థితిఁ బెంపఁగ = కందుకూరి రుద్ర కవి యతిశయస్థితిచే వృద్ధిఁజేయఁగా ననియును శంకరుఁడు అతిశయస్థితిని నశింపఁజేయఁగా ననియును, సోమభాస్కరుల్ మేధ వికాసమీయన్ = నాచన సోమకవియును హుళక్కి భాస్కరకవియును, బుద్ధికౌశలముచే కాంతుల నీయఁగా ననియును చంద్ర సూర్యులు బుద్ధినైపుణ్యముతో కాంతుల నీయఁగా ననియును, కృతి మించె = కవిత్వము అతిశయించె ననియును పని మించెనని యును (అనఁగా జగతియొక్కపని అతిశయించెననుట) తదాఢ్యుల భక్తిఁ గొల్చెదన్ = ఆపై మహాత్ములను భక్తి పూర్వకముగా స్తోత్రము సేయుదును, (అనఁగా ఆ మహాత్ములగు కవుల ననియును ఆమహాత్ములగు దేవతలననియును) పెంపుశబ్దము నాశమునకును వృద్ధికినిఁజెల్లును సీ॥ తనమహా హవదీక్ష తన మహాహవదీక్ష పగిది నానావనీపకులఁబెంప అని వసుచరిత్ర ప్రయోగము

చ॥ సరసుల దూరుచుండఁగను • సార్థకమౌనొకొ మంచివారిలో
దురుసుగ భంగమొందుట య • ధోగతిఁజెందుట పంకమందుటల్

ధర సుముఖుం డొకం డయినఁ ♦ దద్గతిఁగాంచిన నవ్వకుండునే
విరసమెగాక దుష్కవి క ♦ విత్వము వీనులకెట్లు సొంపగున్ 11

ఈ పద్యములో దుష్కవి కవిత్వము వీనులకెట్లు సొంపగున్. అనుటచే చెడుకవుల కవిత్వము చెవులకు సొంపు గానేరదనియును, చెడుజల పక్షుల యొక్క జలపక్షిత్వము గరుడపక్షులకు సొంపుగానేరదనియును అర్థ ద్వయముఁ గలుగునట్లు రచియింపఁబడినది.

టీక సరసులఁ దూరుచుండఁగను సార్థక మౌనొకొ = బుద్ధిమంతులను నిందించుచుండఁగనే ప్రయోజన మౌనేమొకో అని కుకవుల పరముగను కొలనులయందుఁ జొరబాఱినంతనె ప్రయోజకమౌనే మొకో అని చెడు జలపక్షుల పరముగను, మంచివారితో దురుసుగ భంగమందుట = సజ్జనులతో కఠిన ముగా భంగపాటు నొందుటయును అనియును మంచి జలములో కర్కశముగా తరఁగల నొందుటయును అనియును, అధోగతిఁ జెందుట = అధమ స్థితినిఁ బొందుట అనియును అడుగు బట్టుట అనియును పంకమందుటల్ = పాపము నొందుటలు అనియును బురదనొందుటలు అనియును. ధరన్ = భూమియందు తద్గతిఁ గాంచినన్ = ఆ కుకవులయొక్క నడవడిన్గనిన ననియును ఆ చెడుజల పక్షులయొక్క స్థితినిఁ గాంచిన ననియును, సుముఖుం డొకండయినన్ = ఒక్క పండితుఁడైనను అనియును ఒక్క సుముఖుఁడైనను (అనఁగా గరుడుని కుమారుఁడగు నొక్క సుముఖుఁడైనను) అనియును నవ్వ కుండునే = హసియింపకుండునా (అనఁగా హసియించు ననుట.) విరసమె గాక = రస విహీనమే తప్ప దుష్కవి కవిత్వము, వీనులకెట్లు సొంపగన్ = చెడుకవి యొక్క కవనము చెవులకు నెట్లు ఇంపగును (అనఁగా కాదనుట) దుర్ + కవి, దుష్కవి = చెడుగగు, క = జలసంబంధమగు, వి = పక్షి యొక్క, కవిత్వము = జలపక్షిత్వము, వి + ఇనులు, వీనులు = వి = పక్షులయొక్క, ఇనులకు, ప్రభువులకు, (అనఁగా గరుడ పక్షుల కనుట) ఎట్లు సొంపగున్ = ఎట్లు సొంపు కాగలదు (అనఁగా కానేరదనుట ని, భంగ స్సరం గే రుగ్భేదే భేదే జయవిపర్యయే॥ అని విశ్వము ని వా ర్వారి సలిలం కసులం

జలంపనం । అని అమరము, ని పంకః కర్దమ పాపయోః॥ అనియును ని
సుముఖస్తార్క్ష్యతనయే ఫణిభేదేచ పండితే అని విశ్వము

వ॥ అని యిష్టదేవతా వందనంబును సుకవి జనాభినందనంబును
కుకవి నిందనంబును నొనర్చి యే నొక్క ప్రబంధంబును రచియింప
నుద్యుక్తుండనై యున్న నొక్కనాఁడు 12

టీక సుగమము.

సీ॥ ఒకచాయ మృదుగేయ ♦ మొగి సేయఁగ నమేయ
కమనీయతర గాయ ♦ క సముదాయ
మొకచాయ నిదితాయ ♦ మొ కదాయనఁగ తీయ
నవుచాయ కృతిఁజేయ ♦ కవి నికాయ
మొకచాయ పెఱరాయ ♦ ల కజేయ మహనీయ
సదుపాయములు సేయ ♦ సఖులతోయ
మొకచాయ ననపాయ ♦ తకు నాయముఁల సాయ
ములు సేయ గణనీయ ♦ బుధ వినాయ

గీ॥ కు లొకచాయన తపనీయ ♦ లలితకాయ
గణిక లెసలారఁ బేరోల ♦ గమునసుండి
స్వర్ణగరమునుఁ బోలు గ ♦ ద్వాలనేలు
నాదిలక్ష్మి మహారాజ్ఞి ♦ యతుల ప్రాజ్ఞి 13

టీక ఒక చాయఁ = ఒక వైపున, మృదుగేయము = కోమల
మగు గానము ఒగి సేయఁగఁ = క్రమముగా నొనర్చుటకు అమేయ = సాటిలేని
కమనీయతర = మనోజ్ఞతరమగు. గాయక సముదాయము = సంగీతపరులయొక్క
సంచయమును ఒక చాయఁ = ఒక వైపున ఇది తాయమొ కదా యనఁ
గఁ = ఇది అరుదైన వస్తువు గదా యనునట్లు, తీయనవు చాయ = మా
ధుర్యమగు రీతిని, కృతిఁజేయఁ = కవిత్వము రచియించుటకు కవి ని
కాయము = కవీశ్వరుల సముదాయమున్ను. ఒక చాయన్ = ఒక వైపు

పెఱరాయలకు = ఇతర రాజులకు. అజేయ = జయింపఁగాని. మహనీయ = ఘనతరములగు సదుపాయములు సేయన్ = మంచియోచన లొనర్చుటకు, సఖులతోయము = మిత్రమండలమున్ను ఒక చాయన్ = ఒక వైపున, అనపాయతకు = అపాయత్వము లేకుండుటకు. (అనఁగా తనకు మోసము లేకుండుట కను..) నాయములు = ధర్మములు. సాయ ములు సేయన్ = సహాయములు సేయుట కొఱకు. (అనఁగా నుపదేశించుట కనుట.) గణనీయ = లెక్కింపఁదగిన. బుధ వినాయకులు = పండి తులును, గురుపులున్ను, ఒక చాయన = ఒక వైపున. తపనీయ = బంగారువంటి లలిత = మనోజ్ఞమగు. కాయ = శరీరముగల. గణికలు = వేశ్యలు. ఎసలారన్ = ఒప్పారుచుండఁగా పేరోలగముననుండి = పెద్ద యగు సభనుండి. స్వర్నగరమునుఁబోలు = అమరావతిని పోలిన, గద్వాల నేలు = గద్వాలపురమునుఁ బాలించునట్టి ఆదిలక్ష్మి మహారాజ్ఞి మహారాణి బిరుదముఁగల ఆదిలక్ష్మి దేవమ్మ బహద్దరుగారు. అతుల = సమాన రహిత మగు. ప్రాజ్ఞి = లౌకిక వ్యవహారములయందు నేర్పుగలసాధ్వి ఇక ముందరి పద్యముతో నన్వయము. ఈ పద్యము అంత్యచ్ఛేక శబ్దాలంకారముగా రచి యింపఁ బడినది

సీ॥ సను పల్లెనాటి సీ • మనుగల బోధిల
వీటి నివాసుని • విశ్వకర్మ
కులుని భరస్వత • గోత్రుఁ బోకూరి సు
బ్బయకును రామల • క్ష్మమకు సుతుని
కోటయ కెల్లయ • కున్ గోటమకు నీశ్వ
రాంబకు నల లింగ • మాంబ కనుజు
లచ్చి చిన్నులకు వ • ల్లభుఁ జతుర్విధ కవి
తాప్రవీణున్ ద్రవ్య • ధానవేదిఁ

గీ॥ ప్రాజ్ఞు ఘటికా శతాధిక • పద్యహృద్య
చోద్యరచనా విశారదు • శుభచరిత్రు

గోవిద విధేయు నీశభ ♦ క్తుఁ గవిసింహ
బిరుద కాశీపతిని పిలి ♦ పించి కాంచి 14

టీక సుగమము

మ॥ అమితప్రీతి నిరోష్ఠ్య నిర్వచన శు ♦ ద్ధాంధ్ర త్రిశంక్వాత్మజీ
యము నా వల్లభు నాథుఁజేసి రమణీ ♦ యంబౌగతిన్ గూర్చితొ
తమ కావ్యంబిక నొందు నా విభునె భ ♦ ర్తన్ జేసి త్ర్యర్థి ప్రబం
ధముఁ గాఁ గూర్చి యొసంగవే యరుదుగా ♦ దా త్ర్యర్థికావ్యం బనన్॥

టీక సుగమము 15

గీ॥ విష్ణుచరితలు పలుమారు ♦ విన్నవార
మటవు కథలను వినఁ గోర్కి ♦ యాత్మఁ బొదమెఁ
గాన శివుని చరిత్రంబుఁ ♦ గవితఁగూర్ప
నగును కాశీపతి కవీంద్ర ♦ సుగుణసాంద్ర 16

టీక సుగమము

వ॥ అని తాంబూల జాంబూన దాంబరంబుల నొసంగిన నేనత్యంత సంతుష్టాంతరంగుండనై శివచరిత్రంబునకు నేచరిత్రంబులుఁ బొందుపఱుతునని యసామాన్య కార్యభారంబునకు యోజింపుచున్న నాటి రాత్రి. 17

టీక సుగమము

సీ॥ ధీరసన్నుతమగు ♦ దివ్యధర్మంబును
ధర్మమై తగు కల ♦ ధౌతరాశి
కలధౌతరాశినాఁ ♦ గ్రాలెడు పురమును
పురమునందున వెలి ♦ బూదిపూత
పూతమౌ స్వర్నది ♦ భూషితంబగు శిఖ
శిఖలీను నిటల దృ ♦ క్ఛిఖికరంబు
కరిమునందునను చ ♦ క్కనగు సారంగంబు
సారంగ చర్మ వ ♦ స్త్ర విలసితము

గీ॥ సిత రుచిరయుక్త గోపతిఁ ♦ జెలఁగు దాలు
దాలుమించిన గట్ల రా ♦ చూలి సరస

సరససల్లాపములుగల ♦ సాంబమూర్తి
మూర్తిఁజూపించె నాస్వప్న ♦ మునను గనను 18

టీక. ధీరసన్నుతమైన = పండితులచే నుతింపఁబడినదైనట్టి, దివ్యధర్మంబును = మనోజ్ఞమగు న్యాయమును లేక దేవతా ధర్మమున్ను, ధర్మమైతగు కలధౌతరాశి = ధనుస్సుగా నెసఁగినట్టి బంగారుకొండయున్ను (అనఁగా మేరు పర్వతమనుట) ని. దివ్యంవల్గాదివిభవేఽన్యసత్॥ అనియును ని ధర్మఃపుణ్యే యమేన్యాయేచాపేచోప నిగద్యతే॥ అనియును, ని కలధౌతౌంరౌప్యహేమ్నోః॥ అనియును విశ్వము, కలధౌతరాశినాఁ బ్రాలెడు పురమును = వెండికొండ యనఁగా బ్రకాశించునట్టి పట్టణమున్ను (అనఁగా కైలాస మనుట) పురము నందున వెలిబూదిపూత = శరీరమునందున తెల్లని భస్మము లేపనమున్ను. ని. పురంపురిశరీరేచ, అని విశ్వము. పూతమౌ స్వర్ణదీ భూషితం బగు శిఖ = పవిత్ర మైన గంగానదిచేత నలంకరింపఁబడిన జటాజూటమున్ను శిఖిశిఖ నిటలదృక్ఛ్రీకరంబు = జ్వాలల నుప్పతిల్లఁజేయు ఫాలభాగమందుఁగల నేత్ర సంపద సంబంధమైన కాంతియున్ను ని శిఖాశిఖాయాం చూడాయాంజ్వాలాయా మగ్రమాత్రకే॥ అని విశ్వము కరమునందునను చక్కనగు సారంగంబు = హస్తమందుఁ జక్కన యగు జింకయును, సారంగ చర్మవస్త్రవిలసితము = గజచర్మ సంబంధ మగు వస్త్రముచేత బ్రకాశింపఁ బడుటయున్ను. ని. సారంగ శ్చాతకే భృంగే కురంగేచ మతంగజ॥ అని విశ్వము. సితరుచిరయుక్తగోపతిఁ జెలఁగు డాలు = తెల్లని కాంతులతోఁ గూడిన బసవేశ్వరునిచే నెసఁగు టెక్కెమున్ను డాలుమించిన గట్టురాచూలి సరసను = కాంతిహెచ్చినట్టి పర్వత రాజకుమారి యగు పార్వతీదేవి చెంతనున్న, సీ॥ కేతువునకు కాంతికిని సమూహ్వాయ మగు డాలనంగను మేరుశైలధావ యని యాంధ్రనామ సంగ్రహము. సరస సల్లాపములుఁ గల సాంబమూర్తి = రసయుక్త మైన పరిహాసములుఁ గఁట్టి నశంకరుఁడు నా స్వప్నమునను గనను = నా కలయందు కనుఁగొనునట్లు

మూర్తి(జూపించెజా = శరీరమును( బొడసూపెను (అన(గా దర్శన మిచ్చె నని తాత్పర్యము ) ఈ పద్యము కవి స్వప్నమును( గూర్చి ముక్తపదగ్రస్తముగా రచింప(బడెను

క॥ కల నిటు లరుదెంచిన నే
నల పరమేశు(డె యటంచు • నానందముతో(
బలుమరు వినుతు లొనర్చియు
నిలిచిన నా కిట్టు లనియె • నెన రిగురొత్తజా ॥ 19

టీక సుగమము.

మ॥ కమనీయంబుగ( జాటువుల్ శతకముల్ • గాన ప్రబంధంబు లీ
వమలంబైన నిరోష్ఠ్య నిర్వచన శు • ద్ధాంధ్ర త్రిశంక్వాత్మజీ
యము నేకాదశ వర్ణసంచయమునౌ • యాదుల్ పొసంగించి ది
వ్యముగా శైశవశౌరి లీల రచియిం • పజా గంటి( గాశీపతీ 20

అన(గా మనోహర మగు చాటుపద్యములును, శతకములును, గేయ ప్రబంధములును, నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర శ్రీ హరిశ్చంద్రోపాఖ్యానమును, పదకొండక్షరముల సమూహమగు। య- ర- ల- వ- శ- ష- స- హ- క్ష- ఱ- అను అక్షరములతో శైశవశౌరిలీల యను గ్రంథమును నీవు రచియింప(గా నో కాశీపతి కవీంద్రా। కనుగొన్నా(డ నని తాత్పర్యము.

క॥ అవధానత్రయ వేదివి
కవన చతుష్కప్రవీణ • కలితుండవు నా
భవనమును( బ్రబిష్ఠించితి
వవురా కాశీపతీ మ • హాకవిసింహా ॥ 21

టీక. సుగమము

క॥ ఈవు సమర్థు(డ వన్నిట(
గావున మిత్కథకుతోడు • కంజారి కథన్
రీవిన్ సారంగధరుని
జీవిత కథ(గూర్చి త్ర్యర్థి • జేయంగదవే 22

టీక సుగమము

గీ॥ తత్ప్రబంధంబునకును గ ♦ ద్వాలపీటి
జేనిఁగృతికర్తఁ జేసితి ♦ వేని నీదు
యశము నాచంద్ర తారార్కమై తనర్చు
దివ్య గుణ సాంద్ర కాశిప ♦ తి కవిచంద్ర 23

టీక సుగమము

చ॥ అనుచు సదృశ్యమైన నరు ♦ దందుచు మేల్కొని గద్దవాల భూ
పుని కృతికర్తఁజేసిన ♦ పూర్వధనంబును కూలి సచ్చరి
త్రను రచియింప నంత్యమునఁ ♦ దప్పక మోక్షముఁగల్గు భూతలం
బునఁ బరమందు సౌఖ్యములు♦వొందుదు నంచుఁ దలంచి యెంతయున్.

టీక సుగమము 24

సీ॥ మిగులఁ దెల్లనిడాలు ♦ నెగడు మేనునఁ బాలు
సగము నొందిన యాలు ♦ సిగన జాలు
పగతుర నిలఁగూలు ♦ పఁగల ముమ్మొనవాలు
మృగ మెసంగినకేలు ♦ నగము ప్రోలు
మొగము నేనుఁగుఁ బోలు ♦ వగలు గుల్కెడు చూలు
సొగసు పావసరాలు ♦ తెగని శ్రీలు
పొగడు జోగులదాలు ♦ నాగులు బాపెడువీలు
జిగిగల పులితోలుఁ ♦ దగిన సేలు

గీ॥ నాగిఁ గలుగు సత్కృపావాలు ♦ నిగమమూలు
విగత కిల్బిషజాలు ది వ్యగణలోలు
నగణిత యశోవిశాలు భ ♦ వ్యగుణశీలుఁ
బొగడి కృతిఁ జేయ నేలు న ♦ ట్లగుటె మేలు 25

టీక. మిగులఁదెల్లనిడాలు=మిక్కిలి తెల్లనయిన కాంతులు, నెగడు మేనునఁ= మెఱయుశరీరమందు, పాలుసగము నొందినయాలు=భాగము సగమువహించిన భార్యయున్ను (అనఁగా పార్వతి యనుట) సామిసామేనుఁ జేకొన్నదాన, అని యాంధ్రనామసంగ్రహము సిగనజాలు=జడలముడియందు నదియును(అనఁగా

గంగ యనుట) పగతురనిలఁ గూలుపఁగల ముమ్మొనవాలు=శత్రువులు భూమిపై కూల్పఁగలిగిన త్రిశూలమును ఆ మృగ మెసంగినకేలు=జింక తనరుచుండిన హస్తమును, నగముప్రోలు=పర్వతమే తను వసించు పట్టణమును, మొగము . చూలు=వదనము నేనుంగునుఁబోలి ముద్దుఁగుల్కు నట్టి కొడుకును (అనఁగా విఘ్నేశ్వరుఁ డనుట) సొగసు పాపసరాలు=అందముఁ గల సర్పహారములును తెగనిశ్రీలు=ఎడబాటు లేని సంపదలును పొగడు జోగులచాలు=స్తోత్రము సేయునట్టి యోగిజనుల వరుసయొక్క, నొగులుఁ బాపెడుపీలు = దుఃఖమునుఁ బాపునట్టి యనుకూలమును , జిగిఁగల పులి తోలు=కాంతిఁగల వ్యాఘ్రచర్మము, తగినసేలు=ఒప్పగునట్టి శాలువయును, నొగిఁ గలుగు సత్కృపావాలు=వరుసగాఁ గలిగినట్టి శ్రేష్ఠమైన దయకుపాదైన వానిని, నిగమమూలు=వేదములకు మూలమైన వానినిన్ని, విగతకిల్బిష జాలు = గతించిన పాపపుంజముఁ గల వానినిన్ని, దివ్యగణలోలు = దేవతా సముదయమందు మెలఁగువానినిన్ని, లేక మనోజ్ఞ మగు ప్రమథగణ మందు మెలఁగువానిని, అగణిత యశోవిశాలు = ఎన్నతరముగాని కీర్తియందు విస్తారుఁడైన వానిని, భవ్యగుణశీలు=మనోహరమైన గుణములే యాచార ముఁగా గలవానిని, (అనఁగా శంకరు ననుట) పొగడి కృతిసేయనేలుట= స్తోత్రముఁజేసి కవిత నొసర్చిన రక్షించును అట్లగుట మేలు=అట్లు జరుగుటే మేలు

ఈపద్యము సర్వతః ప్రాసచ్ఛేకాలంకారముగా రచింపఁబడినది

చ॥ భువిపయిఁ ద్వ్యర్థికావ్యములు • పూర్వులు మూడు రచించి రంచు స
త్కవుల చరిత్ర లందునను • గన్పడుచుండుటెకాని చూడ మెం
దవి యొకవేళఁ గన్పడిన • నల్పుఁడ నట్లెటులట రచింప నా
కవు నిఁక నెట్లెకాని పర • మాత్ముఁడె తోడగు నంచు నెంచుచున్

టీక. సుగమము.

20

గీ॥ కామినేని కులాంబుధి ♦ సోముఁ డనఁగఁ
బరగు సోమేశ్వ రావనీ ♦ పాలుఁ జూచి
యాదిలక్ష్మీ మహారాజ్ఞి ♦ యానతియు మ
హేశ్వరుని యాజ్ఞఁ దెల్పఁ దా ♦ నిట్టు లనియె. 27

టీక. సుగమము

క॥ తొలిఁ జేసిన మీ పున్నెము
వలనఁ మా యత్తవారు ♦ వ్రాక్రుచ్చిన య
ట్టుల శంకరుండు కలలోఁ
బలికెఁ దమ కింతకన్న ♦ భాగ్యము గలదే 28

టీక సుగమము.

ఉ॥ చిన్నతనంబునుండి కృతిఁ ♦ జేయుచు నిం దరుదెచుంచుండి మా
మన్నన లందుచుండితివి ♦ మామకసూరి సభాంతరంబునం
దెన్నికఁగన్న నీ కవన ♦ మే విధిఁ గూర్తువొ కాని పల్కుటఁ
విన్నను దన్వి దీరదు క ♦ విప్రవరా యది యేమి చోద్యమో. 29

టీక. సుగమము.

గీ॥ ప్రకటతర సకలావనీ ♦ పకుఁడ వీవు
ప్రకటతర సకలావనీ ♦ పకుల మేము
మా తనవిఁదీర గ్రంథముల్ ♦ బ్రీతి నిడిన
నీ తనివిఁదీర గ్రంథముఁ ♦ బ్రీతి నిడ మె. 30

టీక॥ ప్రకట తర = విశదకరమగు, స కల = విద్యాయుక్తుఁడ వగు అ + వనీపకుఁడవీవు = నీవు స్థానయాచకుఁడవు, ఏము = ఇఁక మే మో, ప్రకటతర = విశదకర మగు, సకల = సమస్త మగు, అవనీపకు లము = భూమిపతులము, ని. ఆకారస్తు పదేభావే, అవి నానార్థ రత్నమాల, మా తనివిఁ దీరఁ = మా కోర్కె తీరునట్లుగా, గ్రంథముఁ బ్రీతి నిడిన = ప్రబంధమును ప్రేమతో నిచ్చి నట్లయిన, నీ తనివిఁ దీరఁ = నీ యొక్క కోర్కె దీరునట్లుగా, గ్రంథముఁ = ధనమును, ప్రీతి నిడమె =

ప్రేమతో నీయమా (అనఁగా నిచ్చెద మనుట) గ్రంథము ధన మనుటకు శబ్దార్థ చంద్రికలో చూడ నగు

గీ॥ శీఘ్రముగఁ దత్ప్రబంధంబు ♦ సేయు మదియు
ముగియు నప్పుడె ప్రీతితో ♦ ముద్రణమున
కాజ్ఞనిడి నీ బహూకృతు ♦ లందఁజేతు
మని పలుక నట బుధు లిట్టు ♦ లనిరి వేడ్క. 31

టీక॥ సుగమము

గీ॥ సోమ సదిన సమాఖ్య ల ♦ చ్చు పడనుండు
చెంతకాలమొ యందాక ♦ యీ ప్రబంధ
దీపకుల పేరు లగుటఁ గా ♦ శీపతి కవి
సోమసదిన సమాఖ్య ల ♦ చ్చు పడనుండు 32

టీక॥ సోమ సత్ + ఇన, సోమసదిన = చంద్ర, నక్షత్ర, సూర్యుల యొక్క సమాఖ్యలు = నామములు, అచ్చుపడనుండు చెంతకాలమొ = స్పష్ట మగు నట్లుండుట యెంతకాలమువఱకో అందాక = అంతవఱకు, నీ ప్రబంధ దీపకుల పేరులగుటన్ = ఈ కావ్యమును ప్రకాశింపఁజేసిన వారి పేరు లగుటవలన, కాశీపతికవి = కాశీపతికవి యనునట్టియు,సోమ, సత్ + ఇన, సోమసదిన = సోముఁ డనే శ్రేష్ఠనృపు డనునట్టియు సమాఖ్యలు = పేరులు, లేక యశములు అచ్చు పడనుండున్ = ముద్రణ మైనయెడల నుండును. ని సన్నక్షత్రే శ్రేష్ఠే॥ అనియును ని ఇనస్సూర్యే నృపేపత్యే॥ అనియును నిఘంటువులు సమాఖ్యాశబ్దము కీర్తికిని నామమునకును చెల్లునను టకు శబ్దార్థ చంద్రిక ఁజూడుడు

క॥ నానార్థములు బుధుల కిడ
నౌ నాతని వృత్త మెన్నఁ ♦ గా నసమదయన్
నానార్థములు బుధుల కిడ
నౌ సీతని వృత్త మెన్నఁ ♦ గాన సములెకా, 33

టీక. అసమదయన్ = సమాన రహితమైన కరుణచేత, అతసి వృత్త మెన్నఁగా = ఆ సోమేశ్వర నృపతి చరిత్రమును గణించిన యెడల, నానార్థ ములు = అనేకములగు ద్రవ్యములు,బుధుల కిడనౌఁగా = పండితులకు నీయ నగును, ఈతని వృత్తమెన్నఁగా = రః కాశీపతి కవియొక్క పద్యము నెంచి చూచినట్లైతే, బుధులకు = పండితులకు, నానార్థములు = అనేకము లగు శబ్దార్థములు, ఇడనౌఁగా = ఈయ నగును, కాన = కావున, సములేకా = సమానులేకద, అని అర్థము ని॥ వృత్తం చరిత్ర చ్ఛందసోరపి, అని విశ్వము ని॥ అర్థోభిధేయరై వస్తు, అని అమరము

వ॥ అట్లనుచున్న నే నమిత ముదంబున నోలలాడుచు వీరభద్ర విజయంబును, పార్వతీజననంబును, గౌరీపరిణయంబును, కుమార సంభవంబును, శివకథాపక్షంబునను, అనసూయాచరిత్రంబును, తారాశశాంక విజ యంబును, చంద్రకథా పక్షంబునను, నన్నయజీవిత చరిత్రంబు ను, సారంగధర చరిత్ర భేదంబులును, సారంగధర కథాపక్షంబునను, మఱికొన్ని పురాణంబుల నాధారంబులుగాఁ గైకొని.
టీక. సుగమము 34

క॥ సారంగధరుల ముప్వురి
చారిత్రంబులనుగూర్చి ♦ చాతుర్యముగా
సారంగధరీ యం బనఁ
గా రచియించితిని ద్ర్యర్థి ♦ కావ్యము వేడ్కఁగా 35

సారంగధరుల ముప్వురి ననగా, శివుని యొక్కయు, చంద్రుని యొక్కయు, సారంగధరునియొక్కయు, చరిత్రములనుఁ గూర్చి యనుట. తతిమ్మ విషయము సుగమము.

శా॥ ఆద్యాశ్వాసము వెంట నిందలి చతు ♦ ర్థాశ్వాసముఁగా దొల్లిటఁగా
హృద్యంబౌ గతి వ్రాసి మూడుకథ లెం ♦ తే యుక్తితోఁగూర్చి నా
విద్యాకౌశల మందు జూపుటకునై ♦ వీలేమియుఁగ లేమిచే
నాద్యంతంబుల మధ్యభాగమున రెం ♦ డాశ్వాసముల్ బెంచితిఁగా.

మొట్టమొదదట యీ ప్రబంధమును రెండాశ్వాసములుగా రచియించి యందు మూఁడు కథలను నా నేర్పు సామర్థ్యముఁగొలది నిమిడించి నా కవితా నైపుణ్యమును సంపూర్ణముగాఁ జూపుటకు వీలు లేకుండినందున నీ రెండాశ్వాసములను ఆద్యంతములుగాఁజేసి మఱి రెండాశ్వాసము లభివృద్ధిఁజేసి మధ్య భాగమునం దిమిడించి నాల్గాశ్వాసముల ప్రబంధము రచించినా నని తాత్పర్యము

గీ॥ త్ర్యర్థికావ్యం బగుట చరి • త్రాంతరమున
రసముఁ బోషింప వీల్గుద • రక కవితను
తనివిఁదీరక కావ్య ప • ద్ధతిని వర్ణ
నములఁబెంచి చమత్కృతి • నడిపినాఁడ 37

టీక సుగమము

క॥ పరికింపఁగను సుభద్రా
పరిణయమునుఁబోలు మత్కృ • వనము నృపాలా
దరమై సద్విబుధ మనో
హరమై కుకవి ప్రతాప • హరమై థిరమై 38

టీక పంకింపఁగను = విచారింపఁగా, మత్కృవనము = నా కవిత్వము, నృపాలాదరమై = జననాథులయొక్క ఆదరముఁ గలదియై, సద్విబుధమనోహరమై = శ్రేష్ఠులగు పండితులకు మనోజ్ఞమైనదై, కుకవి ప్రతాప హరమై = కాకవులయొక్క ప్రతాపమును హరించునదియై, థిర్షమై = స్థిరమైనదియై, సుభద్రా పరిణయమునుఁ బోలుఁ = సుభద్రా పరిణయమను నామాంతరముఁగల విజయవిలాసమును పోలును, మఱియును, సు = శ్రేష్ఠమగు, భద్రా పరిణయమునుఁ బోలుఁ = భద్రాపరిణయోల్లాసంబను నామాంతరముఁగల ముకుందవిలాసమునుఁ బోలును.

అనఁగా చేమకూర వేంకటకవి ప్రణీతం బైన విజయవిలాసమునకును, కాణాదము పెద్దనకవి ప్రణీతం బైన ముకుంద విలాసమునకును,

నా కవిత్వము సాటి యగు నని గ్రంథకర్త తన కవితాశక్తినిఁ గుఱించి విశద పఱిచెనని తాత్పర్యము

గీ॥ తెలుఁగు కావ్యంబె రచియింపఁ ♦ బలు ప్రయాస
మగును రెండర్థముల కావ్య ♦ మంతకన్న
భార మగు నిఁకఁ ద్ర్యర్థికా ♦ వ్యము రచింప
నెంత కష్టమొ రసికులే ♦ యెఱుఁగఁ గలరు. 39

టీక. సుగమము

సీ॥ సౌరభాషాంధ్ర భా ♦ షాశ్లేష యొకచోట
నుచిత శబ్దశ్లేష ♦ యొక్క చోటఁ
దనర నర్థశ్లేష ♦ యును ముఖ్యగౌణ వృ
త్తిశ్లేష యొకచోటఁ ♦ దేజరిల్ల
నా నేర్పుకొలఁది నానాశ్లేష లిటుఁగూర్చి
పండితోత్తముల క ♦ బ్రమయితోప
శర బాణ వసు నిశా ♦ కరసంఖ్య దగు శాలి
వాహన శక గతా ♦ బ్దములకు సరి

గీ॥ యౌ ప్రమోదూత వత్సర ♦ మందు చైత్ర
శుక్ల పంచమి రోహిణీ ♦ శుక్రవార
వృషభ లగ్నాంతరమునఁ ద్ర్య ♦ ర్థి ప్రబంధ
కృతికిఁ బ్రారంభ మే నొన ♦ ర్చితిని వేడ్క. 40

టీక. సుగమము.

వ॥ కావున మత్కృతి పతి యగు శ్రీమన్మహారాజ ముష్టిపల్లి శ్రీ సీతా
రామ భూపాలరావు బలవంతు బహద్దరు నామక శ్రీ మద్విద్వ
ద్గద్వాల ధరణీపతి వంశావతారం బభివర్ణించెద నదె ట్లనిన. 41

టీక. సుగమము

## కృ తి ప తి వం శా వ ళి

క॥ శ్రీవనితా వల్లభ భా
హావిర్భవులందు మేటు ♦ లై తేం ద్లనఁగా

భూవలయమందు వెలసిరి
భావింపఁగ పాకనాటి ♦ వారలు ప్రతిభన్ 42

టీక సుగమము

క॥ శ్రీలురు గుణశాలులు వా
చాలురు విలసద్యశో వి ♦ శాలురు కరుణా
లోలురు రిపుకాలురు భూ
పాలురు నౌ పాకనాటి ♦ వారలు తలఁపన్. 43

టీక. సుగమము

క॥ ధీరులు సువిచారులు నవి
కారు లుదారులు పరోప ♦ కారులు వసుధా
ధారులు కరుణారస కూ
పారులు నౌ పాకనాటి ♦ వారలు ధాత్రిన్. 44

టీక సుగమము

గీ॥ అరయ రాడ్శబ్ద తద్భవ ♦ మగును ఱేఁడు
ఱేని రూపాంత రంబగు ♦ రెడ్డి గాన
దేశ భేదఁబులందు క్ష ♦ త్రియుల రెడ్లు
నా వచింతురు పెద్దల ♦ నాటనుండి 45

టీక సుగమము

ఆ॥వె॥ అట్టి ఱేండ్ల కులము ♦ నందున ముష్టిప
ల్యన్వయాయ మలరు ♦ నల సదన్వ
యంబునందు పెద్ద ♦ యగుట నౌకో పెద్ద
నృపతి యనఁ దనర్చె ♦ విపుల నాకఁడు, 46

టీక సుగమము

సీ॥ ఏ రమ్య సువిచారు ♦ చారు సందేశంబు
దేశంబునకు శుభ ♦ స్థితినిఁ గూర్చు
నే రాజితోదారు ♦ దారుణాతత హేతి
తత హేతిగతి రిపు ♦ తతినిఁ గూల్చు
నే రుచిరాకారు ♦ కారుణ్య సంతతి

సంతతి విధమున ♦ జనులఁ జూచు
నే రాట్కుల కుమారు ♦ మారు లే నందంబు
నందంబుఁ దమినూంచు ♦ సుందరులకు
దీ॥ నతఁ దమితసారుఁ దఘదూరుఁ ♦ దరసమీరుఁ
దబ్ధిగంభీరుఁ దవికారుఁ ♦ దద్రిధీరుఁ
దంగజిత మారుఁ దతిశూరుఁ ♦ డాశ్రితోప
కారుఁ డగు పెద్దన నృపాల ♦ వీరుఁ డొనరు. 47

టీక ఏ రమ్యసువిచారు = ఏ యొప్పిద మైన మంచి తలంపు గలవాని యొక్క, చారుసందేశంబు = మనోజ్ఞ మైన యాజ్ఞ, దేశంబునకు = రాష్ట్ర మునకు, శుభస్థితిని గూర్చు = క్షేమకర మైన యునికిని గూర్చునో, ఏ రాజితోదారు = ఏ ప్రకాశింపఁబడిన యీవిఁగలవాని యొక్క, దారుణాతత హేతి = భయంకరమును విరివియు నగు నాయుధము, తత హేతిగతిన్ = విస్తృత మగు నగ్నిజ్వాల విధమున, రిపుతతనిఁగూల్చు = శత్రు సముదాయమునుఁ గూల్చునో, ఏ రుచిరాకారు = ఏ యొప్పిదమైన రూపముఁగల వానియొక్క, కారుణ్య సంతతి = దయావిశేషము, సంతతివిధమున = సంతానసురీతిగా, జనులఁజూచున్ = ప్రజలనుగాంచునో, ఏ రాట్కులకుమారు = ఏ రాజవంశ కుమారునియొక్క, మారులేనందంబు = ప్రతిలేని చక్కదనము, సుందరులకు = రమణులకు, నందంబుఁ దమినూన్చుఁ = సంతోషము బాళిని పొందించునో, అతఁడు = ఆ పెద్దన నృపాలుఁడు, అమితసారుఁడు = అధిక బలముఁ గలవాఁడు, అఘదూరుఁడు = పాపమునకు వెలినుండువాఁడు, అరసమీరుఁడు = వేగమందు వాయుదేవుఁడైనవాఁడు, అబ్ధిగంభీరుఁడు = సముద్రునివంటి గాంభీర్యముఁగలవాఁడు, అవికారుఁడు = వికార రహితమైనవాఁడు, అద్రిధీరుఁడు = పర్వతమువంటి ధైర్యముఁగలవాఁడు, అంగజితమారుఁడు = ఆకారముతో జయింపఁబడిన మన్మథుఁడు గలవాఁడు, అతిశూరుఁడు = అధిక విక్రముఁడు, ఆశ్రితోపకారుఁడు = ఆశ్రయింపఁబడినవారలకు మేలుచేయువాఁడు అగు =

అవునట్టి, పెద్దనృపాలవీరుఁడు పెద్దన జనపాలశూరుఁడు, ఒనరున్ = ఒప్పును
ని హేతిస్స్వాయుధే జ్వాలే, అని విశ్వము

ఆ॥వె॥ అతఁడు బక్కమాంబ • యను నట్టి నారీల
లామ యందుఁ గాంచె • సోమనృపతి
యనెడువాని సిరిగ • జన విభుఁ డను నట్టి
వాని బుధులు మెచ్చ • వార లందు 48

టీక సుగమము

ఉ॥ అన్నగరాజు తప్పుటడు • గైన నొకించుక యేని వేయ లే
డెన్నఁగ దిగ్గజేంద్రుఁ డస • లే మెద నిల్పఁగలేడు చూడఁగా
పన్నగ భర్త రొమ్మునను • పాకెడు పాప యటంచుఁ గేరుచున్
దిన్నఁగఁ జేరె సోమనృప • తిన్ నవయౌవను భూమికాంత సూ 49

టీక. అన్నగరాజు = ఆ పర్వత నాయకుఁడు, ఒకించుకయేని = కొంచమైనను, తప్పుటడుగైన = నేర్చినేరని యడుగైనను, వేయలేడు = వేయఁజాలఁడనియును, ఎన్నఁగన్ = ఎంచి చూడఁగా, దిగ్గజేంద్రుఁడు = అష్టదిక్కుల యందుఁగల యేనుఁగులలో శ్రేష్ఠుఁడు, అసలే మెదనిల్పఁగ లేడు = అసలికే మెద నిల్పఁజాలఁ డనియును, చూడఁగాన్ = కాంచి నట్లయిన, పన్నగ భర్త, సర్పరాజగు శేషుఁడు రొమ్మునను పాకెడు పాప యటంచు = రొమ్ముతో పాకులాడు పసివాఁ డనియును, కేరుచున్ = పరిహసించుచున్, భూమికాంత = భూదేవి, నవయౌవను = నూతన మగు జవ్వనముఁ గలవానిని, సోమనృపతిన్ = సోమజన నాథునిన్ చేరెన్ = కలుసుకొనియెన్, సూ = సుమీయని భావము ఇచట నుపమేయాధిక్య పర్యవసాయి యగు శ్లేషోత్థాపిత వ్యతిరేకాలంకారము

అనఁగా నీ పద్యములో కులాచల దిగ్గజేంద్రాది భూసార వాహకుల యందు శిశుత్వారోపణముఁజేసి తన కీడుగా రని యౌవనవంతుఁడగు సోమ భూపాలుని భూదేవి వరియించి చేరె నని తాత్పర్యము. ఈ పద్యము ద్విప్రాసముగా రచియింపఁ బడినది

గీ॥ ఆ జనేశుఁడు గద్వాల • రాజధాని
గాఁగ నిర్మించి పూడూరి • గ్రామ చెన్న
కేశవస్వామి నెంతో భ • క్తిఁ గొనితెచ్చి
తగఁ బ్రతిష్ఠించి కొల్చుచు • ధాత్రి నేలె. 50

టీక సుగమము.

ఆ॥ వె॥ అతఁడు చండయాత్ర • కరుదెంచి దుర్మార్గు
లైన యవన నృపుల • హరముఁ జేసి
ప్రాజ్ఞు లెన్నఁ దుంగ • భద్రకుఁ గృష్ణకున్
మధ్యసీమ నేలె • మహితగతిని 51

టీక సుగమము

సీ॥ సవ్యార్క కాననో • న్నత హర్మ్యరాజముల్
నవ్యార్క కాననో • న్నతము లాయె
వితతకాంచన సమ • న్విత సదనంబులు
వితతకాంచన సమ • న్వితము లాయె
నవ్యక్తగంధికా • యత సౌధ నికరము
లవ్యక్త గంధికా • యతము లాయె
నతులితాధిక శివాం • చిత భవనావళు
లతులితాధిక శివాం • చితము లాయె

గీ॥ రణధరణి సోమరాజ దో • ర్దండయుక్త
చండ కోదండ మండితా • ఖండ కాండ
మండలాభీల శత్రు ప్ర • కాండ మెంతో
చింతఁ బరతెంచగాఁ దత్పు • రాంతరముల 52

టీక రణధరణిఁ = యుద్ధభూమియందు, సోమరాజదోర్దండయుక్త = సోమభూపాలునియొక్క బాహుదండములతో గూడుకొనియున్న, చండ కోదండ = తీక్ష్ణమైన ధనుస్సునందు, మండిత = ప్రకాశించునట్టి,అఖండ కాండమండల = ఖండముగాని బాణపరంపరలచే, ఆభీల = బాధ నొందిన, శత్రుప్రకాండము = వైరి సముదాయము, ఎంతో చింతఁబరతెంచగా =

ఎంతయో దిగులుతో పొఱిపోవ నా సమయమున, తత్పురాంతరములఁ = వారి పట్టణముల లోపల, నవ్య = నూతనమైన ,అర్కకానన = సూర్యుని గృహమువలె అనఁగా మండల మనుట ని కాననం విపినే గేహే, అని విశ్వము ఉన్నత=ఎత్తైన, హర్మ్యరాజముల్ = సౌధశ్రేష్ఠములు, నవ్యార్క-కానన = నూతనమగు జిల్లెడు వనములచేత, ని. అర్కో-ఽర్కపపర్ణే స్ఫటికే రవౌతామ్రే, అని విశ్వము ఉన్నతము లాయె = ఎత్తైన వాయెను. వితత = విరివియైన, కాంచన = బంగారుతో, సమన్విత = కూడుకొనఁబడిన, సదనంబులు = గృహములు, వితత కాంచన సమన్వితము లాయెఁ = విరివి యగు నుమ్మెత్త చెట్లతోఁ గూడిన వాయెను ని కాంచనః కాంచనారే స్యాచ్చంపకే నాగకేసరే ఉదుంబరేచ దుత్తూరే, అని విశ్వము. అవ్యక్త = తెలియఁబడని, గంధిక = పరిమళముఁగల, ఆయత = నిడుపైన, సౌధనికరముల్ = మేడల సముదాయములు, అవ్యక్తగంధికాయతము లాయె = వెంపల చెట్లచేత నిడుపైన వాయెను ని నీలినీ చారటీనీల పుష్పికావ్యక్తగంధికా, అని అభిధాన రత్నమాల, అతులిత=సమాన రహితమైనట్టియు, అధిక=హెచ్చగునట్టియు, శివ = శుభములచేత అంచిత = ఒప్పినట్టి భవనావళుల్ = గృహసముదాయములు, అతులితాధికశివాంచితము లాయె = సమానరహితమైనట్టి హెచ్చగు నక్కలతో నొప్పిన వాయెను, ని శివం మోక్షే సుఖే భద్రే అనియును, అభయా మలకీ గౌరీ క్రోష్టి సక్తుఫలాసుచ, అనియును విశ్వము

ఈ పద్యమున నవ్యాది శబ్దములు పునరుక్తములైన విశిష్టతను భేదము న్నదిగాన దుష్టములు కావు, ఇట్టి ప్రయోగములు వసుచరిత్రాదులనుఁ గలవు ఇందు యమకవృత్త్యనుప్రాసములు, శబ్దాలంకారములు రూపకమర్థాలంకారము.

గీ॥ అతని తమ్ముఁడు సిరిగ ధ • రాధినేత
దురమునందున శాత్రవుల్ • దురితు లైన
యవన నృపులను బరిమార్చి • యౌవరాజ్య
పదవిఁ గొని యన్న కెపుడుఁ దో • డ్పడుచునుండె 53

టీక. సుగమము.

సీ॥ గురుతరం బైనట్టి ♦ గోవుపాలుగఁ జేసె
నానావిపక్ష ఘ ♦ నాఘనాలి
రామణీయక పయో ♦ రాశిపాలుగఁ జేసె
నరినికురుంబ శ ♦ రాగ్రములను
సత్వరగతిని భూ ♦ జనులపాలుగఁ జేసె
దర్పిత రిపు వీర ♦ ధర్మములను
బ్రోదతనంబున ♦ న్నాదుల పాలొసె
దాయల నారుల ♦ తంచములను
గీ॥ విమతులన్ బగసాధించి ♦ సమర మందు
హరణ మొనరించుగాని త ♦ త్పరికరములుఁ
దత్తదుచిత ప్రదేశముల్ ♦ దవులఁ జేయు
నహహ సిరిగాహ్వయుం డనా ♦ భావనుండు. 54

ఇందు సిరిగ భూపాలుఁడు శత్రురాజులను సంహరించును గాని వారి యొక్క యుద్ధ సాధనములను నసింపఁ జేయక వాని వానిజన్మ భూముల కును, అందగలుగు చోట్లకునుఁ డింపెనని అర్థ ద్వయముతో చెప్పఁబడినది.
టీక. నానావిపక్ష ఘనాఘనాళిఁ = అనేకులగు శత్రువులలో ఘాతుకుల సంఘమును, గురుతరంబైనట్టి = అధికతరమైన, గోవు పాలుగఁ జేసెఁ = బాణము, లేక భూమి, లేక స్వర్గము, పాలబడునట్లు జేసె ననిన్ని, నానా విపక్ష = అనేకములగు శత్రులయొక్క, ఘనాఘనాళిఁ = ఏనుంగుల గుంపును, గురు గోవుపాలుగజేసెన్ = అధికతరమైన దిశపాలబడు నట్లుఁ జేసె ననిన్ని అర్థాంతరము న్ని ఘనాఘనో ఘాతుకమత్తదంతినో, అని యును ని. గౌఃస్వర్గే నేత్రదిగ్బాణభూ వాగ్వారిషు గౌర్మతా అని విశ్వము. అరినికురుంబ = శత్రుసముదాయముయొక్క, శరాగ్రములను = నీళ్ళచివర లను, రామణీయక = అందమైనట్టి. పయోరాశి పాలుగఁజేసెన్ = సముద్ర ముల పాలఁబడునట్లు జేసెను అనఁగా వైరుల చెఱుపులు మొదలైనవానిని

తెంచి యా నీటిని సముద్రములో కలియునట్లు చేసె ననియును, అరినికురుంబ శరాగ్రములను = శత్రుసముదాయముయొక్క బాణాగ్రములను, అనఁగా బాణముల ములుకుల ననుట, రామణీయకఁపు = అందమైనట్టి, అయోరాశి పాలుగఁజేసెఁ = ఇనుపగుట్టలపాలఁ బడునట్లు జేసెనని అర్థాంతరము. ని॥ శరోదధ్యగ్రబాణయోః అనియును, శరంనీరే' అనియును, విశ్వము, దర్పిత = గర్వింపఁబడిన రిపువీర = శత్రువీరుల యొక్క, ధర్మములను = న్యాయ ముల ననియును, వింటిబద్దల ననియును, సత్వరగతిని = మిక్కిలి వేగ ముగల గమనముచేత, భూజనులపాలుగఁ జేసెఁ = భూప్రజల పాలుగఁ జేసె ననియును, వృక్షముల పాలఁబడునట్లుఁ జేసెననియును, దాయల = శత్రువులయొక్క, నారుల తండములను = స్త్రీల సముదాయము ననియును, అల్లెత్రాడుల సముదాయము ననియును, ప్రోఢ తనంబునఁ = ప్రౌఢత్వము చేత, నాడులపాల్ చేసెఁ = దేశముల పాలు చేసె ననియును, నరముల పాలు చేసె ననియును, విమతులఁ = శత్రువులను, పగఁ = విరోధముచేత సాధించి = జయించి, సమరమందు = యుద్ధమునందు, హరణ మొనరించు గాని = నాశనము చేయునేగాని, తత్పరికరములన్ = వారి యుద్ధసాధన ములను, తత్తదుచిత ప్రదేశముల్ = వాటివాటి యుచిత స్థలముల యందు, తవులఁ జేయుఁ = చేరునట్లు నొనర్చును, సిరిగాహ్వయుండు = సిరిగనామఁ డగురాజు, అనాథ = దిక్కులేని వానిని, అవనుండు = రక్షించు వాఁడు. అహహ = ఆశ్చర్యము.

అనఁగా సింగరాజు యుద్ధభూమియందు శత్రుసంహార మొనరించి శత్రువుల యేనుంగులను దిగ్గజములఁ గలుపుటకై దిక్కుల పాలు చేసె నని యును, బాణముల చివరనుండు నినుపయలుగులని యినుపగుట్టలపాలుఁ చేసె ననియును, అల్లెత్రాళ్లను నరముల పాలుజేసె ననియును, అనఁగా అల్లె త్రాళ్ళు నరములే కనుక త్రెంచివైచి వచ్చిన శత్రువుల నరముల చెంతఁబడ వైచె ననుట కావున వాని కులస్థానములతో వానినిఁ జేర్చె నని తాత్పర్యము.

కII అ సిరిగ విభున కగ్రజుఁ
డౌ సోమనృపాలుఁ డంబ • మాంబను లింగాం
బాసాధ్విని రామాంబను
బాసురముగఁ బెండ్లియాడె • వారలలోనన్ 55

టీక సుగమము

కII శ్రీయుతుఁడు సోమధరణీ
నాయకుఁ డల లింగమాంబ • నాఁజను సతియం
దాయననుగాంచెఁ దిరుమల
రాయ ధరారమణు రామ • రాయ నృపాలున్ 56

టీక సుగమము

సీII తానెంత సిరిఁగన్నఁ • దత పర వాహినుల్
భంగమూన్పగ సుడిఁ • బడుట లేదె
తానెంత కువలయా • ప్తతఁగన్న దోషాక
రుండయి కృశియింపు • చుండ లేదె
తానెంత రాజరా • జైనఁ గ్రతుధ్వంస
కారి కెన్నఁగఁ జెలి • కాఁడు గాదె
తానెంత భువన ప్ర • దాతయైనను విష్ణు
పదమును విడి గట్లు • పాలు గాదె

గీII యని సరిత్పతి సత్పతి • ధనద వనద
పూగములఁగేరు సంతత • త్యాగ గరిమ
నా హిమాచల సేతు ప • ర్యంత కీర్తి
శాలి తిరుమలరాయ • భూపాల మౌళి. 57

టీక తా నెంత సిరిఁ గన్నన్ = అతఁ డెంత సంపదను వహించిన నని యును, అతఁడెంత లక్ష్మిదేవిని జనింపఁజేసిన ననియును, తత పర వాహినుల్ = విస్తృతములైన శత్రు సైన్యములు, భంగమూన్పగన్ = భంగ పాటు నొందించఁగా ననియును, విస్తృతమును శ్రేష్ఠమునగు నదులు తరంగముల నొందింపఁగా ననియును, సుడిఁబడుటలేదె = దన్నియుండుట

లేదా (అనఁగా దస్సెననుట) అనియును నుడిగుండములలోఁ బడుచుండుట లేదా యనియును, తానెంత కువలయాప్తతఁ గన్నన్ = అతఁడెంతటి భూవలయమునకు మిత్రత్వమును వహించిన ననియును, అతఁడెంత కలువలకు నాప్తత్వము వహించిన ననియును, దోషాకరుండయి కృశియింపుచుండలేదె = పాపములకు, నాకరమైన వాఁడయి క్షీణించు చుండలేదా యనియును, రాత్రికి నాకరమైన వాడయి దినమున కొకకళ తరుగుచుండలేదా యనియును,తా నెంత రాజరాజైనను = అత డెంత చక్రవర్తియైన ననియును, అత డెంతయక్షులకు రాజైన ననియును, క్రతుధ్వంస కారికెన్నఁగఁ జెలికాఁడుగాడె = యజ్ఞములు జెరుచు వాని కెంచిచూడ మిత్రుఁడు కాడా యనియును, ఎన్నగా నీశ్వరునకు స్నేహితుఁడు కాడా యనియును, తా నెంత భువనప్రదాతయైనను = అతడెంతటి లోకములో ఖ్యాతి గల పెద్దైన దాతయైన ననియును, అతఁడెంత యుదకమును మిక్కిలియిచ్చువాఁడైన ననియును విష్ణుపదమును విడి గట్లపాలుగాదె = నారాయణుని పాదమును వదలి కొండలపాలుగాడె యనియును, ఆకాశమును వదలి పర్వతముల పాలుగాదా యనియును అని = ఇట్లనుచు (పైపెద్ద గీట్లకు క్రింది గీతము క్రమము) సరిత్పతిన్ = సముద్రునిన్ని, సత్పతిన్ = చంద్రు, ధనద = కుబేరుని, వనద పూగములన్ = మేఘసముదాయములను, *సంతత త్యాగగరిమన్ = నిరంతర దాతృత్వాతిశయముచేత, అహిమాకీర్తిశాలి = హిమవత్పర్వతము మొదలు సేతువు పర్యంతము యశముచేత నొప్పునటి, తిరుమలరాయ భూపాలమౌళి = తిరుమల రాయభూపాల శ్రేష్ఠుఁడు కెరున్ = పరిహసించును ని॥ వాహినీస్యాత్తరంగిణ్యాం సేనాసైన్య ప్రభేదయోః, అనియును, ని భంగస్తరంగేరుగ్భేదే భేదెజయవిపర్యయే, అనియును దోషస్తు దూషణే పాపే దోషా రాత్రౌభుజేఽపిచ, అనియును, ని. రాజరాజ కుబేరేఽపి సార్వభౌమే సుధాకరే, అనియును, విశ్వము ని. వియద్విష్ణుపదమ్, అని అమరము

ఇందు నాలుగు చరణములయందుఁ జెప్పిన యర్థము వరుసగా గీతియం దున్న సరిత్పతి సత్పతి ధనద వనదములతో నన్వయించుటచే యథా సంఖ్యా లంకారము ఉపమానభూత సముద్రాదుల త్యాగములయందు దోషోద్భావనముఁజేసి యుపమేయ తిరుమలరాయ నృపత్యాగమందు నిర్దోషత్వ రూప విశేషముఁ జెప్పుటచే శ్లేషోత్థాపిత వ్యతిరేకాలంకారము. యథాసంఖ్యమునకు వ్యతిరేకమునకును బరస్పర నైరపేక్ష్యము వలన సంసృష్టి.

చ॥ కిరివరుఁ డెల్ల వేళఁజెడు ♦ కీర్తిన్ వహింపుచు నొంటిఁ ద్రిమ్మరున్
గిరివరులన్న సంయముల ♦ నిచ్చఁదపింపఁగఁ జేయు కర్కశుల్
కరివరులో కడున్ మదముఁ ♦ గల్గినవారని నేలరోసి యీ
తిరుమలరాయనిన్ దనకు ♦ దీటనుచున్ వరియించి గైకొనెన్ ౫౪

టీక. నేల = భూదేవి, కిరివరుఁడు = ఆదివరాహేశ్వరుఁడు, ఎల్లవేళలన్ = ఎల్లప్పుడును, చెడుకీర్తివహింపుచు నొంటిఁ ద్రిమ్మరున్ = అప్రఖ్యాతిని వహించి యనియును, చెడు బురదను వహించి యనియును ఒంటరిగాఁ దిరుగువాఁడని. గిరివరులన్నన్ = పర్వత శ్రేష్ఠులనిననో, సంశయములన్ = మునీశ్వరులను, నిచ్చన్ = నిత్యమును, తపింపగఁజేయు కర్కశుల్ = తాపమునొందు వారినిఁగాఁజేయు కఠినులనియును, తపస్సు నొనర్చువారినిఁగాఁ జెయు గట్టివారనియును, కరివరులో = గజరాజు లందమా,(అనఁగా దిగ్గజములనుట) కడున్ = మిక్కిలి, మదముగల్గినవారని = గర్వముగలవారని యును, సీదిరము గలవారనియును, రోసి = పరిత్యజించి, రః తిరుమలరాయనిన్ = ఆ తిరుమలరాయ భూపాలుని, తనకు దీటనుచున్ = తనకుసమానుఁడగువాఁడని, వరియించి గైకొనెన్ = కోరిచేకొన్నది.

అనఁగా భూభరణ ధురీణులగు నాదివరాహ కులాచల దిగ్గజశ్రేష్ఠుల మాలిన్య వర్తన సాధుసంతాప కాఠిన్య మదాసక్తులఁ బొందుటచే వారిని వదలి తిరుమలరాయభూపాలుని భూమికాంత వరియించెనని భావము ఇందు శ్లేషోత్థాపిత వ్యతిరేకాలంకారము

గీ॥ అట్టి తిరుమలరాయ ధ ♦ రాధినేత
సూనగాత్రలు గుణవతుల్ ♦ [illegible] చంద్ర

లైన లక్ష్మాంబ మంగాంబ • యనెడు సతులఁ
బరిణయంబాడె శౌరి శ్రీ • ధరణులబలె 59

టీక. సుగమము

క॥ అలమేలు మంగమకు తిరు
మలరాయఁడు మరులుఁ జూపి • మసలు నయారే
యలమేలుమంగమకు తిరు
మలరాయఁడు మరులుఁ జూపి • మసలుట లరుదే 60

టీక అలమేలు = అన్నిటిమేలైన, మంగమకు = మంగమాంబకు, తిరుమల రాయఁడు = తిరుమలరాయ భూపాలుఁడు, అయారే = ఆశ్చర్యము, మరులు చూపి = మోహమును జూపి, మసలున్ = విహరించును, అలమేలు మంగ మకు = అలమేలుమంగాదేవికి, తిరుమలరాయఁడు = వేంకటేశ్వరుఁడు, మరులుఁజూపి = మోహమును గనుపఱిచి, మసలుట లరుదే = విహరించుట వింతయే (అనఁగా కాదనుట)

క॥ ఆ మంగమాంబయందున
ధీమంతుఁడనన్ దనర్చు • తిరుమలరాయం
డౌ మేల్ మేలనఁ గాంచెన్
సోమాకారుఁడగు రాము • సోమ నృపాలున్ 61

టీక సుగమము

ఉత్సా॥ మేరలేని దాత సోమ • మేదినీశుఁ డౌటచే
భూరి శంభ దద్రి చుట్టు • భూరి శంభ దద్రి యా
తార వరశిఖరిని జేరి • తారవర శిఖరియు నె
వ్వారి కిచ్చునో యటంచు • వారకుందు రజ్జరే 62

టీక సోమమేదినీశుఁడు = సోమభూపాలుఁడు, మేరలేని దాత = మితములేని త్యాగి, ఔటచే = ఐనందువలన, భూరి = బంగారుచేత, శంభత్ = ప్రకాశించునట్టి, అద్రిచుట్టు = పర్వతము చుట్టును,

(అనఁగా మేరువుచుట్టు ననుట) భూరి = అధికమగు, పంభత్ = ప్రకాశము గల, అద్రియు = సూర్యుఁడును, ని॥ భూరిస్స్వర్ణే బహౌత్రిషు, అని నానార్థ రత్నమాల ని॥ అద్రిశ్శైలద్రుమార్కేషు, అని విశ్వము ఆ = అలా, తారవర = వెండిలో శ్రేష్ఠమైన, శిఖరిని జేరి = కొండను జేరి (అనఁగా కైలాసము ననుట) తారవర = నక్షత్రేశుని, శిఖరియు = శిఖరము గలవాఁడును (అనఁగా నీశ్వరుఁడనుట) ఎవ్వారి కిచ్చునో యటంచు = ఎవ్వరికి నొసంగునో యని, వారక = ఎడబాటు లేక, ఉందురు = ఉండెదరు, అజ్జరే = ఆశ్చర్యము. ని॥ కనీనికర్క్షయో స్త్రీషద్వయోస్తారంతు రూప్యకే, అని నానార్థరత్నమాల తారశబ్దము ద్వయోః యనుటచే పుంస్త్రీలింగముల యందు గలదని గ్రహింప వలయును అందువలననే శబ్దార్థచంద్రికలో నక్షత్ర రౌప్య పర్యాయమునందు తారము అని వ్రాసుకున్నాడు

చ॥ తమమును బూనెఁబో యరుల • ద్వంద్వముఁ బాపియుఁ బుండరీక ప
త్రములు బలమ్ము మాయఁగ స • రాసరి డాలుల డిందఁజేసి య
త్యమలతరాకృతిఁ గువల • యం బలరన్ వసుసంచయంబులన్
సుమనసు లూననిచ్చుఁదన • సోమసమాఖ్యము సార్థకంబుగన్ 68

ఈపద్యములో సోమసమాఖ్యము సార్థకంబుగన్, అనుటచే చంద్ర పర్యాయముగను సోమభూపాలుని పర్యాయముగను అర్థద్వయముఁ గలుగు నట్లు జెప్పఁ బడినది

టీక॥ తమమును బూనెఁ బో = చీకటిని వహించి నట్లైతే నని చంద్ర పరముగను తామసమును వహించినట్లైతే నని నృపుని పరముగను, అంతటని ట్లేగ్రహించునది, ని॥ రాహౌధ్వాంతే గుణేతమః ॥ అని అమరము, అరులద్వంద్వముఁ బాపియున్ = చక్రవాకముల జంటను నెడ బాపియు ననియును, శత్రువులను యుద్ధమునుండి పాఱఁ దోలియుననియును, అరి ద్వంద్వశబ్దములు, శబ్దార్థచంద్రికలో చూడనగు పుండరీకపత్రములు = తెల్ల తామరరేకులు, బలమ్ము మాయఁగన్ = సామర్థ్యము మాసి పోవునట్లు, సరా

సరిన్ = సగటున, డాలుల డిందఁజేసి = కాంతులనణంపఁ జేసి యనియును పుండరీక సితచ్ఛత్రములును, పత్రములు = వాహనములును బలమ్ము = కాల్బలమును, మాయఁగన్ = హరణమగునట్లుగా సరాసరి = సగటున, డాలుల డిందఁ జేసి = డెక్కెముల నసింపఁజేసి యనియును, ని॥ పుండరీకం సితాంభోజే సితచ్ఛత్రేచ భేషజే, అనియును, ని॥ పత్రంస్యా ద్వాహనేపర్ణే॥ అనియును విశ్వము అతి = అధిక మగు, అమలతర = కల్మష రహితమగునట్టి, ఆకృతిన్ = రూపము చేత, కువలయంబలరన్ = కలువ వికసింపఁగా ననియును, భూవలయము ప్రకాసింపఁ గాననియును వసుసంచయంబులన్ = కాంతుల సముదాయ ముల ననియును, ధన సముదాయముల ననియును, సుమనసులూననిచ్చున్ = దేవతలు పరిగ్రహింపఁగా నొసంగు ననియును, విద్వాంసులు పరిగ్రహింపఁగా నొసంగు ననియును, తన సోమ సమాఖ్యము సార్థకంబుగన్ = తనయొక్క సోముఁడను నామము సార్థక్యముఁ జెందునట్లుగా నని భావము.

అనఁగా, సోమనాథుము చంద్రునకును తనకును చెల్లియున్నందున తన నామము సార్థకమగునట్లు చంద్రుఁ డెట్లొనర్చునో తానట్లు నొనర్చు నని తాత్పర్యము.

క॥ బలి విబుధద్వేషి యగున్
నెల స్వగురు ద్రోహియగు గ • ణింపఁగఁ గర్ణుం
డిల దుష్ట చతుష్టయ మం
దలి వాఁడిఁక సోముఁబోలు • దాతలుఁ గలరే 64

టీక॥ సుగమము

సీ॥ చంద్రకిరీట భా • స్వర దీర్ఘకచ పాళి
మణి కలితాహీన • ఘృణి సరాళి
ధీరగణాశ్రయా • గార సంతత హేల
శిఖిశిఖాంచితఫాల • సీమలీల

నిర్మలద్రాక్షాయ • ణీపాల నావాప్తి
ప్రకట యశో మహి • తకర దీప్తి
గురుతరకల్యాణ • గోత్రధర్మాసక్తి
రిపుపురచ్ఛేదన • నిపుణశక్తి
గీ॥ ధామసమ్మేళ నాభోగి • తర విభూతి
గోవరస్తుత్య పాద రా • జీవ రీతి
నరయఁగా ముష్టిపల్లి సోమాధినాథుఁ
డవనిఁ బొగడొందు సోముఁ డౌ • ననఁగ సహహ. ౬౫

ఈ పద్యములో సోమనామము శంకరుని యందును వర్తించును గనుక శంకరుని పరముగను సోమభూపాలుని పరముగను, అర్థద్వయముగలుగు నట్లు రచియింపఁ బడినది.

టీక చంద్ర కిరీట భాస్వర దీర్ఘ కచపాళిన్ = చంద్ర మకుటము చేత ప్రకాశించు నట్టి పొడుగైన కురుల సమూహము నందునని శంకరుని పరముగను, బంగారు కిరీటముచేత ప్రకాశించునట్టి పొడుగైన వెంట్రుకల సముదాయము నందునని రాజు పరముగను అంతట నిట్లే గ్రహించునది ; ని, చంద్రస్సుధాంశు కర్పూర కంపిల్ల స్వర్ణ వారిషు అని విశ్వము మణి కలితాహీన ఘృణి సరాళిన్ = మణికలిత = రత్నములఁ చేత నొప్పునట్టి, అహి + ఇన, అహీన = ఆదిశేషునియొక్క, ఘృణి = కాంతులు గల, సరాళిన్ హారములయందు ననియును, మణులతో నొప్పునట్టి, అహీన = అధికమగు 'ఘృణి = కాంతిగల, సరాళిణ = హారముల సముదాయమందు ననియును' ధీర = ధైర్యవంతులగు, గణ = ప్రమథులకు, ఆశ్రయ = ఆశ్రయభూతమగు, ఆగార = గృహముయొక్క, సంతతహేలన్ = నిరంతరసంతోషమందుననియును,ధీరగణ = పండిత సముదాయమునకు, ఆశ్రయ భూతమైన గృహముయొక్క నిరంతర సంతోషమందుననియును, ని॥ గణ స్సమూహే ప్రమథే, అనివిశ్వము'. శిఖిశిఖాంచిత = అగ్నిజ్వాలలచేత నొప్పు నట్టి, ఫాలసీమలీలణ = నిటల ఫలకముయొక్క విలాసమందు ననియును,

శిఖిశిఖ = కుంకుమ పువ్వుచేత, అంచిత = ఒప్పునట్టి, ఫాలసీమలీల = నిటల ఫలకముయొక్క విలాసము నందుననియును, నిర్మల = కల్మషరహితమగు, దాక్షాయణీ పాలనావాప్తిన్ = పార్వతీ పాలనమందలి శుభోదయ మందనియును, భూమి పాలన మందలి లాభము నందనియును, ని॥ దాక్షాయణీ భవానీ భూ, అని నానార్థ రత్నమాల ప్రకట = ప్రసిద్ధమైన, యశః, కీర్తిగల, మహితకర = త్రిశూనోలమొప్పెడు హస్తముయొక్క, దీప్తిన్=కాంతియందు ననియును, ప్రసిద్ధమైనకీర్తి వలన గలిగిన యధికతరమగు కాంతియందు ననియును, మహితశబ్దము త్రిశూల మనుటకు శబ్దార్థకల్పతరువుఁ జూడనగు, గురుతర = అధికతరమగు, కల్యాణ = బంగారు సంబంధమగు, గోత్ర = పర్వతమగు (మేరువనుట) ధర్మ = వింటిబద్ధయందలి, ఆసక్తిః = అపేక్ష యందుననియును, గురుతర = అధికతరమగు, కల్యాణ = మంగళకరమైనట్టి, గోత్రధర్మ = కులధర్మ మందలి, ఆసక్తిః = అపేక్షయందుననియును, ని॥ కల్యాణమక్షయేస్వర్ణే కల్యాణంమంగళేపిచ, అని విశ్వము, ని॥ గోత్రంనామ్నికులేక్షేత్రే, అనియును, గోత్రశ్శైలేఽథమాత్రంస్యాత్, అనియును, నానార్థరత్వమాల, ధర్మే పుణ్యేయమేన్యాయే, అనియును, చాపేచోపని గద్యతే, అనియును, విశ్వము రిపుపురచ్ఛేదన = శత్రుపట్టణముల ఖండించుట యందు, (అనఁగా త్రిపురముల ననుట) నిపుణశక్తిః = నేర్పుగల సామర్థ్యము నందనియును, రిపు = శత్రువులయొక్క, పుర = శరీరములను, ఛేదించుట యందు నేర్పుగల సామర్థ్యము నందనియును, ని॥ పురం పురి శరీరేచ, అని విశ్వము' ధామసమ్మేళన = శరీరమందు కలుసుకొనియుండిన' ఆభోగతర = సంపూర్ణకరమైన, విభూతిః = భస్మమందు ననియును, గృహమునందు కలుసుకొని యుండిన సంపూర్ణతరమగు సంపత్తు నందుననియును, గృహాదేహ త్విట్ ప్రభావా ధామాని, అని అమరము విభూతి ర్భూతిరైశ్వర్యం, అని అమరము గోవరస్తుత్య = ఇంద్రునిచేత, లేక బ్రహ్మచేత, లేక విష్ణువుచేత, లేక బసవేశ్వరునిచేత, నుతింపఁ బడిన, పాదరాజీవరీతిః = పదపద్మముల యొక్క విధమునందనియును, భూపతులచేత నుతింపఁ

బడిన పద పద్మములయొక్క విధమునం దనియును, అరయఁగాఁ = విచారించి చూడఁగా, ముష్టిపల్లిసోమాధినాథుఁడు = ముష్టిపల్లి సోమభూపాలుఁడు, ఆహహా = ఆశ్చర్యము, సోముఁ డౌనసఁగఁ = సఱశ్వరుఁ డేనని యనుటకు అవనిఁ = భూమియందున, పొగడొందుఁ = పొగడ్తను వహించును

కII సోమనృపాలుఁడు గాంచెఁ
రామనృపాలకుని నతఁడు ♦ రమణఁ సీతా
రామినృపుఁ గాంచె నాతఁడు
సోముఁ గనె నతఁడు రాము ♦ శుభముగఁ గాంచెన్. 66

టీక. సుగమము.

ఈ పద్యమునఁగల నృపులు దత్తసంతానమవి తెలియనగుచున్నందున నాభాగము చరిత్రకారులకు వదలివేయఁ బడినది.

సీII శివధర్మమునుఁ జెలు ♦ చియు జనకుని దత్త
పుత్రికఁ భార్యగాఁ ♦ బూనదేని
కువల యాహితు సుతు ♦ కొలకు సతర్పించుని
శతధృతి జాతునిఁ ♦ జంపదేని
చపలాశిఖాన స ♦ లిపి భువనేశుఁ గ
లంచి గ్రామముల వే ♦ యించదేని
విబుధ ద్విషుండౌ వి ♦ భీషణు దరిఁ జేర్చి
పుణ్య జనుల బోరి ♦ పుచ్చదేని

గీII సాటియగు నలరామ భూ ♦ జాని నెన్న
సతత ధర్మైక రతికి ర ♦ క్షిత సుకృతికి
వినయసంయుక్త మతికి వి ♦ వేకధృతికి
ముష్టిపలికుల వర రామ ♦ భూమి పతికి. 67

టీక సతత = నిరంతరమును, ధర్మ = న్యాయమందు, ఏక = ముఖ్యమైన, రతికి = అనురాగము గల వానికిని, రక్షిత = రక్షింపఁ బ

డిన, సుకృతికి = పుణ్యవంతులు గలవానికిని, వినయ = మంచి నీతితో, సంయుక్త = కూడుకొనఁబడిన, మతికిన్ = హృదయముగల వానికిని, వివేక = జ్ఞానమును, ధృతికి = వహించిన వానికిని, ముష్టిపలి కుల వర రామభూమి పతికిన్ = ముష్టిపల్లి వంశ్యుఁ డైన శ్రేష్ఠుఁడగు రామ భూపాలునకును, అల రామ భూజాని = అట్లు రఘురామభూపతి, శివధర్మమునుఁ జెఱచియు = మంగళకరమగు న్యాయమునుఁ జెడగొట్టియు, జనకుని దత్త పుత్రికన్ = తండ్రియొక్క పెంపుడు కూతురిని, భార్యగాఁ బూనదేని = పెండ్లాముగా వహింపడేని, శివధర్మమునుఁ జెఱచియు = ఈశ్వర ధనుస్సును భంగముఁ జేసి జనకుని దత్తపుత్రికన్ = జనక మహారాజు పెంపుడు కూతురైన సీతాదేవిని భార్యగాఁ గైకొన్నాఁడని భావము, గీతిలోఁ జెప్పిన యర్థము లకు వీనికి క్రమముఁజూడవలయును, కువలయ = భూవలయమునకు, అహిత = శత్రుఁడైన వానియొక్క, సుతకొఱకు = కుమారుని నిమిత్త మయి, సత్రంబునన్ = యజ్ఞనమునందు, ని సత్రంయజ్ఞేయజ్ఞ భేదే సదా దానే వనేఒంతకే, అని రత్నమాల శతధృతిజాతుని = బ్రహ్మ సంతతి వానిని, చంపడేని = హతముఁ జేయడేని, కువలయ = కలువలకు అహితుని = శత్రువైన సూర్యునియొక్క, సుతకొఱకు = కొడుకైన సుగ్రీవునికొఱకు, సత్రంబున = వనమునందు, శతధృతిజాతుని = ఇంద్రుని కుమారుఁడైన వాలినిఁ జంపినాఁడని భావము ని, శతధృతి ర్ధాతరీంద్రే, అనివిశ్వము చపలాళికి నిలుకడలేనివారలకు, ఆన సలిపి = ఆజ్ఞఁచేసి, భువనేశుఁగలంచి = లోకేశ్వరుని కలత నొందించియును, గ్రావములన్ = రాళ్ళతో, వేయించడేని = కొట్టించడేని. చాపలాళికి = కోతుల సముదాయము నకు, ఆజ్ఞఁ జేసి భువనేశుఁ గలంచి - సముద్రుని కలత నొందించి, గ్రావము లన్ = కొండలను వేయించి నాఁడని భావము ని చపలో వానరే నీచే, అని విశ్వము విబుధద్విషుండౌ = పండితవిరోధి యగునట్టి, విభీషణున్ = మిక్కిలి భయంకరుఁడైనవానిని, దరిఁజేర్చి = చెంతఁ జేర్చుకొని, పుణ్యజనులన్ = పుణ్యవంతులగు నరులను, పొరిపుచ్చడేని = నశింపఁజేయడేని, విబుధ

ద్విషుండౌ = సురవిరోధియగు (అనఁగా రాక్షసుఁడనుట) విభీషణుఁ = రావ ణుని తమ్ముఁడగు విభీషణుఁడనువానిని చెంతఁజేర్చుకొని, పుణ్యజనులన్ = రాక్షసులను నశింపఁ జేసినాఁడని భావము ని పుణ్యజనస్సుజనే స్యాద్రక్షసి, అని రత్నమాల ఎన్నన్ = ఎంచిచూఁడగా, సాటియగున్ = సమానుఁడగును. ఇందు యథాసంఖ్యాలంకారము, యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాంసమ న్వయః॥ అని లక్షణము వర్ణ్యుండగు రామభూపాలునకు నవర్ణ్యుండగు రామ భద్రుం డౌపమ్య నిష్పత్తి లేనందున సాటిగాఁడని చెప్పుటచే ప్రతీపాలంకారము వర్ణ్యేనాన్యస్యోపమాయా, అనిష్పత్తివచశ్చ తత్, అని లక్షణము.

మ॥ తెలుపై తోఁచెడు కేశముల్ గలుగుపో • త్రిశ్రేష్ఠునిన్ హెచ్చుగాఁ
దల యేవేళ వడంకుచుండ కరిభ • ర్తన్ ద్రిమ్మరన్‌లేని గ
ట్టులజేనిన్ శ్రవముల్ పదంబులును ఖ • ట్టున్ దప్పియున్నట్టి నా
గులమేటిన్ ముదివారటంచు ధరకై • కోలొందె రామాధిపున్ 68

టీక. తెలుపై తోఁచెడు పోత్రిశ్రేష్ఠునిన్ = తెల్లనై చూపట్టెడు వెంట్రుకలుఁ గలిగినట్టి, (అనఁగా నరిసిన వెంట్రుకలనుట) ఆదివరాహవర్యు నుని, ఆదివరాహము శ్వేతవర్ణమని ప్రసిద్ధము హెచ్చుగాన్ = అధికముగా, తలయేవేళ వడంకుచుండు కరిభర్తన్ = ఎప్పుడును తలవడకుచుండెడి గజరాజును, (అనఁగా దిగ్గజేంద్రుననుట) ద్రిమ్మరన్ లేని గట్టుల జేనిన్ = తిరుగులాడజాలని పర్వత రాజును, శ్రవముల్ పదంబులును ఖట్టున్ దప్పియున్నట్టి నాగులమేటిన్ = చెవులును, కాళ్లును, పటుత్వముఁ దప్పిపోయిన సర్పరాజును, ముదివారటంచుఁ = ముసలివారని భావించి, రామాధిపుఁ = రామభూపాలుని, ధర = భూదేవి, కైకోలొందెఁ = పరి గ్రహించెను.

అనఁగా భూభార భరణ ధుర్యులగు నాదివరాహ దిగ్గజాదులయందు వృద్ధత్వము నారోపించి శ్వేతవరాహమూర్తికి వెంట్రుకలు నరిసినవని

దిగ్గజేంద్రునకు తల వణుకుఁ గలిగినదని పర్వతరాజు కదిలి మెదిలాడ నేరదని, ఆదిశేషునకు చెవులు కాక్ను పటుత్వముఁ దప్పిపోయినవని' దోషారోపణఁజేసి భూదేవి యౌవనమూర్తియగు రామభూపాలుని పరిగ్రహించె నని తాత్పర్యము

ఆ॥వె॥ సురభి నెన్న పశువు ♦ సురమణియో బండ
కల్పకంబు తరువు ♦ కంజవైరి
యనిన నొక్కొ కపుడుఁ ♦ గనుపింపదని శ్రితుల్
రామనృపతిఁ జేరి ♦ యోము మంద్రు 69

టీక. సుగమము.

ఆ॥వె॥ ఖగతనయుఁడు నమృత ♦ కరుఁడును వనదుఁ డీ
జనవరేణ్యు దాన ♦ మునకు నోడి
ముఖము సెల్లకునికి ♦ ముఖ్యవర్ణ భ్రష్టు
లైరి చెడుగుపేరు ♦ లంది రిస్సి 70

టీక ఖగ = సూర్యునియొక్క, తనయుఁడును = కొడుకును (కర్ణుఁ డనుట,) ని ఖగస్సూర్యేగ్రహేదేవే, అని విశ్వము అమృతకరుఁడును = చంద్రుఁడును, వనదుఁడు = మేఘుఁడును, ఈ జనవరేణ్యు దానమునకు నోడి = ఈ రాజు దాతృత్వమునకు నోడిపోయి, ముఖముసెల్లకునికి = మొకము చెల్లకపోయినందున, ముఖ్యవర్ణ భ్రష్టులైరి = తమకుఁగల ముఖ్యమైన వర్ణ మేదిగలదో దానినిఁ జెడిపోయిరి, చెడుగుపేరులందిరిస్సి = చెడ్డపేరును వహించిరి యేవకరము ముఖ్యవర్ణభ్రష్టు లెట్లైరఁనగా కర్ణుఁడు రాజ వంశమందుఁబుట్టి సూతకులములోఁ జేరుకున్నాడు, చంద్రుఁడు తెల్లని వర్ణ మునుఁ బోగొట్టుకొని యమావాస్య దివసమున నల్లనై కనుపడనివాఁడై యున్నాఁడు మేఘుఁడు తన నల్లనగు వర్ణమునుఁ బోగొట్టుకొని వర్షానంతరము వెలవెలఁబాఱిపోవుచున్నాఁడు అంతేగాక ముఖముచెల్లలేదు గనుకముఖ్యవర్ణభ్రష్టు లైరి యనుటచే ముఖమునందుఁగల వర్ణము ముఖ్యవర్ణము అనఁగా మొదటివర్ణము

నుట. వర్ణమనఁగా నక్షరమునకును బల్లునుగాన ముఖ్యవర్ణముఁ జెడ గొట్టుకున్నారు. అనఁగా మొదటియక్షరము చెడగొట్టుకొన్నారు, ఖగ తనయుఁడు ఇందు మొదటి యక్షరముఁ బోఁగా మిగిలినశబ్దము గతనయుఁడు అని యున్నది, గత నయుఁడుఁ అనఁగా గతించిన నీతిఁగలవాఁడు అని యర్థము (నీతిమాలిన వాఁడనుట) అమృతకరుఁడు ఇందు మొదటి యక్షరము చెడిపోఁగా మృతకరుఁడు అని నిల్చినది, మృతకరుఁడనఁగా నశించిన కిరణములుఁగలవాఁడని గాని నశించిన చేతులుఁ గలవాఁడని గాని యర్థము వనదుఁడు ఇందు మొదటి యక్షరముపోఁగా నదుఁడు అని యున్నది నదుఁడు అనఁగా నిచ్చువాఁడు కానివాఁడని యర్థము ఇన్ని = ఏవకరము చెడుగు పేరులందిరి = కర్ణుడు నీతిమాలిన వాఁడనియును, చంద్రుఁడు చేతులులేని వాడనియును, మేఘుఁడు లోభివాడనియును, చెడు పేరులు తెచ్చుకొన్నారని తాత్పర్యము ని॥ వర్ణోద్విజాదౌశుక్లాదౌ స్తుతౌ రూపయశోఽక్షరే, అని విశ్వము.

క॥ ఈ వసుధేశుఁడు రామాం
బావనితా రత్నమును శు • భస్థితి లక్ష్మి
దేవాంబా మానినినిన్
వైవాహిక మాడె బుధులు • వాహ్వా యనఁగన్ 71

టీక॥ సుగమము

క॥ దీపితముగ నాలయ మీ
భూపతి గట్టించి భక్త • పూగము మెచ్చన్
గోపాలస్వామి నరుదు
దోపఁ బ్రతిష్ఠించి భక్తి • తో సేవించున్ 72

టీక సుగమము

క॥ కోవెలఁ బతి గట్టించుట
చే వేడుక గోపురంబు • స్థిరముగ లక్ష్మి
దేవమ్మ ప్రతిష్ఠించెను
భావింపఁగ జగతి నిట్టి • పడఁతులుఁ గలరే 73

టీక సుగమము

క॥ ఆ రామన్నృపాలుఁడు సీ
తారామ నృపాలుఁ దత్త ♦ తన్‌గనెఁ దత్సీ
తా రామ విభుఁడె నా యీ
సారంగధరీయ మునకు ♦ సద్భ ర్త సుమీ. 74

టీక సుగమము

సీ॥ గురుమహేశులు గాని ♦ గురుమహేశులు గారు
సవతు ధీ సమరస ♦ సమర సరణి
ఘన కుభృత్తులుఁగానిఁ ♦ ఘన కుభృత్తులుగారు
దీటు స్పర్శన ధీర ♦ ధీరభూతి
దండి కర్తలుగాని ♦ దండికర్తలుగారు
పాటి ధర్మ విపాక ♦ పాక కళల
చక్రిసూరులుగాని ♦ చక్రిసూరులు గారు
నాటి కృపాసార ♦ సారవిభల

గీ॥ ననుచు బుధులెన్న నుతికెక్కు ♦ నతుల నిశిత
శరవిఖండిత రణశూర ♦ శాత్రవ ప్ర
కాండభేదిత కరుహా స్త ♦ మండలాంత
రుండు సుకృతి సీతారామ ♦ మండలపతి 75

టీక ధీ సమరస = బుద్ధి భేదమందును, సమరసరణి = యుద్ధమార్గ ము ందును, సవతు - సాటి, గురు మహీశులుగాని = బృహస్పతియు నీశ్వరుఁడు నగునేకాని గురుమహేశులుగారు = అధికులగు మహా ప్రభు వులు కారు, స్పర్శనధీర = దాన స్వాతంత్ర్యమందును, ధీరభూతిన్ = ధైర్య సంపదయందును, దీటు = సమానము, ఘన కుభృత్తులుఁగాని - మేఘమును, పర్వతమును యగునేకాని, ఘన కుభృత్తులుగారు = అధికులైన భూభర్తలుగారు, ధర్మవిపాక = న్యాయ పరిపాకమందును, పాకకళలన్ = వికాసమైన విద్యలయందును, పాటి = సమానము, దండి కర్తలుగాని = యముడును బ్రహ్మయును నగునేకాని, దండికర్త

లుగారు = గొప్ప యధిపతులు గారు, కృపాసార = దయారసమునందును, సారవిభలన్ = శ్రేష్ఠమగు కాంతుల యందును, సాటి = సమానము, చక్రి సూరులుగాని - విష్ణువు సూర్యుఁడు నగునేకాని, చక్రిసూరులుగారు = రాజకుమారులుగారు, అనుచు = ఇట్లనుచు, బుధులెన్నఁగ = పండితులు గణింపఁగా, అతుల = సమానరహితమైన, నిశిత = వాడిగల, శర విఖండిత = బాణముచేత ఖండింపఁబడిన, రణశూర = యుద్ధశూరులగు, శాత్రవప్రకాండ - శత్రుసముదయముచేత, భేదిత = భేదింపఁబడిన, కరుహోష్ణ మండలాంతరుండు = సూర్యమండలాంతరముఁగల వాఁడును, సుకృతి - పుణ్యవంతుఁడైన వాఁడును, సీతారామ మండలపతి = సీతారామ భూవల్లభుఁ డనువాఁడు, పరికెక్కెన్ = పొగడ్తకెక్కెను

సీ॥ తన గో వితానంబు ♦ తన గో వితానంబు
 రీతిని పరుల క ♦ రిష్టమూంచఁ
దన దివ్య హృదయంబు ♦ తన దివ్యహృదయంబు
 పోల్కని సరిగల్గి ♦ పొసఁగుచుండఁ
దన ధృతి మహిమంబు ♦ తన ధృతి మహిమంబు
 గతి విబుధానంద ♦ కలనఁ బొదలఁ
దన భూరి కటకంబు ♦ తన భూరి కటకంబు
 వితమున శ్రీకరాం ♦ చితముగాఁగఁ
గీ॥ జను మదావళ కుముఖ పా ♦ షాణరాశి
విషధరాధిప విషచర ♦ విరస విముఖ
వసుమతీసౌఖ్య లబ్ద దో ♦ ర్బల విహార
శాలి మహిత సీతారామ ♦ చక్రిమౌళి 76

టీక తనగోవితానంబు = తన యొక్క బాణ సముదాయము, తనగోవితానంబురీతిన్ = తన వాక్సముదాయము భంగి, పరులకు = శత్రువులకు, అరిష్ట మూంచఁగ = అశుభమును బొందింపఁగా ననియును,

వాక్పర మైనపుడు, ఇతరులకు, శుభమును పొందింపఁగా ననియును, అంతట నిట్లే గ్రహించవలెను ని అర్జునీనేత్ర దిగ్బాణ భూవాగ్వారిషు గౌర్మతా॥ అని విశ్వము అరిష్టేతు శుభాశుభే, అని యమరము,తనదివ్య హృదయంబు= తనశ్రేష్ఠమైనవక్షము, తనదివ్య హృదయంబు పోల్కని = తన యొప్పైన మానసమునుఁబోలి, సరిగల్గి పొసఁగు చుండఁ = హారముఁ గల్గియును, యుక్తమును పొందియును, ఒప్పుచుండఁగా, తనధృతి మహిమంబు = తన సంతోష సంబంధమగు గొప్పతనము, తనధృతి మహిమంబు గరి = తనయ క్షమహత్వములీల, విబుధానంద కలనఁబొదలఁ = పండితానందమును, దేవతానందమును, చేయుట యందొప్పియుండఁగా, తనభూరి కటకంబు = తన బంగారుకడియము, తనభూరి కటకంబు వితమునఁ = తనయధికతర మైన రాజ్యము విధముగా, శ్రీకరాంచితము గాఁగన్ = శుభమైన హస్తమునం దొప్పియుండఁగా, సంపత్కరముచేత నొప్పియుండఁగా, మదావళ = మదముఁగల దిగ్గజమునందును, కుముఖ = కుత్సితమగు ముఖముఁగల యాదివరాహ మందును, పాషాణరాశి = పాషాణజాతియైన కులాచలమందును, విషధరాధిప = గరళమును వహించిన యాదిశేషునియందును, విషచర = విషమందు సంచరించు నాదికూర్మము నందును, విరస = స్నేహ వైషమ్యము చేత, విముఖ = పరాఙ్ముఖయైన, వసుమతీ = భూదేవియొక్క, సౌఖ్యలబ్ధ= సుముఖను పొందఁబడిన, దోర్బల విహారశాలి = భుజబల సంచారమం దొప్పునట్టి, మహిత = అధికతరమగు, సీతారామ చక్రిమౌళి = సీతారామ భూపాల శ్రేష్ఠుఁడు, చనును = ఒప్పును

అనఁగా భూభరణ ధుర్యులగు దిగ్గజాదులయందు, పైనవివరించిన దోషముల నారోపించి భూదేవి సీతారామ నృపాలుని జేరి సౌఖ్యముల నిచ్చు చుండెనని తాత్పర్యము

సీ॥ కరినాత్మఁ దైయేరిఁ • గనుఁ గొన్న సరియైన
వారిలోఁ దలనీగు • వానిఁ బాసి

తతభుజంగేశుఁడై ♦ శ్రుతుల విన్కలి లేని
　　　వంకరి టింకరి ♦ వాని రోసి
యొరుల నోర్వక గుబ్బు ♦ నొంది నిచ్చలు పంక
　　　వర్తనుఁడైనట్టి ♦ వాని దూఱి
కుజనులఁ బైఁజేర్చు ♦ కొనియెదఁ గదలక
　　　వరలుచునుండిన ♦ వానిఁ గేరి

గీ॥ వదసె భూకామినీమణి ♦ గడుసుగాని
యట్టి తామేటి జేని న ♦ యాత్త చక్రి
వర్యు నమలిన సౌకర్య ♦ వరు సుగమన
భూధరేంద్రు సీతారామ ♦ పుణ్యసాంద్రు. 77

టీక॥ కఠినాత్ముఁడై = కఠిన హృదయముఁ గలవాఁడై, ఏరిఁ గనుఁగొన్నన్ = ఎవ్వరిని చూచినను, సరియైన వారిలోఁ = యుక్తమైన వారిలోన, తల సీగు వానిఁ బాసి = తలను ముడుచుకొనునట్టివాని వదలుకొని, యనియును, కఠినాత్ముఁడై = కఠినమైన దేహముఁ గలవాఁడై, ఎవ్వలని చూచినను, సరియైన వారిలోఁ = యుక్తమైన నీటిలోన, తల ముడుచుకొను నట్టివానిని వదలుకొని యని భావము (అనఁగా నాదికూర్మ మనుట) తత భుజంగేశుఁడై = విరివియైన విటనాయకుఁడై, శ్రుతుల విన్కలి లేని = వేదముల వినుట లేని, వంకరిటింకరివాని రోసి = వక్రగమనముఁ గలిగినవానిఁ బరిత్యజించి యని అర్థము విస్తారమైన సర్పనాయకుఁడై చెవులతో వినుట లేనియట్టి వంకరటింకరవానినిఁ బరిత్యజించి యని భావము (ఆదిశేషుని యనుట) ఒరుల నోర్వక గుబ్బు నొంది = పరుల సహింపలేక యీర్ష్యను వహించి, నిచ్చలు పంకవర్తనుఁ డైనట్టి వాని దూఱి = ఎప్పుడును పాపవర్తనఁ గల్గినట్టివానిని నిందించియని, యర్థము, ఎల్లప్పుడును ఒంటరిగా నుండి గుబ్బు గుబ్బు మను ధ్వని గలవాఁడై బురదయందు తిరుగునట్టివానిని, (ఆదివరాహ మనుట) నిందఁ జేసి, యని భావము కుజనులఁ బైఁజేర్చుకొని = కుత్సితులను పైనబెట్టుకొని, ఎంతుఁ గదలక బిటుకును పోనివాఁడై, వరలును నుండిన వానిఁ గేరి = వర్తిలుచుండిన వానినిఁ దిరస్కరించి యని, యర్థము.

కుజనులన్ = వృక్షములఁ బైనఁ బెట్టుకొని యచలుఁడై ప్రకాశించు వానిని దిరస్కరించి యని భావము, అనఁగా కులాచలేశ్వరు ననుట, గడుసుగాని యట్టి తామేటి తేనిఁ = కరినాత్ముఁడుగాని కూర్మరాజు ననియును, తా = తాను గడుసు గానటువంటి మేటియైన రాజు ననియును భావము, నయాత్త చక్రివర్యు = నీతిఁబొందిన సర్ప శ్రేష్ఠుని యనియును నయయుక్తుఁడగు రాజ శ్రేష్ఠుననియును భావము, అమలిన సౌకర్యవరుఁ = బురదలేని సూకర సంబంధమగును త్తముని యనియును, మాలిన్యరహితుఁడగు సుకరత్వముగల రాజు ననియును భావము, సుగమన భూధరేంద్రుఁ = మంచి నడక గల పర్వతరాజు ననియును, మంచి హృదయముగల రాజశ్రేష్ఠు ననియును భావము, అనఁగా పై పెద్దగీట్లకు క్రమము చూడనగు, సీతారామ పుణ్య సాంద్రుఁ = సీతారామ భూపాలుఁడనే దట్టమైన పుణ్యశాలిని, భూకామినీమణి = భూదేవి, వదసెఁ = పొందెను

ఇందు శ్లేషోత్థాపిత వ్యతిరేకాలంకారము, యథాసంఖ్యాలంకారమును

సీ॥ విసపు పుట్టిల్లయి • వెసఁబల్కు జడధీశు
నామూలమును గన్న • నసలె కందు
విసము తోడుతఁబుట్టి • విలసిల్లు దోషాక
రుని హృదయంబారఁ • గనినఁగందు
నంగిట విషమూని • యలరి పల్కెడు నుగ్రు
ప్రౌఢి మంగళము నా • రయఁగఁ గందు
పుక్కిటిలో విషం • బును గల ద్విరసజ్ఞ
లోకేశుఁ గన గుర్ల • లోనఁ గందు

గీ॥ గాన నా కీడుగారని • కదిమిఁ గేరుఁ
బటురసాధీశు నిర్దోషుఁ • బరమకాంతు

బుధజనైకరసజ్ఞ శ్రీ • ముష్టిపల్లి
జాతిసూతి సీతారాము • కేతినాతి 78

టీక విసపు పుట్టిల్లయి = విషమునకు పుట్టినప్రదేశమై, వెసఁబల్కు = తీవ్ర ధ్వనులు చేయు, జడధీశుఁ = మంద బుద్ధిగల ప్రభువును, అనియును, జలధీశుఁ = సముద్రశ్రేష్ఠుఁడగు క్షీరసాగరుని, అనియును, లడయోరభేదః అను సూత్రముచే జలధికి, జడధియనుట సాధువు, ఆమూలమును గన్నఁ = మొదటివరకు చూచినట్లైతే, అసలెకందు = బొత్తుగానే పసివాఁడనియును, బురదయే నలుపనియును భావము, విసముతోడుతఁబుట్టి = గరళముతోడనే పుట్టి, విలసిల్లు = ప్రకాశించు, దోషాకరుని = పాపములకు నాకరమైన వాని ననియును, చీకటికి నాకరమైన చంద్రుని యనియును, హృదయం బారఁగ నినఁగందు = మనసార జూచినచో పసివాఁడనియును, వక్షస్థలమును నిండుగాచూచినచో నలుపు, అనిభావము అంగిటవిషమూని = గొంతులో విషమును వహించి, అలరఁబల్కెడునుగ్రు = ఒప్పునట్లుగా వచించునట్టి కోపముఁగలవాని ననియును శంకరు ననియును, ప్రౌఢిమంగళముఁ = నేర్పుసంబంధమైన శుభము ననియును, ప్రౌఢిమఁ = నేర్పుచేత, గళమున్ = కంఠమును అనియును, అరయఁగఁగందు = చూడఁగా పసివాఁడనియును, అరయఁగా నలుపనియును భావము. పుక్కిటిలో విషంబునుఁగల = అంకిలియందు గరళముఁ గల్గినట్టి, ద్విరసజ్ఞలోకేశున్ = కొండెగాండ్రలో శ్రేష్ఠుని ననియును, సర్పరాజనియును, కనన్ = చూడఁగా, గుడ్లలోన కందు = లోకూగడ్డన, అనఁగా మిక్కిలి పసివాడనియును, కన్నులలో నలుపనియును భావము, కాన = కావున, పటురసాధీశు = బలముఁగల ధరాధీశ్వరుని యొక్కయు, నిర్దోష = దోషరహితుని యొక్కయు, బుధజనైకరసజ్ఞ = పండితజనులలో ముఖ్యమైన రసము నెఱింగినవాని యొక్కయు, శ్రీ ముష్టిపల్లి జాతి సూతి సీతారాముకేతినాతి = సంపత్కరమైన ముష్టిపల్లివంశ సంభవుఁడగు సీతారామభూపాలునియొక్క కీర్తికాంత, నాకీడుగారని = నాకు

సమానముకారని, కడిమిఁ = అతిశయముగా, కేరుఁ = పరిహసించును

ఇందు పెద్ద చరణములకు గీతిలో క్రమముఁ జూడనగును అనఁగా క్షీరాబ్ధియును, చంద్రుఁడును శంకరుఁడును శేషుఁడును, క్రమముగ విషజనక విషసహజ విషకంఠ విషవక్త్రు లైనందున విషమునకు నునికి పట్టైన వారని యును, జడధీశ దోషాకరోగ్ర ద్విరసజ్ఞ నామంబులు విచారింపఁగా క్రమ ముగా మందబుద్ధియు పాపయుక్తియు కోపమును కొంటెతనమును గలవారని యన్వయించుటవలనను, ఈ సీతారామభూపతి మందబుద్ధి గలవాఁడు గాక రసాధీశుఁడును అనఁగా శృంగారాది నవరసములు గల ప్రభువనియును పాప యుక్తుఁడుగాక నిర్దోషుఁడును అనఁగా పాపరహితుఁడనుట పరమశాంతుఁ డును, అనఁగా నుగ్రుఁడుగాక ఓర్పుగలవాఁడనియును, కొండెగాఁడుగాక బుధజనైక రసజ్ఞుఁడు అనఁగా పండితులలో ముఖ్యుఁడైన రసికుఁడనియును, క్షీరాబ్ధికి ఉదరమునందు నలుపును, చంద్రునికి వక్షమునందు నలుపును శివునకు కంఠమునందు నలుపును, ఆదిశేషునకు గుడ్లలో నలుపును గల దనియును, ఇందు అనుటచే వసివాండ్రనియును కీర్తి తెలుపును అపకీర్తి నలుపువర్ణముఁ గనుక శ్రీ సీతారామభూపాలుని కీర్తికాంతయం దెచ్చటను నలుపులేదనియును అందువలన పైవారలు తనకు సమానులుఁ గారని తిరస్క రించెనని తాత్పర్యము

ఆ॥వె॥ అశర హిత దాని ♦ యాకార మడుగంటె
నివల మిగిలినట్టి ♦ కువలయ హితుఁ
బోల్చి చూతమన్నఁ ♦ బూర్వవర్ణముఁ బాసి
వ్యర్థుఁడౌ నరేపుఁ ♦ దగు నితనికి 79

టీక అరేపుఁడగు నితనికి = అతిశయుఁడగు సీతారామభూపాలునకు అశర = రాక్షసులలో, హితదాని = ఒప్పైన దానముఁగల బలిచక్రవర్తి, అకారమడుగంటెన్ = రూపము విష్ణుమూర్తి యొక్క పాదమువలన

రసాతలమునకుఁజేరెను. అనియును, అశరహితదాని అను వాక్యములో అకారము అనఁగా (అ) యనే యక్షరము అడుగంటెననియును భావము, ఇవల మిగిలినట్టి కువలయ హితుఁ = బలి చక్రవర్తి పోఁగా ఈవల మిగిలినట్టి కలువలకు మిత్రుఁడైన చంద్రుని అనియును, అ యనెడి యక్షరముపోఁగా నివతల మిగిలినట్టి, కువలయ = భూవలయమునకు, హితుఁ = మేలుచేయు వానిని అనఁగా అశరహితదాని అను వాక్యములో (అ) యనే అక్షరము పోఁగా మిగిలినవాఁడు, శరహిత దాని, అనఁగా, శర = ఉదక సంబంధమైన, హితదాని = తగిన దానముగలవాఁడు మేఘుఁడు అట్టి మేఘుని, పోల్చిచూతమన్నఁ = సామ్యముజేసి చూచెద మనుకొనఁగా, పూర్వవర్ణముఁబాసి = చంద్రుఁడు తనకు పూర్వమున్నట్టి తెల్లని కాంతి వదలుకొని, యనియును. శరహితదాని, అను వాక్యములో పూర్వవర్ణమనఁగ మొదటి యక్షరమునుబాసి, అనియును భావము వ్యర్థుఁడౌఁ = చంద్రుఁడు నమవసయందు నశించిన వాఁడగుచున్నాడనియును, వి + అర్థుఁడు. వ్యర్థుఁడు మేఘుఁడు తన ద్రవ్యము పోఁగొట్టుకొనిన వాఁడగుచున్నాఁడని యును, శరహితదాని అను వాక్యములో, పూర్వ వర్ణముఁబాసి, అనఁగా, మొదటి యక్షరముపోగా రహితదానియని మిగిలెను రహితదాని అనఁగా రహితమైన దానముగల వాఁడనియును, అందువల్ల, వ్యర్థుఁడైనాడనఁగా నిరర్థక శబ్దవాచ్యుఁ డైనాడనియును చంద్రుఁడు మేఘుఁడు రహితదాని, అనఁగా మొదటి, ర = రేఫముతో, హిత = కూఁడుకొనినదాని = దానముఁ గల వాఁడని నిల్చినందున, అ రేఫుఁడగు నితనికి, అనుటచే, రేఫాక్షరము లేని యితనికి, అనఁగా రహితదాని, అతఁడును రేఫాక్షరము లేనివాడైనందున, హితదాని యీ సీతా రామ భూపాలుడనియును భావము. ని॥ రేఫో రవర్ణే కథితః కుత్సితే వాచ్యవన్మతః, అని విశ్వము వర్ణోద్విజాదౌ శుక్లాదౌ స్తుతా రూప యశోక్షరే అని విశ్వము.

క॥ అ విభుఁడు నాదిలక్ష్మీ
దేవాంబఁ బెండ్లియాడె • ధీవరు లెన్నఁ

భావింపఁగ నాయమకుఁ
భూవలయము నందుసాటి ♦ బోటులు గలరే 80

టీక॥ సుగమము

సీ॥ అల శచియేపాటి ♦ లలన నాథుఁడు గోత్ర
నాశకుఁ, దగ్గువేళ ♦ నాపదాయె
శ్యామల యేపాటి ♦ సాధ్వియౌఁ గాంతుఁ దం
తకుఁ డైన వారింపఁ ♦ దలఁపదాయె
ఛాయ యేపాటి యో ♦ షామణి పతి కువ
లయశత్రుఁ డై నఁజె ♦ ల్లదనదాయె
రోహిణి యేపాటి ♦ రోచన భర్త దో
షాకరుండగు టావ ♦ లేకపోయె

గీ॥ ననుచు వారల హనియింపు ♦ చును జగద్ధి
త ప్రవర్తములను భ ♦ ర్తకుఁదెలుపును
బుధులు కరణేషు మంత్రియఁ ♦ విధము దివ్య
లక్షణకదంబ శ్రీయాది ♦ లక్ష్మమాంబ 81

టీక॥ అల శచి యేపాటి లలన = ఆ శచీదేవి యెటుల విల
సన శీలయైన స్త్రీ యగును నాథుఁ డుగోత్ర నాశకుఁ దగు టావ లేక
పోయెఁ = పతియైన యింద్రుఁడు కులనాశకుఁ డౌట నిలబెట్ట లేక
పోయెననియును, పర్వత నాశకుఁడౌట నాప లేకపోయెననియును
భావము, శ్యామల యే పాటి సాధ్వియౌ = శ్యామలాదేవి యెంతపాటి
పతివ్రత యగును, కాంతుఁ దంతకుఁ డైన వారింపఁ దలపదాయె =
నాథుఁడగు యముఁడు నాశకుఁడై యుండఁగ నాపుటకు నెంచదాయె నని
యును, అంతక నామమును వారింప నెంచదాయె ననియును భావము.
ఛాయ యేపాటి యోషామణి = ఛాయాదేవి యెంతపాటి నారీరత్న
మగును, పతి కువలయ శత్రుఁడైనఁ జెల్లదని దాయెఁ = భర్తయగు
సూర్యుఁడు భూవలయమునకు విరోధి యైయుండగా తగదని తెల్ప

దాయె ననియును, కలువలకు విరోధియై యుండుట చెల్లదని తెల్పదాయె ననియును భావము, రోహిణి యేపాటి రోచన = రోహిణీదేవి యెంతపాటి యుత్తమ స్త్రీ యగును, భర్తదోషాకరుండగు టాపలేకపోయెఁ = నాథుఁడగు చంద్రుఁడు పాపములకు నాధారుడైయుండుట నివారింపఁ జాలదాయె ననియును, రాత్రి కాధారుఁడైయుండుట నివారింప జాలదాయె ననియును భావము, అనుచు వారల హసియింపుచును = ఇట్లని పైఁజెప్పఁబడిన ఇంద్ర యమ సూర చంద్రుల భార్యలను పరిహాసము చేయుచు, జగద్ధిత ప్రవర్తనములను భర్తకుఁ దెలుపును=లోకమునకుహితమైన నడవడికలను పెనిమిటి కెఱిఁగించును, అదెట్లనన, బుధులు=పండితులు, కరణేషు మంత్రియఁ విధము=క్రియాభేదములందు మంత్రివలె భర్త యెడ నుత్తమ స్త్రీ వర్తించునను నట్లుగా, దివ్యలక్షణకదంబ = శుభ లక్షణముల సమూహముగల, శ్రీ యాదిలక్ష్మమాంబ = సంపత్కరమైన అదిలక్ష్మీదేవాంబ, భర్తకు దెలుపును, అనుక్రియతో సన్వయము

క॥ ఈ రాణియందునఁ జ సీ
తారామ విభుండు గాంచెఁ ♦ దనయల వరల
క్ష్మీ రోచన శ్రీలక్ష్మీ
చారుమతిన్ సర్వ జనులు ♦ సంతస మొందన్. 82

టీక. సుగమము

గీ॥ భూవరుం డాది లక్ష్మీ వి ♦ భుండు పూరు
షోత్తముఁడు చక్రి రాడన్వ ♦ యోద్భవుఁ దన
ఘనతనుఁదన సీతారాముఁ ♦ దనఁగ నెసఁగి
శాత్రవుని రాము నోడించె ♦ సహజమె కద. 83

టీక॥ సుగమము.

ఆ॥వె॥ దుష్ట శిక్షణమును ♦ శిష్ట పాలనమును
సలిపి సప్త సంత ♦ తులను బసని

చనె వికుంఠ ధామ • మునకు సీతారామ
మేదినీశుఁ డంతె • కాదె నాఁడు. 84

టీక॥ సుగమము

చ॥ ఎడపక నన్ను మీరు భరి • యింపుదురా యని ధాత్రి పల్కఁగా
మెడ లటు లిట్టు లూపిరి సు • మీ దిగిభేంద్రులు కచ్ఛపేశుఁడో
ముడిఁగియు లోన నుండె గిరి • పుంగవులో కదలాడరైరి శే
షుఁడు తల వంచెఁ గావున వ • సుంధర యేల్మనె నాదిలక్ష్మమన్

టీక ఎడపక = నిరంతరమును, నన్ను మీరు భరియింపుదురా యని = నన్ను తాము వహింపఁ గలరా యటంచు, ధాత్రిపల్కఁగాన్ = భూదేవి వచియింపఁగా, దిగిభేంద్రులు = దిగ్గజ శ్రేష్ఠులు, మెడ లటులిట్టు లూపిరి సుమీ = అటు నిటు మెడలూపినారుసుమా, అనఁగా భరియింప జాలమని మెడలూపి రనుట, ఏనుంగులు నిరంతరము మెడలూపుట సహజ మని యెఱుంగునది, కచ్ఛపేశుఁడో = ఇఁక కూర్మ రాజందుమో, ముడిఁగియు లోన నుండెన్ = ఇంటిలోపల ముడుచుకొని యుండెను' అనఁగా భరింపఁ జాలనని ముడుచుకొనెననుట,కూర్మములు తల ముడుచుకొని బొచ్చెయందుండుట సహజమని గ్రహించునది, గిరి పుంగవులో కదలాడరైరి = పర్వత శ్రేష్ఠు లందుమో, భరింపజాలమని కదలకుండ నుండిరనుట, పర్వతములు కదల కుండుట స్వాభావికమని తెలియునది, శేషుఁడు తలవంచెన్ = ఆదిశేషుఁడు భరింపలేనని తలవంచుకొన్నాడనుట సర్పములకు పడిగెవంచుకొనుట సహజ మని గ్రహించునది, కావున = కాబట్టి, ఆదిలక్ష్మమణా = ఆదిలక్ష్మిదేవమ్మను, వసుంధర = భూదేవి, ఏల్మనెన్ = ఏలుమని తననుఁగూర్చి పల్కెను.

సీ॥ తన యంగదేశంబు • ననుకరింపుచు నుండ
ఘనత రాఘోద వం • గము ధరించి

తన వత్సమండలి • కనురూప మగుచుండ
లలిత విచిత్ర చో • లము ధరించి
తన కాంచిదేశ మెం • తయు విలసిల్లఁగా
రమణీయమైన లా • టము ధరించి
తన కుంతలాధఃస్థ • లిని వన్నె కెక్కింప
ననుపమ బాహ్లీక • మును ధరించి

గీ॥ తనదు కల్యాణ కరదేశ • మొనరునట్లు
కటకమునుఁ దాల్చి తన ముద్ర • కంఠ మెసఁగు
లీలఁ గాంభోజ కువలయ • మాలికఁ గొని
యాదిశ్మికి జతఁజేరె • నవని యరుదె 86

టీక అవని = భూదేవి, తన యంగదేశంబు ననుకరింపుచు సుందఱ = తనయొక్క అంగదేశమునుఁ బోలియుండఁగా, ఘనతర = అధికతరమగు, ఆమోద = సంతోషకరమైన, వంగముధరించి = వంగరాజ్యమును వహించి యనియును, తనదేహమునుఁ బోలి యుండునట్లు నధికతరమగు పరిమళముఁగల కర్పూరమును ధరించి యనియును భావము ని వంగః కర్పూరవార్తాక దేశ బేదేషు కీర్తితః॥ యని విశ్వము తన వత్సమండలి కనురూపమగుచుండఁ = తనయొక్క వత్సదేశమునకుఁ దగినదియై యుండఁగా, లలిత = మనోజ్ఞమగు, విచిత్ర = మిక్కిలి చిత్రమైన, చోలముధరించి = చోళదేశమును వహించి యనియును, తనవక్షోమండలికి (అనఁగా కుచ ప్రదేశమున కనుట.) తగినదియై యుండునట్టి మనోజ్ఞమగు చిత్ర వర్ణముఁగల రవికను ధరించి యనియును భావము ని వత్సస్తుతాదౌ తర్ణకే త్రిషువక్షస్య స్త్రీదా॥ అని నానార్థ రత్నమాల ని చోళః కూర్పాసకోఽ స్త్రీయాం, అని అమరము తన కాంచిదేశ మెంతయు విలసిల్లఁగాఁ = తన యొక్క కాంచిరాజ్యము మిక్కిలి ప్రకాశింపఁగా, రమణీయమైన లాటము ధరించి = మనోహరమైన లాటదేశమును వహించి యనియును, తన వడ్డాణ ప్రదేశము, (అనఁగా నడుమనుట ) మిక్కిలి విలసిల్లునట్లుగా నొప్పిదమైన

సన్నవస్త్రమును ధరించి యనియును భావము ని. లాటోదేశేంశు శేపిచ అని విశ్వము తన కుంతలాధస్థలిని పన్నె తెక్కించఁగ = తనయొక్క కుంతల రాజ్యమునకు దిగువప్రదేశమునుఁ బ్రకాశింపఁజేయఁగా, అనుపమ = సమాన రహితమైన, బాహ్లీకమును ధరించి = బాహ్లీకదేశమును వహించి యనియును, తనయొక్క ముంగురులకు క్రిందటి భాగమగు నిటలమునుఁ బ్రకాశింపఁజేయు టకు, సాటిలేని కుంకుమ మును ధరించి యనియును భావము ని కుంతలో దేశ చికురౌ, అని రత్నమాల ని బాహ్లీకే దేశ భేదేఽశ్వే బాహ్లీకం ఘీరహింగునో, అని విశ్వము తనదు కల్యాణకరదేశ మొనరునట్లు = తనయొక్క కల్యాణ సంబంధమగు కాంతి యుక్తమైన దేశముఁ దనర్చునట్లుగా, కటకమునుఁ దాల్చి = రాజధానిని వహించి యనియును, తన శుభమైన హస్త ప్రదేశముఁ దనర్చునట్లుగా కడియమును ధరించి యనియును భావము. ని. కటకంవలయేసానౌ రాజధానీ నితంబయోః అని విశ్వము, తన మద్రకంఠ మెసఁగులీలన = తనయొక్క మద్రరాజ్యమునకు సమీపప్రదేశ మతిశయించు విధమున ననియును, తనయొక్క మంగళమగు కంఠము తనరువిధము ననియును భావము కాంభోజకువలయ మాలికఁ గొని = కాంభోజ రాజ్య సంబంధమగు భూవలయ పంక్తిని వహించి యనియును, పొన్నపూవుల యొక్కయు, కలువల యొక్కయు, హారమును వహించి యనియును భావము, ని కాంభోజ స్తురగే సోమ వల్కే-పున్నాగ పాదపే, అని విశ్వము. ఆదిలక్ష్మికి జతఁ జేరెఁ=శ్రీదేవికిఁ జత జేరె ననియును, ఆదిలక్ష్మిదేవమ్మయను మహారాణి గారి జతఁజేరె ననియును భావము అరుదే = ఆశ్చర్యమా కాదనుట ఏల యన శ్రీదేవియును, భూదేవియును విష్ణుమూర్తి భార్యలైనందున భూదేవి గంధ వస్త్రభూషణ మాల్యాదు లలంకరించుకొని శ్రీదేవి యొక్క సరసఁ జేరుట సహజమే కావున సత్లీ భూదేవి అంగవంగ వత్సచోళ కాంచి లాట కుంతల బాహ్లీక కల్యాణ కటకమద్ర కాంభోజాది దేశములను ధరించి ఆదిలక్ష్మి దేవమ్మగారి సరసకు నేలుమని చేరెనని తాత్పర్యము.

సీ॥ పాలించె నేరాణి ♦ ప్రాజ్ఞత గద్వాల
రాష్ట్రంబు నవలీల ♦ రాజు లెన్న
గాలించె నేరాణి ♦ ఘన పురాణంబుల
యందలి నీతుల ♦ ననుసరింప
నాలించె నేరాణి ♦ యఖిలాశ్రితుల మొఱల్
సంతాన మట్టుల ♦ సంతరింపఁ
జాలించె నేరాణి ♦ సతత ధనార్జన
యుక్తిని వితరణా ♦ సక్తిచేతఁ
గీ॥ గాంచ నేరాణి కీర్తి నా ♦ ర్జించి రిపుల
వంచి సన్మార్గమందు వ ♦ ర్తించి శుభము
లూంచి భక్తులయెడ ప్రేమ ♦ నించె నట్టి
యాదిలక్ష్మ్యంబ నెన్నఁగా ♦ నలవి యగునె. ౮౭

టీక. సుగమము

సీ॥ కట్టించె నేరాణి ♦ గద్వాల కేశవు
ముఖ మంటపము సత్ర ♦ ము రథశాలఁ
బెట్టించె నేరాణి ♦ పీట జీవన యంత్ర
ములను విద్యుద్దీప ♦ ములను బడులఁ
బట్టించె నేరాణి ♦ పసిడి సీ రిందిరే
శ్వరుని తార్క్ష్య ధ్వజ ♦ స్తంభమునకుఁ
బుట్టించె నేరాణి ♦ పురజనంబుల కెల్ల
పరమేశు పై నన ♦ వరత భక్తిఁ
గీ॥ గాంచ నేరాణి బుధులఁ బూ ♦ జించి కవులఁ
బెంచి యాత్రలనెల్ల సే ♦ వించి ముదము
నూంచి దీనుల నెపుడు పో ♦ షించె నట్టి
యాదిలక్ష్మ్యంబ నెన్న శ ♦ క్యంబె జగతి ౮౮

టీక. సుగమము.

సీ॥ నల్లసోమ నృపాలు ♦ నాటినుండియు లేని
సంతతి నేటి కే ♦ సాధ్వి గాంచె

నెన్నఁడుఁ దమవార • లెఱుఁగని శ్రీ మహా
రాజ్ఞియన్ బిరుదమే • ప్రాజ్ఞిగాంచె
సప్త సంతతులన్ బ్ర • శస్తంబులౌ కృతు
లంది సత్కీర్తి నే • యమ్మ గాంచె
మంజులాష్టాక్షరీ • మంత్రమున్ జిహ్వాగ్ర
సీమనే సువ్రత • శీల గాంచె

గీ॥ నట్టి సద్గుణజాల ద • యాలవాల
నుత్తమ పదప్రచారఁ బ • రోపకార
దాన కంకణపాణి గ • ద్వాల రాణి
నాదిలక్ష్మ్యంబ నెన్నఁగా • నజు తరంబ. 59

టీక సుగమము

గీ॥ అమ్మ నొకదేవతగ నెంచు • నప్ప యాజ్ఞ
మీఱ దార్యుల మదిఁగొల్చు • శౌరి పూజ
సేయు నెపు డాదిలక్ష్మ్యంబ • చిన్ని పట్టి
లలితగుణ నికురుంబ శ్రీ • లక్ష్మమాంబ 90

టీక సుగమము

ఉ॥ విశ్వము నాది లక్ష్మమ న • వీన దయామతి నేలుచున్ విర్గా
దశ్వని భక్తిఁగొల్చుచు ని • జాగ్రసుతన్ వరలక్ష్మమన్ యశ
శ్శాశ్వత దోమకొండ విల • సద్యువరాజగు కామినేని సో
మేశ్వర రాయ భూవరున • కిచ్చి వివాహము సేసె వేడుకన్ 91

టీక సుగమము

క॥ సోమేశ్వర రాజేంద్రున
కేమో ధన భూతి సాతి • హిత భోగములన్
సోమేశ్వర రాజేంద్రు బ
హా మాదిరి రాచ సుమి ర • వంతయునైనన్ 92

టీక సోమేశ్వర రాజేంద్రునకు = ఈ కామినేని సోమేశర్వరరావు భూపాలునకు, ఏమో = ఎందువలనో, ధన = ద్రవ్యము నందును,

భూతిఁ = ఐశ్వర్యమునందును, సాతిఁ = త్యాగమునందును, హితభోగ ములఁ = క్షేమకరమైన వైభవములందును, సోమ — కుబేరుఁడును, ఈశ్వర = శివుఁడును, రాజ = చంద్రుఁడును, ఇంద్ర = దేవేంద్రుఁడును, అహో = ఔరా, రవంతయునైనఁ = ఇంచుకయైనను, మాదిరిరారుసుమీ = సాటిరారు సుమా, అనఁగా ధనముచేత కుబేరుఁడును, ఐశ్వర్యముచేత నీశ్వరుఁడును, త్యాగముచేత చంద్రుఁడును, భోగముచేత నింద్రుఁడును, సమానులుకారని తాత్పర్యము. ని సోమః కుబేరే పితృదేవతాయాం, అని విశ్వము. రాజా స్నృపే తాలభేదే వతౌ క్షత్రియ చంద్రయోః, అని రత్నమాల

క॥ వరలక్ష్మీభర్త మహే
శ్వరసఖుఁడు ధనదుఁడు పుణ్య • జనపతి లోకో
త్తర భూవరుఁ డైనందున
నరయఁగ సోముఁ డనుపేరు • సార్థము కాదే 98

ఈపద్యమందు సోముఁడను పేరు సార్థము కాదే యనుటచే కుబేరుని యందు సోమేశ్వరరావు భూపాలుని యందును అభేదా ధ్యవసాయముచేసి అర్థద్వయము గలుగునట్లుగా రచింపఁ బడినది.

టీక॥ వరలక్ష్మీ భర్త = వరమును నిధి సంపద కధిపతి యని కుబేరు నకును, వరలక్ష్మీ దేవమ్మగారికి పెనిమిటి యని సోమేశ్వర నృపాలునకును, అంతట నిట్లే గ్రహించునది, మహేశ్వర సఖుఁడు = ఈశ్వరునకు మిత్రుఁడని యును, రాజులకు మిత్రుఁడని యును, ధనదుఁడు = ధనదాఖ్యఁగలవాఁడని యును, దాతయనియును, పుణ్యజనపతి = యక్షులకు నాథుఁడనియును, పుణ్యవంతుఁడగు జననాయకుఁ డనియును, లోకోత్తర భూవరుఁడు = లోకమం దుత్తరభూమి కధినాథుఁ డనియును, జనులలో నుత్తముఁడైన భూనాయకు డని యును, ఐనందున= ఇట్లగుటవలన, సోముఁడను పేరు=సోమనామము, సార్థముకాదే = అర్థయుక్తమైనదేకదా, అనఁగా సరి యనుట, కుబేరునకే వాక్యములు చెల్లునో

ఈ నృపునకు నాయా వాక్యము లీపద్యమం దొప్పియుండుట చేత సోమనామము సార్థక నామమని తాత్పర్యము ని॥ వరశ్చనిథయోనవ, అని అమరము

శా॥ వాణిఁ నెత్తిన మొట్టి దివ్యకరిఁ జెం • పల్ గొట్టి గోవల్లభున్
ఘ్రాణంబందున మట్టి శీతకరు వ • క్షంబుఁ గయిఁ దట్టి యా
స్థాణుఁ గుత్తుకఁ బట్టి నెట్టి హలి వ • స్త్రం బీగి సోమేశ్వర
క్షోణీనాథుని కీర్తికన్య నటియిం • చుఁ ధాత్రిపై శుభ్రతఁ 94

టీక సోమేశ్వర కీర్తికన్య = సోమేశ్వర భూపాలుని కీర్తికాంత, వాణిఁ నెత్తినమొట్టి = సరస్వతిని నెత్తిపైఁబొడిచి, దివ్య కరిఁ జెంపల్ గొట్టి = స్వర్గపు ఏనుఁగును, అనఁగా నైరావతమునను‌ట, చెంపల్ గొట్టి = దవడలు వాయించి, గోవల్లభుఁ = బసవేశ్వరుని, ఘ్రాణంబందున మట్టి = ముక్కుమీదఁబొడిచి, శీతకరుఁ = చంద్రుని, వక్షంబుఁ = రొమ్మును, కయిఁ దట్టి = చేతఁగొట్టి, ఆ స్థాణుఁ ఆ శంకరుని కుత్తుకఁబట్టినెట్టి = మెడఁబట్టి గెంటించి, హలివస్త్రంబీగి = బలరాముని వలువనులాగి, ధాత్రిపై శుభ్రతఁ = భూమిమీద విశదమైనదై, నటియించుఁ = ప్రవర్తించును, అనఁగా కీర్తి కన్యను ధవళ వర్ణముగా వర్ణించుట కవిసమయముగావున సోమేశ్వర కృపాలుని కీర్తికాంత కెందును నలుపులేక శుభ్రమైనదై పైఁజెప్పఁబడిన సరస్వత్యాదులకు ధవళతనులైనను నొకానొకచోట నలుపుండుటచే తత్కీర్తికాంతయెందు నలుపుండెనో యందందు కొట్టుచు భూమియం దసమాన ధావళ్యముతోఁ బ్రవర్తించెనని భావము

సీ॥ పతి యొక్కఁడేని యె • వ్వరికి నిరుకు లేని
ధాత్రి యెంతటి సుచ • రిత్ర యగును
పతిభయంబును లేక • పరుల యిండ్లఁ జరించు
చంచల యేపాటి • సాధ్వి యగును
పతిమాట మీఱి సం • తతము లాతుల నోళ్ల
నాను వాక్సతి యెంత • మానిని యగు

పతిని సమ్మతి మేనఁ • బాల్గొన్న చండికా
దేవి యేపాటి ప • తివ్రత యగు
గీ॥ ననుచు వారలఁ గేరుచు • ననవరతముఁ
బతియె దైవంబు గురువు స • ద్గతి యటంచు
సలలితంబగు పతిభక్తి • మెలఁగు దివ్య
లక్షణ కదంబ శ్రీవర • లక్ష్మమాంబ 95

టీక॥ సుగమము.

క॥ సోమేశ్వరుండు వరల
క్ష్మీమానిని యందు రామ • కృష్ణన్ సీతా
రామన్నృపుఁ గాంచె జనముల
కామోదం బతిశయించి • యభినుతిఁ జేయున్ 96

టీక॥ సుగమము

సీ॥ సంపఁగి పిరి జరీ • దా ల్దబుకొత్తఁగా
లరిమీఁబు రీలి చ • ల్లడముఁ దాల్చి
జలతారు బాబల • సందుఁ జాజిపూ
లలరెడు మంచిప • ట్టంగిఁ దాల్చి
కలికితురాయి బా • సిలెడు చామంతిపూ
సరిగంచుపాగ శి • గ్షమునఁ దాల్చి
యచ్చటచ్చట రవల్ • పచ్చలుఁ బొదిగిన
ముచ్చెలు పదపద్మ • ములను దాల్చి
గీ॥ హార కట కాంగుళీయకా • ద్యాభరణము
లెనసి పిడిబాకుఁ గొని హ_త్తి • నెక్కి చిన్ని
దండు గొలువఁగఁ గ్రీడకై • తరలు రామ
కృష్ణ విభుఁ జూచి ముద్దగు • నేరికైన 97

టీక॥ సుగమము

వ॥ ఇట్లీ వంశావతారం బభివర్ణించి తదనంతరమున 98

టీక॥ సుగమము

షష్ఠ్యంతములు

క॥ కామాదృతి వామాతతి
కామాకృతి ధామ ధృతికి • ఖల సంహృతికిన్
కోమల వచనామల రచ
నా మలయజ శీతలునకు • నయ కలితునకున్ 99

టీక॥ కామాదృతి = కామమందు నాదరముగల, వామాతతి = స్త్రీ సముదాయమునకు, కామాకృతి = మన్మథ స్వరూపము వంటి, ధామధృతికిన్ = శరీరము ధరించినవానికిని, ఖల సంహృతికిన్ = దుష్టసంహారము గల వానికిని, కోమల వచన = మృదువచనముల యొక్క, అమలరచనా = కల్మషరహితమగు నిర్మాణము నందు, మలయజ = చందనమువంటి, శీతలు నకు = చల్లదనము గలవానికిని, నయ కలితునకున్ = నీతితోఁ గూడు కొన్న వానికిని

క॥ భీమారవ నేమాహవ
సీమాభవ ధామ ధృతికి • శ్రీ సుతసఖ సు
త్రామాత్మజ సోమాత్మజ
సోమాత్మజ నల విలాస • శోభాకృతికిన్ 100

టీక భీమారవనేమ = భయంకరధ్వనులు నియమముగాఁగల, ఆహవ సీమ = రణరంగ ప్రదేశమందు, అభవధామ ధృతికిన్ = ఈశ్వర ప్రభావ మును ధరించినవానికిన్ని, శ్రీసుత = మన్మథుని యొక్క, సఖ = చెలికాఁడౌ వసంతునివంటివానికిని, సుత్రామాత్మజ = ఇంద్రనందనుఁడగు జయంతుని వంటివానికిని, సోమాత్మజ = కుబేరనందనుడగు నలకూబరుని వంటివానికిని, సోమ = చంద్రునివంటియు, ఆత్మజ = మన్మథునివంటివానికిని, నల = నల రాజు వంటివానికిని, విలాసశోభ = శృంగారకాంతులుగల, ఆకృతికిన్ = స్వరూ పముగలవానికిని, ని॥ సోమఃకుబేరే పితృదేవతాయాం వసుప్రభేదేచ సుధాక రేచ, అని విశ్వము

క॥ ఖేచర వైరోచన వై
రోచన సుదధీచి శిబి వి • రోచన ఘన దా
నౌచితికి ననఘునకు భా
షాచాతుర్య విజితాహి • జాతీశునకుఁ. 101

టీక. ఖేచర = ఖేచరుని వంటి, వైరోచన = బలిచక్రవర్తి వంటి, వైరోచన = కర్ణుని వంటి, సుదధీచి = శ్రేష్ఠుఁడగు దధీచివంటి, శిబి = శిబి చక్రవర్తి వంటి, విరోచన = చంద్రుని వంటి, ఘన = మేఘుని వంటి, దానౌచితికిఁ = త్యాగ యోగ్యత్వము గలవానికి, అనఘునకుఁ = పాపరహితుఁడైన వానికి, భాషాచాతుర్య = వాగ్నైపుణ్యము చేత, విజిత = జయింపఁ బడిన, అహిజాతీశునకుఁ = సర్పకుల ప్రభువునకు (అనఁగా శేషుని కనుట) ని. వైరోచనస్తు సుగతే బలిదైత్యార్క పుత్రయోః॥ అనియును, విరోచనార్కే దహనే చంద్రే ప్రహ్లాదనందనే, అనియును విశ్వము

క॥ నారద శర పారద హర
శారదవరనీరద దర • సమ కీర్తికి వి
స్తార దయాపార నయా
చార చయాధార మతికి • సద్బుధ తతికిన్. 102

టీక. నారద = దేవమునియగు నారదునితో, శర = జెల్లుతో, పారద = పాదరసముతో, హర = ఈశ్వరునితో, శారద వరనీరద = శరత్కాలమందలి శ్రేష్ఠమగు మేఘముతో, దర = శంఖముతో, సమ = సాటియగు, కీర్తికిఁ = యశముఁగలవానికి, అనఁగా పైఁజెప్పఁబడిన నారదాదుల కాంతివలె తెల్లని కీర్తిఁ గలవాఁడని భావము విస్తారదయా = విశేషమైన కరుణకు, అపారనయ = మేరలేని నీతికి, ఆచారచయ = ప్రవర్తనానీకమునకు, ఆధార మతికిఁ = ఆదరువైన హృదయముఁ

గలవానికిని సద్బుధతతికిన్ = మంచిపండితులయొక్క సముదాయము గలవానికిని.

కII పరిపాలిత గద్వాల న
గర సామ్రాజ్యునకు విగత • కలుషునకున్ శ్రీ
కర ముష్టిపల్లి కులునకు
వర సీతారామ రాయ • వసుదేశునకున్ 103

టీక పరిపాలిత = పరిపాలింపఁబడిన, గద్వాల నగర సామ్రాజ్యునకున్ = గద్వాలపట్టణ సామ్రాజ్యముఁ గలవానికిని, విగతకలుషునకున్ = నశించిపోయిన పాపములు గలవానికిని, శ్రీకర = సంపత్కరమైన, ముష్టిపల్లి కులునకున్ = ముష్టిపల్లి వంశముఁ గలవానికిని, వర = శ్రేష్ఠుఁడైన, సీతారామరాయ = సీతారామరాయలవారను, వసుదేశునకున్ = భూమిపతికిని

వII అభ్యుదయ పరంపరాభివృద్ధి యగుగాక్కట్లుగా నా యొనర్పం బూనిన సారంగధరీయంబను త్ర్యర్థికావ్యంబునకు కథానిధానం బెట్టిదనిన

టీక సుగమము 104

# సారంగధరీయము

త్ర్యర్థి కావ్యము

ప్రథమాశ్వాసము - సవ్యాఖ్యానము

## కథాప్రారంభము

క॥ శ్రీరమణార్చా ధుర్యా
సూరసుతౌదార్య భావ • సురపాచార్యా
మేరు కుధర ధైర్యా సీ
తారామ నృపాల వర్య • ధార్మిక చర్యా 1

టీక. శ్రీర . ధుర్యా = విష్ణుపూజా ధురీణుఁడవైన వాఁడా, సూరసుతౌదార్య = కర్ణునివంటి త్యాగముగలవాఁడా, భావ = మతియందు, సురపాచార్యా = ఇంద్ర గురువగు బృహస్పతియైన వాఁడా, మేరు ధైర్యా = మేరు పర్వతమువంటి ధైర్యముఁగలవాఁడా, ధార్మిక చర్యా = పుణ్యప్రవర్తనముఁగలవాఁడా, ఓ సీతారామ నృపాలవర్యా, అని సంబోధనము.

ఆ॥ వె॥ మనము ముదము నెనయ • వినుము రాజమహేంద్ర
మన బుధగణవాస • మయి శుభ కల
ధౌతరాశి నాఁగ • గోతలమ్మునఁ దగి
మెఱయుఁ ద న్నగరము • మేటి గాఁగ. 2

టీక. శివచరిత్రమునకు — మనము ముదము నెనయఁగ = హృదయము సంతసము పొందునట్లుగా, రాజమహేంద్ర = ఓ రాజశ్రేష్ఠుఁడా, వినుము = ఆకర్ణింపుము, మనఁగ = వర్తింపఁగా, బుధగణవాసమయి = దేవతలకును ప్రమథులకును నివాసస్థానమై, శుభ = మంగళకరమైన, కలధౌతరాశినాఁగ = వెండిగుట్ట యనంగ (అనఁగా కైలాస మనుట) గోతలమ్మునఁదగి = స్వర్గతలమునఁ దనరి లేక భూతలమునం దొప్పి, తన్నగరమ మేటిగాఁగ = ఆ పర్వత సంపద యగ్రగణ్యమైనదై యుండఁగా, మెఱయుఁగ = ప్రకాశించును. ని బుధఃకవౌ సురేసౌమ్యే, అనియును, ని గణస్సమూహే ప్రమథే, అనియును, ని. కలధౌతం రౌప్యహేమ్నోః, అనియును విశ్వము. ని గౌః క్రతౌ వృషభే చంద్రే వాగ్భూదిగ్ధేనుమస్త్రియాం॥ అని రత్నమాల

టీక. చంద్ర చరిత్రమునకు— బుధగణవాసమయి = దేవతా సమూహమునకు నివాసస్థానమై, శుభ కలధౌతరాశి నాఁగఁ - మంగళకరమైన బంగారుగుట్ట యనఁగా (మేరుపర్వత మనుట) తతిమ్మ విషయము సమానము.

టీక. సారంగధర చరిత్రమునకు— మనము = మన మిర్వురము, ముదము నెనయఁగ = సంతోషమును పొందఁగా, వినుము = ఆకర్ణింపుము, బుధగణవాసమయి = పండిత సమూహమునకు నివాసస్థానమై, శుభ = మంగళకరమైన, కలధౌతరాశినాఁగఁ = అవ్యక్త మధురధ్వనుల ప్రోవు అనునట్లుగా, గోతలమ్మునఁ = భూతలము నందు, రాజమహేంద్రమనఁగ = రాజమహేంద్ర మనఁగా, తగి = ఒప్పినట్టిదై, తన్నగరమ = ఆ పట్టణమే. మేటిగాఁగ = మేటియగుచుండఁగా, మెఱయుఁ = ప్రకాశించును, ని. కలధౌతం కలధ్వనౌ. అని విశ్వము

సీ॥ అచ్చటి విశ్వ ద్వి • జాళి మెచ్చునె యాత్మ
భువు నెక్కుడుఁగ శ్రుతి • మోదనోక్తి
నచ్చటి రాజహం • సావళి మెచ్చునే
తగు పతంగవరుఁ బ్ర • తాప గరిమ

నచ్చటఁగల పలుం ♦ బచ్చుల గమి మెచ్చు
నే బక శ్రీని వ ♦ న్నెగల కల్మి
నచ్చటఁగల జఘ ♦ న్య వితతి మెచ్చునే
బలునెమ్మి మించుదా ♦ ళ్ళ లవమేని

గీ॥ యచటి సుమన స్సదనముల ♦ నచటి బుధుల
నచటి సరసుల నచ్చటి ♦ యమల తరుల
నచటి నెఱసరి దంటల ♦ నచటి చిఱుత
ల న్నిజంబుగ హరికైన ♦ నెన్నఁ దరమె. 8

టీక॥ శివ, అచ్చటి = ఆ కైలాసమునందుండినట్టి, విశ్వద్విజాళి = సమస్తమగు పక్షి సముదాయము, శ్రుతి = చెవులకు, మోదన = సంతోష కరమైన, ఉక్తిఁ = పలుకులయందు, ఆత్మభువుని = మన్మథుని యొక్క, ఎక్కుడుఁ = వాహనమైన చిలుకను, మెచ్చునే = మెచ్చునా (అనఁగా నొప్పుకొనదనుట) అచ్చటి . .. వళి = అక్కడ నుండిన రాజ హంసల సముదయము, ప్రతాపగరిమఁ = విక్రమాతిశయమునందు, తగు = ఒప్పిదమైనట్టి, పతంగవరుఁ = పక్షినాయకుఁడగు గరుత్మంతుని, మెచ్చునే = మెచ్చదనుట, అచ్చటఁగల = అరజతాచలము నందుండిన, పలుఁ = అనేకములైన, పచ్చులగమి = పక్షి సముదాయము, వన్నెఁగల కల్మిఁ = కాంతిచేత గలిగిన సంపదయందు (అనఁగా ధావళ్యమున ననుట) బకశ్రీని = కొంగలశోభను, మెచ్చునే = మెచ్చదనుట, అచ్చటఁగల = ఆ వెండికొండ యందుండి నట్టి, జఘన్య = కనిష్ఠమైన, వితతి = పక్షి సమూహము. (అనఁగా కాకులనుట) లవమేని = ఇంచుకయైనను, మించుదాళ్ళఁ = కాంతిపంక్తులయందు, బలు = లెస్సయైన, నెమ్మిఁ = నెమిలిని, మెచ్చునే = మెచ్చదనుట, అచటి = ఆ కైలాస పర్వతమందలి, సుమన స్సదనములఁ = పూపొదరిండ్లను, లేక దేవతాగృహములను, అచటి బుధులఁ = అక్కడి దేవతలను, అచటి సరసులఁ = అక్కడి కొల నులను, అచ్చటి యమల తరులఁ = అక్కడి నిర్మలమైన వృక్షములను,

అచటి నెఱసరిదంటలఁ = అక్కడి సింహశ్రేష్ఠములను, అచటి, చిఱుతలఁ = అక్కడి చిఱుతపులులను, నిజంబుగఁ = వాస్తవముగా, హరికైనఁ = విష్ణుమూర్తికైనను, ఎన్నఁదరమే = వర్ణించుటకు శక్యమా? కాదనుట.

టీక. చంద్ర, అచ్చటి = ఆమేరు శైలము నందలి, యని యీపద్య మందెల్లచోట్ల మార్చుకొనుచుండవలయును తతిమ్మా విషయమంతయు సమానము. ని. ద్వీపోవ్యాఘ్రే౽ండజే దంతే॥ అని విశ్వము

టీక సారంగ, అచ్చటి = ఆ రాజమహేంద్రమనే పట్టణమందలి, విశ్వద్విజాళి = సమస్తమైన బ్రాహ్మణసముదాయము, లేక విశ్వబ్రాహ్మణ సముదయము, శ్రుతి = వేదములచేత, మోదన = సంతోషపెట్టునట్టి, ఉక్తిఁ = వచనముల యందు, ఆత్మభువు నెక్కుడుఁ = బ్రాహ్మయొక్క యాధిక్యమును, మెచ్చునే = మెచ్చదనుట, అచ్చటి = ఆ పట్టణమందలి, రాజహంసావళి = రాజశ్రేష్ఠుల సముదయము, ప్రతాపగరిమఁ = విక్రమాతిశయము నందు, తగు = ఒప్పునట్టి, పతంగవరుఁ = సూర్యుఁడనెడి శ్రేష్ఠుని, మెచ్చునే = మెచ్చదనుట ని. పతంగశ్శలభే శాలిభేదే విహగే రవౌ॥ అనీ విశ్వము అచ్చటఁగల = ఆరాజ మహేంద్రమున నుండినట్టి, పలుఁ = అనేకములైన, బచ్చులగమి = వైశ్య సముదాయము, వన్నెగల కల్మిఁ = ప్రసిద్ధమైన సంపత్తునందు, బకశ్రీని = కుబేరుని సంపత్తును, మెచ్చునే = మెచ్చదనుట. ని బకస్తు బకపుష్పేస్యాత్కహ్వే శ్రీదేచరక్షసి॥ అని విశ్వము. అచ్చటఁగల = ఆపట్టణమునందుండినట్టి, జఘన్యవితతి = శూద్ర సముదాయము, నెమ్మిమించువాళ్ళఁ = సంతోష మతిశయించునట్టి నాగటివాళ్ళయందు, బలుఁ = బలరాముని, లవమేని = ఇంచుకయేని, మెచ్చునే = మెచ్చదనుట. ని. బలోహలాయుధేదైత్య॥ అని విశ్వము. అచటి సుమనస్సదనములఁ = అక్కడి దేవాలయములను, అచటి బుధులఁ = అక్కడి పండితులను, అచటి సరసులఁ = అక్కడి రసిక జనులను, అచ్చటి యమలతరులఁ = అక్కడి నిర్మలతరులైన వారిని, అచటి నెఱసరిదంటలఁ = అక్కడి శూరాగ్రేసరులను, అచటి చిఱుతలఁ = అక్కడి కుఱ్ఱవాండ్లను,

సీ॥ శిశువును బులియునోఁ జిఱుతయనఁగ, అని సాంబనిఘంటువు హరికైనన్ = విష్ణుమూర్తికైనను, ఎన్నతరమె = వర్ణింపశక్యమగునా? కాదనుట.

ఆ॥వె॥ అందలి గణికాళి • యందమై రంభాదు
లను హసింపుచు సఫ • లత వహించి
వన్నె మీఱుఁ బల్ల • వ మనోహరంబులై
కొమ్మలఁగ వికాసి • తమ్ము నగుచు. 4

టీక. శివ, అందలి = ఆ కైలాసమందుండిన, గణికాళి = తక్కెడు చెట్ల సమూహము, అందమై = సొంపైనవై, ని. గణికాయూధికా వేశ్యా తర్కారీ కరిణీషుచ అని విశ్వము. రంభాదులను = అరటిచెట్లు మొదలయిన వాటిని, ని. రంభాకదళ్యప్సరో॥ అని విశ్వము, హసింపుచుఁగా = పరిహాసము చేయుచు, సఫలత వహించి = ఫలసమేతత్వమును పొంది, పల్లవ = చిగురు టాకులచేత, మనోహరంబులై = మనోజ్ఞమైనవియై, కొమ్మలన్ = శాఖల చేత, వికాసితమ్ము నగుచు = ప్రకాశింపఁబడినవి యగుచు, వన్నెమీఱుఁగా = సొంపుమించును.

టీక. చంద్ర॥ అందలి = ఆ మేరుపర్వతమునఁ గల్గినట్టి, తతిమ్మా విషయము సమానము. అనఁగా మేరుశైలమందలి తక్కెడు చెట్ల సమూహము, యరఁటి మొదలైన చెట్లను తిరస్కరింపుచు ఫలములచేతను, చిగురుటాకుల చేతను, కొమ్మలచేతను వన్నె మీఱెనని తాత్పర్యము.

టీక సారంగ॥ అందలి = రాజమహేంద్రమున గల్గినట్టి, గణికాళి = వేశ్యాసముదాయము, అందమై సొంపై, రంభాదులను = రంభ మొదలయిన యప్సరసలను, హసింపుచుఁగా = పరిహాసముఁ జేయుచు, సఫలత వహించి = సాఫల్యమునుఁబొంది, పల్లవ = విటులకు, మనోహరంబులై = మనోజ్ఞమై, కొమ్మలఁగా = స్త్రీలలో, వికాసితమ్మునగుచు = ప్రకాశింపబడుచు, వన్నెన్మీఱున్ = అలంకారము మించును.

ఆ॥వె॥ అచటి హరులవలె వి • హాయస సంతతి
స్వామి మనము స్వారి • సలిపి నన్ను
మీఱ నెక్కుఁడనుచు • సారంగ మని యోడి
పోయెనేమొ యెక్కుఁ • డాయె నదియె 5

టీక. శివ॥ అచటి = ఆ కైలాసపర్వతమందలి హరులపలెఁ = చిలుకల మాదిరిగాఁ, విహాయససంతతి స్వామీ = ఓ పక్షులరాజా, (అనఁగా నో గరుత్మంతుఁడా యనుట) మనము = మన మిర్వురము, స్వారి సలిపి = విహారముఁజేసి (అనఁగా పరుగెత్తి యనుట) నన్ను మీఱఁ = నన్ను మించిన యెడల, ఎక్కుఁడనుచున్ = నీ వధికత నొందుమటంచు (అనఁగా నన్ను మించకున్నచో నీకాధిక్యము తగదనుట) సారంగమని = చాతకపక్షి పలికి. ఓడిపోయెనేమొ = ఓడిపోయినది గాబోలు, యెక్కుఁడాయె నదియె = ఆ గరుడపక్షియే హెచ్చైనదాయెను (అనఁగా పక్షిరాజాయె ననుట.)

టీక చంద్ర॥ అచటి హరులవలెన్ = ఆ మేరుపర్వతము నందలి చిలుకల రీతిగా, తతిమ్మా విషయము సమానము.

అనఁగా మేరుశైలమందలి చిలుకలతో సమానముగా మనమిర్వురము పరుగెత్తినచో నన్ను మించితివేని నీవు హెచ్చు. లేకుండిన నీ హెచ్చు లేల యని గరుడునితో పందెము పెట్టుకొని చాతకపక్షి యోడిపోయి యుండ వచ్చును అందువలననే గరుడుఁడు హెచ్చాయెనని తాత్పర్యము. ని. సారంగ స్చాతకే భృంగే కురంగేచ మతంగజ ॥ అని విశ్వము.

టీక. సారంగ॥ అచటి = ఆ రాజమహేంద్రమునందలి, హరుల వలెన్ = గుఱ్ఱముల రీతిగా, విహాయస సంతతి స్వామీ = ఓ వాయుదేవుడా, మనము = మన మిర్వురము, స్వారి సలిపి = పరుగెత్తి, నన్ను మీఱన్ = నన్ను మించిన యెడల, ఎక్కు డనుచున్ = నన్నధిరోహింపుఁడటంచు, సారంగమని = జింక పలిించి, ఓడిపోయెనేమో = తగ్గిపోయినదిగాబోలు. అదియె = ఆ జింకయే, ఎక్కుడాయెన్ = వాహనమాయెను.

గీ॥ రమణ నట దీర్ఘములగు నా ♦ గముల చాయ
అరయ శితియయి సాంద్రమై ♦ యలరు కతనఁ
గాంచి భీతిలె నాకొ యట్లు ♦ గాక దివ్య
దంతి వెలిఁజేసికొన నేల ♦ త్వక్కు నెల్ల 6

టీక॥ శివ అటన్ = అకైలాసమునందు, రమణన్ = ఒప్పిదముగా, దీర్ఘములగు = పొడుగైనట్టి, నాగముల చాయలు -- పొన్నవృక్షముల నీడలు, అరయన్ = విచారింపఁగా శితియయి = నల్లనయై, సాంద్రమై = దట్టమై, అలరుకతనన్ = ప్రకాశించుటచేత, కాంచి = చూచి, భీతిలెనొకొ = భయ పడెనేమొ, అట్లుగాక = అటులఁ గాకపోయినచో, దివ్య = శ్రేష్ఠమైన, దంతి = దంతివృక్షము, త్వక్కు నెల్లన్ = తొటనంతయును, వెలిఁజేసికొన నేల = తెల్లఁజేసికొని యుండుటెందులకు, అనఁగా దంతిచెట్లు తెల్లగానుండుట స్వభావమని యెఱుంగునది.

టీక. చంద్ర అటన్ = అ మేరు శైలమునందు, తతిమ్మా విష యము సమానము, ని॥ నాగకేసర పున్నాగ నాగదంతకము స్త్రకే, అని, దంతిస్యాదోషధీ భేదే, అనియును, విశ్వము.

టీక సారంగ రమణన్ = ఒప్పిదముగా, అటన్ = ఆరాజమహేంద్ర మున, దీర్ఘములగు = నిడుపైనవియగు, నాగములచాయలు = ఏనుగుల కాంతులు, అరయఁగా = విచారింపఁగా, శితియయి = నల్లనయై, సాంద్రమై = దట్టమై, అలరు కతనన్ = ప్రకాశించుటవలన, కాంచి = చూచి, భీతిలె నొకొ = భయమునొందెను గాబోలును, అట్లుఁగాక = అరీతి గాకున్నచో, దివ్యదంతి = స్వర్గజము, (అనఁగా నైరావతమనుట) త్వక్కునెల్ల = చర్మము నంతయును, వెలిఁజేసికొననేల = తెల్లజేసికొని యుండుటెందులకు, ఐరా వతము తెల్లఁగా నుండుట సహజమని యెఱుంగునది

వ॥ అందుపై నింద్రనిలయంబును గ్రిందుఁజేయుచు భోగ విఖ్యాతినొంది యతియుక్తంబైన మహోన్నత ధామ మండలంబొండు విలసిల్లు చుండె. 7

టీక॥ శివ. అందుపైఁ = ఆ కైలాసపర్వతము పైన, ఇంద్రనిలయంబును గ్రిందుఁజేయుచు = దేవేంద్రుని నిలయమైన యమరావతిని మించినదై, భోగ విఖ్యాతి నొంది = భోగమని ప్రసిద్ధిని పొందినదై, అతియుక్తంబైన = మిక్కిలియొప్పైనట్టి, మహోన్నత ధామ మండలంబొండు = అత్యున్నత గృహసముదాయ మొకటి (అనఁగా పట్టణమనుట) విలసిల్లుచుండెఁ = ప్రకాశింపుచుండెను

టీక॥ చంద్ర. అందుపైఁ = ఆమేరు శైలముమీఁది భాగమున, ఇంద్రనిలయంబును = స్వర్గలోకమును, క్రిందఁ జేయుచుఁ = క్రిందుగా నుండునట్లు జేసుకొని (అనఁగా స్వర్గమునకు మీది భాగమున ననుట) భోగవిఖ్యాతి నొంది = సౌఖ్యమునందు ప్రసిద్ధిని వహించి, యతియుక్తంబైన = ఋషి సమేతమైనట్టి, మహోన్నతధామ మండలంబొండు = అత్యున్నత ప్రభావముఁగల సప్తర్షి మండలం బొకటి, విలసిల్లుచుండెన్ = ప్రకాశింపు చుండెను.

టీక॥ సారంగ, అందుపైన్ = ఆరాజమహేంద్రము పైకి, ఇంద్ర నిలయంబును గ్రిందుఁజేయుచు = దేవేంద్రుని సదనంబును మించినదియై, భోగ విఖ్యాతినొంది = సౌఖ్యమునందు ప్రసిద్ధినిపొంది, అతియుక్తంబైన = మిక్కిలి యొప్పైనట్టి, మహోన్నత ధామ మండలం బొండు = అత్యున్నత గృహ సముదయ మొకటి, (అనఁగా సౌధములనుట) విలసిల్లుచుండెఁ = ప్రకాశింపుచుండెను

గీ॥ అందు నొక శంకరుండు మ • హాత్రి లోక
నుతుఁ డనం దగి రాతి ని • యతుల రాజ
రాజునాఁ బేరుఁ గాంచియుఁ • దేజరిల్లు
నవిరళం బుగఁ దన్మండ • ల వరుఁ డగుచు 8

టీక॥ శివ అందున్ = ఆభోగధామము నందున, ఒక శంకరుండు = ఒక్క యీశ్వరుఁడు, మహా = ఘనమైనట్టి, త్రిలోక = ముజ్జగములచేత, నుతుఁడనందగి = కొనియాడఁ బడిన వాఁడనుటకు తగిన

వాఁడై, రాతి నియతులన్ = త్యాగ భాగ్యములయందు, రాజ రాజు = నాన్ = కుబేరుఁ డనునట్లుగా, పేరుఁ గాంచియున్ = ప్రఖ్యాతి వహించి యును, అవితథంబుగన్ = యథార్థముఁగా, తన్మండలవరుఁ డగుచున్ = ఆ కైలాస సంబంధమైన దేశమునకు నాథుఁడైన వాఁడై, తేజరిల్లున్ = ప్రకాశించును

టీక చంద్ర అందున్ = అసప్తర్షి మండలంబున, ఒక శంక రుండు = ఒక్క శుభకరుఁడైన వాఁడు, శం శుభం కరోతీతి శంకరః, అని వ్యుత్పత్తి, మహా = అధికుఁడైన, అత్రి = అత్రిముని, లోక = భువనముల చేత, నుతుఁ డనందగి = కొనియాడఁబడిన వాఁడనుటకు తగినవాఁడై, రాతిని = అనుగ్రహముతో, యతులన్ = మునులయందున రాజరాజునాన్ = సార్వభౌముఁడను నట్లుగా, పేరుఁ గాంచియున్ = ప్రసిద్ధిని పొందియును, అవితథంబుగన్ = సత్యముగా, తన్మండల వరుడగుచున్ = అసప్తర్షి మండలమునందు శ్రేష్ఠుఁడైన వాఁడగుచు, తేజరిల్లు = ప్రకాశించును. శ్లో॥ కశ్యపోఽత్రి భరద్వాజో విశ్వామిత్రశ్చ గౌతమః। జమదగ్ని ర్వసిష్ఠశ్చ ఋషయ స్సప్తకీర్తితాః, అనుటచే యత్రిముని సప్తర్షులలోని వాఁడని గ్రహించునది

టీక సారంగ అందున్ = ఆ నగర్యయందున, ఒక శంకరుండు = ఒక్క శుభకరుఁడు, మహాత్రిలోక నుతుఁ డనందగి = ఘనతరమగు ముజ్జగముల చేత కొనియాడఁబడిన వాఁడనుటకు తగినవాఁడై, రాతినియతులన్ = త్యాగ భాగ్యములతో, అవితథంబుగన్ = యథార్థముగా, తన్మండల వరుఁడగుచున్ = ఆ రాజమహేంద్ర సంబంధమైన దేశమునకు ప్రభువైన వాఁడై, రాజ రాజునాన్ = రాజరాజనియనంగా, పేరుఁ గాంచియున్ = నామమును వహించియును, తేజ రిల్లున్ = ప్రకాశించును, అనఁగా రాజనరేంద్రునకు రాజరాజను నామముఁగల దని గ్రహించునది, గీ॥ మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి। రాజరాజ నరేం ద్రుఁడు రాజరాజు। ననఁగఁ బేరెన్నికకు నెక్కి యతిశయిల్లు। నింద్ర విభ వుండు రాజమహేంద్ర విభుఁడు అని చేమకూర వేంకట కవి సారంగధర చరిత్రములో ప్రయోగముఁగద్దు

గీ॥ తనర నాయతి శ్రేష్ఠుఁడు • దక్ష తనయ
యైన సతి ననసూయ ర • త్నాంగి నాత్మ
దేవిఁగాఁ గొని యేలును • దివ్యులైన
సర్వ సుమనో గణంబు లా • సక్తిఁ గొలువ. 9

టీక. శివ॥ ఆయతిశ్రేష్ఠుఁడు = ఆ పైఁ జెప్పఁబడిన యీశ్వరుఁడను మిక్కిలి యుత్తముఁడు, దక్షతనయయైన సతిని = దక్షప్రజాపతికుమారి యగు సతీదేవిని, అనసూయన్ = అసూయ లేని దానిని, రత్నాంగిని = మణులఁ బోలిన కాంతియుక్తమయిన శరీరముఁ గల దానిని, ఆత్మ దేవిఁగాఁ గొని = స్వకీయమయిన భార్యఁగాఁ గైకొని, దివ్యులైన = స్వర్గసంబంధమయినవారగు, సర్వసుమనస = సమస్తమయిన దేవతలును, గణములు = ప్రమథులును, ఆసక్తిఁ గొలువన్ = అపేక్షతో సేవింపుచుండఁగా, తనరన్ = అతిశయిల్లు నట్లు, ఏలును = ఏలుఁబడి చేయును ని. గణస్సమూహే ప్రమథే. అని విశ్వము

టీక చంద్ర॥ ఆయతిశ్రేష్ఠుఁడు = ఆమునిసత్తముఁడు (అనఁగా న త్రిమహాముని యనుట) దక్షతన్ = నేర్పుతో, నయయైన సతిని = నీతియైన చేడెను, అనసూయన్ = అనసూయయను పేరుగల దానిని, రత్నాంగిన్ = మణివంటి శరీరముఁ గల దానిని. ఆత్మదేవిఁగాఁగొని = తన భార్యఁగాఁ గైకొని, దివ్య . గణంబులు = స్వర్గీయులగు సమస్త దేవతాసముదాయములు, ఆసక్తిఁగొలువన్ = అపేక్షతో సేవింపుచుండఁగా తనరన్ = అతిశయించునట్లు. ఏలును = ఏలుఁబడి చేయును

టీక సారంగ॥ ఆ = అపైనఁ జెప్పఁబడిన రాజనరేంద్రుఁడను. అతిశ్రేష్ఠుఁడు = మిగుల నుత్తముఁడు దక్షతన్ = నేర్పుతో, నయయైన సతిని = నీతియైన చేడెను. అనసూయన్ = అసూయ లేనిదానిని, రత్నాంగిఁ = రత్నాంగియను పేరుగల దానిని, ఆత్మదేవిఁగాఁగొని = స్వకీయమయిన పట్టపురాణిగాఁ గైకొని దివ్య ...... ... గణంబులు = మనోజ్ఞమయిన సమస్తమగు బుద్ధిమంతుల సముదాయములు ఆస

కి్రఁగొలువఁ = అపేక్షతో సేవింపుచుండగా, తనరఁ = అతిశయిల్లునటుల, ఏలును = ఏలుఁబడి చేయును

క॥ పతి యాజ్ఞఁ జవ దాటక
సతతము గురునిగను దైవ ♦ సమముగ నెంచుఁ
మతి సేవించుఁ గావున
సతి యనుటలు తద్రమణికి ♦ సార్థమ కాదే 10

టీక శివ॥ పతి దాటక = భర్త యొక్క శాసనమును గడి మీరక, సతతముఁ = నిరంతరమున్ను, గురునిగను = దేశికుని వలెను, దైవ... నెంచుఁ = దైవము సమానముగ భావించును, మతి సేవించుఁ = హృదయమున ధ్యానించును కావునఁ = కాబట్టి, తద్రమణికి = ఆ శంక రుని భార్యయైన తొయ్యలికి, సతియనుటలు = సతీ దేవియని వచించుటలెల్ల, సార్థమకాదే = అర్థయుక్తమైనదేకదా (అనఁగా, ని సుచరిత్రాతు సతీసాధ్వీ పతివ్రతా, అని యమరము గావున సతీ శబ్దము పతివ్రత యందు వర్తిం చుటచే సతీ దేవియని వచించుట సార్థక నామధేయమేయని తాత్పర్యము

టీక చంద్ర. సతియనుటలు = పతివ్రతయని వచించుటలు, తద్ర మణికి = ఆ యత్రిమహర్షి భార్యకు, సార్థమకాదే = సార్థకనామమేరది, అనఁగా భర్తయాజ్ఞను జవదాటక గురునివలెను దైవమువలెను భావించి డెంద మునఁ గొనియాడునట్టి యనసూయను పతివ్రతయని వచించుటలు సార్థక్య మేయగునని తాత్పర్యము

టీక, సారంగ తద్రమణికి = ఆ రాజనరేంద్రుని భార్యయగు రత్నాం గికి, సతియనుటలు = పతివ్రతయని పల్కుటలు, సార్థమకాదే = సార్థక్యమే కదా, తతిమ్మా విషయము సుగమము

గీ॥ పరుల కరయఁగ నెంత సం ♦ పదలు గలుగ
నంత సంతస మాత్మలో ♦ నందుఁగాని

కొంచెమైన నసూయఁ దాఁ • గొనదు గానఁ
దరుణి ననసూయ యనుట సా • ర్థకముకాదె 11

టీక శివ॥ పరులకు = ఇతరులకు, అరయఁగన్ = విచారింపగా, ఎంత సంపదలు గలుగన్ = ఎంత భాగ్యము గలిగితే, అంత .నందుఁ గాని = అంత సంతోషము మదిలోఁ జెందునేగాని, కొంచమైనన్ = లేశ మాత్రమేనియును, అసూయన్ = ఓర్వలేని తనమును, తాన్ = తాను, (అనగా సతీదేవియనుట) కొనదుగాన = వహింపదు కాబట్టి, తరుణిన్ = అ భిప్రాయముఁగల సతీదేవిని అనసూయ యనుట, అసూయ రహితమైనదియని వచించుట సార్థకముకాదె = అర్థ యుక్తమైనదేకదా.

టీక, చంద్ర॥ తరుణిన్ = అ భిప్రాయముఁగల చేడెను, అనసూయ యనుట = అనసూయయను నామముతోఁ బిలుచుట. సార్థకముకాదే = సార్థక నామధేయమే యగును తతిమ్మా విషయము సమానము

టీక సారంగ॥ తరుణిన్ = రత్నాంగియను చిన్నదానిని, అనసూయ యనుట = అసూయరహితమైనదియని వచింపుట సార్థకముకాదె = సార్థ కమే యగును తతిమ్మా విషయము సుగమము

గీ॥ పదము లెన్నఁ బ్రవాళముల్ • పెదవి కెంపు
పలువరుస మౌక్తికము లిఁక • నలక లనిన
నీలములు నవ్వు హీరమై • నెగడుఁ గాన
నామె రత్నాంగి యను టొక • యబ్బురంబె. 12

టీక శివ॥ పదములెన్నన్ = పాదముల నెంచఁగా ప్రవాళములు = పగడములు, పెదవికెంపు = అధరము పద్మరాగమణి, పలువరుస మౌక్తిక ములు = దంతములచాలు ముత్యములు ఇఁక నలకలనిసెన్ = ఇంక ముంగురులన్ననో, నీలములు = ఇంద్రనీల మణులు, నవ్వు హీరము =

నగపు వజ్రము, ఐ నెగడుఁగాననే = ఐనదిగా వర్ధిల్లుచుండును గావున, ఆమెకా = ఆ సతీదేవిని, రత్నాంగియను టొక యబ్బురంబె = మణులవంటి శరీరముఁగలది యనుట యొక యాశ్చర్యమా, కాదనుట.

టీక. సారంగ ॥ ఆమెకా = ఆ రాజనరేంద్రుని భార్యను, రత్నాంగి యను టొక యబ్బురంబె = రత్నాంగియని వచించుట యాశ్చర్యముగాక సార్థక నామమే యనుట తతిమ్మ విషయము సుగమము

వ॥ అట్టి సతీరత్నంబునుం గైకొని ప్రశస్తకీర్తి విస్తారుండై వెలయుచున్నంత గొన్నాళ్ళకు 13

టీక శివ॥ అట్టి సతీరత్నంబునుం గైకొని = అటువంటి సతీదేవియను మణినిఁ జేకొని, ప్రశస్తకీర్తిన్ విస్తారుండై = ప్రసిద్ధికెక్కిన యశముచేత విశాలమైనవాఁడై, వెలయుచున్నంతకా = ప్రకాశింపుచుండినంతలో, కొన్నాళ్ళకు = కొన్ని దివసములకు

టీక చంద్ర సారంగధర కథలకు సమానము అట్టి సతీరత్నంబునుం గైకొని = అటువంటి పతివ్రతామణిని చేకొన్నవాఁడై, తతిమ్మా విషయము సుగమము

క॥ తనరఁగ నన్నయ కోవిదుఁ
దన నొక్కఁడు దివ్య చారు • దగణిత వాగ్వైం
భణ నారదుఁ డా సురుచిర
మణి కద కరుదెంచి భక్తి • మై జే యనినన్ 14

టీక శివ॥ ఆ సురుచిరమణికదకు = ఆ సమీచీనమైన కాంతియందు రత్నప్రాయుడగు శంకరుని యొద్దకు, నయకోవిదుఁ డనన్ = నీతికోవిదు డనఁగా, ఒకఁడు దివ్యచారుఁడు = ఒకానొకఁడు దివియందుఁ బుట్టిన

సేవకుఁడు, అగణిత = ఎన్నశక్యముఁగాని, వాగ్జృంభణ = వాక్యముల యొక్క యతిశయమునందు, నారదుఁడు = మేఘునివంటివాఁడు తనరఁగ =ఒప్పునట్లుగా, కనన్ = చూచుట కొఱకు, అరుదెంచి = వచ్చినవాఁడై, భక్తిమై = భక్తితో, జేయనిన్ = నమస్కారమని పల్కఁగా, ముందరి పద్యముతో నన్వయము.

టీక చంద్ర॥ అసురుచి = ఆ మంచికాంతిగల యత్రిమహర్షియొక్క, రమణికడకు = భార్యయగు ననసూయాదేవి యొద్దకు, తనరఁగనన్ = ఒప్పునట్లుగా దర్శించుటకొఱకు, నయకోవిదుఁడనన్ = నీతికోవిదుఁడను నట్టుల, ఒక్కఁడు = ఒంటివాఁడు దివ్యచారుఁడు = స్వర్గమందు బుట్టి సంచరించు వాఁడు అగణిత వాగ్జృంభణన్ = ఎన్నతరముగాని వచనాతిశ యము చేత, నారదుఁడు = నారదుఁడను దేవర్షి, అరుదెంచి = వచ్చినవాఁడై, భక్తిమై జేయనినన్ = భక్తితో నమస్కారమని వచింపఁగా

టీక సారంగ॥ అ సురుచిర మణికడకు = ఆ రాజనరేంద్రుని యొద్దకు తనరగన్ = ఒప్పునట్లుగా, నన్నయ కోవిదుఁడు = నన్నయభట్టను విద్వాంసుఁడు, అనన్ = అనంగా, ఒక్కడుఁ ఒంటివాఁడు. = దివ్యచారుఁడు = మనోజ్ఞమైన వర్తనము గలఁవాడు అగణిత నారదుఁడు = ఎన్న తరముగాని వాక్యాతిశయమునందు మేఘుఁడైనవాఁడు, అరుదెంచి = వచ్చిన వాఁడై, భక్తిమైజేయనినన్ = భక్తితో జయమగునని పల్కఁగా, ముందరి పద్యముతో నన్వయము జేయనిన నమస్కారమునకును జయమను దీవనకును చెల్లుననుటకు శబ్దార్థ చంద్రిక చూడనగును.

గీ॥ కాంచి యాతని వైరించిఁ • గా నెఱింగి
ముఱల జేజే యటంచు స • న్మాన బుద్ధి
నొండు తగుగద్దె నిడినఁ గూ • ర్చుండి తనదు
రాక వివరింపఁగా నిట్లు • జోకఁ బలికె

టీక శివ॥ కాంచి = వచ్చి నమస్కరించిన బ్రహ్మదూతను శంక రుఁడు జూచి, అతనిఁ = ఆ సేవకుని, వైరించిఁగా నెఱింగి = బ్రహ్మ సంబంధమయిన వానిఁగాఁ దెలిసికొని, (అనఁగా బ్రహ్మపంపిన పరిచార కుఁడని గ్రహించి) మఱలన్ = నమస్కారముఁ జేసినవానికి తిరుగ, జేజే యటంచున్ = జయము జయమని దీవించుచు, సన్మాన బుద్ధిన్ = మర్యాదఁ జేయు తలంపుతో, ఒండు తగుగద్దె నిడినన్ = వానికి తగినట్టి పీటనొకటి యొసఁగఁగా, కూర్చుండి = అ దారుం డాసీనుఁడై తనదు. జోకఁ బలికెన్ = తాను వచ్చిన విషయముఁ దెలుపుట కొఱకు సీవిధము సొంపుగా వచియించెను

టీక. చంద్ర॥ కాంచి = వచ్చి నమస్కరించిన నారదుని ననసూయా దేవి జూచి, అతని వైరించిగా నెఱింగి = వానిని బ్రహ్మ కుమారునిఁగాఁ దెలిసికొని, తతిమ్మ విషయము సమానము

టీక సారంగ॥ కాంచి = వచ్చి దీవించిన నన్నయభట్టును రాజ నరేంద్రుఁడు జూచి, అతని వైరించిఁగాఁ నెఱింగి = వానిని బ్రాహ్మణుఁ డుగాఁ దెలిసికొని, మఱల జేజేయటంచున్ = తిరుగా నమస్కారమని పల్కుచు, తతిమ్మ విషయము సమానము

క॥ ఓ సుచరిత్రా నీదగు
వాసిన్ విని విధి వశమున ♦ వచ్చితిఁ గరుణో
ల్లాసముల తోడ నాదృతిఁ
జేసి కటాక్షింప వలయు ♦ శ్రీ లొదవు నినున్ 18

టీక శివ॥ ఓ సుచరిత్రా = సచ్చరిత్రుఁడవైన శంకరా, నీదగు వా సిన్ విని = నీ సంబంధమయిన ప్రసిద్ధిని విన్నవాఁడనై, విధివశమున వచ్చి తిన్ = బ్రహ్మ మూలకముగా వచ్చినాఁడను, కరుణోల్లాసముతోడన్ = దయా సంతోషములతో, ఆదృతిజేసి = ఆదరణ మొనర్చి, కటాక్షింప వల యున్ = కడగంటఁ జూడవలయును, శ్రీ లొదవు నినున్ = నిన్ను సంప దలు పూనును

టీక. చంద్ర॥ ఓ సుచరిత్రా = మంచి చారిత్రము గల యో యన సూయా, విధివశమున వచ్చితిఁ = నాభాగ్యవశమున వచ్చినాఁడను. మిగత సమానము. ని భాగ్యం స్త్రీ నియతిర్విధి, అని యమరము.

టీక సారంగ॥ ఓ సుచరిత్రా = సచ్చారిత్రుఁడవగునో రాజ నరేంద్రా, విధివశమున వచ్చితిఁ = కాలవశమున వచ్చినాడను. మిగత సమానము ని. విధిర్విధానే నియతౌ కాలే సద్మభవే, అని నానార్థ రత్న మాల.

గీ॥ ఎపుడు మీవంటి వారినే ♦ యేను గాంచి
సారముగఁ గృతు లొనరించి ♦ వారి యాద
రములఁ బడసియుఁ ద దతిశ ♦ యముల నెల్ల
నెంచు చుండుటయే నాదు ♦ వృత్తి కాంత. 17

టీక శివ॥ కాంత = ఓ ప్రభువా, ఎపుడుఁ = ఎల్లప్పుడును, మీ వంటివారినే = మీలాటి ప్రభువులనే, ఏను గాంచి = నేను దర్శించి, సార ముగఁ = శ్రేష్ఠముగా, కృతు లొనరించి = చెద్దు లొనర్చి, (అనఁగా పనులు చేసియనుట) ని కృతిః 'కరణహింసయోః' అని విశ్వము. వారి యాదర ములఁ బడసియు = వారలయొక్క మన్ననల నొందియును, తత్ = వారల యొక్క, అతిశయములనెల్లఁ ఆధిక్యముల నన్నియును, ఎంచుచుండుటయే = వర్ణింపుచుండుటయే, నాదు వృత్తి — నా జీవనోపాయము. ఇట్లని యీశ్వరు నితో బ్రహ్మదూత బలికెనని తాత్పర్యము.

టీక. చంద్ర॥ కాంత = ఓ లలనా, సారముగఁ = శ్రేష్ఠముగా, కృతు లొనరించి = యత్నములుజేసి, ని. కృతిస్తు యత్నేచ వర్గాఖ్యగతి తేపినా, అని రత్నమాల. తతిమ్మా విషయము సమానము. ఇట్లని యనసూయా దేవితో నారదుఁడు పల్కెనని తాత్పర్యము

టీక. సారంగ॥ కాంత = ఓ ప్రభువా, సారముగఁ = రసవత్తరముగ,

కృతు లొనరించి = ప్రబంధములు చేసి ఇట్లని రాజనరేంద్రునితో నన్నయభట్టను కవీశ్వరుఁడు పల్కెనని తాత్పర్యము తతిమ్మా విషయము సమానము

గీ॥ ఎల్లెడల కేగి నారాక • నెఱుఁగఁ జేసి
విసిగి యున్నాఁడ నేఁ డిష్టి • విధులుఁ గూడి
చేయ చనుపమ హితుఁడ నిన్ • జేరినాఁడఁ
దెలుప నాకృతిఁ గాంచఁగా • వలయుఁ జనుము 18

టీక శివ॥ ఎల్లెడల కేగి = ఎల్లచోట్లకు నరిగిన వాఁడనై, నారాక నెఱుఁగఁ జేసి = నేనువచ్చిన విషయమునుఁ దెలియపర్చి, విసికి యున్నాఁడన్ = విసుగుఁ జెంది యుండినాఁడను, నేడు = ఇప్పుడు, ఇష్టిన్ = యజ్ఞమును, విధులు గూడి చెయుచు = బ్రహ్మలు ప్రోవై యొనరింపుచు, అనుపన్ = పంపఁగా, మహితుఁడ = ఓ మహాత్ముఁడా, తెలుపన్ = ఎఱిగించుటకు, నిన్ జేరినాఁడన్ = నీ సమీపమునకు వచ్చినాడను, ఆ కృతిఁ గాంచఁగావలయున్ = ఆపనిని జూడవలెను, చనుము = అరుగుము, ని. ఇష్టిస్స్యాదఖిలాక్షేపి సంక్షేప శ్లోక యాగయోః అని విశ్వము

టీక చంద్ర॥ ఎల్లెడల యున్నాఁడన్ = సమస్త ప్రదేశములకు నరిగి నేవచ్చిన కార్యమునుఁ దెలిపి విసుగుఁ జెంది యున్నాడను, నేడు = ఇప్పుడు, ఇష్టిన్ = కోరికను, తెలుపన్ = ఎఱిఁగించుటకు, విధులుగూడి చేయుచు = భాగ్యములు ప్రోవై యిట్లొనరింపుచు, అనుపన్ = నన్ను పంపఁగా, నిన్ జేరినాఁడన్=నీ చెంతకు వచ్చినాఁడను, నాకృతిఁ గాంచఁగా వలయున్ = నా యత్నమును జూడవలయును మహితుఁడన్ = మహాత్ముఁడను గావున, చనుము = ఒప్పుకొనుము

టీక సారంగ॥ ఎల్లెడల యున్నాఁడన్ = సమస్త ప్రదేశముల కేగి నేవచ్చుటలుఁ దెలిపి విసుగునొంది యుండినాడను అనుపమహితుఁడన్ = సమానరహితమగు మిత్రుఁడను, నేడు = ఇప్పుడు, విధులుగూడి సేయుచు = అదృష్టములు ప్రోవై యిట్లొనరింపుచు, ఇష్టిన్ = కోర్కెను, తెలుపన్ =

ఎఱింగించుటకు, నినీ జేరినాడన్ = నిన్నుఁ గలిసికొంటిని, నాకృతిన్ = న్నాప్రబంధమును, కాంచఁగావలయున్ = వహింపఁగావలయును లేక చూడఁగా వలయును, చనుము = ఒప్పుకొనుము

గీ॥ ఏ పనులనైన నెఱవేర్ప • నెంచి చూతు
మేని మీటోఁటులకె తగుఁ • గానీ పరుల
కెట్లు సాధ్యము మత్కృతు • లెఱుఁగఁ జేతు
లలిఁ గనుము రాతి మంగళ్య • ము లివి యప్ప 19

టీక శివ॥ అప్ప = ఓయయ్యా, ఎంచిచూతు మేని, విచారించి కనుగొంటిమేని, ఏపనులనైన నెఱవేర్పన్ = ఎట్టికార్యములఁనైనను సిద్ధింపఁ జేయుటకు, మీటోటులకె తగుఁ గాని = తమబోటి వారలకే చెల్లునుగాని, పరుల కెట్లు సాధ్యము = ఇతరుల కేవిధమున సాధింపఁదగును, రాతిన్ = అనుగ్రహముతో, లలిఁ గనుము = క్రమముగాఁ జూడుము మత్కృతుస్లెఱుఁగఁ జేతున్ = నాపనులం దెలియఁ జేయుదును ఇవి = ఈపనులు, మంగళ్యములు = శుభకరములు సుమా

టీక చంద్ర॥ అప్ప = ఓ యక్కా (అనఁగా నో యనసూయా యనుట) ఎంచి చూతుమేని = విచారించి కనుగొందుమేని, ఏపనులనైన నెఱవేర్పన్ = ఏట్టిపనుల నేని సిద్ధింపఁ జేయుటకు, మీటోటులకుతగుఁ గాని = మీస్త్రీలకే చెల్లునుగాని, పరుల కెట్లు సాధ్యము = ఇతరులకు నేవిధముగా సాధింపఁదగును, మత్కృతు లెఱుఁగఁ జేతున్ = నాకార్యములుఁ దెలియపరిచెదను, రాతిమంగళ్యములివి = ఇవి జాతి చిఱుసెనగలు, లలిఁ గనుము = ప్రేమతోఁ జూడుము మంగళ్య శబ్దము చిఱు సెనగ లనుటకు శబ్దార్థ చంద్రికలో చూడ నగును

టీక సారంగ॥ అప్ప = ఓయయ్యా, అనఁగా నో రాజనరేంద్ర భూపాలా యనుట ఎంచి చూతుమేని = గణించి కనుగొందుమేని, ఏపనులనైన నెఱవేర్పన్ = ఎట్టి కార్యములనైన నెఱవేర్చుటకు, మీటోటులకె తగుఁ గాని = మీవంటివారలకే చెల్లును గాని, పరుల కెట్లు సాధ్య

ము = ఇతరుల కేరీతి సాధింపనగును, మత్కృతు లెఱుఁగఁ జేతుఁ = నా ప్రబంధముల నెఱింగింతును ఇవి = ఈ ప్రబంధములు, మంగళ్యములు = శుభకరములగు గావున, రాతిఁ = మిత్రుఁడను, లలిఁ గనుము = ప్రేమతోఁ జూడుము

ఆ॥వె॥ అస్మ దీప్సితము మ • హా పక్వమునుఁ జేయ
వలయు నీవటంచు • వచ్చినాఁడ
సత్య మది యిఁకేల • శంకరా మంగళ్య
ములగుఁ గానఁ గృ • తికిఁ బూను కొమ్మ. 20

టీక. శివ॥ అస్మత్ = నాయొక్క, ఈప్సితముఁ = కోర్కెను, మహాపక్వ మునుఁ జేయవలయు నీవటంచుఁ = నీవు హెచ్చుగా ఫలించు నట్లొనరింప వలెనని, వచ్చినాఁడఁ = అరుగుదెంచినాను, సత్య మది = అయ్యది సత్య లోకము (అనఁగా యజ్ఞముఁజేయు స్థలము సత్యలోకమనుట) శంకరా = ఓ యీశ్వరుఁడా, ఇఁకేల = ఇంక నేటికి, కానఁ = చూచుటకొఱకు, కృతికిఁ బూనుకొమ్మ = పనికిఁ బూనుకొనుము, మంగళ్యములగుఁ = శుభకరము లౌను.

టీక. చంద్ర॥ కొమ్మ = ఓవెలఁది, రామంగళ్యములగుఁగాన = జాతి చిఱిసెనగలగుటవలన, మహా + అపక్వమును = దొడ్డ గుగ్గిళ్లనుగా, చేయ వలయు నీవటంచుఁ = నీవే యొనరింప వలెనని, వచ్చినాఁడఁ = అరుగు దెంచినాఁడను, అస్మదీప్సితము = నాకోరిక, సత్యమది = యథార్థమల్లది, కృతికిఁబూను = పనికిఁబూనుము, ఇం కేల శంక = ఇంక శంక యెందు లకు.

టీక సారంగ॥ అస్మత్ = నాయొక్క, ఈప్సితముఁ = కోర్కెను, మహా . . . నీవటంచుఁ = నీవధికముగా ఫలించు నట్లొరింప వలయు నని, వచ్చినాఁడఁ = ఏగుదెంచినాఁడను, సత్యమది = అయ్యది యథా ర్థము. ఇంకేల శంక = ఇంక సంశయ మేటికి, రా = ధనమున్ను, మంగళ్యములగుఁగాన = శుభములున్ గలుగును గావున, కృతికిఁ బూను

కొమ్మ = ప్రబంధమునకు సిద్ధపడుము ని రాస్తుద్వయోర్థనే స్వర్థే, అని రత్నమాల

క॥ భావింపఁగఁ గృపఁ గనఁగల
తావండి యనుజ్ఞనిడి ము • దం బొనరింపం
గా వలె ధాత్రీ రమణుల
లో వెదకిన నిట్టివార • లుఁ గలరె మహిమన్ 21

టీక. శివ॥ భావింపఁగన్ = ఎంచిచూడఁగా, కృపన్ = ప్రేమతో, కనఁగలతావండి = చూడఁగలిగిన స్థానమండి, (అనఁగా యజ్ఞభూమియనుట) అనుజ్ఞనిడి గావలెన్ = ఆజ్ఞనిచ్చి నాకు సంతోషమొనర్ప వలయును, మహిమన్ = గొప్పతనమందు, ధాత్రీ రమణులలో = ధరణీ పతులలోన, వెదకినన్ = దేవులాడినను, ఇట్టివారలు = ఇటువంటివాండ్రు (అనఁగా నీయట్టివార లనుట) గలరె = ఉండిరా, లేరనుట

టీక చంద్ర॥ భావింపగాన్ = తలపఁగా, కృపఁగనఁగల = దయతోఁ జూడఁగలిగినట్టి, తా = తాము, వండి = వంటఁజేసి, అనుజ్ఞన్ = ఆజ్ఞతో, ఇడి = నాకొసఁగి, ముదం బొనరింపంగావలెన్ = సంతోషముఁజేయ వలయును (అనఁగా జాలసెనగలను గుగ్గిళ్లుగావండి యనుట) ధాత్రీ = ఓతల్లీ, వెదకినన్ = వెదకిచూచినను, రమణులలోన్ = స్త్రీలలోపల, మహిమన్ = మహత్వమునందున, ఇట్టివార లుఁగలరె = ఇటువంటివార లుండిరా (అనఁగా నీయటువంటి వారు లేరనుట) ని ధాత్రీ జనన్యామలకీ వసుమత్యుప మాతృషు, అనివిశ్వము

టీక. సారంగ॥ భావింపఁగన్ = ఎంచఁగా, కృపఁగనఁగల తావండి = ఇది దయన్ వహింపఁగలిగినట్టి స్థానముండి, అనుజ్ఞనిడి = కృతినిఁగైకొందునని యాజ్ఞనిచ్చి, ముదంబొనరింపం గావలెన్ = సంతోషింపగా జేయవలయును ధాత్రీ రమణులలోన్ = భూనాయకులలోపల, వెదకినన్ = విచారించి చూచినను, మహిమన్ = గొప్పతనము నందున ఇట్టివారలుఁ గలరె = నీవంటివారలున్నారా, (లేరనుట)

గీ॥ యతిగణంబుల విధిఁ గూర్చి • ధృతి నలరఁగఁ
జేసి యిటఁ జేరితిన్ దయ • సేయు మన్న
నెలమి నాపక్వ కృతి నిర్వ • హించి తేని
ప్రౌఢి మదిని నినున్ బహు • ప్రస్తుతింతు 22

టీక శివ॥ విధిన్‌గూర్చి = బ్రహ్మనుగురించి, యతిగణంబులన్ = ఋషిసమూహములను, ధృతిన్ = యజ్ఞమందున, అలరఁగఁ జేసి = ప్రకాశింపఁగా నొనర్చి (అనఁగా యజ్ఞస్థానమునకుఁ దీసికొని వచ్చి నిల్పియనుట) ఇటఁజేరితిన్ = ఇచ్చటికి వచ్చి నాఁడను, అన్న = ఓయన్నా, (అనఁగా శంకరా యనుట) దయసేయుము = యజ్ఞస్థానమునకుపొమ్ము, ఎలమిన్ = ప్రేమతో, అ పక్వ కృతిన్ = అ పరిపాకమైన కార్యమును, (అనఁగా యజ్ఞ కార్యముననుట) నిర్వహించితేని = నెఱవేర్చితివేని, ప్రౌఢిన్ = నేర్పుతో, మదిని = హృదయమునందున, బహుప్రస్తుతింతున్ = మిక్కిలి స్తోత్రము సేయుదును. ని ధృతి ర్యోగాంతరే ధైర్యే ధారణోధ్వర తుష్టిషు, అని విశ్వము

టీక. చంద్ర॥ యతిగణంబుల విధిన్ = ముని సమూహముల రీతిగా, ధృతిన్ = సంతోషముతో, అలరఁగజేసి = ఈ రాతి చిఱు సెనగలు ప్రకాశించునట్లుగా నొనరించి, కూర్చి = ప్రోవుఁజేసి, ఇటన్‌జేరితిన్ = ఇచటికి వచ్చినాఁడను అన్న = అన్ను + అ, అన్న, అన్ను, (అనఁగా స్త్రీ, ఉకారాంత ప్రథమైక వచనంబులు సంబోధనమున అకారాంతములుగా మారుట యాంధ్రమున సహజమని గ్రహించునది, ఉదాహరణము, తోఁడు, తోఁడా, జోదు, జోదా ఇత్యాదులు, అన్న = ఓమగువా, దయసేయుము = కనికరింపుము, ఎలమిన్ = ఒప్పునట్లుగా, ఆపక్వకృతిన్ = గుగ్గిళ్ళ కార్యమును, నిర్వహించి తేని, నేఱవేర్చితివేని, ప్రౌఢిమన్ = నేర్పుతో, తిని = భక్షించి, నినున్ బహు ప్రస్తుతింతున్ = నిన్ను మిక్కిలి స్తుతించెదను. ని॥ ఆపక్వంపౌః రభ్యూషః, అనియమరము,

టీక॥ సారంగ॥ యతిగణంబులన్ = యతులను గణములను; విధిన్ = క్రమముగా, కూర్చి = సమకూర్చి, ధృతిన్ = సంతోషముతో, అలరగన్ = ప్రకాశించు నట్లు, చేసి = రచియించి, ఇటన్ జేరితి = ఇచ్చటికి వచ్చితిని, అన్న = ఓయన్నా (అనఁగా నో రాజనరేంద్రా యనుట) దయసేయుము = కనికరింపుము, ఎలమిన్ = మనోహరమగునట్లుగా, నా వక్ర్యకృతిని = నా పరిపాకమైన ప్రబంధమును, నిర్వహించితేని = ఖరియించెదవేని, ప్రౌఢిన్ = నేర్పుతో, మదిఁ = హృదయమునందు, నినున్ బహు ప్రస్తుతింతున్ = నిన్ను విశేషముగాఁ గొనియాడుదును.

క॥ అని బహువిధముల వేఁడం
గను భట్టారకునిఁ గాంచి • కడువేగమ నీ
యనుమతిని వత్తునని వడ
సెనగలు రసపాత్రముఁగని • చేర్చెఁ గరుణమై. 23

టీక॥ శివ॥ . వేఁడంగను = ఇట్లని యనేక విధములుగా ప్రార్థింపఁగా, భట్టారకునిగాంచి = బ్రహ్మదరినుండి దూతగావచ్చిన నిర్జరుని జూచి, కడువేగమ = మిక్కిలి శీఘ్రముగానే, నీ యనుమతిని వత్తును = నీ యిష్టప్రకారము వచ్చెదను, అని=ఇట్లు పలుకుచు, అగలున్ = గంధనమును వడసెన్ = తీసికొనియెను, అనఁగా శుభకార్యములకు పిలువవచ్చినవారు చందనాదులు తీసికొని వచ్చుట సహజము, రసపాత్రము గని = ఆ దూత యొక్క యనురాగ యోగ్యతను జూచి, కరుణన్ = ప్రేమముతో, మైన్ =శరీరమునందున, చేర్చెన్ = పూసెను, లేక ప్రేమతో పంపెను, ని భట్టారక స్సురే రాజ్ఞి కథితశ్చ తపోధనే అని విశ్వము.

టీక॥ చంద్ర॥ అని గను = ఇట్లని యనేక విధములుగా వేఁడుకొనఁగా, భట్టారకునిఁగాంచి = తపోధనుడైన నారదునిఁ గనుఁగొని కడువేగమ = మిక్కిలి శీఘ్రముగానే, నీ యనుమతిని వత్తునని

నీ యిష్టప్రకారము ప్రవర్తింతు నటంచు, వడన్=కాకయందు, రసపాత్రముఁ గని = నీటి పాత్రమును వహించి, సెనగలు = రాళ్ళసెనగలను, కరుణమై= ప్రేమముతో, చేర్చెన్ = పెట్టెను, ని ఇలే శరీరధాతౌచ తిక్తాదౌ పారదే రస, అని యమర శేషము

టీక॥ సారంగ॥ అని. . . గను = ఇట్లని యనేక రీతులఁ బ్రార్థింపఁగా, భట్టారకునిఁగాంచి = నన్నయభట్టారకునిఁజూచి, కడు వేగమ = మిక్కిలి శీఘ్రముగానే, నీ యనుమతిని వత్తునని = నీయిష్టప్రకారము నడుచుకొందు నటంచు, వడసెఁ = ఆ కృతిని స్వీకరించెను, లేక, నగలు = భూషణములు, వడసెఁ = గైకొనియెను, రసపాత్రముఁ గని = ఆ నన్నయ భట్టారకుని విశేషమైన యోగ్యతను గాంచి, కరుణఁ = ప్రేమముతో, మైన్ = ఆ కవియొక్క శరీరమునందున, చేర్చెన్ = ధరింపజేసెను, అనఁగా నన్నయ భట్టారకుని యోగ్యతను జూచి కంఠీలు నొంటీలు చంద్రహారములు మొదలైన భూషణముల బహూకృతిఁజేసి ధరింప నొనర్చెనని తాత్పర్యము. ని, గుణే రాగే ద్రవేరసః, అని యమరము, ని. పాత్రంతు భాజనే యోగ్యే, అని విశ్వము.

గీ॥ చేర్చి తదభీష్టమును నెఱ • వేర్చ నెంచి
యందు నుండియుఁ దా దివ్య • మౌని రూఢిఁ
బనుచు వాక్పతి దగు మహా • స్థానమును న
లంకరించి ప్రజాపతి • వంకఁ జూచి 24

టీక. శివ॥ చేర్చి = బ్రహ్మ దూతను స్వస్థానముఁ జేరునట్లొనర్చి, తదభీష్ట . ... నెంచి = వానియొక్క కోరిక నెఱవేరఁజేయుటకుఁ దలఁచి, తాన్ = శంకరుఁడు, దివ్యమౌ = మనోజ్ఞమైన, నిరూఢిన్ = నేర్పుతోడ, అందు నుండియు = ఆ కైలాసముననుండి, చనుచు = పోయెడివాఁడై, వాక్పతిది = బ్రహ్మదేవునిది, అగు = బనట్టి, మహాస్థానమును నలంకరించి= ఘనతరమైన స్థలమునకుఁ జేరినవాఁడై, ప్రజాపతి వంకన్ = బ్రహ్మదేవుని వైపు, చూచి = కాంచినవాఁడై, ముందరి పద్యముతో నన్వయము.

టీక॥ చంద్ర॥ చేర్చి = అనసూయాదేవి సెనగలు ప్రోయిమీదఁబెట్టి, తదభీష్టమును నెఱవేర్పన్ = అనారదుని యభిలాషమును సిద్ధింపఁజేయఁగా, ఎంచి = ఆ నారదుఁడు స్తోత్రముఁజేసినవాఁడై, తాదివ్యమౌని = దేవర్షియైనతాను, రూఢిఁజనుచు = ప్రసిద్ధిగా నేగుచు, వాక్పతి నలంకరించి = బ్రహ్మవైపునకు జూచి బ్రహ్మ పట్టణమును ప్రవేశించినవాఁడై, ప్రజాపతివంకఁ జూచి = బ్రహ్మవైపునకుఁ జూచి

టీక॥ సారంగ॥ చేర్చి = రాజనరేంద్రుఁడిట్లు భూషణముల నన్నయభట్టు మేనఁ జేర్చినవాఁడై, తదభీష్టమును నెఱవేర్పన్ = ఆ నన్నయభట్టు కోర్కెను సిద్ధించునట్లుఁ జేయఁగా, ఎంచి = ననయభట్టు రాజును స్తోత్రము జేసి, అందునుండియున్ = ఆ రాజమహేంద్రములోనే యుండి, తా = ఆ నన్నయభట్టు, దివ్యమౌ = మనోజ్ఞమైన, నిరూఢిన్ = నేర్పుతో, చనుచున్ = ఒప్పును, వాక్పతిదగు = విద్వాంసునిదైనట్టి మహాస్థానము నలంకరించి = అధికతరమైన యాస్థానమునుఁ బ్రకాశింపఁజేసి, అనఁగా నాస్థానపండితుఁడుగాఁ జేరుకొనియనుట ప్రజాపతివంకఁ జూచి = జనవల్లభుఁడైన రాజనరేంద్రుని దిక్కుఁ బాఱఁజూచి.

క॥ జే సత్యావాలా జే
జే సుమనో జ్యేష్ఠ విబుధ • సేవితభవనా
జే సదమ లాబ్జ జాతా
జే సూర్య సమప్రకాశ • జే లోకేశా ॥ 25

టీక శివ॥ జే = నమస్కారము, సత్యావాలా = సత్యలోకమే పాదుగాఁ గలవాఁడా, జేజే = వందనము, సుమనోజ్యేష్ఠ = దేవతలలో పెద్దయైనవాఁడా, విబుధ = దేవతలచేత, సేవిత = కొలువఁబడిన, భవనా = గృహముగలవాఁడా, జే = నమస్కారము, సదమల = మిగుల శుద్ధమైన, అబ్జజాతా = పద్మమునందు పుట్టినవాఁడా, జే = వందనము, సూర్య సమప్రకాశ = ప్రొద్దుకు సాటియగు నెఱ్ఱని కాంతిగలవాఁడా, జే = దండము, లోకేశా = లోకేశ నామముగల యో బ్రహ్మదేవా,

టీక చం్రద॥ పైదానికి సమము

టీక. సారంగ॥ జే = జయము, సత్యావాలా = యథార్థమే పాదుగాఁ గలవాఁడా, జేజే = జయము జయము, సుమనోజ్యేష్ఠ = సుగుణ వంతులలో శ్రేష్ఠుఁడవైన వాఁడా, విబుధ = పండితులచేత, సేవిత = సేవింపఁబడిన, భవనా = గృహముఁగలవాఁడా, జే = జయము, సదమల = పరిశుద్ధమైన, అబ్జజాతా = చంద్రవంశము గలవాఁడా, జే = జయము, సూర్య కాళ = రవిసమాన = తేజముగలవాఁడా, జే = జయము, లోకేశా = జననాయకా.

వ॥ అని యిట్లుగ్గడింపుచుఁ దదాస్థానంబునం దా సుకృతి ధూర్జటి వెలసె నంత నాదండి లోకేశు ప్రేరణంబున. 26

టీక శివ॥ అని యిట్లుగ్గడింపుచుణా = అని యీ ప్రకారముగా బ్రహ్మనుఁ గూర్చి శంకరుఁడు పలుక నారంభించుచు, తదాస్థానంబునందు = ఆ బ్రహ్మయొక్క యాస్థానమున, ఆ సుకృతి ధూర్జటి = ఆ పుణ్యవంతుఁడగు శంకరుఁడు, వెలసెన్ = ప్రకాశించెను, అంతన్ = తదుపరిని, ఆ దండి లోకేశు ప్రేరణంబునన్ = ఆ దొడ్డవాఁడైన బ్రహ్మదేవుని ప్రోత్సాహము వలన.

టీక చంద్ర. అ . పుచు = ఇట్లని బ్రహ్మనుగూర్చి నారదుఁడు పల్కుచు, తదాస్థానంబునందు = బ్రహ్మయొక్క సన్నిధానమునందున, ఆ సుకృతి ధూర్జటి వెలసెన్ = ఆ పుణ్యవంతుఁడైన భారనుగు జటలుగల నారదుఁడు ప్రకాశించెను, అంతన్ = అటుమీదట, ఆ దండి లోకేశు ప్రేరణంబునన్ = ఆ మునిజన శ్రేష్ఠుని ప్రోత్సాహము వలన, అనఁగా నంతకు ముందే నారదుఁ డీ క్రిందఁ జెప్పఁబోవు వారలకు ప్రోత్సహించెనని గ్రహించునది.

టీక, సారంగ. అని . . పుచు = ఇట్లని రాజనరేంద్రుని గూర్చి

నన్నుయఖట్టు పలుకుచు, తదాస్థానంబునందు = ఆ రాజనరేంద్రుని సంస్థానములో, ఆ సుకృతి ధూర్జటి వెలసెన్ = ఆ శ్రేష్ఠుఁడైన కవీశ్వరుఁడు ప్రకాశించెను, అంతన్ = అటుపిమ్మట, ఆదండి లోకేశు ప్రేరణంబునన్ = ఆ మహారాజుయొక్క ప్రోత్సాహమువలన

క॥ ఆ లోకేశు కడకు మం
త్రాలోచన దక్షుఁ డంబు • జాక్షుఁడు శివుఁ డు
ద్వేల మతిమంతుఁ డఁట ధృతి
నాలోకించుటకునై ర • యంబున రాఁగాన్ 27

టీక శివ ఆ లోకేశు కడకు = ఆ బ్రహ్మయొద్దకు, మంత్రాలోచనన్ = వేద మంత్రములయొక్క యాలోచనతో, అనఁగా గాయత్ర్యాది మంత్రములు జపించుచు ననుట, దక్షుఁడు = దక్షప్రజాపతి, అంబుజాక్షుఁడున్ = కమలములవంటి కన్నులు గలవాఁడును, శివుఁడు = శుభుఁడును, ఉద్వేలమతిమంతుఁడఁట = అధికమైన బుద్ధిమంతుఁడంట, ధృతిన్ = యజ్ఞమును, ఆలోకించుటకునై = దర్శించుటకొఱకై, రయంబున రాఁగాన్ = శీఘ్రముగా వచ్చియుండఁగా

టీక చంద్ర ఆ లోకేశు కడకు = ఆ బ్రహ్మదేవుని యొద్దకు, మంత్రాలోచన దక్షుఁడంబుజాక్షుఁడున్ = రహస్యాలోచనమునందు నేర్పరియైన విష్ణుమూర్తియును, శివుఁ డుద్వేలమతిమంతుఁడఁట = శంకరుఁడనే యధికతరమైన బుద్ధిమంతుడంట, ధృతిన్ = సంతోషముతో, ఆలోకించుటకునై = చూచుటకొఱకై, రయంబున రాఁగాన్ = శీఘ్రముగా వచ్చియుండగా

టీక సారంగ ఆలోకేశు కడకు = ఆ రాజనరేంద్రుఁడనే జననాథుని యొద్దకు, మంత్రాలోచన దక్షుఁడున్ = రహస్యాలోచనమందు సమర్థుఁడును, అంబుజాక్షుఁడున్ = పద్మముల వంటి కన్నులు గలవాఁడును, శివుఁడు = శుభుఁడును, ఉద్వేల = అధికుఁడైన, మతిమంతుఁడఁట = మతిమంతుఁడను

నాపము గల మంత్రియింట, ఆలోకించుటకున్నై = దర్శించుటకోఱకున్నై, రయంబున రాఁగాన్ = శీఘ్రముగా వచ్చియుండగా

గీ॥ తత్ప్రజాపతి ముఖులు ము • దంబు లొంది
జే యనుచు నర్ఘకృత్యముల్ • జేసి లోక
శుభము లడిగిన లోకేశుఁ • జూచి ధృతి ని
యోగి దక్షుఁ డిటులఁ బల్కె • నుజ్వలముగ 28

టీక॥ శివ తత్ప్రజాపతి ముఖులు = ఆబ్రహ్మదేవుఁడు మొదలైన వారలు, ముదంబు లొంది = సంతోషముల నొందినవారై, జే యనుచున్ = నమస్కారమని వచింపుచు, అర్ఘకృత్యముల్ చేసి - అర్ఘ్యపాద్యా ద్యుప చారము లొనరించి, లోక శుభములడిగినన్ = లోకక్షేమము లడిగినంతనే లోకేశుఁజూచి = బ్రహ్మదేవునిఁ గాంచినవాఁడై, ధృతినియోగి = యజ్ఞము నకు నుపయోగము గలిగిన, దక్షుఁడు = దక్షప్రజాపతి, ఉజ్వలముగ = ప్రకాశించునట్లుగా, ఇటుఁ బల్కెన్ = ఈ క్రింది విధమున వచించెను

టీక॥ చంద్ర, తత్ప్రజా . లొంది = ఆబ్రహ్మ మొదలైన వారలు సంతసములఁ జెందినవారై, జే యనుచున్ = నమస్కార మటంచు వచింపుచు, అర్ఘ జేసి = అర్ఘ్యపాద్యాద్యుపచారము లొసరించి, లోక
గినన్ = లోక క్షేమములు ప్రశ్నించి నంతట, లోకేశుఁ జూచి = బ్రహ్మను కనుఁగొని, ధృతిని = ధైర్యముతో, ఉజ్వలముగన్ = ప్రకాశించు నట్లుగా, యోగిదక్షుఁడు = తాపసులలో నేర్పరియైన నారదుఁడు, ఇటు పల్కెన్ = ఈ క్రింది విధముగా వచియించెను

టీక॥ సారంగ, తత్ప్రజా లొంది = అజసపతి మొదలైన వారలు సంతసములఁ జెందిన వారలై, జే యనుచున్ = జయమని వచియిం పుచు, అర్ఘ జేసి = ఆమంత్రికిఁ దగినపను లొనరించి, లోక
గినన్ = లోక క్షేమములను గురించి ప్రశ్నించినంతట, లోకేశుఁ

జూచి = రాజనరేంద్రుని గనుఁగొని, ధృతిన్ = సంతోషముతో, నియోగి దక్షుఁడు = మంత్రులలో నేర్పరి యైన మతిమంతుడు, ఉజ్వలముగన్ = ప్రకాశించు నట్లుగా, ఇటుబల్కెన్ = ఈక్రింది విధముగా వచించెను

క॥ ఎక్కడ నేని జగంబుల
నిక్కముగా రాజమౌళి, నిన్ బోలుచు నే
డొక్కఁడుఁ గలఁడా సముదుఁడు
చక్కఁగఁ గనుఁగొన మహాత్రి, జగదభి నంద్యా. 29

టీక॥ శివ మహాత్రి జగదభినంద్యా = ఘనతరమైన మూడు లోకములచేతఁ గొనియాడఁ బడిన ఓ బ్రహ్మ దేవా చక్కఁగఁ గనుఁగొనన్, = ఒప్పుగాఁ జూచినట్లయిన, జగంబులన్ = లోకములలో, ఎక్కడనేని = ఎందైనను, నిక్కముగాన్ = వాస్తవముగా, సముదుఁడు = గర్వముతోఁ గూడినవాఁడు, రాజమౌళినిన్ బోలుచున్ = చంద్రశేఖరుఁడగు శివునకు దీటగుచు, నేడు = ఇప్పుడు, ఒక్కఁడు గలఁడా = ఒక్కఁడైన నున్నాడా (లేదనుట) అనఁగా శంకరుఁడు గర్విష్ఠుడని బ్రహ్మతో దక్షుఁ డనియెనని తాత్పర్యము

టీక చంద్ర జగదభినంద్యా = లోకములచేతఁ గొనియాడఁ బడెడు నో బ్రహ్మదేవా, చక్కఁగఁ గనుఁగొనన్ = ఒప్పుగాఁ జూచినట్లైన, జగంబులన్ = లోకముల యందున, ఎక్కడనేని = ఎందేనియు, నిక్కముగాన్ = వాస్తవముగా, రాజమౌళినిన్ బోలుచు = చంద్రశేఖరుఁడగు శివునకు దీటగుచు, నేడు = ఇప్పుడు, ఒక్కఁడుఁ గలఁడు = ఒక్కఁడు మాత్ర మున్నాడు, ఆ సముదుఁడు = ఆ సంతోషయుక్తుఁడు, మహాఽత్రి = ఘనుఁడైన యత్రిముని యను నాతఁడు, ని॥ మదో రేతసి కస్తూర్యాం గర్వే హర్షేభ దానయోః, అని విశ్వము.

టీక సారంగ మహా త్రిజగ దభినంద్యా = ఘనతరమైన మూడు లోకములచేతఁ గొనియాడఁబడెడు వాఁడా, చక్కఁగఁ గనుఁగొ

నన్ = ఒప్పుగాఁ జూచినట్లైతే, జగములన్ = లోకముల యందున, ఎక్కడ నేని = ఎందేనియును, నిక్కముగాన్ = వాస్తవముగా, రాజమౌళి = ఓ రాజశ్రేష్ఠుఁడా, నిన్ బోలుచున్ = నీతో సాటియగుచు, సముదుఁడు = సంతోష యుక్తుఁడు, నేడు = ఇప్పుడు, ఒకక్కఁడుఁ గలఁడా = ఒక్కఁడైన నున్నాడా, (లే దనుట)

గీ॥ తెలియఁ గన్నాకు నీవేగి • దేశ మెల్లఁ
జూమి విమర్శనఁ జేయన • జోగి యొకఁడుఁ
గాక యెల్లరు నతులుగాఁ • గ్రాలు చుండి
నారు తత్క్షేత్ర మేను గ • న్న యది వినవె. 80

టీక శివ తెలియఁగన్ = ఎఱుకపడఁగా, నీవేగి = నీవు చని దేశమెల్లన్ = ప్రదేశమంతయును, విమర్శనన్ = పరామర్శముతో, చుమి = చూడుమి, నాకు = నన్నుఁ గూర్చి, జే యనన్ = నమస్కారమనుటకు, జోగి యొకండుగాక = ఆ భిక్షుకుఁడైన శంకరుఁ డొక్కరుఁడు తప్ప, ఎల్లరున్ = అందరును, నతులుగాన్ = వంగిన వారలుగా, క్రాలుచుండి నారు = ప్రకాశింపు చున్నారు, తత్ = ఆ శంకరుని యొక్క, క్షేత్రము = భార్య, ఏనుఁగన్న యది = నేను కనినది [అనఁగా నా శంకరుని భార్యయగు సతీదేవి నా కూతురనుట) వినవే = వింటువే కదా, ని. క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థాన కళత్రయోః, అని విశ్వము.

టీక. చంద్ర. తెలియఁగ = ఎఱుక పడఁగా, సీవేగి = నీవరిగిన వాఁ డవై, దేశమెల్లన్ = ప్రదేశ మంతయును, విమర్శనన్ — పరామర్శతో, చుమి = చూడుమి, నాకు = నన్ను గుఱించి, జే యనన్ = జయమని దీవించుటకు, జోగి యొకండు గాక = ఈయత్రియను యోగియొక్కఁడు తప్ప, ఎల్లరున్ = అందరును, నతులుగాఁ గ్రాలు చుండినారు = వంగిన వారుగా వర్తింపు చున్నారు, అనఁగా నత్రి మహర్షి యొక్కఁడు తప్పగాని తదితరులు నాకు లోకువయే యనుట, తత్ = ఆయత్రిమహర్షి యొక్క, క్షేత్రము = భార్యయగు ననసూయాదేవి, ఏను గన్నయది = నేను దర్శించి

నదియే, వినవే = ఆకర్ణింపఁగదవే,

టీక సారంగ, తెలియన్ = ఊహింపఁగా, కన్నాకు = శ్రేష్ఠుఁడు, నీ = నీయొక్క, వేగిదేశమెల్లన్ = వేగిరాజ్యము నంతయును, చుమి = చూడుమి, (అనఁగా రాజనరేంద్రుఁడేలు నా రాజ్యము వేగి దేశమని ప్రసిద్ధము), విమర్శనఁ జేయన = పరామర్శనము జేయనే. (అనఁగా వేగిదేశమును పరామర్శఁ జేయుచునే యున్నాననుట) జోగి యొకఁడుఁగాక = ఒకఁడైనను భిక్షగాఁడు గాక, అనఁగా నందఱు 'ధనికులే' యనుట, ఎల్లరున్ = అందరును, నతులుగాఁ గ్రాలుచుండినారు, మనకు 'లోఁబడి వర్తింపుచున్నారు, తత్ = ఆవేగిదేశ సంబంధమైన, క్షేత్రము = పుణ్య భూమి, ఏనుఁగన్న యది వినవే = నేను విహరించి చూచినదియే యని విందువేకదా!

గీ॥ లోక రమణుల యందఱి ◆ లోన నరయ
నెందు నీబోటి దొర వేఱె ◆ యెఱుఁగ నంచుఁ
బొగడి శివ లోపములుఁ దెల్పఁ ◆ బూని తనదు
చేతనైనవి దృష్టముఁ ◆ జేసె నహహ ।31

టీక శివ, లోకరమణుల యందఱిలోనన్ = భువననాయకులయింత మందిలో, అరయన్ = విచారింపఁగా, ఎందున్ = ఎచ్చటను, 'నీబోటి దొర = నీవంటి ప్రభువు, వేఱె = ఇతరముగా, ఎఱుఁగ నటంచుఁ బొగడి = నేరనని స్తోత్రము జేసి, శివలోపములు దెల్పఁ బూని = శంకరుని యొక్క లోపముల నెఱిఁగించుటకు నుద్యమించి, తనదుచేతనైనవి = ఆశంకరునిచే నైన యపచారములను, అహహ = ఆశ్చర్యము, దృష్టముఁ జేసెన్ = బ్రహ్మను కనుఁగొనున ట్లొనర్చెను, అనఁగా శంకరుఁడు దక్షునిఁ జూచి లేవకుండుట నమస్కరింపకుండుట యర్ఘ్యపాద్యాది విధులఁ బూనింపకుండుట మొదలైనవి యనుట

టీక. చంద్ర లోక = భూవలయమునందలి, రమణులయందఱిలోనన్ = స్త్రీల యంతమంది యందును, అరయన్ = విచారింపఁగా, ఎందున్ =

ఎచ్చోటను, ఈఁబోటి = ఈతొయ్యలికి, దొర = సమానము, వేరే = ఇతర ముగా, ఎఱుఁగనంచుఁ బొగడి = నేరనని యనసూయాదేవిని స్తోత్రముఁజేసి, శివలోపములుఁ దెల్పఁబూని = శుభముయొక్క మెఱుగుపాటుల నెఱిఁగింప నుద్యమించి (అనఁగా నారదుఁడు తెలుపంబూనుకొన్న శుభమును వెల్లడించుట కనుట) తనదు చేతనైనవి = ఆ యనసూయాదేవిచే తయారైనవాటిని, (అనఁగా గుగ్గిళ్లనుట) అహహ = ఆశ్చర్యము, దృష్టముఁజేసెన్ = కనుఁగొను నట్లొర్చెను.

టీక. సారంగ॥ లోకరమణుల . . .పొగడి = జననాయకు లందరితో విచారింపగా నెచ్చటను నీవంటి ప్రభువును వేరేచూడలేదని మతిమంతుడను మంత్రి రాజనరేంద్రునిఁ గూర్చి స్తోత్రముఁజేసి, శివ = శుభమును, లోపములను = హైన్యములను (అనఁగా దేశమందెక్కడ శుభముగా నుండెనో యెక్కడ లోపముగా నుండెనో యనునవి), తెలుపఁబూని = ఎఱిఁగించ నుద్యమించి, తనదు చేతనైనవి = తనయొక్క చేతిగుండా నెఱవేర్చిన కార్యములను అహహ = ఆశ్చర్యము, దృష్టముఁజేసెన్ = లిఖితరూపమైన కాగితముల మూలకముగా కనుఁగొనునట్లొనరించెను.

గీ॥ సొరిది నా బ్రహ్మజాతి ద • క్షుఁ డిటువలెను
గోపతికి నల విభున కా • శ్రీపతికిని
వారి బోటుల కెదనాటు • తీరుఁ దెలిపి
పని ముగియఁగనె సెలవంది • యనికి కేగె 32

టీక శివ॥ ఆబ్రహ్మజాతి దక్షుఁడు = ఆ బ్రహ్మసంతతివాఁడైన దక్ష ప్రజాపతి, ఇటువలెను = ఈవిధముగా, గోపతికిని = స్వర్గనాథుఁడైన యింద్రునకును, అల విభునకున్ = ఆ బ్రహ్మకును, ఆ శ్రీపతికిని = ఆ విష్ణు మూర్తికిని, వారిబోటుల కెదనాటు తీరుఁదెలిపి = వారలవంటి ప్రముఖులకు హృదయమునందు పాదుకొను విధముగా నెఱుఁగఁజేసి, సొరిదిన = క్రమ

ముగా, పనిముగియఁగనే = యజ్ఞకార్యము సమాప్తము కావడముతోడనే, సెలవంది = అజ్ఞను తీసికొని, ఉనికి కేఁగెన్ = తన నిలయమునకుఁ బోయెను.

టీక చంద్ర॥ ఆ బ్రహ్మజాతి దక్షుడు = ఆ బ్రహ్మ కుమారులలో నేర్పరియైన నారదుఁడు, ఇటువలెను = ఈరీతిగా, గోపతికిని = వాగ్వల్లభుఁడైన బ్రహ్మకును, అల విభునకున్ = ఆ శివునకును, ని విభుశ్శివేప్రభౌనిత్యే, అని విశ్వము, శ్రీపతికిని = ఆ విష్ణువునకును, సొరిదిన్ = క్రమముగా, వారిబోటుల కెదనాటు తీరుఁదెలిపి = వారలయొక్క కులాంగనలైన సరస్వతీ పార్వతీ శ్రీలకు హృదయములో పాదుకొను విధమున నెఱిఁగింపఁజేసి, పని ముగియఁగనె = తానువచ్చిన కార్యము నెఱవేరడముతోడనే, సెలవంది = అజ్ఞనుఁ గైకొని, ఉనికి కేగెన్ = తన యునికిపట్టున కరిగెను

టీక సారంగ॥ ఆ బ్రహ్మజాతి దక్షుఁడు = ఆ బ్రాహ్మణులలో నేర్పరియైన మతిమంతుఁడనే మంత్రిపుంగవుఁడు, ఇటువలెను = ఈవిధముగా, గోపతికిని = భూనాయకునకును, అల విభునకున్ = ఆ ప్రభువునకును, ఆ శ్రీపతికిని = ఆ సంపద్వరునకును (అనఁగా రాజనరేంద్రున కనుట), ని శ్రీపతిః క్ష్మాపతౌహరౌ, అనివిశ్వము వారిబోటుల దెలిపి = ఆ ప్రభువులవారి వంటి ముఖ్యులయొక్క చిత్తములకు విశదమగునట్లు నెఱిగించి, (అనఁగా సామంతరాజులు రాజబంధువులు మొదలయిన వారికనుట - గౌరవనీయులైన ప్రభువులకు వారని బహువచనము వాడుట సుప్రసిద్ధమని గ్రహించునది) పని ముగియగనె = రాజకీయ కార్యములు చక్కపడడముతోడనే, సొరిదిన్ = క్రమముగా, సెలవంది = సెలవుదీసుకొని, ఉనికికేగెన్ = ఇంటికిఁబోయెను.

వ॥ అంత నొకనాఁడు 33

టీక సుగమము, మూడింట సమానము

సీ॥ అల ప్రజాపతి యమ్మ • హాఁ త్రిలోకైక సం
స్తుతఁడాద్విజన్మ దక్షుఁ డెదలోన

పరదీక్షచేతను ♦ భవహీనరీతిఁ ద
లఁచి ప్రౌఢిమహిమ ని ♦ లయమె ముఖ్య
మనుచుఁ దపంబందు ♦ ననసూయ నెనసి యు
దార సంగతి బుధ ♦ తతి గణింప
హిత ముహూర్తమున స ♦ ర్వేశ్వర ప్రీతిగా
ధృతి నొనరింపు చు ♦ న్నతతి నటకుఁ

గీ॥ జాకచక్యంబు మీఱఁ బ్ర ♦ జాపతీంద్రు
క్షేత్రమునుఁ దన్మహత్వ మం ♦ చితముగఁ గనఁ
బూనివచ్చిరి లోకేశ ♦ పుణ్యజనప
బంధు పురుషోత్తములు ♦ విప్రభావములను 34

టీక శివ॥ అట్రప్రజాపతి = ఆ ప్రజాపతి కోటిలోఁ జేరినవాఁడును, అమ్మహా = ఆయధిక తరమైన, త్రిలోక = ముజ్జగములచేత, ఏక ముఖ్యముగా, సంస్తుతుఁడు = మిక్కిలి కొనియాడఁ బడెడువాఁడును, అ ద్విజన్మదక్షుఁడు = ఆ బ్రాహ్మణుడైన దక్షుఁడను వాఁడు, ఎదలోనఁగా = హృదయమందున, భవహీన రీతిఁదలఁచి = ఈశ్వరుఁడు లేకుండునట్టి విధము నూహించి (అనగా శంకరునిఁ బిలుపకుండు నట్లనుట), తపంబందునఁగా = వేసవియందున, అసూయ నెనసియుఁగా = ఓర్వలేనితనము నొందియు, దారసంగతిఁగా = భార్యా సమేతముగా, హితముహూర్తమునఁగా = శుభ లగ్నమందున, సర్వేశ్వర ప్రీతిగాఁగా = సమస్తలోకపాలురకు ప్రీతియగు నట్లుగా, పర = శ్రేష్ఠమైన, దీక్ష = యజ్ఞాది క్రియారంభమందుఁ బూనిన యాచారనియమముయొక్క, చేఁతను = కృత్యమునందున, ప్రౌఢి మహిమఁగా = తన నేర్పుయొక్క గొప్పతనముచేత, నిలయమె ముఖ్యమనుచుఁగా = గృహమే ప్రధానమైనదటంచు, బుధతతిగణింపఁగా = దేవతాసముదాయము స్తోత్రముసేయుఁగా, ధృతిఁగా = యుత్సాహమును, ఒనరింపుచున్నతతిఁగా = చేయు చుండిన సమయమునందున, అటకుఁగా = ఆ స్థలమునకు, విప్రభావములను = మిక్కిలి ప్రభావములతోడ, జాకచక్యంబు మీఱఁగా = చర చకాయిమాన ..ల

శయించఁగా ప్రజాపతీంద్రు క్షేత్రమును = ప్రజాపతి శ్రేష్ఠుఁడయిన దక్షుని
యొక్క యజ్ఞభూమిని, తత్ = అతనియొక్క, మహత్వమున్ = గొప్ప
తనమును, అంచితముగన్ = ఒప్పునట్లుగా, కనన్ = చూచుకొఱకు,
లోకేశ = బ్రహ్మయును, పుణ్యజనప = నైరృతియును, లేక, కుబేరుడును,
ని భవేత్పుణ్య జనోయక్షే రాక్షసే సజ్జనేపిచ, అని విశ్వము, బంధు = చుట్ట
ములును, పురుషోత్తమ = విష్ణుమూర్తియును, పూనివచ్చిరి = యత్న
ముతో వచ్చేసిరి (అనఁగా నాహ్వానింపఁగా వచ్చినారనుట) శ్లో॥ మరీచిరత్రి
రంగిరాః పులస్త్యః పులహః క్రతుః వశిష్ఠో వామదేవశ్చ దక్షో నవవిరించయః॥
అనుటచే దక్షుఁడును, అత్రియును, నవబ్రహ్మలలో చేరినవారని గ్రహించునది.

టీ. చంద్ర॥ అత్రిప్రజాపతి = ఆ ప్రజాపతి కోటిలోఁ జేరినవాఁడు
ను, అమ్మహాఽత్రి = ఆయధికుఁడైన యత్రి యనువాఁడును, లోక =
భువనములచేత, ఏక = ముఖ్యముగా, సంస్తుతుఁడు = మిక్కిలి కొని
యాడఁబడెడువాఁడును, ఆ ద్విజన్మదక్షుఁడు = ఆ బ్రాహ్మణులలో నేర్పరి
యైనవాఁడు, ఎదలోనన్ = హృదయమందున, తనుభవహీన = సంతా
నములేని, రీతిన్ = తెఱంగును, తలఁచి = చింతించి, వరదీక్షచే =
వరముకొఱకూనిన యాచార నియమముతో, ఉదార = అధికతర
మయిన, సంగతిన్ = జ్ఞానము చేత, బుధతతిగణింపన్ = దేవతా
సముదయము స్తోత్రము సేయుచుండగా, ప్రౌఢిమన్ = నేర్పుతో, హిమనిల
యమె ముఖ్యమనుచు = హిమవత్పర్వతమే ప్రాధాన్యమటంచు, అన
సూయ నెనసి = అనసూయాదేవి యుక్తముగా, హితముహూర్తము
నన్ = శుభలగ్నమునందున, సర్వేశ్వర ప్రీతిగాన్ = విశ్వేశ్వరునకు
ప్రీతియగునట్లుగా, తపంబునన్ = తపస్సును, అందున్ = ఆ హిమ
వత్పర్వతమందున, ధృతిన్ = సంతోషముతో, ఒనరింపుచున్న తఱిన్ =
చెయుచున్న సమయమునందున, అటకు = అహిమవన్నగమునకు, చాక
చక్యంబుమీఱన్ = చకచకాయమాన మతిశయిల్లునట్లుగా, ప్రజా
పతీంద్రు = ఆ ప్రజాపతులలో శ్రేష్ఠుఁడగు నత్రియొక్క, క్షేత్ర
మున్ = భార్యను (అనగాఁ ననసూయ ననుట) తత్ = ఆయమ

యొక్క, మహత్వమున్ = గొప్పతనమును, అంచితముగన్ = ఒప్పు నట్లుగా, కనన్ = చూచుటకు, లోకేశ = బ్రహ్మయును, పుణ్యజనప బంధు = యక్షపాలుఁడగు కుబేరునకు మిత్రుఁడైన శంకరుఁడును, పురుషోత్తముఁడు = విష్ణుమూర్తియును (అనఁగా త్రిమూర్తులనుట), విప్ర = బ్రాహ్మణులవంటి, భావములను = పద్ధతులను, పూని = వహించి, వచ్చిరి = ఏగుదెంచిరి, (అనగా త్రిమూర్తులు, బ్రాహ్మణ వేషములూని యనసూయాదేవి పరీక్షార్థము వచ్చిరని తాత్పర్యము )

టీక సారంగ॥ అల ప్రజాపతి = ఆ జననాయకుఁడును, అమ్మహా = అయధికతరమైన, త్రిలోక = ముజ్జగములచేత, ఏక = ముఖ్యముగా, సంస్తుతుఁడున్ = మిక్కిలి కొనియాడఁబడెడువాఁడును, ఆ ద్విజన్మదక్షుఁడున్ = ఆ క్షత్రియులలో నేర్పరియైనవాఁడును, (అనఁగా రాజనరేంద్రుఁడనుట) ఎదలోనన్ = హృదయమునందున, తనుభవహీన = సంతానము లేని, రీతిన్ = తెఱంగును, తలచి = చింతించి, వరదీక్షచే = వరము కోఱకూనిన యాచార నియమముతో, తపంబందున్ = మాఘమాసమునందున, అనసూయన్ = అసూయారహితమును, ఎనసి = పొందినవాఁడై, ఉదార సంగతిన్ = త్యాగయుక్తముగా, హితముహూర్తమునన్ = శుభలగ్నము నందున, సర్వేశ్వర ప్రీతిగాన్=విశ్వేశ్వరునకు ప్రీతియగునట్లుగా, ప్రౌఢి మహిమన్=నేర్పుయొక్క గొప్పతనముచేత, నిలయమె ముఖ్యమనుచున్=గృహమే ప్రాధాన్యమటంచు, బుధతతిగణింపన్ = పండితసముదాయము పొగడునట్లుగా ధృతిన్ = ఇష్టిని (పుత్రకామేష్టిననుట), ఒనరింపుచున్నతరిన్ = చేయుచున్న సమయమందున, అటకున్ = అచ్చోటికి, విప్రభావములను = మిక్కిలి ప్రభావముతోడ, వి॥ ఉపసర్గగా గ్రహించునది, చారచక్యంబుమీఱన్ చకచకాయమాన మతిశయిల్లుచుండఁగా, ప్రజాపతీంద్రుక్షేత్రమును = రాజనరేంద్రుని పుత్రకామేష్టి సంబంధమైన పుణ్యస్థలమును, తత్ = ఆతనియొక్క, మహత్వమున్ = గొప్పతనమును, అంచితముగన్ = ఒప్పునట్లుగా, కనన్ = చూచుటకు, లోకేశ = జననాయకులును, ని. లోకస్తు భువనేజనే, అని

విశ్వము, పుణ్యజనప = పుణ్యాత్ములలో శ్రేష్ఠులైనవారును, బంధు = చుట్ట ములయందున, పురుషోత్తములున్ = పురుష శ్రేష్ఠులును, పూనివచ్చిరి = యత్నములతో విచ్చేసిరి (అనగా నాహ్వానించఁగా వచ్చినారనుట)

క॥ వచ్చిన వారలఁ గనుఁగొని
హెచ్చగు మర్యాద లిడియు • మృష్టాన్నంబుల్
బుచ్చుకొనుఁడనిన వారలు
మచ్చికతోఁ దత్సురుచి ర • మణి కని రిటులన్ 35

టీక శివ॥ వచ్చిన ... గొని = విచ్చేసినట్టి బంధుమిత్రాదులనుఁ జూచి, హెచ్చగు మర్యాద లిడియున్ = అధికతరమైన మర్యాదలుఁ జేసి, మృష్టాన్నంబుల్ = పరిపక్వమైన యన్నములను, పుచ్చుకొనుఁడనినన్ = పరిగ్రహించుఁడని పల్కఁగా, వారలు = ఆవచ్చినవారు, మచ్చికతోన్ = అనక్తిచేత, తత్ = ఆయొక్క, సురుచిరమణికి = సత్కాంతియందు రత్న ప్రాయుడైన దక్షునకు, ఇటులన్ = ఈక్రిందఁజెప్పఁబోవు విధముగా, అనిరి = వచియించిరి.

టీక చంద్ర వచ్చినవారలఁ గనుఁగొని = ఆ విచ్చేసిన త్రిమూర్తు లనుఁజూచి, తతిమ్మా విషయము సమానము తత్ = ఆయొక్క, సురుచి = మంచికాంతిగల, రమణికి = భామినికి, (అనఁగా ననసూయాదేవితో ననుట.) అని రిటులన్ = త్రిమూర్తు లీవిధముగాఁ బల్కిరి.

టీక సారంగ॥ శివకథకు సమానము, తత్సురుచిరమణి కనిరిటు లన్ = ఆ మంచికాంతియందు రత్నప్రాయుఁడైన రాజనరేంద్రున కీవిధ ముగా బల్కిరి, యని మార్చుకొనవలయును

క॥ నెమ్మనమునను హితవుగను
మమ్మా మోదంబు తోడ • మనిచియుఁ గృపఁ జే

కొమ్మా మేముని కన్యా
యమ్మా తినసోమ రహిత • మౌఁగానిమ్మా 36

టీక. శివ॥ నెమ్మనమునను = హృదయమందున, హితవుగను = మనోజ్ఞమగునట్లుగా, మమ్ము = మమ్ములను, ఆమోదంబుతోడఁ = మిక్కిలి సంతోషముతోడ, మనిచియున్ = వృద్ధిఁ బొందించియును, కృపన్ = కరుణ చేత, చేకొమ్మా = గైకొనుమా, మేమునిఁకన్ = ఇంకను మేము, న్యాయమ్మా తినన్ = భోంచేయుట ధర్మమా, సోమరహితమౌన్ = ఈశ్వరుఁడు లేకుండ నాయెను, కాన్ = అట్లునెయుండఁగా, ఇమ్మా = యుక్తమా (అనఁగా దక్ష యాగమునకు వచ్చిన వారలు శంకరుఁడు లేనిది భోంచేయుట యుక్తముగాదని దక్షునితో తమ సందేహమునుఁ దెల్పిరని తాత్పర్యము)

టీక. చంద్ర॥ నెమ్మనమునను = హృదయమందున, హితవున్ = మంచిని, కనుమమ్మా = చూడుము తల్లీ, మోదంబుతోడమనిచియు = సంతోషముతో మమ్ముఁ బోషించి, జే = జయము, కొమ్మా ఓవెలదీ, మునికన్యా = ఓ మునిభామినీ, అమ్మా - ఓతల్లీ, తినన్ = భోంచేసినట్లైతే, మే = శరీరము యొక్క, సోమ = శ్రమము, రహితమౌన్ = నశించును కాన్ = అట్లగు విధముగా, ఇమ్మా ఒసంగుమా, అనఁగా భోంచేయఁ బెట్టుమాయని యనసూయా దేవితో త్రిమూర్తులుఁ బల్కిరని తాత్పర్యము

టీక. సారంగ॥ సోమరహితమౌన్ = సోమపానముఁ జేయుటకు లేదు గావున, కానిమ్మా = పుత్రకామేష్టి సంబంధమైన క్రియలు జరిగించుమా, తతిమ్మావిషయము శివకథకు సమానము.

గీ॥ కాంత దయగలదేని య • నంతరమున
నన్నతృప్తులఁ జేయనౌ • ననిన మంతు
చేత వారలపై వారిఁ జిలుకె నోలి
విప్రభావులు పెద్దలు • పిన్నలైరి. 37

టీక. శివ॥ కాంత = ఓ ప్రభువా, దయగలదేని = కరుణయుండి నట్లైతే, అనంతరమునన్ = తరువాత, అన్నతృప్తులఁ జేయనౌననినన్ = అన్నమువలనఁ దృప్తిఁ జెందువారలనుగా నొనర్చఁదగునటంచు వచింపఁగా అనఁగా నీశ్వరుఁడు లేనిది భోజనముఁ జేయుట యుక్తముగాదనిన వారలు పిమ్మట భోంచేతు మనుటతో, మంతుచేతన్ = మంత్రముతో, వారలపైన్ = ఆ వచ్చిన బంధుమి తాదులమీద, వారిన్ = ఉదకమును, చిలికెన్ = చిలుక రించెను, ఓలిన్ = క్రమముగా, పెద్దలు పిన్నలున్ = వృద్ధులును బాలురును లేక గౌరవాగౌరవస్థులును, విప్రభావులు = మిక్కిలి ప్రభావములుగలవారు, ఐరి = అయ్యిండిరి.

టీక చంద్ర॥ కాంత = ఓ యనసూయాదేవి, దయగలదేని = మా యందు నీకు ప్రేమయున్నట్లైతే, అనంతరమునన్ = అంతరము లేకుండా, అనఁగా వస్త్రము లేకుండా ననుట, ని అంతరః పరిధానీయ స్వీయ బాహ్యేషు వాచ్యవత్, అని రత్నమాల అన్నతృప్తులఁ జేయనౌ ననినన్ = అన్నముబెట్టి సంతృప్తి పరుపనొప్పుననఁగా, మంతు చేతన్ = మంత్రముతోడ, వారలపై వారిఁ జిలికెన్ = ఆ త్రిమూర్తుల మీద నుదకమును జిలుకరించెను, ఓలిన్ = క్రమముగా, విప్రభావులు = బ్రాహ్మణ పద్ధతిగలవారలు, (అనఁగా బ్రాహ్మణ వేషధారులై వచ్చినత్రిమూర్తు లనుట) పెద్దలు = పెద్దవారలైన వీరలు, పిన్నలైరి = పసిబాలకులైరి

టీక నారంగ॥ కాంత = ఓ ప్రభువా, దయగల దేని = మాయందు నీకు ప్రేమయున్నచో, అనంతరమునన్ = అటుపిమ్మట, అనఁగా వీరలు పుత్రకామేష్ట్యంత్య దివసమున వచ్చిన వారలగుటవలన తాము సోమపానముఁ జేసిన మీదట, అన్నతృప్తులఁ జేయనౌననినన్ = మమ్ము నన్నమువలనఁ దృప్తిజెందింపవచ్చునని పల్కఁగా, మంతు = రాజు, చేతన్ = హస్తము తోడ, వారిపైవారిఁ జిలికెన్ = వారలమీఁద నుదకమునుఁ జిలుకరించెను, ఓలిన్ = క్రమముగా, పెద్దలు పిన్నలున్ = పెద్దవారలును చిన్నవారలును, విప్రభావులు = మిక్కిలి ప్రభావముఁ గలవారలు, ఐరి = అయ్యిండిరి

క॥ ఈవార్తనెల్ల మునుకొని
ప్రోవౌగతిదివ్యమౌని ♦ రూఢివలననెం
తోవిశదముగానెఱిఁగియు
శ్రీవాగీశ్వరులునిష్టి, ♦ జేరిరి సరవిన్ 38

టీక. శివ॥ ఈవార్తనెల్లన్ = ఈ సమాచారమంతయును, మును కొని = ముందుగనే, ప్రోవౌగతిన్ = సంపూర్ణమైన విధముగాఁ దివ్యమౌ = శుభమైనట్టి, నిరూఢివలనన్ = నేర్పువలన, ఎంతోవిశదముగాన్ = మిక్కిలి తేట తెల్లముగా, ఎఱిఁగియున్=తెలుసుకొని, శ్రీ=శోభాయుక్తమగు, వాగీశ్వ రులు = కవీశ్వరులు, సరవిన్ = క్రమముగా, ఇష్టిన్ = యజ్ఞమందునఁ చేరిరి = చేరుకొనిరి.

టీక. చంద్ర॥ ఈవార్తనెల్లన్ = ఈ సమాచార మంతయును, మును కొని = ముందుగనే, ప్రోవౌగతిన్ = సవిస్తరముగా, దివ్యమౌని = దేవర్షి యైననారదుని యొక్క, రూఢివలనన్ = ప్రసిద్ధివలన, ఎంతోవిశదముగాన్= మిక్కిలి విశద మగునట్లుగా, ఎఱిఁగియున్ = తెలుసుకొని, శ్రీ = లక్ష్మీదేవి యును, వాక్ = సరస్వతీదేవియును, ఈశ్వరి = పార్వతీదేవియును, సర విన్ = క్రమముగా, ఇష్టిన్ = కోరికతో, చేరిరి = ప్రవేశించిరి.

టీక. సారంగ॥ శివచరిత్రమునకు సమానము

గీ॥ చేరియోయప్పనీకు జే ♦ జేలుకొనుమ
నీదుశాసనములుదప్పు ♦ నేయెవరికి
బాలకులరీతిఁగాంచి మా ♦ పతులదయన
మనుచుచున్నాపుత్రికలమ ♦ మ్మనసమబుద్ధి 39

టీక. శివ॥ చేరి = ఇట్లుచేరుకొన్న వారలై, ఓయప్ప = ఓయయ్యా, నీకు జేజేకొనుమ = నీకునమస్కారములుఁ జేయుచున్నాము గైకొనుము లేక జయములగును దీవనలు గైకొనుము, ఎవరికిన్ = ఎవ్వరికేనియు, నీదు

శాసనములుఁ దప్పనే = నీయొక్క యొడంబడిక తప్పునా (అనగా తప్పదనుట), మాప = విష్ణువునకు, తుల = సమానమైన, దయన = కరుణతో, మమ్మ = మమ్ములను, అసమబుద్ధిన్ = సమానరహితమైన బుద్ధిచేత, శ్రితులన్ = ఆశ్రితులను, బాలకుల రీతిగాంచి = బిడ్డలవిధముగాఁజూచి, మనుచుచున్నావు = పోషింపుచుండినావు

టీక చంద్ర॥ చెరి = ఇట్టుఁ జేరుకొన్న వారలై, ఓయప్ప = ఓ యతా, నీకు జేజేలుకొనుము = నమస్కారముఁ గైకొనుము, ఎవరికిన్ = ఎవ్వారికైనను, నీదు శాసనములుఁ దప్పునే = నీయొక్క శిక్షలు దప్పునా (అనఁగా దప్పవనుట), మాపతులన్ = మాభర్తలను, (అనఁగా త్రిమూర్తుల ననుట) బాలకుల రీతిఁగాంచి = పసిపాపలనుగా వహించి, శ్రితులన్ = ఆశ్రితులను, దయన = కరుణతో, మనుచుచున్నావు = పోషింపుచుండినావు, ముందరిపద్యముతో నన్వయము

టీక. సారంగ॥ శివచరిత్రమునకు సమానము

క ॥ చూవే యనదల మగు మముఁ
బ్రోవవె యన్యులను వేడఁ • బోము గడకమై
ఈవే వరభిక్షమును
నీవేకద యిట్లుఁజేసి • నెగడుట లన్నా 40

టీక శివ॥ చూవే = చూడవే, అనదలమగుమమున్ = అల్పులమైన మమ్మును, ప్రోవవే = పోషించవే, కడకమై = యత్నముతో, అన్యులనువేడఁ బోము = ఇతరులను మఱెవ్వరిని స్తోత్రము సేయనేగము, వర = కోరినటువంటి, భిక్షమ్మును = తిరిపెమును, ఈవే = ఒసంగవే, అన్నా = ఓయన్నా, ఇట్లుఁజేసి నెగడుటలు = ఈ విధముగా యజ్ఞమునొనరించి బయలు మెఱయుటలు, నీవేకద = తామేకద (అనఁగా నిట్టి ఘనకార్యమునుఁ జేసి ప్రఖ్యాతికి వచ్చినవార లింకెవ్వరు గలరనుట )

టీక చం ద॥ చూవె = ఇటు చూడగదవె, అసదలమగు = అనాథల మైనట్టి, మమ్ముఁబ్రోవవె = మమ్ములను రక్షింపవె, కదకమై = యత్న ముతో, అన్యులను వేడఁబోము = ఇతరులను ప్రార్థింపనేగము, వరభిక్షమ్మును = పతిభిక్షమును, ఈవే = ఒసంగవే, అన్నా = ఓకొమ్మా, ఇట్లుజేసి నెగడుటలు = ఈ విధముగా నొనరించి బయలు మెఱయుటలు, నీవేకద = తామే కాదా, అనఁగా త్రిమూర్తులను బాలకులుగాఁ జేసిన వారలింకెవ్వరు లేరనుట

టీక సారంగ॥ శివచరిత్రమునకు సమానము

క॥ నావుఁడుఁ దద్వినుతులకున్
భావం బలరారి వారి ♦ పతులదయన్ జె
న్నొం విధమునిష్టి ముదమును
గావింప నపూర్వ రౌప్య ♦ కలితులఁ జేసెన్ 41

టీక శివ॥ నావుడున్ = ఇట్లనగా, తత్ = వారలయొక్క, వినుతులకున్ = స్తోత్రములకు, భావంబు = చిత్తము, అలరారి = ప్రకాశించి, వారిప = సముద్రునితో, తుల = సమానమైన, దయఁజ = కరుణచేత, చెన్నొంవిధము = ఒప్పైనరీతిగా, ఇష్టిఁజ = యజ్ఞమునందున, ముదముఁజ గావింపఁజ = సంతోషము గలుగఁజేయుటకు, అపూర్వ = అరుదైనట్టి, రౌప్య = రూపా యీలతో, కలితుల = కూడుకొనబడినవారనిగా, చేసెఁజ = ఒనరించెను.

టీక చంద్ర॥ నావుడుఁజ = ఇట్లనఁగా, తత్ = ఆ లక్ష్మీపార్వతీ సరస్వతులయొక్క, వినుతులకుఁజ = స్తోత్రములకు, భావంబు = చిత్తము, అలరారి = విలసిల్లి, వారి = వారలయొక్క, పతులఁజ = భర్తలైన హరిహర బ్రహ్మలను, దయఁజ = కరుణతో, చెన్నొంవిధము = ఒప్పైనరీతిగా, ఇష్టిఁజ = కోర్కెను, ముదముఁ గావింపఁజ = సంతోష మొనరించుటకే, పూర్వ = తొలుతటియొక్క, రౌప్య= రూపసంబంధముతో, కలితులన్ = కూడుకొన్న వారినిఁగా, చేసెన్ = ఒనరించెను

టీక సారంగ॥ శివచరిత్రమునకు సమానము

గీ॥ చేయఁగా నవ్విబుధ మణుల్ ♦ చిత్తములు ర
హింపఁ గొన్న స్వరూప మ ♦ హిత యశమున
కబ్బురముఁ జెంది యోయప్ప ♦ యాదరించి
నావు లేకున్న మా హైన్య ♦ మే విధిఁజను. 42

టీక శివ॥ చేయఁగాన్ = ఇట్లొనరింపఁగా, అవ్విబుధమణుల్ = ఆ పండితశ్రేష్ఠులు, చిత్తములు = హృదయములు, రహింపఁగ = ఒప్పునట్లుగా, కొన్న = బడసిన, స్వరు = వజ్రాయుధమునకు, ఉపమ = సమానమయిన తెల్లనగు, మహిత = గురుతరమైనట్టి, యశమునకు = ఆయజ్ఞకర్తయొక్క కీర్తికి, అబ్బురముఁ జెంది = ఆశ్చర్యమును వహించి, ఓయప్ప = ఓయయ్యా, ఆదరించినావు = సన్మానముఁ జేసినాడవు, లేకున్నన్ = అట్లుఁగాకున్నచో, మా హైన్యము = మాయొక్క లేమిడి, ఏవిధిఁజనున =ఏవిధముగఁ బోవును.

టీక చంద్ర॥ చేయఁగా నవి = ఇట్లొనర్పఁగా నివ్వినవారలై, బుధమణుల్ = దేవతాశ్రేష్ఠులు (అనగాఁ త్రిమూర్తులనుట) చిత్తములు రహింపఁగ = హృదయము లొప్పునట్లుగా, కొన్న = తాము బడసినటువంటి, స్వరూప = తమ రూపములయొక్క, మహిత = గొప్పతనముఁగల, యశమునకుఁగ = కీర్తికి, అబ్బురముఁజెంది = ఆశ్చర్యమును పొంది, ఓ యప్ప = ఓ యక్కా, ఆదరించినావు = ఆదరణచేసినావు, లేకున్నఁగ = అట్లుఁగాకున్నచో, మా హైన్యము = మాయొక్క హీనస్థితి (అనగా మా బాల్యతనమనుట) ఏ విధి జనుఁగ = ఏ రీతిగాఁ బోవును

టీక. సారంగ॥ శివచరిత్రమునకు సమానము

గీ॥ ఇపుడు మీ పదూవరులుఁ బ ♦ రేశునకు మ
హాప్రియంబుగ పరనంద ♦ నాప్తి నిష్టి

సువ్రతులునై యెసంగుటఁ • దీవ్రముగనె
కొమరులనుఁ గాంత్రుమా శివాం • శములఁ గొమ్మ 43

టీక శివ॥ ఇపుడు = ఈ సమయ మందున, మీ వధూవరులు = మీరు భార్యాభర్తలు, పరేశునకున్ = పరమేశ్వరునకు, మహాప్రియంబుగన్ = అధికతరమైన మనోహరముగా, లేక, మహా = ఘనతరమైన, ఆప్రియంబుగన్ = నిరోధముగా ననియు నశ్లీలముఁ దోచుచున్నది, వర=శ్రేష్ఠమైన, నందన = సంతోషము యొక్క, ఆప్తిన్ = కలిమిచేత, ఇష్టి = యజ్ఞ సంబంధమైన, సువ్రతులునై, = సమీచీన మగు వ్రతము గలవారలై, ఎసంగుటన్ = అతిశయిల్లుటచేత, తీవ్రముగనే = శీఘ్రముగనే, కొమరులనుఁ గాంత్రుమా = మనోజ్ఞములను బడయుదురు బళీ, శివాంశములఁ గొమ్మ = శుభాంశములు గైకొనుము,

టీక. చంద్ర॥ ఇపుడు = ఈ సమయమందున, మీ వధూవరులు = మీరు భార్యాభర్తలు, పరేశునకున్ = పరమేశ్వరునకు, మహాప్రియంబుగన్ = మిక్కిలి మనోహరముగా, వర నందనాప్తిన్ = (శ్రేష్ఠులైన కుమారుల కలిమి యందు, అనఁగా సంతానము కావలయుననియనుట) ఇష్టిన్ = కోర్కెచేత, సువ్రతులునై యెసంగుటన్ = సమీచీనమైన వ్రతముగలవారలై యతిశయించుట వలన, తీవ్రముగనే = శీఘ్రముగనే, కొమ్మ = ఓ వెలఁదీ, మా శివాంశములన్ = మాయొక్క శుభములైన యంశముల చేత, కొమరులనుగాంత్రు = కొడుకులను బడయుదురు

టీక సారంగ॥ ఇపుడు=ఇప్పుడు, మీవధూవరులున్ = మీభార్యాభర్త లిర్వురును, పరేశునకున్ = పరమేశ్వరునకు, మహాప్రియంబుగన్ = మిక్కిలి ప్రియము గలుగునట్లుగా, వరనందనాప్తిన్ = శ్రేష్ఠులైనకుమారుల కొఱకైన యాసక్తిచేత (అనఁగా సంతానము కావలయుననియనుట), ఇష్టిన్ = పుత్రకామేష్టియందున, సువ్రతులునై యెసంగుటన్ = సమీచీనమైన యాచారముఁగలవారలై యతిశయిల్లుటవలన, తీవ్రముగనే = శీఘ్రముగానె, శివాంశ

ములన్ = ఈశ్వరాంశములచేత, కొమరులను గాంత్రు = మా కొమారులను బడయుదురు బళీ, కొమ్మ = కొనుమా

మ॥ అనుచున్నంత సదాశ్రమంబునయి యొ ♦ ప్పాభోగధామాంతరం
బునవోర్తార్యవరున్ గనుంగొనియు నో ♦ పుణ్యాత్మకానందనే
ష్టినిధీదక్ష వరవ్రతాఢ్య తను వీ ♦ క్షింపంగ బల్ వేడు కా
యెన నాహూయమెయ్యెనఁగాన్కలిడి యెం ♦ తే సత్కృతుల్ గాం
చెదన్. 44

టీక శివ॥ అనుచున్నంతన్ = ఇట్లనిపల్కుచున్న తర్వాత, సదా నిరంతరమును, అశ్రమంబునయి = శ్రమరహితమైనదియై, ఒప్పు = తగుచున్నట్టి, ఆభోగ ధామాంత రంబునన్ = ఆభోగమనే సదనమధ్యమున, ఓర్తు = ఒకతెయగు, ఆర్య = సతీదేవి, వరున్ గనుంగొనియున్ = భర్తయైన శంకరునిఁజూచి, ఓపుణ్యాత్మకా = ఓయి పుణ్యమూర్తి, నందనేష్టినిధీ = సంతోషాభీష్టములకు స్థానభూతుఁడవైనవాఁడా, దక్ష = దక్షుఁడనే మాతండ్రియొక్క, వరవ్రతాఢ్యతను = యజ్ఞసంబంధమైన సమాచారము నందలి యాధిక్యమును, వీక్షింపంగన్ = దర్శించుటకుగాను, బల్ వేడు కాయెను = మిక్కిలి కుతూహలము గల్గినది, అనాహూయమెయ్యెనన్ = పిలువకపోయి నప్పటికిని, కాన్కలిడి = దక్షిణలు సమర్పించి, ఎంతే సత్కృతుల్ గాంచెదన్ = మిక్కిలి సత్కారముల్ బడయఁగలదానను.

టీక చంద్ర॥ అనుచున్నంతన్ = ఇట్లని పల్కుచుండఁగనే, సత్ = శ్రేష్ఠమై, ఆశ్రమంబునయియొప్పు = మునికుటీరమై యొప్పునట్టి, ఆభోగ ధామాంతరంబునన్ = అసుఖతరమైన స్థలమధ్యమున, ఓర్తు = ఒకతెయగు, ఆర్య = పదియాతేండ్లచేడియ, వరున్గనుఁగొనియు = భర్తనుఁజూచి, పుణ్యాత్మకా = ఓయి పుణ్యమూర్తీ, నందనేష్టిని = సంతానకాంక్షతోఁడ, ధీదక్ష = బుద్ధినైపుణ్యముఁగల, వరవ్రత = పతివ్రతయొక్క, ఆఢ్యతను = ఆధిక్యమును (అనఁగా ననసూయయొక్క ఘనతననుట), వీక్షింపంగన్ = దర్శించుటకుగాను, బల్ వేడుకాయెను = మిక్కిలి కుతూహలముఁ గల్గినది,

అనాహూయమెయ్యెనన్ — పిలువకపోయినప్పటికిని, కాన్కలిడి = దక్షిణలు సమర్పించి, ఎంతే సత్కృతుల్‌గాంచెదన్ = మిక్కిలి సత్కారములు బడయ గలదానను

టీక సాఠంగ॥ అనుచున్నంతన్ = ఇట్లనిపల్కుచుండఁగా, సదా = నిరంతరమును, అశ్రమంబునయి = శ్రమరహితమగునట్టిదియై, ఒప్పు = తగునట్టి, అభోగ ధామాంతరంబునన్ = అసుఖతరమైన ప్రదేశమధ్యమున (అనఁగా రాజమహేంద్రముననసుట), ఓర్తు = ఒకతెయగు, ఆర్య = పదియాతేండ్లచేడియ, వరున్‌గనుంగొనియు = భర్తనుఁ జూచి, ఓపుణ్యాత్మకా = ఓయి పుణ్యమూర్తి, సందనేష్టినిన్ = పుత్రకామేష్టినిని, ధీదక్ష = బుద్ధినైపుణ్యముఁగల, పర — ప్రభువుయొక్క (అనఁగా రాజనరేంద్రునియొక్కయనుట) వ్రతాఢ్యతను = ఆచారసంపత్తిని, వీక్షింపంగన్ = చూడఁగా, బల్ వేడుకాయెను = మిక్కిలిసంతోషమాయెను, అనాహూయమెయ్యెనన్ = పిలువకపోయినప్పటికిని, కాన్కలిడి = దక్షిణలు సమర్పించి, ఎంతేసత్కృతుల్ గాంచెదన్ - మిక్కిలి సత్కారములుఁ బడయఁగలదానను

గీ॥ నాథ చెలులరుగుచునుండి • నారు గాన
నాగురుస్థానమునకు నే • నేగుదెంతు
ననియు నంగీకరింప నం • తనాగెఁ గాన్క
లారతులుఁ గొనిపోయెనా • యన్నుమిన్న 45

టీక శివ॥ నాగురుస్థానమునకున్ = నాతండ్రి యింటికి, అనియును తతిమ్మారెంటను, ఆగురుస్థానమునకున్ = ఆఘనమైన స్థలమునకు ననియు, అంగీకరింపని + అంతన్ అని శివకథకును, అంగీకరింపన్ + అంతన్ అని తతిమ్మారెంటను, మిగత మూడిఁట సమము, సుగమము

క॥ పోయి యటఁవోడి కన్నెల
సియమ గలిసియు నివాళు • లిచ్చుచు జేయు

ప్స్వాయన నరిష్ట వచనము
లాయెదఁ దాబల్కియిడె మ • హాగౌరవముల్ 46

టీక శివ॥ జేయప్స్వాయనన్ = నమస్కారము నాయనా యని ప ల్కఁగా, తాన్ = ఆదక్షుడు, ఆయెదన్ = ఆసమయము నందున, అరిష్ట వచనములు = అశుభవాక్యములు, పల్కి = వచియించి, మహా = అధిక మైన, అగౌరవముల్ = అమర్యాదలు, ఇడెన్ = ఒసంగెను, తతిమ్మా విషయము సుగమము

టీక చంద్ర॥ జేయప్స్వాయనన్ = నమస్కారమయ్యా యని పలుకగా ననియును = సారంగధర కథకు, నమస్కారముకా యని పలుకగా ననియును, తాన్ = ఆ యనసూయాదేవి యని యును, ఆరాజనరేంద్రుఁ డనియును, అరిష్ట వచనములు = శుభవాక్యములు, పల్కి = వచియించి, మహాగౌరవముల్ = అధికతరమైన సన్మానములు, ఇడెన్ = ఒసంగెను, అని రెంటసమానము, తతిమ్మా విషయము సుగమము, ని అరిష్టేతు శుభాశుభే, అని యమరము.

క ॥ చెలి యిటు నానాగౌరవ
ముల నెనయుచుఁ బతి యనుజ్ఞ • మున్ దాటియు ని
ట్టుల వచ్చినందులకుఁ దగు
ఫల మనుభవ మాయెననుచుఁ • బరిపరి గతులన్ 47

టీక శివ॥ చెలియిటు = సతీదేవి యీవిధముగా, నానా = అనేకము లైన, అగౌరవముల నెనయుచున్ = అమర్యాదలను పొందుచును, పతి యను జ్ఞన్ = భర్తయైన శంకరుని యాజ్ఞను, మున్ = మొదటను, దాటి యున్ = అతిక్రమించియు, ఇట్టుల వచ్చినందులకున్ = ఇచ్చోటి కరుదెంచి నందులకు, తగుఫల మనుభవమాయుననుచున్ = తగినఫలితమును పొంద నాయెనటంచు, పరిపరి గతులన్ = అనేక విధములుగా, ముందరిపద్యముతో నన్వయము

టీక చంద్ర॥ చెలియిటులన్ = ఆచేడియ యీ విధముగా, నానా - అనేకములైన, గౌరవముల నెసియుచున్ = మర్యాదలను పొందుచును, మున్ = మొదట, పతియనుజ్ఞన్ = భర్త యాజ్ఞప్రకారము, దాటియున్ = బయలుదేఱి, ఇట్టులవచ్చి నందులకున్ = ఈస్థానమునకు వచ్చినందులకు, తగు ఫలమనుభవ మాయెననుచున్ = తగినట్టి లాభమును పొందనాయె నటంచు, పరిపరిగతులన్ = అనేక విధములుగా.

టీక. సారంగ॥ చంద్రకథకు సమానము

క॥ కొంతతడ వెడద నవ్విధ
మంతయుఁ జింతించి శుచి క • రార్పణముగ న
త్యంతాత్మ త్యాగముఁ ద
త్కాంతామణి సూపె నపుడు • గాన్కల తోడన్ 48

టీక శివ॥ కొంతతడవు = కొంతసేపు, ఎడదన్ = హృదయము నందున, అవ్విధమంతయున్ = ఆవిషయమంతయును, చింతించి = చింత జేసి, శుచి = అగ్నియొక్క, కర = కిరణములకు, అర్పణముగన్ = అప్పనమగునట్లుగా, అత్యంత = అధికమైన, ఆత్మత్యాగమున్ = ప్రాణత్యాగ మును, తత్కాంతామణి = ఆ నారీరత్నము (అనఁగా సతీదేవియనుట) అప్పుడు = ఆసమయమందున, కాన్కలతోడన్ = దక్షిణలతో సహా, చూపెన్ = కనపరిచెను అనఁగా నచటఁ జరిగిన యమర్యాదలకు సతీదేవి యగ్ని కిరణములకుఁ దన ప్రాణము లర్పించెనని తాత్పర్యము.

టీక. చంద్ర॥ కొంతతడవు = కొంతసేపు, ఎడదన్ = హృదయము నందున, అవ్విధమంతయున్ = ఆరీతినంతయును, చింతించి = యోచించి, శుచికర = పవిత్రకరయైన యనసూయాదేవికి, అర్పణముగన్ = అప్పన మగునట్లుగా, అత్యంత = అధికతరమైన, ఆత్మ = తనయొక్క, త్యాగమున్= తెంపును, తత్కాంతామణి = ఆకాన్కలుఁ దెచ్చిన నారీరత్నము, అపుడు =

ఆసమయమునందుని, కాన్కలతోఁడన్ = కానుకల మూలకముగా, చూపెన్ = కనుపడునట్లుఁ జేసెను

టీక సారంగ॥ శుచికర =పవిత్రకరుఁడైన రాజనరేంద్రునకు, అర్పణముగన్ = అర్పనమగునట్లుగా, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము. ని శుచిర్నాశుక్రశృంగార చంద్రాషాఢ హారాగ్నిషు అయంతు శ్వేత గుణిని శుద్ధేఽనుపహతేత్రిషు, అనియును, ఆత్మాయత్న ధృతిస్వాంత స్వభావపర మాత్మసు జీవబుద్ధి శరీరేషు, అనియును నానార్థ రత్నమాల.

వ॥ ఇట్లుఁ జూపి చనినఁ దదనుచరాళులెదుర్కొని మహాహవము నంగీకరించి యా ప్రజాపతికి నట్లొనరించు పిమ్మట 49

టీక ఇట్లుఁ జూపి = ఈ విధముగా సతీదేవి ప్రాణత్యాగముఁ గనుఁగొనునట్లుఁ జేసి, చనినన్ = నశింపఁగా, తత్ = ఆ సతీదేవియొక్క, అనుచరాళులు = వెంబడివచ్చినవారల సమూహములు, (అనఁగా పరివారమనుట), ఎదుర్కొని = ఎదురించినవారలై, మహా = అధికతరమైన, ఆహవమున్ = యుద్ధమును, అంగీకరించి = సమ్మతించి, ఆ ప్రజాపతికిన్ = ఆదక్ష ప్రజాపతికి, అట్లొనరించు పిమ్మటన్ = అవిధముగా యుద్ధముఁ జేయుచున్న మీదట

టీక చంద్ర॥ ఇట్లుఁ జూపి = ఈవిధముగాఁ దన త్యాగమునుఁ గనుగొను నట్లొనర్చి, చనినన్ = వెళ్ళఁగా, తత్ = ఆ కాన్కలుఁ దెచ్చిన చెడియయొక్క, అనుచర = వెంబడివచ్చినట్టి, అళులు = చెలికత్తియలు, మహా = ఘనమైన, హవమున = పిలుపును, అంగీకరించి = సమ్మతించి, ఎదుర్కొని = ఎదురుగాఁబోయి, ఆ ప్రజాపతికిన్ = ఆ యత్రియను ప్రజాపతికిని, అట్లొనరించు పిమ్మటన్ = అవిధముగాఁ గాన్కలిడుచున్న మీదట, అనఁగా ననసూయకు వలెనేయనుట

టీక సారంగ॥ ఆ ప్రజాపతికిన్ = ఆ రాజనరేంద్ర నృపాలునకు, అట్లొనరించు పిమ్మటన = ఆపైవారలెట్లో యటులనే కాన్కల నిచ్చు తరువాత, తతిమ్మావిషయము చంద్రకథకు సమానము ని హవో యజ్ఞే తథాహ్వానే అని విశ్వము.

మ॥ కరిభిత్ప్రాభవుఁడా శివాప్రియుఁడు జో • కన్ ముంగలన్ మేటియై
స్థిరబుద్ధిన్ బొడసూపి హెచ్చయిన యా • జిన్మన్యునన్ గాంచివా
విరిమిమ్మున్ గడతేర్తు నంచుఁదనయం • ప్తిన్ గూర్చివాక్రుచ్చుచున్
సరవిన్ వారలకృత్యముల్ నిలుపఁగా • శాసించుచున్ దాఁజనెన్ 50

టీక శివ॥ కరిభిత్ = సింహమువంటి, ప్రాభవుఁడు = పరాక్రమ శాలియైన, అశివ = అశంకరునకు, అప్రియుఁడు = శత్రుఁడగు దక్షుఁడు, జోకన్ = యుక్తముగా, ముంగలన్ = యుద్ధమునకు ముఖస్థానమునందున, మేటియై = మొనగాఁడై, స్థిరబుద్ధిన్ = చలించని హృదయముతో, పొడసూపి = కనుపట్టి, హెచ్చయిన = అధికమైనట్టి, ఆజిన్ = యుద్ధమును, మన్యునన్ = యజ్ఞమునందు, లేక క్రోధముతో, కాంచి = చూచి, వావిరిన్ = ఉత్కర్షముతో మిమ్మున్ = మిమ్ముల, కడతేర్తునంచున్ = హతముఁజేతు నటంచు, తన = తనయొక్క, అప్తిన్ గూర్చి = కలిమిని గురించి, వాక్రుచ్చుచున్ = పల్కుచు, సరవిన్ = వరుసగా, వారలకృత్యముల్ = అసతీదేవి యనుచరుల చేష్టలు (అనఁగా యుద్ధమనుట), నిలుపఁగాన్ = ఆపునట్లుగాగా, శాసించుచున్ = శిక్షింపుచు, తాన్ - అదక్షుఁడు, చనెన్ = ఒప్పెను, ని మన్యుః క్రోధే క్రతౌ దైన్యే, అనియును, శాసనం రాజదత్తోర్వ్యాం లేఖాజ్ఞాశాస్త్రశాస్తిషు, అనియును విశ్వము.

టీక చంద్ర॥ కరిభిత్ = సింహమువంటి, ప్రాభవుఁడు = పరాక్రమశాలి యగు, లేక గజాసుర సంహారకుడైన పరాక్రమశాలి యగు, అ శివాప్రియుఁడు = అ పార్వతీ మనోహరుడు, ని. శివాభవానీ, రుద్రాణి, అని యమరము, జోకన్ = యుక్తముగా, ముంగలన్ = ఎదురుగా, మేటియై = శ్రేష్ఠుఁడై, స్థిరబుద్ధిన్ బొడసూపి = చలింపని చిత్తముతో ప్రత్యక్షమై, హెచ్చయిన = అధికుఁడైనట్టి, అజిన్ = బ్రహ్మకుమారుఁడైన యత్రిని (అనఁగా అజుని కుమారుడైనందుకు నాజియాయెననుట), మన్యునన్ = దైన్యముతో, కాంచి = చూచి, వావిరిన్ = ఉత్కర్షముచే, మిమ్మున్ గడతేర్తునంచున్ = మిమ్ములను

రక్షించెదనటంచు, తనయ=కుమారుల విషయమైన, అప్తిఁగూర్చి = ఆశయమునుగురించి, వాక్రుచ్చుచుఁ = పల్కుచు, సరవిన్ = క్రమముగా, వారల కృత్యముల్ నిలుపఁగాఁ = ఆ దంపతులయొక్క తపోవ్రతాది కృత్యములాపునట్లుగా, శాసించుచున్ = ఆజ్ఞాపించుచు, తాన్ = ఆ శంకరుఁడు, చనెన్ = అదృశ్యుఁడాయెను

టీక సారంగ॥ ఆ శివాప్రియుఁడు = ఆ యీశ్వరుఁడు, మన్యునన్ = పుత్రకాంక్షతోఁ జేయఁబడిన క్రతువునందు, హెచ్చయిన = అధికుఁడైన, యాజిన్ = యజ్ఞముఁజేసినవానిని, (అనఁగా పుత్రకామేష్టిఁజేసి యాజియనుటకుఁ దగినట్టి రాజనరేంద్రుసనుట), కాంచి = చూచి, కలన్ = స్వప్నమునందున, మున్ = ఎదుడుగా, పొడసూపి = ప్రసన్నమై, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము

వ॥ చనినవారలు మన కరిష్టంబుఁ గల్గునని చింతింపుచు నిజ కృత్యంబులు విరమించిరి తదితరులా ప్రజాపతి శాసనంబుఁగొని జనిరంత, 51

టీక శివ॥ చనినన్ = దక్షుఁడిట్లు యుద్ధమునందొప్పియుండఁగా, వారలు = ఆ సతీదేవి పరివారములు, మనకరిష్టంబుఁ గల్గునని చింతింపుచు = మనకుఁ గీడువాటిల్లునటంచు దుఃఖింపుచు, నిజకృత్యంబులు విరమించిరి = తమయుద్ధకృత్యములు మానుకొనిరి, తదితరులు = మఱికొందరు, ఆ ప్రజాపతి శాసనంబుఁగొని = ఆ దక్షప్రజాపతియొక్కశిక్షనుపొంది, చనిరి = చచ్చిపోయిరి, అంతన్ = అటుతర్వాత

టీక. చంద్ర॥ చనినన్ = ఈశ్వరుండిట్లుఁ బల్కి పోవఁగా, వారలు = అనసూయాత్రులు, మనకరిష్టంబుఁగల్గునని చింతింపుచున్ = మనకు పటముఁగల్గునని యోచింపుచు నిజకృత్యంబులు విరమించిరి = తమ తపోవ్రతాదులు నిల్పివేసిరి, తదితరులు = తతిమ్మావారలు, ఆ ప్రజాపతి శాసనంబుఁగొని = ఆయత్రి ప్రజాపతియొక్క యనుజ్ఞవడసి, చనిరి = పోయిరి, అంతన్ = అటుపిమ్మట

టీక సారంగ॥ ఆ ప్రజాపతి శాసనంబుఁగొని = ఆ రాజనరేంద్ర నృపాలుని యనుజ్ఞవడసి, తతిమ్మావిషయము చంద్రకథకు సమాసము.

సీ॥ ఓలి నాయతిరాజ ♦ మౌళి నిజాంగనా
హీనవృత్తము దివ్య ♦ మౌని రతినిఁ
దేట తెల్లంబుగాఁ దెలిసికొనియుఁ దన్వి
కడతేఱినందుల ♦ కెడదలోఁన
గరుణముతోడ స ♦ ద్గణయుక్తుఁడై స్వక
ల్పిత భద్రుఁడై చని ♦ ధృతినిఁబెంపుఁ
జేసియుఁ దానందు ♦ బాసిగీమున బుధ
తండంబు లరుదు లొం ♦ దగను దీక్షఁ

గీ॥ బూర్తిగాఁ జేసె దక్షిణా ♦ మూర్తి నాగ
నంతఁ బ్రౌఢిమ హిమవంతుఁ ♦ డ తనయుఁడయి
వ్రతమొనర్చిన యందుల ♦ కతని సతికి
మేనకా సుందరికి చూలుఁ ♦ గానుపించె 52

టీక శివ॥ ఓలిన్ = క్రమముగా, రాజమౌళి = చంద్రశేఖరుఁడైన శంకరుడు, ఆయతిన్ = రాఁగల కాలమును, నిజాంగనా హీనవృత్తమున్ = తనచేడియ హీనమై నశించిన విషయమును, దివ్యమౌని=దేవర్షియైన నారదుని యొక్క, రతిని = అనురాగమువలన, తేటతెల్లంబుగాన్= విశదమగునట్లుగా, తెలిసికొనియున్ = ఎఱింగినవాడై, తన్వి = సతీదేవి, కడతేరినందులకు = మృతినొందినందుకు, ఎడదలోనన్ = హృదయమునందున, కరుణతోడన్ = దుఃఖముతో, సత్ = శ్రేష్ఠులైన, గణ = ప్రమథులతో, యుక్తుఁడై = కూడుకొన్నవాడై, స్వ = తనచేత, కల్పిత = సృష్టింపబడిన, భద్రుఁడై = వీరభద్రుఁడు గలవాఁడై (అనగా వీరభద్రుని సృష్టించుకొని యనుట), చని = ఆ దక్షయజ్ఞమునకుఁ బోయి, ధృతిన్ = యజ్ఞమును, పెంపుఁజేసియున్ = నాశనమొనరించియును, తాన్ = ఆ శంకరుడు, అందుఁబాసి = అచ్చోటు

వదలి, గీమునన్ = గృహమునందున, అనఁగాఁ గైలాసమునం దనుట, బుధ తండములు = దేవతాసమూహములు, అరుదు లొందగను = ఆశ్చర్యములు పొందునట్లుగా, దక్షిణామూర్తి నాగన్ = దక్షిణామూర్తి యను నామముతో, దీక్షన్ = తపోనియమమును, పూర్తిగాన్ = సంపూర్ణముగా, చేసెన్ = సలిపెను, అంతన్ = అటుపిమ్మట, ప్రౌఢిమ౯ = నేర్పుతో, హిమవంతుఁడు = హిమవంతుఁడను పర్వతరాజు, అతనయుఁడయి = సంతానము లేనివాఁడై, వతిమొనర్చినయందులకు = వ్రతముఁజేసినందులకై, అతని సతికి = ఆ హిమవంతుని భార్యకు, మేనకాసుందరికి = మేనక యను నామముఁగల సౌందర్యవతికి, చూలు = గర్భము, కానుపించెన్ = కనుపట్టెను

టీక చంద్ర॥ ఓలిన్ = క్రమముగా, ఆ యతిరాజమౌళి = ఆ ముని సార్వభౌముడు(అనఁగా నత్రిమహర్షియనుట), నిజాంగన=తన భార్యయొక్క అహీన = అధికతరమైన వృత్తముల్ = నడతను, (అనగాఁ రాతిసెనగలను గుగ్గిళ్లనుగాఁ జేసిన చారిత్రమును) దివ్యమౌని = దేవర్షియైన నారదునియొక్క, రతిని = అనురాగమును (అనఁగా ననసూయాదేవికీర్తి నతిశయిల్లునట్లుఁ జేయుటకై యొనరించిన పరీక్షవిషయమైన యనురాగముననుట), తేట తెల్లంబు గాన్ = విశదమగునట్లుగా, తెలిసికొనియున్ = యోగదృష్టివలన నెఱిఁగినవాడై, తన్వికదతేరినందులకు = అనసూయాదేవియను కొమ్మ గట్టెక్కినందుకు, అనఁగా రాతిసెనగలను వండి గుగ్గిళ్లనుగాఁ జేసి వడ్డుఁ జేరినందుకనుట) ఎదదలోనన్ = హృదయమునందున, కరుణముతోడన్ = ప్రేమముతోడ, సద్గుణయుక్తుఁడై = సాధుసముదాయముతోఁ గూడుకొన్నవాఁడై, స్వకల్పితభద్రుఁడై = తనచేత నిర్మింపబడిన శుభములుగలవాడై, ధృతినిఁ బెంపుజేసియున్ = అనసూయకు సంతోషమును వృద్ధియగు నట్లొనరించియును, తానందువాసిన్ = తానుపొందిన ప్రసిద్ధివలన, బుధతండము లరుదు లొందగను = దేవతాసముదాయము లాశ్చర్యములఁ జెందుచుండగా, గీమునన్ = భద్రికాశ్రమమున తనకుటీరమున, దక్షిణామూర్తినాగన్ =సాక్షాత్పరమేశ్వరుఁడను

నట్లుగా, దీక్షఁబూర్తిగాఁజేసె = తపోనియమమును సమాప్త మొనరించెను, అంతఁ = అటుపిమ్మట, ప్రౌఢిఁ = నేర్పుతో, మహిమవంతుఁడు = మహత్వముఁగల యత్రిమహర్షి, అతనయుఁడై = సంతానములేక, వ్రతమొనర్చిన యందులకు=తపోవ్రతముఁ జేసినందుకై, అతని సతికిన్ = ఆ యత్రిమహర్షి యొక్క చేడియకు, మేనకాసుందరికి = మేనకయను నప్సరస వంటి సౌందర్యముఁ గలదానికి (అనఁగా ననసూయకనుట), చూలుగానుపించెన్ = గర్భము కనుపట్టెను (అనఁగా గర్భవతియైన దనుట) ౨ ఊర్వశీమేనకారంభా ఘృతాచీచ తిలోత్తమాః అని యమరము

టీక సారంగ॥ ఓలిన్ = వరుసగా, రాజమౌళి = రాజనరేంద్రుఁడు, ఆయతిన్ = రాఁగల కాలమున, నిజాంగనా = కులాంగనయైన రత్నాంగి యొక్క, హీనవృత్తమున్ = వెలితియైన జీవమును, దివ్యమౌ = ఒప్పైనట్టి, నిరతిని = మిక్కిలి యాసక్తిని, తేటతెల్లంబుగాఁ దెలిసికొనియున్ = పండితుల వలన విశదమగునట్లుగా నెరిఁగిన వాడయ్యెను, తన్వి కడతేరినందులకు = తృప్తి నిండారినందుకై, అనఁగా రాఁగల కాలమున రత్నాంగి కష్టభాజన యౌనని పండితుల వలన నెఱింగియును తనకు స్వప్నంబున నందీశ్వరుఁడు ప్రసన్నుండై మీ సంతాన విషయమయిన యభీష్టమును నెఱవేర్తునని పల్కినందులకనుట, ఎడదలోనన్ = హృదయమునందున, కరుణముతోడన్ = రత్నాంగిపై దయతోడ, సద్గుణయుక్తుడై = పండిత సముదయముతోఁ గూడుకొన్నవాఁడై, స్వకల్పితభద్రుఁడై = తనచే నిర్మింపబడిన శుభములు గలవాఁడయి, చని = ఒప్పి, ధృతినిఁబెంపుఁ జేసియున్ = రత్నాంగికి సంతోషము నభివృద్ధిఁ జేసియును, తానందున్ = సంతోషమునుఁ దానుపొందును, వాసిగీమునన్ = ప్రసిద్ధిగల గృహమునందున, దక్షిణామూర్తినాఁగన్ = సాక్షాదీశ్వరుఁడే యనునట్లుగా, బుధతండము లరుదులొందగన్ = పండిత సముదాయము లాశ్చర్యము లొనయునట్లుగా, దీక్షన్ = పుత్రకామేష్టి విషయమైన నియమమును, పూర్తిగాఁజేసెన్ = సంపూర్తియగు నట్లొనర్చెను (అనగాఁ సమాప్తముఁ జేసెసనుట), అంతన్ = అటుతరువాత, ప్రౌఢిన్ = నేర్పుతో, మహిమవంతుఁడు = మహత్వముఁగల రాజనరేంద్రుడు, అతన

యుఁడై = సంతతిలేనివాఁడై, వ్రతమొనర్చిన యందులకు = పుత్రకామేష్టిఁ జేసినందుకు, అతని సతికి = ఆ రాజనరేంద్రుని భార్యయగు రత్నాంగిదేవికి, మేనకా సుందరికి = మేనకయను నప్సరస వంటి సౌందర్యముగలదానికి, చూలుగానఁ బించెన్ = గర్భ మగుపడియెను, ఈ పద్యమున పెద్దగీట్ల యందు నాల్గవపాదములో, తానందుఁబాసిగిమున నన్నుచోట నీశ్వరకథలో బాసియని యను చంద్ర, సారంగధర కథలలోవాసియనియు ర, వబయోర భేధః, అను సూత్రముచే సాధింపబడినదని గ్రహించునది

క॥ తెలుపాయెఁ జెలికిఁ జెక్కులు
నలుపాయెన్ జూచుకములు • నారీమణికిన్
బలిసెన్ మధ్యము వెలదికిఁ
బొలిసెన్ బేరా కలిపయిఁ • బొలతికిఁ గోర్కుల్ 53

టీక సుగమము

క॥ నల్లని మంటన్ మిక్కలి
పుల్లని వస్తువులఁ దినగ • బుద్ధి జనించెన్
మెల్లన నడకల యందున్
వెల్లన కనుదోయి యందు • వెలఁదికిఁ దోచెన్ 54

టీక సుగమము

క॥ ఒదలికి నెప్పుడుఁ జూచిన
బడలికయై నిదుర గలిగి • పవళించును తా
నదలుచు లేచున్ వసనము
నదలుచు సవరించుకొను వి • చారతఁ జూచున్ 55

టీక సుగమము

క॥ కటిభరమునఁగుచ భరమున
నటియించెడు వెలఁది మధ్య • నణు మధ్యంబు॥

జటుభరమై తోఁచినఁదా
నెటుఁ గదలఁగ లేక నగరఁ • నెనయ దయారే॥ 56

టీక సుగమము; పై నాల్గు పద్యములును మూఁడిఁటసమానము

సీ॥ నెలతుక చూలు చి • న్నియలు నిట్టులనొంది
నెలలంత కంతకు • నిండియున్న
వేళమిక్కలి గర్భ • వేదనమై నాకు
దనఁజెల్లు వరదత్తుఁ • గనియె సరవి
నితఁడు యోగమునందు • నెంచదూర్వాసుఁడ
నందగు నితఁడంద • మందుఁ జంద్రుఁ
దననొప్పునని బుధ • జనములుఁ గొనియాఁడ
మంచి కొమరులనుఁ • గాంచి యెసఁగ
ఆ॥వె॥ నంత సర్వమంగ • ళాత్మ జోద్భవమైన
శుభముహూర్తమునను • క్షోణివెలసె
సురలు కుసుమవృష్టిఁ • గురిపించి దుందుభి
స్వనముఁజేసి రాక • సమున నుండి॥ 57

టీక శివ॥ నెలతుక = మేనకయను వెలఁది, చూలు చిన్నియల నిట్టులనొంది = ఈ విధముగా గర్భిణీ చిహ్నములను పొందినదై, నెల వేళన్ = రానురాను నవమాసములు పూర్తిగావడముతోడనే, మిక్కలిగర్భవేదనన్ = అతిశయమైన ప్రసవ కష్టముచేత, మైనాకుఁడనఁ జెల్లు = మైనాకుఁడనఁనొప్పు నట్టివానిని, వరదత్తున్ = వరముచేత స్వీకరింపఁబడిన వానిని, సరవిన్ = క్రమముగా, కనియెన్ = ప్రసవించెను ఇతఁడు = ఈ మైనాకుఁడు, యోగమునందు = యోగబలముచేత, దూర్వాసుఁ దనందగున్ = చెడ్డవాస స్థానముగల వాఁడనఁగా నొప్పుచు (అనఁగా ఇంద్రునకు పాఁఱిపోయి లవణసముద్రమున దాగినాఁడని పురాణప్రసిద్ధము, యోగము లభ్యసించుటయందు దూర్వాసమునివంటి వాఁడనఁగా జెల్లును), ఇతం దంద మందు = ఈ మైనాకుఁను చక్కఁదనమందున, చంద్రుఁడననొప్పున్ =

చంద్రుడే యనదగును, అని = ఇట్లని, బుధజనములుఁ గొనియాడన్ = దేవతాజనములు స్తోత్రము జేయఁగా, మంచికొమరులను = లెస్సయైన సౌంద ర్యములను, కాంచి = వహించిన వాఁడై, ఎఁసగునంతన్ = అతిశయింపు చున్న మీదట, సర్వమంగళాత్మ జోద్భవమైన = సర్వమంగళయను కుమా ర్తె పుట్టినట్టి, శుభముహూర్తమునను = దివ్యమైనలగ్నమునందున, క్షోణివెల సెన్ = భూమి ప్రకాశించెను, సురలు = దేవతలు, కుసుమ వృష్టిఁ గురి పించి = పూలవానఁ గురియునట్లొనర్చి, దుందుభిస్వనముఁజేసి రాకసమున నుండి = ఆకాశముననుండి దుందుభియను భేరిని ప్రయోగించిరి, ని శర్వాణీ సర్వమంగళా, అని యమరము

టీక చంద్ర॥ నెలతుక నొంది = ఆ యనసూయాదేవియను కాంత యీ విధముగా గర్భిణీ చిహ్నములను పొందినదియై, నెలలంత వేళన్ = నవమాసములు సంపూర్ణమయిన సమయమునందున, మిక్కిలి గర్భవేదనమై = హెచ్చైన ప్రసవకష్టముతో, నాఁకుఁధ నందగు = పాపరహితుఁడన నొప్పునట్టి, వర = శ్రేష్ఠుఁడయిన, దత్తున్ = దత్తాత్రేయుని, కనియెన్ = ప్రసవించెను, సరళి = వరు సఁగా, ఇతఁడు = ఈ చెప్పఁబోవు నీ బాలకుఁడు, యోగమున్ = హఠ యోగాది యోగములలో నొకటి, అందున్ = వహించును, దూర్వాసుఁ డనందగున్ = దూర్వాసుఁడనఁగా నొప్పును, ఇతఁడు = ఈ క్రిందఁ జెప్పఁబోవు బాలకుఁడు, అందమున్ = చక్కఁదనమును, అందున్ = పొందును, చంద్రుఁడన నొప్పును = చంద్రుఁడనఁగాఁ జెల్లును, అని = ఇట్లని, బుధజనములుఁ గొనియాఁడన్ = దేవతాజనములు స్తోత్రముఁ జేయఁగా, మంచికొమరులను = శ్రేష్ఠులయినకుమారులను, కాంచి = కనినదియై, ఎసఁగున్ = అతిశయించును, అంతన్ = పిమ్మట, సర్వ మంగళాత్మ జోద్భవమైన = సమస్త శుభముల కాటపట్టైన కుమా రులు ముప్వురు జనించినట్టి, శుభముహూర్తమునను = దివ్యతరమైన లగ్నమునందున, క్షోణివెలసెన్ = భూమి ప్రకాశించెను, సురలు, దేవతలు, కుసుమవృష్టిన్ = పువ్వుల వానను, కురిపించి = వర్షింపఁ

జేసి, అకసమునసుండి = ఆకాశమునందుండి, దుందుభిస్వనముఁ జేసిరి = దేవదుందుభిని మ్రోగించిరి.

టీక సారంగ॥ నెలతుక నొంది = రత్నాంగియను చేడియ యిట్లు గర్భిణీచిహ్నములనుఁబొంది, నెలల వేళన్ = నవమాసము లంతకంతకుఁబూర్తియైన సమయమున, మిక్కిలి . మై = హెచ్చైన గర్భకష్టముతో, నాకుఁడనఁజెల్లు = పాపరహితుఁడనఁగా నొప్పు, ధర్మ సు భర్తవలన, లేక వరముచేత, దత్తున్ = స్వీకరింపఁబడినవానిని, సరవిన్ = క్రమముగా, కనియెన్ = ప్రసవించెను. ఇతఁడు = ఈ పుట్టిన శిశువు, యోగమునందు = జన్మకాల యోగముచేత, దూర్వాసుఁడ నందగును = చెడువస్త్రముఁగల వాఁడనఁగా నొప్పును (అనఁగాఁబినతల్లియైన చిత్రాంగిచేతగఁ బట్టుబడిన వస్త్రముఁగల వాఁడగుట ప్రసిద్ధము, లేక యోగవిద్యయందు దూర్వాసుఁడనే మునియనఁగా నొప్పును) ఇతఁడు = ఈబాలకుఁడు, అందమందు = చక్కఁదనమునందున, చంద్రుఁడన నొప్పును = చందమామయనఁగాఁ జెల్లును, అని = ఇట్లని, బుధజనములుఁ గొనియాడన్ = పండిత జనములు స్తోత్రముఁజేయఁగా, మంచికొమరులనుఁగాంచి = శ్రేష్ఠమైన సౌందర్యము లనుఁబడసి, ఎసఁగున్ = అతిశయించును, అంతన్ = అటుపిమ్మట, సర్వ మంగళ = సమస్తశుభముల కాటపట్టైన, ఆత్మజ = కుమారుఁడు, ఉద్భవ మైన శుభముహూర్తమునను = పుట్టినమంచిలగ్నమునందున, క్షోణివెల సెన్ = భూమి ప్రకాశించెను, అకసమునసుండి = ఆకాశమునందుండి, సురలు = దేవతలు, కుసుమవృష్టిఁ గురిపించి = పూలవాన గురియునట్లు జేసి, దుందుభి స్వనముఁ జేసిరి = దేవదుందుభిని వాయించిరి

ఆ॥వె॥ అందుఁ జిన్నిపట్టి ♦ కౌర సద్విభుఁడు సా
రంగధరుఁ డటంచుఁ ♦ బ్రాజ్ఞులెల్లఁ
బేరుఁబెట్టి ధనిరి ♦ పెద్దల వాక్యము
లెందు రిత్తలగునె ♦ యించుకైన. 58

టీక శివ॥ అందున్ = అచ్చోట, చిన్నపట్టికి = ముద్దుబిడ్డయై, సర్వమంగళాదేవికి (అనఁగా పార్వతికనుట), సద్విభుఁడు = మంచిమగఁడు సారంగధరుఁడు = జింకను ధరించినవాఁడైన శంకరుఁడు, ఔర = అగునురా, అటంచున్ = ఇట్లని పల్కుచు (అనఁగా నీపార్వతికిముందు శంకరుఁడు భర్తయగునని యనుట), ప్రాజ్ఞులెల్ల = తెలిసిన మహానుభావులందరును, పేరుఁబెట్టి చనిరి = శంకరుఁడే భర్తయని పేరుబెట్టి యేగిరి, ఎందున్ = ఎచ్చటనైనను, పెద్దలవాక్యములు = మహాత్ములపలుకులు, ఇంచుకైనన్ = కొంచమైనను, రిత్తలగునె = వ్యర్థములగునా (కావనుట)

టీక. చంద్ర॥ అందు = అబాలకులలోపల, చిన్నిపట్టికి = చిన్న కొమారుఁడైన చంద్రునకు, సద్విభుఁడు = నక్షత్రనాయకుఁడును, సారంగధరుఁడు = జింకనుధరించువాఁడును, ఔరా = అగునురా, అటంచున్ = ఇట్లని పల్కుచు (అనఁగా నీచంద్రుఁడు ముందు చుక్కలకు ఱేఁడును జింకను తాల్చెడివాఁడును నగునురా యని యనుట), ప్రాజ్ఞులెల్లన్ = తెలిసిన మహానుభావులందరును, పేరుఁబెట్టి చనిరి = ముందిట్టివాఁడు కాఁగలఁడని పేరుఁబెట్టి పోయిరి, ఎందున్ = ఎచ్చటనేనియును, పెద్దలవాక్యములు = మహాత్ముల పలుకులు, ఇంచుకైనన్ = కొంచమైనను, రిత్తలగునె = వ్యర్థములగునా? కావనుట,

టీక సారంగ॥ అందున్ = అచ్చట, చిన్నపట్టికిన్ = అపసిబాలునకు, ఔర = ఆశ్చర్యము, సద్విభుఁడు = పండిత ప్రభుఁడనియును, లేక మంచిరాయఁడనియును, సారంగధరుఁ డటంచున్ = సారంగధరుఁడనియును, ప్రాజ్ఞులెల్లన్ = పెద్దలెల్లరును, పేరుఁబెట్టిచనిరి = నామము నిడి పోయిరి, ఎందున్ = ఎచ్చటనేనియును, పెద్దలవాక్యములు = మహాత్ములపల్కులు, ఇంచుకైనన్ = కొంచమైనను, రిత్తలగునే - వ్యర్థములగునా (అనఁగా కావనుట)

వ అంత నాశిశువునకు జనకుండు వేదోక్తముగా జాతకర్మ నామకరణంబులు నిర్వర్తించి నందనోద్భవోత్సాహంబున స్వాశ్రితజనంబుల కర్థదానంబుల నొసంగి కృతార్థతనెసంగు నవసరంబున.

టీక. శివ॥ నందనోద్భవోత్సాహంబునన్ = పుత్రికాజనన సంతోషము చేత, సనియును చంద్ర, సారంగధరకథలతో పుత్రజననోత్సాహంబుచేత నని యును, మిగతా విషయము మూడింట సమానము, సుగమము.

ఆ.వె. వారిముగురఁగాళి ♦ కోరుమంజుల వేణి
జనని పట్టి ముద్దుఁ ♦ గొనుచుఁ బ్రేమ
నమృతమొసఁగి పోష ♦ ణముఁ జేయుచుండియు
గొనబు నుడులనిట్టు ♦ లనుచుఁ బలికె॥

టీక. శివ॥ వారిముక్ = మేఘమువంటి, ఉరగ = సర్పమువంటి, అళి = తుమ్మెదవంటి, క = ఉదక సంబంధమైన, ఉరు = శ్రేష్ఠమగు, మంజుల = పాచివంటి, వేణి = జడ గలిగినట్టి, జనని = తల్లియైన మేనకా దేవి, పట్టిన్ = కూతురగు పార్వతిని, ముద్దుఁగొనుచున = ముద్దుఁబెట్టు కొనుచు, ప్రేమన్ = కరుణతో, అమృతమొసఁగి = పాలనిచ్చి, పోషణముఁ జేయుచుండియున్ = రక్షణ మొనర్చుచుండియును, గొనబునుడులన్ = మనో జ్ఞమైన మాటలచేత, ఇట్టులనుచుఁ బలికెన్ = ఈవిధముగా వచియించెను, మంజుల శబ్దము పాచియనుటకు శబ్దార్థచంద్రికతోఁ జూడ నగును.

టీక చంద్ర॥ వారిముగురన్ = దత్తాత్రేయ దూర్వాస చంద్రులను సెట్ట వారిముగ్గురను, కాళికా = మేఘపంక్తివంటి, ఉరుమంజుల = మిక్కిలి మనోహరమైన, వేణి = జడ గలిగినట్టి, జనని = తల్లియైన యనసూయాదేవి, పట్టి = చేకొనినదియై, ముద్దుగొనుచున్ = ముద్దుఁబెట్టుకొనుచును, ప్రేమన్ = నెనరుతో, అమృతమొసఁగి = పాలనిచ్చి, పోషణముఁజేయుచుండియున్ = రక్షణ మొనర్చుచుండియును, గొనబునుడులన్ = మనోజ్ఞమైన మాటలతో, ఇట్టులనుచుఁ బలికెన్ = ఈవిధముగా వచియించెను.

టీక సారంగ॥ జనని = తల్లియైన రత్నాంగిదేవి, పట్టిన్ = కుమారుఁ డైన సారంగధరుని, తక్కినవిషయము శివకథకు సమానము

సీ॥ అంబురుహోక్షుద ♦ య న్నినుఁగంటి వే
నాయగ్ర సుత గయి ♦ సేయుమనును
హరుకృప నినుగంటి ♦ నంకముపై నద్వి
తీయాత్మజా కొల్వుఁ ♦ దీరుమనును
అజుని సత్ప్రేమ ని ♦ న్నలరఁ గంటిని చిన్ని
పట్టి చెక్కిలి ముద్దుఁ ♦ బెట్ట మనును
నేనుఁ గన్నట్టి సం ♦ తానమందున నిందు
నను నీవె సతతంబు ♦ మనుపననును

గీ॥ కన్నులారంగఁ గనుఁగొందుఁ ♦ గాన నిపుడుఁ
గదక జిలిబిలి నడకలుఁ ♦ నడువు మనును
నాయనా యమ్మ యనుచుఁ జి ♦ న్నారి పలుకు
తెలమి నాతోడనొకసారి ♦ పలుకుమనును॥

టీక. శివ॥ అంబురుహోక్షుదయన్ — ఉదకసంజనితుఁడైన యగ్ని హోత్రుని నేత్రముగాఁ గలిగిన శంకరుని కరుణవలన, నేన్ = నేను, నినుఁ గంటిన్ = నిన్నుఁ గన్నదానను, నాయగ్రసుత = నాముఖ్య పుత్రికా, గయి సేయుమనును = రమ్మనివచియించును, హరుకృప నినుఁగంటిన్ = హర నామముఁగల యీశ్వరుని దయవలన నిన్నుఁగన్నదానను, అద్వితీయ = ఒక్కదాననైన, ఆత్మజా = కూతురా, అంకముపైనన్ = నాతొడపైన, కొల్వుదీరుమనును = కొల్వుఁజేయుమని వచియించును, అజునిసత్ప్రేమన్ = ఈశ్వరునియొక్క మంచి దెనరువలన, ని అజశ్శంభు విధాత్రోః అని నానార్థ రత్నమాల నిన్నలరఁగంటిని = ప్రకాశింపఁగా నిన్నుఁ గన్నదానను, చిన్నిపట్టి = పసిబిడ్డా, చెక్కిలిన్ కపోలమును ముద్దుఁబెట్టుమనును = ముద్దొసంగమని వచియించును, నేనుఁగన్నట్టి = ఏనుఁ గనినటువంటి, సంతాన మందునన్ = పుత్రపుత్రికాది సంతతియందున, ఇందున్ = ఇచ్చోట, నను నీవేసతతంబు మనుపననుమ = నిరంతరము నన్నుఁ బోషింపనీవేయని వచి యించును, కన్నులారంగఁ నిపుడు = నేత్రములకింపౌనట్లుగా నిపుడు

నేఁ జూచెదను కావున, కదకన్ = యత్నముతో, బిలిబిలినడకలు = మనోజ్ఞమైన నడకలను, నడువుమనును = గమనము సేయుమని వచియించును, నాయనా . పలుకుమనును = అమ్మాయయ్యాయటంచు మనోహరమైన మాటలను వికాసముగా నాతో నొక్క పర్యాయము మాట్లాడుమని వచించును

టీక చంద్ర॥ అంబురుహాక్షుదయన్ = పద్మనేత్రుఁడైన విష్ణుమూర్తి కరుణవలన, నేన్ = ఏను, నినుఁగంటిన్ = నిన్నుఁ గన్నదానను, నాయగ్రసుత = నాపెద్దకొమరుఁడవైన దత్తాత్రేయుఁడా, గయి సేయుమనును = రమ్మని వచియించును, హరుకృపనినుఁగంటిన్ = ఈశ్వరుని దయవలన నిన్నుఁగన్న దానను, ద్వితీయాత్మజా= రెండవకుమారుఁడవైన దూర్వాసుఁడా, అంకముపైనన్ = నాతొడపైన, కొల్వుఁదీరు మనును = కొల్వుఁ జేయుమని వచియించును, అజునిసత్ప్రీమఁ = బ్రహ్మదేవుని సమీచీనమైన దయవలన, నిన్నలరఁగంటిని = ప్రకాశించునట్లుగా నిన్నుఁగన్నదానను, చిన్నిపట్టి = కడగొట్టు తనయుఁడవైన చంద్రుఁడా, చెక్కిలి ముద్దుఁబెట్టు మనును = కపోలమున ముద్దీయుమని వచియించును, నేనుఁగన్నట్టి = ఏనుఁగాంచినటువంటి, సంతానమందునన్ = కుమారుల యందున, ఇందు = ఓ చంద్రుఁడా, నను నీవె సతతంబు మనుపనను = నిరంతరము నన్నుఁబోషింపగాఁ నీవేయని వచియించును, అనఁగా ననసూయాదేవికి విష్ణ్వంశమున దత్తాత్రేయుఁడును రుద్రునంశమున దూర్వాసుఁడును బ్రహ్మదేవు నంశమునఁ జంద్రుఁడును జనియించిరని గ్రహించునది తతిమ్మా చిన్నగీట్లు పయి కథకు సమానము.

టీక సారంగ॥ నాయగ్రసుత = నా మొదటి కొమరుఁడా, అద్వితీయాత్మజా = ఒక్కఁడవైన పుత్రుఁడా, చిన్నపట్టి = పసిపాపఁడా, ఇందునను = ఇచ్చటను, నేనుఁ గన్నట్టి = ఏనుఁబడసినటువంటి, సంతానమందునన్ = దేవాలయ వరనిక్షేప తటాకాది సంతానసప్తకమునందు, తతిమ్మా విషయమంతయును శివకథకు సమానము క॥ తన యుఁడుఁ జెఱువునుఁ గావ్యం। బు నిధానము గుడి వనంబు భూదేవస్థా। వనమును సను

నియ్యేడునుఁ । జనుశాస్త్రములందు సప్త సంతతులనఁగన్ ॥ అని యప్ప
కవీయము

క॥ జనని యిటు శిశుల సత్కృపఁ
 బెనుగోముగఁ గానుపింపఁ • బెనుచుచు నున్నన్
 దినమొక చాయన్ బెరుఁగుచుఁ
 దనరఁగఁ జదివించునట్టి • తరుణమువచ్చెన్ ॥

టీక జననియిటున్ = తల్లియైన మేనకాదేవి యీవిధముగా, శిశున్ = బాలికయైన పార్వతిని, లసత్కృపన్ = మనోజ్ఞమైన ప్రేమ చేత, పెను గోముగఁ గానుపింపన్ = మిక్కిలిమృదువుగాఁ గనుపడు లాగున, పెనుచుచు నున్నన్ = సాకుచు నుండఁగా, దినమొకచాయన్ బెరుఁగుచున్ =రోజున కొక కాంతిచొప్పున వృద్ధిఁబొందుచు, తనరఁగన్ = అతిశయింపఁగా, చదివించు నట్టి = చదువు నేర్పునట్టి, తరుణమువచ్చెన్ = సమయముఁ గూడెను

టీక చంద్ర॥ జననియిటున్ = తల్లియైన యనసూయాదేవి యీ తీరుగా, శిశులన్ = బాలకులైన దత్తాత్రేయ దూర్వాస చంద్రులను, సత్కృపన్ = సమీచీనమైన కరుణచేత, తతిమ్మా విషయము సుగమము.

టీక సారంగ, జనని యిటుగా = తల్లియైన రత్నాంగిదేవి యీ రీతిగా, శిశున్ = బాలకుఁడైన సారంగధరుని, లసత్కృపన్ = మనోజ్ఞమైన ప్రేమ చేత, తతిమ్మా విషయము పై విధమున నని గ్రహించునది

సీ॥ అపుడా సుధీరధ • రాధినాథుండైన
 తండ్రి బావుకిముహూ • ర్తంబునందు
 శ్రుతిహితంబుగఁ బురో • హితునితో నక్షరా
 భ్యాసంబుఁ జేయించి • స్వాశ్రితులకు

నభిమతార్థములిడి ♦ నవ్వారి నెనరుచే
భవ్యసంతోషియై ♦ బడికిఁ బంపి
యచటి పంతులు నేర్పు ♦ నట్టి విద్యల కన్న
మిన్నగా నేర్పింపఁ ♦ జిన్ని పట్టి

గీ॥ కొఁలుకునై క్రన్న నన్నయ ♦ కోవిదుఁడన
వెలయుచుండిన గురుని రా ♦ వించి మ్రొక్కి
ఉన్నతాసనమిడినఁ గూ ♦ ర్చున్నఁ గాంచి
అతివిధేయతగా నిట్టు ♦ లనుచుఁ బలికె॥

టీక శివ॥ అపుడు = ఆ సమయమందున, ఆసుధీర = ఆ మంచి ధైర్యముఁగల, ధరాధినాథు డైన = పర్వతాధిపతియై నటువంటి, తండ్రి = జనకుఁడు (అనఁగా హిమవంతుఁ డనుట), పావక = మంగళకరమైన, ముహూర్తంబునందు = లగ్నమునందున శ్రుతిహితంబుగన్ = వేద సమ్మతముగా, పురోహితునితోన్ = వైదికకర్మలనుఁ జేయించు నాచార్యుని చేత, అక్షరాభ్యాసంబుఁ జేయించి = ఓం నమః శివాయ, అను నక్షర ములను దిద్దఁబెట్టించి, స్వాశ్రితులకున్ - తన నాశ్రయించియుండు వార లకు, అభిమత = ఇష్టమైన, అర్థములిడి = ద్రవ్యముల నిచ్చి, అవ్వారి = విస్తారమగు, నెనరునన్ = ప్రేమచేత, భవ్యన్ = పార్వతీదేవిని, సంతో షియై = సంతసము గలవాఁడై, బడికిఁ బంపి=పాఠశాలకు నసిపినవాఁడై, అచటి పంతులు నేర్పునట్టి = అందుండిన యుపాధ్యాయుఁడు గఱపునటు వంటి, విద్యలకన్న మిన్నగాన్ = కళలకంటె శ్రేష్ఠముగా, నేర్పింపన్ = చెప్పించుటకు, చిన్నిపట్టి కొఁలుకునై = మనోజ్ఞయగు కూతురికోసమై, క్రన్ననన్ = పిమ్మటను, నయకోవిదుఁడనన్ = నీతికోవిదుఁడనగా, వెల యుచుండిన = ప్రకాశింపుచున్నట్టి, గురునిరావించి మ్రొక్కి = ఉపాధ్యా యునిఁ బిలిపించి నమస్కారముఁ జేసి, ఉన్నతాసనమిడినన్ = ఎత్తైన పీఠము నొసఁగఁగా, కూర్చున్నఁ గాంచి = ఆసీనుఁడై యుండగాఁ గనుఁ గొని, అతివిధేయతగాన్ = మిక్కిలి విధేయత్వముతో, ఇట్టులనుచుఁబలి

కెన్ = ఈ విధముగా వచియించెను ని॥ వచ్యాకరిణో మయోః, అని విశ్వము

టీక చంద్ర॥ అపుడు = ఆసమయమందున, ఆసుధీర = ఆమంచి ధైర్యమునందు, ధరాధినాథుండైన, తండ్రి = పర్వతవల్లభుఁడైనట్టి జనకుఁడు, అనఁగా నత్రిమహర్షియనుట, అవ్వారిన్ = ఆ దత్తాత్రేయ దూర్వాస చంద్రులను వారలను, భవ్యసంతోషియై = మనోహరమైన సంతోషముగల వాఁడై, బడికిఁబంపి = పాఠశాలకుననిపి, క్రన్ననన్ = అటుపిమ్మటను, నయకోవిదుఁడనన్ = నీతికోవిదుఁడనన్ = నీతికోవిదుఁడనఁగా, వెలయుచుండిన గురుని = ప్రకాశింపుచున్నట్టి బృహస్పతిని, చిన్నిపట్టికొఱకునై = తన ముగ్గురికుమారులలో కడగొట్టు కొడుకైన చంద్రునికోసమై, రావించి మ్రొక్కి = పిలిపించి నమస్కారముఁజేసి, తతిమ్మావిషయ మంతయు పయి విధముగానే యని గ్రహించవలయును ధర పర్వతమనుటకు, ని॥ ధరస్తు శైలే కార్పాసతూలకే కమరాధిపే, అని విశ్వము

టీక సారంగ॥ అపుడు = ఆసమయముగండు, ఆసుధీర = ఆమంచిధైర్యముగల, ధరాధినాథుండైన తండ్రి = భూనాయకుఁడైనట్టి జనకుఁడు (అనఁగా రాజనరేంద్రుఁడనుట), చిన్నిపట్టికొఱకునై = మనోజ్ఞుడైన కుమారునికోసరమై, క్రన్ననన్ = శీఘ్రముగా, నన్నయకోవిదుఁడనన్ = నన్నయ విద్వాంసుఁడనఁగా, వెలయుచుండిన గురుని = ప్రకాశింపుచున్న మహాత్ముని, రావించిమ్రొక్కి = పిలిపించి నమస్కరించి, తతిమ్మావిషయము సుగమము

గీ॥ వేదశాస్త్ర పురాణ సం • వేది వమర
లోక పూజ్యుఁడ వమలశీ • లుఁడవు చారు
గురు సమాఖ్యుఁడ వగుట మా • కుఁ దమకన్న
ఘనులు గనుపడ రెందేని • యును బుధాన॥

టీక శివ. వేద సంవేదివి = వేదములు శాస్త్రములు పురాణములు మిక్కిలి తెలిసినవాఁడవు, అమరన్ = ఒప్పునట్లుగా, లోక

పూజ్యుఁడవు = జనులయందు పూజింపఁదగినవాఁడవు, ని. లోకస్తుఘవనే జనే, అని విశ్వము, అమల శీలుఁడవు = కల్మషరహితమైన యాచారముఁగలవాడవు, చారు = ఒప్పిదమైన, గురు = గొప్పయగు, సమాఖ్యుఁడవు = కీర్తిఁ గలఁవాడవు, అగుటఁజ = ఐనందున, మాకుఁ దమకన్నఁజ = తమరికంటే, మాకు ఎందేనియును = ఎచ్చటనైనను, బుధాన = ఓపండితుఁడా, ఘనులు = మహాత్ములు, కనుపడరు = కానుపించరు

టీక చంద్ర॥ బుధాన = ఓ బృహస్పతీ, ని బుధానః పండితే గురౌ, అని విశ్వము, అమరలోక = దేవలోకమునందు, పూజ్యుఁడవు = పూజింపఁ దగినఁవాడవు, చారు = చారువను నట్టియు, గురు = గురువను నట్టియు, సమాఖ్యుఁడవు = నామములు గలవాఁడవు, ని. చారు శబ్దము బృహస్పతికి చెల్లుననుటకును సమాఖ్యశబ్దము కీర్తికిని నామమునకును చెల్లుననుటకును శబ్దార్థ చంద్రికలోఁ జూడనగును, తతిమ్మావిషయము పయివిధముననే యని గ్రహించునది.

టీక సారంగ॥ శివకథకు సమానము

క॥ ఈపట్టికెల్ల విద్యలు
నీపట్టగ నాత్మఁదలఁచి • నేర్పెద ననుచుఁజ
జూపట్టిన యది నమ్మిక
చెపట్టియు నార్యమేటిఁ జేయంగదవే॥

టీక శివ॥ ఆర్యఁజ = పార్వతీదేవిని, మేటిఁజేయంగదవే = గొప్ప దానినిఁగా జేయఁగదే యనియును, చంద్ర సారంగధర కథలలో, ఆర్య = ఓపూజ్యుఁడా, మేటిఁజేయంగదవే = గొప్పవానినిఁగాఁ జేయఁగదే యనియును గ్రహించునది తతిమ్మావిషయము మూడిఁట సమానము సుగమము.

క॥ అని యప్పగించి నంతనె
నెనరొప్పఁగ నతనిపట్టి • నిఁజ వెనువెంటఁజ

గొని యింటి కరిగి ప్రియఁదా
రనుగాంచి బుధానుఁ డిట్లు • రహివచియించెన్॥

టీక శివ॥ ప్రియదారను గాంచి = ఇష్టురాలైన భార్యను జూచి, బుధానుఁడు = పండితుఁడు, ఇట్లు రహివచియించెన్ = ఈవిధముగా నాసక్తితోఁ బలికెను. తక్కిమ్మావిషయము సుగమము

టీక చంద్ర॥ ప్రియన్ = ప్రియురాలిని, తారనుగాంచి = తారయను పేరుఁగలదానిని జూచి, బుధానుఁడు = బృహస్పతి, ఇట్లు = ఈవిధముగా, రహిన్ = ఆసక్తితో, వచియించెన్ = పలికెను తక్కిమ్మావిషయము సుగమము.

టీక సారంగ॥ శివకథకు సమానము

గీ॥ ముదిత యీభవ్యగుణశాలి • ని దయతోడ
సకల విద్యలయందునే • జాణఁజేయఁ
దలఁచి తోడ్తెచ్చితిని నీవు • తన్విఁనింందు
నెపుడు మనపాపగాఁ జూచి • యేలఁగదవే॥

టీక శివ॥ ముదిత = ఓకోమలీ, ఈ భవ్యన్ = ఈ పార్వతిని, గుణశాలినిన్ = గుణములచేత నొప్పుదానిని, నేన్ = ఏను, దయతోడన్ = ప్రేమ చేత, సకలవిద్యలయందున్ = సమస్తమైన విద్యల లోపల, జాణన్ = నేర్పరినిగా, చేయన్ = ఒనరించుటకు, తలంచి = భావించిన వాఁడనై, తోడ్తెచ్చితిని = వెంటఁగొని వచ్చినాడను, నీవు = ఈవు, తన్విన్ = ఈచేడియను, ఇందునెపుడున్ = ఇచ్చట నిరంతరమున్ను, మన పాపగాఁ జూచి=మనబిడ్డగాఁ గనుఁగొని, ఏలఁగదవె = రక్షణము సేయుచుండుము కదె.

టీక చంద్ర॥ ఈ భవ్యగుణశాలిని = ఈ మనోజ్ఞమైన గుణముల చేత నొప్పువానిని, నీవు తన్విన్ = ఈవు తృప్తిగా, ఇందున్ = చంద్రుని, తక్కిమ్మావిషయము పైవిధముననే యని గ్రహించునది

టీక సారంగ॥ నీవు తన్వినిందున్ = ఈవు తృప్తిగా నిచ్చోట, తక్కిమ్మావిషయము చంద్రకథకు సమానము

గీ॥ అనుచుఁ దారకు నెఱిఁగించి ♦ యాశిశువున
కతఁడు శాస్త్రపురాణేతి ♦ హాసములను
నేర్పుచుండఁగ నేండ్లుఁ గొ ♦ న్ని చనినంతఁ
దనర బాలకు నెనసె యౌ ♦ వనమయారె ॥

టీక శివ సారంగధర కథలలో॥ దారకు నెఱిఁగించి = భార్యకుఁ దెలిపి యనియును, చంద్రకథలో, తారకు నెఱిఁగించి = తార యను చేడియకుఁ దెలిపి యనియును చంద్రసారంగధర కథలలో, యౌవనము= జవ్వనము, బాలకుని = పిల్లవానిని, ఎనసెన్ = పూనెను, అనియును శివ కథలో, బాలకు = ఆ చిన్నదానికి, యౌవనము = జవ్వనము, ఎనసెన్ = పూనెననియును, తతిమ్మావిషయము మూడింట సమానము సుగమము

గీ॥ అంత సర్వజ్ఞుఁడనఁగఁజె ♦ న్నారునట్టి
భద్ర గురుఁడుఁ బరమహిమ ♦ వంతమునను
తనపనుల నోలిఁగడతేర్చు ♦ కొని సతంబు
జపతపంబులఁ గడుఁ నిష్ఠ ♦ జరుపుచుండె॥

టీక శివ॥ అంతన్ = అప్పుడు, సర్వజ్ఞుఁడనఁగన్ = సర్వజ్ఞుఁడనే పేరుఁగలవాఁడనంగా, చెన్నారునట్టి = ఒప్పారునటువంటి, భద్ర = వీర భద్రునియొక్క, గురుఁడు = తండ్రియైన శంకరుఁడు, పరమ = ఉత్కృష్ట మైన, హిమవంతమునను = హిమవత్పర్వతమునందున, తన పనులన్ = స్వకీయకార్యములను, ఓలిగా = వరుసగా, కడతేర్చుకొని = నశింపఁ జేసు కొని, సతంబున్ = నిరంతరమున్ను, జపతపంబులన్=జపమును తపమును, కడునిష్ఠన్ = మిక్కిలి నైష్ఠికముతో, జరుపుచుండెన్ = సాగింపుచుండెను, భద్రశబ్దము వీరభద్రునకుఁ జెల్లుననుటకు శబ్దార్థచంద్రికలోఁ జూఁడనగును.

టీక చంద్ర॥ అంతన్ = అటుపిమ్మట, సర్వజ్ఞుఁడనఁగన్=సకలము నెఱిఁగినవాఁడనఁగా, చెన్నారునట్టి = ఒప్పారునటువంటి, భద్ర = మంగళ కరుడైన, గురుఁడు = ఉపాధ్యాయుండు, పర = ఉత్కృష్టమైన, మహిమ

వంతమునను = గొప్పతనముచేత, తనపనులనోలిన్ = తనకార్యములను క్రమముగా, కడతేర్చుకొని = నెఱవేర్చుకొని, సతంబుగా = నిత్యమును, జపతపంబులన్ = జపమును తపమును, కడునిష్ఠన్ = మిక్కిలి నిలుకడగా జరుపుచుండెన్ = జరిగించు చుండెను

టీక సారంగ॥ చంద్రకథకు సమానము

వ॥ అట్టియెడ ॥

టీక సుగమము, మూడింట సమము

క॥ సారంగధరుఁడు సద్విభుఁ
డై రాజిల్లంగ వలయు • నని భవ్యమతిన్
గోరుచు గురునానతి గడ
మీరక చని కొల్చుచుండె • మించినభక్తిన్ ॥

టీక శివ॥ సారంగధరుఁడు = జింకకాల్పరి యైన శంకరుఁడు, సద్విభుఁడై = తనకు సమీచీనమైన మగండై, రాజిల్లంగ వలయునని = ప్రకాశింపవలెనటంచు, భవ్య = పార్వతీదేవి, ని భవ్యాకరికణో ముమో॥ అని విశ్వము, మతిన్ = హృదయమునందున, కోరుచున్ = అభిలషింపుచు, గురునానతిన్ = తండ్రియైన హిమవంతుని యాజ్ఞచొప్పున, చని = వెళ్ళినదియై, గడమీరక = హద్దుదాటక, మించినభక్తిన్ = అతిశయించిన భక్తిచేత, కొల్చుచుండెన్ = సేవింపుచుండెను, అనఁగా పార్వతీదేవి తండ్రియాజ్ఞవలన హిమవంతమునందుఁ దపంబొనరించుచు శంకరుని సేవలుసేయుటకు నేగి కొల్చుచుండెనని తాత్పర్యము.

టీక చంద్ర॥ సారంగధరుడు - జింకకాల్పరియైన చంద్రుడు, సత్ = నక్షత్రములకు, విభుఁడై = ప్రభువై, రాజిల్లంగ వలయునని = ప్రకాశింప వలెనటంచు, భవ్యమతిన్ = మనోజ్ఞమైన హృదయమునందున, కోరుచున్ = అభిలషింపుచు, గురునానతి గడమీరక = బృహస్పతియాజ్ఞను హద్దుదాటక చని = ఒప్పి, మించినభక్తిన్ = అతిశయించినభక్తిచేత, కొల్చుచుండెన్ = సేవింపుచుండెను,

టీక సారంగ॥ సారంగధరుఁడు = రాజనరేంద్రుని కుమారుఁడు, సద్విభుఁడై = సాధునాయకుఁడై, రాజిల్లంగవలయునని = ప్రకాశింపవలె నటంచు, భవ్యమతిన్ = యోగ్యమైన హృదయమునందున, కోరుచున్ = అభిలషింపుచు, గురునానతి గడిమీరక = నన్నయభట్టను గురుని యాజ్ఞను మేర దాటక, చని = ఒప్పినవాఁడై, మించినభక్తిన్ = అతిశయించిన భక్తిచేత, కొల్చుచుండెన్ = సేవింపుచుండెను ని సన్నక్షత్రే విద్యమానే సత్యాభ్యర్థిత సాధుష అని విశ్వము

గీ॥ ఆతరుణమందు ననెయల ♦ గోత్రలపతి
తనయ కల్యాణము సన ని ♦ ష్టి నొనరింపఁ
బూని తారకసాధనం ♦ బునకుఁ దగిన
చెలి విచారించు జాణ యో ♦ జించుకొనుచు॥

టీక శివ॥ ఆతరుణమందుననె = అట్టి సమయమందుననె, అల గోత్రలపతి = ఆ స్వర్గాధినాథుఁడైన యింద్రుఁడు, తన = తంయొక్క, అకల్యాణము = అమంగళము, సనన్ = పోవునటుల, ఇష్టిన్ = కోర్కెతో, ఒనరింపఁబూని = చేయుటకు యత్నించి, తారక = తారకాసురుని, సాధనంబునకున్ = సాధించుటకు, తగినచెలిన్ = తగినట్టి మిత్రుని, విచారించు జాణన్ = ఆలోచించు నేర్పరిని, యోజించుకొనుచున్ = యోచనఁజేసు కొనుచు ని. గౌః స్వర్గేవృషభేరశ్మౌ, అని విశ్వము,

టీక. చంద్ర॥ ఆతరుణమందుననె = అట్టి సమయమునందుననె, అల గోత్రలపతి = ఆస్వర్గాధీశుఁడైన యింద్రుడు, తన = స్వకీయమైన, అకల్యాణము = అమంగళము, సనన్ = పోవుటకు, ఇష్టిన్=యజ్ఞమును, ఒనరింపబూని = చేయఁగా యత్నించి, తారక = దాటించునట్టి, సాధనంబునకు = ఉపాయమునకు, తగినచెలిన్ = తగినమిత్రుని, విచారించుజాణన్ = ఆలోచించు నేర్పరిని, యోజించుకొనుచున్ = యోచనఁజేసుకొనుచును

టీక సారంగ॥ ఆతరుణమందుననె = ఆసమయమునందుననె, అల గోత్రలపతి = అభూతలనాయకుఁడైన రాజనరేంద్రుడు, తనయకల్యాణము =

కుమారుడైన సారంగధరుని వివాహము, సనన్ = ఒప్పునట్లుగా, ఇష్టిన్ = కోర్కెతో, ఒనరింపఁబూని=చేయన్ బూనినవాఁడై, తారకసాధనంబునకున్ = దాటించు నుపాయమునకును, తగినచెలిన్ = తగినట్టి కన్యకను, విచారించు జాణన్ = ఆలోచించునేర్పరిని, యోజించుకొనుచున్=యోచనఁజేసుకొనుచును. ఇక ముందరి పద్యముతో నన్వయము, చెలి నేస్తి యనఁజను స్నేహితునకు, అని సాంబనిఘంటువును, చెలిమచ్చెకంటి యుగ్మలి యింతి తొయ్యలి,అని ఆంధ్రనామ సంగ్రహమునందును గలదు, చను ననుపదమును సను నని ప్రయోగించినందులకు ప్రథమాంతశబ్దముల సరసనుండు కచటతపలకు గసడదవలు వచ్చునని గ్రహించునది ని భూవాగ్వారిమ గౌర్మతా, అని విశ్వము

గీ॥ కొమరు మించిన నీతిజ్ఞు • గురు మనీషిఁ
గాంచి స్వాభీష్టమును వి స్త • రించి తెలుప
విని యొకించుక మదిని యో • చనముఁ జేసి
యమరరాజున కతఁ డిట్టు • లనుచుఁ బలికె

టీక. శివ॥ కొమరు మించిన = మనోజ్ఞ మతిశయించి నట్టి, నీతిజ్ఞున్ = న్యాయవేత్తను, గురున్ = బృహస్పతిని, మనీషిన్ = పండితుని, కాంచి = ఇంద్రుఁడు జూచినవాఁడై, స్వాభీష్టమును = తనకోర్కెను (అనగా తారకాసురుని సంహరించు కోర్కెననుట), విస్తరించి తెలుపన్ = విశేషించి యెఱిఁగించఁగా, విని = ఆలకించి, ఒకించుక మదిని యోచనముఁజేసి = హృదయమునందున కొంచ మాలోచనఁ జేసినవాఁడై, అమరరాజునకు = దేవేంద్రునకు, అతఁడు = ఆబృహస్పతి, ఇట్టులనుచుఁ బలికెన్ = ఈక్రిందఁ జెప్పఁబోవు విధముగా వచియించెను

టీక చంద్ర॥ కొమరున్ = తనయుఁడైన జయంతుని, మించిన నీతిజ్ఞున్ = అతిశయించిన ధర్మవేత్తను, గురు = అధికతరమైన, మనీషిన్ = బుద్ధిమంతుని, కాంచి = ఇంద్రుఁడు జూచినవాఁడై, స్వాభీష్టమును = యజ్ఞముఁ జేయవలెననెడి తనకోర్కెను విస్తరించి తెలుపన్ = విశేషించి యెఱిఁగించగా,

విని = ఆలకించినవాఁడై, ఒకించుక .. జేసి = హృదయమునందు కొంచమాలోచించి, అమర రాజునకు = దేవేంద్రునకు, అతఁ డిట్టులనుచుఁ బలికెన్ = జయంతు డివ్విధముగా వచియించెను

టీక సారంగ॥ కొమరుమించిన = మనోజ్ఞ మతిశయించి నట్టి, నీతిజ్ఞున్ = నీతిజ్ఞుఁడను మంత్రిని, గురుమనీషిన్ = అధికతరమైన బుద్ధి మంతుని, కాంచి = చూచినవాఁడై, స్వాభీ . . తెలుపన్ = కుమారునకు వివాహముఁజేయవలయునను తనకోర్కెను వివరముగా నెఱింగింపఁగా, విని = ఆకర్ణించి, ఒకించుక ... జేసి = హృదయమునందునఁ గొంచమాలోచన ముఁ జేసినవాఁడై, అమరన్ = ఒప్పునట్లుగా, రాజునకున్ = రాజనరేంద్రుఁ డనే ప్రభువునకు, అతఁడు = అనీతిజ్ఞుఁడనే మంత్రి, ఇట్టులనుచుఁ బలికెన్ = ఈవిధముగా వచియించెను క॥ అతనికిన్ శక్తిత్రియ । రీతిన్ గడుఁబెంపుఁ గాంచిరి సయూర్జవుఁడున్ । నీతిజ్ఞుఁడు మతిమంతుఁడు । ధీతిలకంబు లర యన్ సుధీతిలకంబుల్. అని చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రము

క॥ వినుమయ్యా మతిమంతుం
దనఁదగు గీష్పతిని గూడి • యాలోచనఁ జే
సిన నాహవమునకును బ్రే
మను వెరవెఱిఁగించు ననుచు • మంత్రిఁ దెలిపినన్ ॥

టీక. శివ॥ వినుమయ్యా = ఓయయ్యా యాలకింపుము, మతిమంతుండ నఁదగు = బుద్ధిమంతుఁడనఁగా నొప్పునట్టి, గీర్ + పతిని = గీష్పతిని = వాణీ పతియైన బ్రహ్మదేవుని, కూడి = కలుసుకొని, ఆలోచనఁజేసినన్ = యోచించి నటులైతే, ఆహవమునకును = యుద్ధమునకు, వెరవు = ఉపాయము, ప్రేమన్ = కనికరముతో, ఎఱిఁగించున్ = తెలుపును, అనుచున్ = ఇట్ల నుచు, మంత్రి = బృహస్పతి, తెలిపినన్ = ఎఱింగించఁగా, ని॥ గీర్వాగ్వాణీ సరస్వతీ అని యమరము

టీక. చంద్ర॥ అయ్యా = ఓనాయనా, వినుము = ఆకర్ణింపుము, మతిమంతుండనఁదగు = బుద్ధిమంతుఁడనఁగా నొప్పునట్టి, గీష్పతిని = బృహ

స్పతిని, కూడి = కలుసుకొని, ఆలోచనఁజేసినన్ = యోచనఁ జేసినటులైతే, ఆ = ఆయొక్క, హవమునకున్ = యజ్ఞమునకు, వెరపు = ఉపాయము, ప్రేమన్ = కరుణతో, ఎఱిఁగించుననుచున్ = తెలుపునటంచు, మంత్రిన్ = బృహస్పతిని గూర్చి, తెలిపినన్ = ఎఱింగించఁగా. ముందరి పద్యముతో నన్వయము

టీక సారంగ॥ వినుమయ్యా = ఓయయ్యా యాలకింపుము, మతి మంతుఁడనఁదగు = మతిమంతుఁడను పేరుతో నొప్పునట్టి, గీష్పతినిగూడి = మిక్కిలి చతురముగా మాట్లాడువానిఁ గలుసుకొని, ఆలోచనఁ జేసినన్ = యోచించినట్లయితే, ఆ = ఆయొక్క, హవమునకును = ఆజ్ఞకు (అనఁగా నాలోచనఁ జేసిన యాజ్ఞ యేదిగలదో యా యాజ్ఞకనుట) ని హతోయజ్ఞే తథాహ్వానేనిదేశేఽపిహవోమత, అని విశ్వము, వెరవు = ఉపాయము, ప్రేమన్ = కనికరముతో, ఎఱిఁగించుననుచున్ = తెలుపునటంచు, మంత్రి = నీతిజ్ఞుఁడను ప్రధాని, తెలిపినన్ = ఎఱిఁగింపఁగా

క॥ నిపుణుండగు నామంత్రియె
యెపుడు నుపాయములఁ దెలిపి • యేపనినైనన్
గృపఁ జేయించు భళిరె యిటు
లుపకృతిఁ గావించువార • లుండిరె యనుచున్ ॥

టీక శివ॥ నిపు... నామంత్రియె = నేర్పరియైన నాప్రధానియె (అనఁగా బృహస్పతియె యనుట), చంద్రకథలో, జయంతుఁడెఱిఁగించిన మీదట, ఆమంత్రియె = అబృహస్పతియె, యజ్ఞకార్యము మొదలైన వానికి నుపాయము లెఱిగించి చేయించువాఁడనియును, సారంగధరకథలో, ఆమంత్రియె = ఆ మతిమంతుఁడనే ప్రధానియెననియును; తతిమ్మావిషయము సుగమము మూఁడిఁటసమానము

క॥ తనయాశయ మెటులో యా
తని యాశయమటులె యగుటఁ • దద్విధినానం

దనుని మతిమంతుఁ గని తె

ల్పిన నాతఁడు మఱల నిట్లు ♦ పేర్మి వచించెన్

టీక శివ॥ తన = తనయొక్క, ఆశయము = అభిప్రాయము, ఎటులో = ఏలాగో, అతని యాశయము = ఆ బృహస్పతి యొక్క యభిప్రాయము, అటులె యగుటన్ = అలాగే యైనందున, తద్విధిన్ = ఆ బ్రహ్మదేవుని, ఆనందనుని = ఆ సంతోషించువానిని, మతిమంతున్ = బుద్ధిమంతుని, కని = ఇంద్రుడు దర్శించినవాడై, తెల్పినన్ = విన్నవించుకొనఁగా, ఆతఁడు = ఆ బ్రహ్మదేవుఁడు, పేర్మిన్ = దయతో మఱల నిట్లు = మళ్ళీ యీ విధముగా, వచించెన్ = పలికినవాఁడాయెను.

టీక. చంద్ర॥ తనయ = కుమారుడైన జయంతుని యొక్క ఆశయము = అభిప్రాయము, ఎటులో = ఏలాగో, అతని యాశయ మటులె యగుటన్ = అతనియొక్క యభిప్రాయము నాలాగే యైనందున (అనఁగా నింద్రుని యొక్క యభిప్రాయమనుట), తద్విధిన్ = ఆ విధమును (అనఁగా నా యభిప్రాయ మటులే యను విధమనుట),ఆ = ఆయొక్క, నందనుని, = కుమారుడైన జయంతుని, మతిమంతున్ = బుద్ధిమంతుని, కని=చూచినవాఁడై, తెల్పినన్ = ఎఱిఁగింపఁగా, ఆతఁడు = ఆ జయంతుఁడు, పేర్మిన్= ప్రేమతో, మఱల నిట్లు = మళ్ళీ యీ విధముగా, వచించెణ = పలికినవాఁడాయెను

టీక సారంగ॥ తన యాశయ మెటులో = తనయొక్క యభిప్రాయమేలాగో, అతని యాశయ మటులె యగుటన్ = సిరిజ్ఞుఁడను మంత్రి యభిప్రాయము యాలాగే యైనందువలన, తద్విధిన్ = ఆవిధముగానే, ఆనందనుని = మిక్కిలి సంతోషించువానిని, మతిమంతున్ = మతిమంతుఁడను మంత్రిని, కని చూచినవాఁడై, తెల్పినన్ = రాజనరేంద్రుఁడు కుమారుని పెండ్లి విషయమై యెఱిఁగించగా, అతడు = ఆ మతిమంతుఁడను మంత్రి, పేర్మిన్ = ప్రేమతో, మఱల నిట్లు - మళ్ళీ యీ విధముగా, వచించెన్ = పల్కినవాఁడాయెను.

సీ॥ తొడరి సారంగధ • రుఁడు గురుయోగ వి
ద్యాభ్యాసియైయున్న • యది సమస్త
జను లెఱింగినది య • గును గదా యా స్వామి
తన పని విరమించు • కొనియు నేఁడు
మనదారి కరుదెంచఁ • గనుజేయ గన్నా కు
మారు సుబుద్ధిని • చారు ధీరు
నంపఁగావలె నట్లుఁ • బంపిన నలరు తీ
రునఁ దననొప్పించు • ట నిటుఁ దిరిగి

గీ॥ యు మను గళ్యాణ మొందును • కొమరుఁ గాంచు
ఘనతఁ గలిగిన యతఁడును • క్కలుఁడు నగుట
నీదు నాహవకర్తయై • నెగడు నిదియె
యౌను తారక సాధనం • బయ్య జియ్య

టీక శివ॥ తొడరి = యత్నించి, సారంగధరుఁడు = జింకతాల్పరి యైన యీశ్వరుఁడు, గురు = అధికతరమైన, యోగవిద్యాభ్యాసియైయున్న యది = యమనియమాది యోగవిద్య యందు నభ్యాసము గలవాఁడై యుండి నది, సమస్తజనులు = ఎల్ల జనములు, ఎఱింగినది యగునుగదా = తెలిసి నదియే యౌనుకదా! ఆ స్వామి ఆ యీశ్వరుఁడను దేవుడు నేఁడు=ఇప్పుడు, తన పని విరమించుకొనియు = తాను చేయు యోగకృత్యమును జాలించు కొని, మనదారి కరుదెంచఁగను జేయఁగ = మన మార్గమునకు వచ్చునట్లుగా నొనరించుటకు, కన్నాకుఁగ = అగ్రేసరుని, మారున్ = మన్మథుని, సుబుద్ధిని = మంచి బుద్ధి గలవానిని, చారుధీరున్ = మనోజ్ఞమైన ధైర్యము గం వానిని, అంపఁగా వలెఁగ = పంపించఁగా వలయును, అట్లుఁ బంపినన్ = అలాగున పంపినట్లయితే, అలరు = పుష్పము యొక్క, తీరునన్ = బాణముచేత, తనన్ = అయీశ్వరుని, నొప్పించుటఁగ =నొవ్వఁ జేయుట వలన, ఇటుఁదిరిగి = మన మార్గమునకు మళ్ళినవాఁడై, ఉమను =

పార్వతిని, కల్యాణమొందును = పెండ్లిఁజేసుకొనుచు, కొమరున్ = కుమార స్వామిని,లేక కొడుకును, గాంచున్ = కనినవాఁడగును (అనఁగా కుమారుని నుద్భవింపఁజేసిన వాఁడగు ననుట), ఘనతన్ = గొప్పతనముచేత, కలిగిన యతఁడు = పుట్టినవాఁడు, ఉక్కలుఁడునగుటన్ = ధురంధరుఁడగును గావున, నీదు = నీయొక్క, అహవకర్తయై = యుద్ధమునొనర్చువాడై, నెగడుఁ = బయలు మెఱయును, ఇదియె = ఇయ్యదియె, తారక సాధనంబు = తారకాసురుని సాధించుట, ఔను = అగును. అయ్య = ఓయయ్యా, జియ్య = ఓదేవా, లేక ఓ ప్రభువా అని సంబోధన

టీక. చంద్ర॥ తొడరి = యత్నముతో, సారంగధరుఁడు = జింక తాల్పరియైన చంద్రుడు, గురు = బృహస్పతియొక్క, దొగ = చేరిక వలన, విద్యాభ్యాసియై యున్నయది = విద్యనభ్యసింపువాఁడై యుండినది. సమస్తజనులు = ఎల్లవారలు, ఎఱింగినది యగునుగదా = తెలిసిన విషయమే యౌనుగదా, ఆస్వామి = అయాచార్యుఁడు (అనఁగా బృహస్పతి యనుట), నేఁడు = ఇప్పుడు, తనపనిన్ = తాను చదువునేర్పుపనిని, విరమించు కొనియు = నిల్పివేసుకొని, మనదారికరుదెంచఁగను జేయఁగన్ = మన మార్గమునకు వచ్చువానినిఁగా నొనరించుటకు (అనఁగా యజ్ఞకార్యము నెర వేర్పవచ్చువానినిఁగా జేయుటకొఱకనుట), నాకుమారు = నాకు బదులుగా, సుబుద్ధిని = మంచిబుద్ధిఁగలవానిని, చారున్ = సేవకుని, ధీరున్ = ధైర్యము గలవానిని, అంపఁగావలెన్ = బృహస్పతివద్దకుఁ బంపింపవలయును. అట్లుఁ బంపినన్ = అలాగున సేవకుని బంపినట్లైతే, అలరుతీరునన్ = సంతోషించు రీతిగా, తనన్ = ఆ బృహస్పతిని, ఒప్పించుటకు = ఒప్పుకొనువానినిఁగాఁ జేయుటవలన, ఇటుఁదిరిగియున్ = మనమార్గమునకు మళ్ళినవాఁడై, మనున్ = వర్తించును, కల్యాణమొందును = మంగళము వహించును, కొమరుఁగాంచున్ = మనోహరతనుఁ బడయును, ఘనఁతగలిగిన యతఁడు = మహత్వము గల్గి నయా బృహస్పతి, ఉక్కలుఁడు నగుటన్ = ధురంధరుఁడైవందున, నీదు = నీయొక్క, అహవకర్తయై = యజ్ఞమును జేయువాఁడై, ని. ఆహవస్సంగ

రేయాగే, అని విశ్వము, నెగడున్ = వర్థిల్లును, అయ్య = ఓ నాయనా, జియ్య = ఓ దేవా, తారకసాధనంబు = తరించునుపాయము, అదియె యౌను = అయ్యదియే యగును

టీక సారంగ॥ తొడరి = యత్నించి, సారంగధరుఁడు = రాజ నరేంద్రా సీకుమారుఁడు, గురుయోగ = నన్నయభట్టను గురునియొక్క చేరిక వలనఁ విద్యాభ్యాసియైయున్నయది = చదువు నేర్చుకొనువాఁడై యున్నది, సమస్తజనులు = సర్వప్రజలు, ఎఱింగినదియగునుగదా = తెలిసికొన్న విషయమే యౌనుకదా, ఆస్వామి = ఆ ప్రభువు, (అనగా సారంగధరుఁడనుట) నేడు = ఇప్పుడు తనపని విరమించుకొనియు = తాను విద్యాభ్యాసము చేయు నట్టిపని నిల్పుకొని, మనదారి కరుదెంచఁగను జేయఁగన్ = మనమార్గమునకు వచ్చువానినిఁగాఁ జేయుట కొరకు, నాకుమారు సుబుద్ధిని = సుబుద్ధియను పేరుగల నా కొడుకును, చారుధీరున్ = మనోజ్ఞమైన ధైర్యముగల వానిని, అంపఁగావలెన్ = సారంగధరుని వద్దకు పంపించవలయును, అట్లుఁ బంపినన్ = అలాగున పంపితిమేని, అలరుతీరునన్ = ఒప్పుకొనువిధముగా, తనన్ = ఆసారంగధరుని, ఒప్పించుటన్ = సమాధాన పర్చుటవలన, ఇటుఁ దిరిగియున్ = మన దారికి మరలినవాఁడై, మనున్ = వర్తించును, కల్యాణమొందును, పెండ్లిఁజేసుకొనును, కొమరుఁగాంచున్ = మనోహరతను వహించును, ఘనతగలిగిన యతఁడు=గొప్పతనముగల్గినట్టి యాసారంగధరుఁడు, ఉక్కలుఁడునగుటన్ = ధురీణుడైనందువలన, నీదు = నీయొక్క, నా = నాయొక్కయు, హవకర్తయై నెగడున్ = అజ్ఞలనొనర్చువాఁడై వర్ధిల్లును, అయ్య = ఓయయ్యా, జియ్యా = ఓ ప్రభువా, తారకసాధనంబు = వివాహమును దాటించునుపాయము, అదియ యౌను = అయ్యదియే యగును.

క॥ అనిన మతిమంతు నాత్మజుఁ
దనమతి నేర్పరియటంచుఁ ♦ దలఁచియు ప్రేమలన్
గనఁబడిన చారు సుమనో

ధనునాతని కడకు సమ్మ • దమ్మున ననిపెన్॥

టీక శివ॥ అనినన్ = ఈ విధముగ బ్రహ్మదేవుఁడు దేవేంద్రునితోఁ బలుకఁగా, మతిమంతు = బుద్ధిమంతుని, ఆత్మజున్ = మన్మథుని, నేర్పరి = ఓసమర్థుఁడా, అటంచున్ = అనుచు, తనమదిన్ = ఇంద్రుడు హృదయము నందున, తలఁచియు = ధ్యానముఁజేసి, మ్రోలన్ గనఁబడిన -- తలఁచిన మాత్రముననెదుట గనుపించినటువంటి, చారుసుమనోధనున్ = సుందరుఁడైన మన్మథుని, అతనికడకున్ = అ శంకరుని యొద్దకు, సమ్మదమ్మునన్ = మిక్కిలి సంతోషముతో, అనిపెన్ = పంపినవాఁడాయెను

టీక చంద్ర॥ అనినన్ - ఇట్లుఁ బలుకఁగా, మతిమంతున్ = బుద్ధిమంతుని, ఆత్మజున్ = కుమారుఁడైని జయంతుని, నేర్పరియటంచున్ = నైపుణ్యముగల వాఁడనుచు, తనమదిన్ = ఇంద్రుఁడు తన హృదయమునందున, తలఁచియున్ = ఎంచుకొనినవాఁడై, మ్రోలన్ గనఁబడిన = ఎదుటఁ గనుపించినట్టి చారున్ = పరిచారకుని, సుమనోధనున్ = సుగుణములే ధనముగాఁ గలవానిని, సమ్మదమ్మునన్ = మిక్కిలి సంతోషముతో, అతనికడకున్ = అబృహస్పతి తావునకు, అనిపెన్ = పంపిన వాఁడాయెను.

టీక. సారంగ॥ అనినన్ = మతిమంతుఁడను మంత్రి యిట్లుఁబలుకఁగా, మతిమంతు నాత్మజున్ = మతిమంతుని కుమారుఁడైన సుబుద్ధిని, నేర్పరియటంచున్ = సమర్థుడేయనుచు, తనమదిన్ = రాజనరేంద్రుఁడు తన హృదయమునందు, తలంచియు = ఎంచుకొనినవాఁడై, మ్రోలన్ గనఁబడిన= ఎదుటఁ గానుపించినటువంటి, చారు సుమనోధనున్ = ఒప్పైనమంచి గుణములే ధనముగాఁ గలవానిని (అనఁగా సుబుద్ధిననుట), అతనికడకున్ = ఆ సారంగధరుని చెంతకు, సమ్మదమ్మునన్ = మిక్కిలి సంతోషముతో, అనిపెన్ = రాజు పంపించినవాఁడాయెను

క॥ అన్నాఁడె మహేంద్రుఁడు రా
కన్నియ మించియును తిరిగి ♦ కని తెలుపుటకై
మన్ననఁగల విప్రవరులఁ
బన్నుగ బాంధవులడాయఁ ♦ బంపించి తగన్॥

టీక శివ॥ అన్నాఁడె = ఆసమయమునందుననె, మహేంద్రుఁడు = దేవేంద్రుఁడు, తిరిగి కని తెలుపుటకై = మళ్ళీచూచి యెఱిఁగించుటకొఱకై, మన్ననగల = గౌరవము గలిగినట్టి, విప్రవరులన్ = మిక్కిలి శ్రేష్ఠులను, బాంధవులన్ = చుట్టములను, రాకన్నియమించియును = వలాని సమయమునకు రావలయునని కాలనిర్ణయముఁ జేసి, పన్నుగన్ = ఒప్పునట్లుగా, డాయఁబంపించి = మన్మథ శంకరుల సమావేశము సమీపమునకు ననిపిన వాఁడై, తగన్ = యుక్తమగురీతిని, ఇక ముందరిపద్యముతో నన్వయము.

టీక చంద్ర॥ అన్నాఁడె = అప్పుడే,మహేంద్రుఁడు = దేవేంద్రుఁడు, మన్నన వరులన్ = గౌరవముగల్గిన ఘనతరమైన శ్రేష్ఠులను, రాకన్నియమించియును = మరల వచ్చునట్టిసమయము నేర్పాటుఁజేసి, తిరిగి= వారివారి నిలయములకు నేగి, కని = వారలనుగాంచి, తెలుపుటకై = ఎఱిఁగించుట కొఱకై, పన్నుగన్ = ఒప్పుగా, బాంధవులడాయన్ = చుట్టములను సమీపించుటకు, పంపించి = అనిపినవాఁడై, తగన్ = యుక్తమగు రీతిని, అనఁగా దేవేంద్రుఁడు యజ్ఞమునకు వచ్చుటకుగాను శ్రేష్ఠులైన కొందరిని చుట్టముల సమీపమునకు దానిని దెలుపుటకొఱకునై పంపించినాఁడని తాత్పర్యము.

టీక సారంగ॥ అన్నాఁడె = ఆసమయమునందుననే, మించియును = అతిశయించునట్లుగా, తిరిగి = దేశాటనముఁజేసి, కని = చూచి, రాకన్నియన్ = రాచకన్నెను, తెలుపుటకై = ఎఱింగించుట కొఱకై, మన్ననగల విప్రవరులన్ = గౌరముగల్గిన బ్రాహ్మణోత్తములను, మహేంద్రుఁడు = రాజనరేంద్రుఁడు, పన్నుగన్ = ఒప్పునట్లుగా, బాంధవులడాయన్ = చుట్టముల సమీపమునకు, పంపించి = అనిపినవాఁడై, తగన్ = యుక్తమగురీతిని,

ఆ॥వె॥ వారిరాకకొఱకు ♦ వారల న్దివ్యవా
ర్తలను వినుటకొఱకు ♦ రాజు మిగుల
నెదురుఁ జూచుచుండె ♦ నింతలో సుమనోధ
నుండు విప్రవరుఁ డొ ♦ కండు వేడ్క 80

టీక శివ॥ వారిరాకకొఱకున్ = శంకర మన్మథుల విషయము జూడనరిగిన వారల యాగమనము కొఱకును, వారల . . కొఱకున్ = వారి శుభవార్తలు వినుట కొసరమును, రాజు = దేవేంద్రుఁడు, ని. రాజాప్రభౌ నృపే చంద్రే యక్షే క్షత్రియ శక్రయోః, అని విశ్వము మిగులన్ = అతిశయముగా, ఎదురుఁజూచుచుండెన్ = నిరీక్షింపుచుండెను, ఇంతలోన్ = ఈలోపల, సుమనోధనుండు = పుష్పధన్వియైన మన్మథుఁడు, విప్ర వరుఁడు : మిక్కిలి శ్రేష్ఠుఁడు, ఒకండు = ఒంటరివాఁడై, వేడ్కన్ = సంతోషముతో, ముందరి పద్యముతో నన్వయము.

టీక చంద్ర॥ వారిరాకకొఱకున్ = యజ్ఞమునకు బంధువులఁ గొని తెచ్చుటకు నేగినవారలు వచ్చుకొఱకును, వారల కొఱకున్ = వారి శుభ వార్తనాలకించుటకొసమును, రాజు = దేవేంద్రుడు మిగుల నెదురుఁ జూచు చుండెన్ = అతిశయముగా నిరీక్షింపుచుండెను, ఇంతలో = ఈలోపల, సుమనోధనుండు = సుగుణములే ధనముగాఁ గలవాఁడు, విప్రవరుఁడు = మిక్కిలి శ్రేష్ఠుఁడు, ఒండు = ఒకానొకఁడు, వేడ్కన్ = సంతోషముతో

టీక సారంగ॥ వారిరాకకొఱకున్ = కన్యను విచారింపనేగిన వారలు వచ్చుటకొఱకును, వారల .. ... కొఱకున్ = వారిశుభవార్తల నాలకించుట కోసమును, రాజు = రాజనరేంద్రుడు, మిగుల నెదురు చూచు చుండెన్ = మిక్కిలిగా నిరీక్షింపుచుండెను, ఇంతలోన్ = ఈ లోపల, సుమ నోధనుండు = మంచి మనస్సేధనముగాఁ గలవాఁడు, విప్రవరుఁడొకండు = ఒకానొక బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు, వేడ్కన్ = సంతోషముతో.

ఆ॥వె॥ భావుకోత్తర మిడి • శ్రమకొల్పఁ జిత్రాంగి
పటము హాయలుమీఱ • నటులఁ దాల్చి
సరవి నలరుతీరు • సారంగధర గురు
వరుని దరికిఁ జేరి • వైచు నెడల॥ 81

టీక శివ॥ భావుకోక్తి = శుభమైనమాటవంటి, ఉత్తరమీడి = ఇంద్రునకు జవాబునిచ్చినవాఁడై, శ్రమకొల్పన్ = భ్రాంతినొందఁ జేయుటకు, చిత్ర = నానావర్ణములు గలిగి, అంగి = ముఖ్యమైన, పటమున్ = వస్త్రమును, హాయలుమీఱ నటులఁ దాల్చి = విలాసము మిక్కిలి గల్గునట్లుగా ధరియించి, సరవిన్ = క్రమముగా, అలరుతీరున్ = పుష్పబాణమును, సారంగధర గురు వరునిన్ = జింకతాల్పరియైన గొప్ప ప్రభువునకు (అనఁగా నీశ్వరునకనుట) దరికిఁ జేరి = సమీపమునకుఁ బోయి, వైచునెడల = వేయు సమయమునందు.

టీక, చంద్ర॥ చిత్రాంగి పటమున్ = నానావర్ణములు గల ముఖ్యమైన వస్త్రమును, హాయలుమీఱ నటులఁ దాల్చి = విలాస మతిశయిల్లునట్టుగా ధరించినవాఁడై, భావుకోత్తర మిడి శ్రమకొల్పన్ = శుభలేఖనిచ్చి భ్రాంతినొందువానిఁగాఁ జేయుటకొఱకు, సరవిన్ = క్రమముగా, అలరుతీరు = సంతోషించువిధమున, సారంగధర గురువరుని = చంద్రగురువరుని యొక్క (అనఁగా బృహస్పతియొక్క యనుట) దరికిఁ జేరి = సమీపమునకు నేగి, వైచునెడలన్ = ఒసఁగు సమయమునందున

టీక, సారంగ॥ భావుకోత్తరమిడి = శుభలేఖ నిచ్చినవాఁడై, శ్రమకొల్పన్ = భ్రాంతినొందువానిఁగా జేయుటకు (అనఁగా నా కిట్టి కోర్కెలు లభింపఁగలవని భ్రాంతినొందుట కనుట), చిత్రాంగి పటమున్ = చిత్రాంగిదేవియొక్క ఛాయాపటమును, హాయలుమీఱ నటులఁ దాల్చి = విలాస మతిశయిల్లునట్లుగా ధరియించి, సరవిన్ = వరుసగా, అలరు తీరు = సంతోషించు విధముగా, సారంగధరగురున్ = సారంగధరుని తండ్రిని, వరున్ = ప్రభువును (అనఁగా రాజనరేంద్రుని యనుట), దరికిఁ జేరి = సమీపించి వైచునెడలన్ = ఆపటము నిచ్చునప్పుడు. ఇఁక ముందరి పద్యముతో నన్వయము

సీ॥ ఆ పటాటోపంబు • నలగో ప్రయోగ చా
తురిఁ బలుమరులేఖ • గురువరుండు
శుచి వీక్షణంబునఁ • జూచె నావలసామి
తద్రుచి రమణి విం • తగ శుచికర
పీడన మాడెనా • వేళ సారంగధ
రుండు సుశేక ని • రూఢి నెసఁగె
నంత జగద్గురుం • డాత్మలో నద్వితీ
యాంగనా సక్తికి • నడఁగుచుండె

ఆ॥వె॥ ధీర వింధ్యగిరి ధృ • తిని మృగార్థముఁ జరి
యింపఁబోవునప్పు • డెదురువచ్చి
వినయభాషణముల • వేమరు నాలుపం
దనము లిడుచు విభున • కవియె నిట్లు॥

టీక. శ్రీ॥ ఆ పటాటోపమ్మునన్ = ఆ మన్మథుని యొక్క వస్త్రాడంబర
మును, నలగో ప్రయోగచాతురిన్ బలున్ = ఆ బాణప్రయోగ చాతుర్యమే బల
ముగాఁ గలవానిని, మరున్ = మన్మథుని, అట్లుగాదేని, అలగో చాతురిన్ =
ఆతని బాణప్రయోగచాతుర్యమును, బలు = లెస్సయైన, మరున్ = మన్మథుని
లేఖ = దేవతలయందున, గురు = అతిశయుఁడైన, వరుండు = ప్రభువగు
శంకరుఁడు, శుచివీక్షణంబునఁ జూచెన్ = అగ్గిచూపుతోఁ జూచినవాఁడాయె
ఆవలసామి = ఆయొక్క వలరాజు (అనఁగా మన్మథుఁడు) తత్ = ఆయొక్క
రుచిర = కాంతియందున, మణి = రత్నప్రాయుడైనవాఁడు, వింతగన్ =
ఆశ్చర్యమ్ముగా, శుచికర = అగ్ని కిరణముల యొక్క, పీడన = బాధవలన
మాడెన్ = దగ్ధమాయెను, ఆవేళన్ = అప్పుడు, సారంగధరుండు = జింక
దాల్పరియైన శంకరుఁడు, కసులేక నిరూఢినెసఁగెన్ = కోపము లేని
వాఁడై ప్రసిద్ధిగా నతిశయించెను, అంతన్ = అటుపిమ్మట, జగద్గు

రుండు = జగజ్జనకుడైన శంకరుఁడు, ఆత్మలోన్ = హృదయమునందున, అద్వితీయ = అసమానమైన, అంగనాసక్తికిన్ = వనితాపేక్షకు, అడఁగు చుండెన్ = లోబడియుండెను, ధీరనీ = విజ్ఞురాలిని, వింధ్యగిరిధృతిని = వింధ్య పర్వతమువంటి ధైర్యముగలదానిని, (అనఁగా కన్యను), మృగార్థము = వెదకు నిమిత్తము, చరింపఁబోవునప్పుడు = సంచరింపఁ బోవు సమయమునందున, వే = శీఘ్రముగా, మరునాలు = మన్మథునిభార్య (అనఁగా రతీదేవి యనుట), ఎదురువచ్చి = అభిముఖముగా వచ్చినదియై, వందనము లిడుచున్ = నమస్కారములు బెట్టుచు, వినయభాషణములన్ = నమ్రమైన వాక్యములతో, ఇట్లు = ఈ క్రిందఁ జెప్పఁబోవు విధముగా, విభుసకనియెన్ = ఈశ్వరునితో వచియించెను. ని విభుశ్శివే ప్రభౌనిత్యే అని విశ్వము, మృగశబ్దము వెదకుట యనుటకు శబ్దార్థచంద్రికఁ జూడనగును

టీక చంద్ర॥ ఆపటాటోపంబున్ = యజ్ఞమునకుఁ బిలువ వచ్చినవాని వస్త్రాడంబరమును, అలగోప్రయోగచాతురి = అతని వాక్ప్రయోగ నైపుణ్యమును, ని అర్జునీ నేత్రదిగ్బాణ భూవాగ్వారిషు గౌర్మతా, అని విశ్వము, లేఖన్ = జాబును, పలుమరున్ = మాటిమాటికి, గురువరుండు = బృహస్పతి యను శ్రేష్ఠుఁడు, శు వీక్షణంబునఁ జూచెన్ = పరిశుద్ధమైన చూడ్కితోఁ జూచినవాఁడాయెను, అవలన్ = అటుపిమ్మట, సామి = ఆచార్యుడు (అనఁగా బృహస్పతి యనుట), తత్ = అయొక్క, రుచిమణి = కాంతియందు రత్నప్రాయుఁడు, వింతన్ = ఆశ్చర్యముగా, శుచికర = పరిశుద్ధకరమైన, పిడన = కరుణను, మాడెన్ = వర్తించెను, ఆవేళన్ = అప్పుడు, సారంగధరుండు = జింకతాల్పరియైన చంద్రుఁడు, ఈసులేక నిరూఢినెసఁగెన్ = ఈర్ష్య లేని వాఁడై నేర్పుతో నతిశయించెను అనఁగా బృహస్పతి వచ్చినవానియందు దయతో వర్తింపుచుండఁగా నీర్ష్యలేక చంద్రుఁడు దనరినాఁడనుట), అంతన్ = అటుతరువాత, జగద్గురుండు = జగదాచార్యుఁడైన బృహస్పతి, ఆత్మలోన్ = హృదయమునందున, అద్వితీయ = అసమానమైన అంగనాసక్తికిన్ = వనితాపేక్షకు, అడఁగుచుండెన్ = లోబడిన వాఁడై యుండెను, ధీర = ధైర్యమునందున, వింధ్యగిరి = వింధ్యపర్వతము వంటివాఁడైన యాబృహస్పతి ధృతిని = యజ్ఞమునందు, మృగార్థము = యాచన నిమిత్తము

చరింపఁబోవు గన్పుడు = సంచరింప బోవు సమయమునందున, అలు = తన భార్యయైన తార, ఎదురువచ్చి = అభిముఖముగా వచ్చినదియై, వినయభాషణములన్ = వినమ్రమైన వాక్యములతో, వేమరున్ = పెక్కుసారులు, వందనము లిడుచున్ = నమస్కారములు సేయుచు, ఇట్టు = ఈ విధముగా, విభున కనియెన్ = భర్తయైన బృహస్పతితో వచియించిన దాయెను, పీడ, కరుణయనుటకును, మాడు, వర్తించుననుటకును, శబ్దార్థ చంద్రికలోఁ జూడనగును.

టీక సారంగ॥ అపటాటోపంబున్ = ఆ చిత్రాంగి భాయాపటము యొక్క యాడంబరమును, గురు = అతిశయుఁడైన, వరుండు = రాజు (అనఁగా రాజనరేంద్రుఁడనుట), అవల = అటుపిమ్మట, సామి = రాజ నరేంద్రుఁడను ప్రభువు, తత్ = అయొక్క, రుచి = కాంతియుక్తమైన, రమణిన్ = సుందరిని (అనఁగా నాపటమునఁ గల చిత్రాంగిననుట), శుచి = శృంగారయుక్తమైన, కరపీడనమూడెన్ = పెండ్లియాడినవాఁడాయెను ని శుచిశ్శుద్ధేఽనుపహతే శృంగారాషాఢ యోస్సితే, గ్రీష్మేహుతవహేఽపిస్యాత్ అని విశ్వము, ఆవేళన్ = అప్పుడు, సారంగధరుంగు = తన కుమారుఁడైన సారంగధరుడు, రంసులేక నిరూఢినెసఁగెన్ = రంర్ష్యలేనివాడై ప్రసిద్ధిగాఁ దనరెను, అంతన్ = అంతట, జగద్గురుండు = భూలోకమునకు తండ్రి వంటివాడైన రాజనరేంద్రుఁడు, ఆత్మలోనన్ = హృదయమునందున, ద్వితీయాంగనాసక్తికిని = రెండవ భార్యాపేక్షకు, అడఁగుచుండెన్ = లోబడినవాఁడై యుండెను, ధీర = ఓ ధైర్యవంతుఁడా (అనఁగా గ్రంథకర్త కృతి భర్తను సంబోధించెనని గ్రహించునది), వింధ్యగిరిన్ = వింధ్యపర్వతము నందు, ధృతిని = సంతోషముతో, మృగార్థము = వేట నిమిత్తము, ని. మృగః పశౌకురంగే చ కరినక్షత్రభేదయోః యాచ్ఞాయాం మృగయాంచ, అని విశ్వము చరింపఁబోవునప్పుడు = విహరింపనేగెడి సమయమునందున, వే = శీఘ్రముగా, మరునాలు = మాఱుపెండ్లాము (అనఁగా రెండవ

నట్లుగా, అందున్ = అచ్చట, విలాసిని = మన్మథుని, మనఁగఁజేసి బ్రతుకునట్లుగా నొనరించి, తరలి = బయలుదేఱినవాఁడై, తత్ = అయొక్క, సవన = వనయుక్తమైన, అచలాంతరమున్ = పర్వతమధ్యమునందున (అనఁగా హిమవత్పర్వత మధ్యమునందనుట), చొచ్చెన్ = ప్రవేశించెను, అనియును, చంద్రసారంగధర కథలలో, ఒప్పుతీరున్ = ఒప్పుకొనురీతిని, నొడువు చున్ = చెప్పుచు, ఓదార్చి = ఊరార్చి, తేజమెసఁగు = ప్రకాశమతిశయించు నట్టువంటి, నట్టునందున్ = గృహమునందున, విలాసినిన్ = సౌందర్యవతిని, మనఁగఁజేసి = వర్తింపఁజేసినవాఁడై, తరలి = బయలుదేఱి, అనియును, చంద్రకథలో, తత్ = అయొక్క, సవనాచలాంతరముఁ జొచ్చెన్ = యజ్ఞ భూమి మధ్యమునన్ బ్రవేశించెను, అనియును, సారంధర కథలో, తత్సవన = ఆ వనయుక్తమైన, అచలాంతరముఁజొచ్చెన్ = పర్వతమధ్యమునఁ బ్రవేశిం చెను (అనఁగా వింధ్యపర్వత మధ్యమునందనుట), తతిమ్మా విషయము సుగ మము మూఁడిఁటసమానము, విలాసి, మన్మథుఁడనుటకు, శబ్దార్థచంద్రికలోఁ జూడనగును

సీ॥ కనుఁగొన్న నొక్కచో • పునశ్రకాంచన
  జరర శేశవశివ • సంగతమ్ము
మారసొంపుగ నొక్క • చోట నింద్రాణీ కు
  మార మన్మథ గుహా౽ • మండితమ్ము
పరికింపఁగా నొక్క • దరిశచీమాధవీ
  హైమవతీశార • దాంచితమ్ము
తిలకింపఁగా నొక్క • దిశయందు గాలవ
  శాండిల్య నారద • సంయుతమ్ము

గీ॥ కాంచనొకచో భరద్వాజ • కౌశికాది
సద్విజ విరాజితమ్మొక • చాయనరయ
సుకరహర్యక్ష జంబుక • శోభితమ్ము
నై తగన్ దత్సవనధరా • ధ్యతగణింప॥

టీక శివ, కనుఁగొన్నన్ = వీక్షించినటులైతే, ఒక్కవైపునన్ = ఒకప్రదేశమునందున, శక్ర = మద్దిచెట్లచేతను ని. శక్రోమహేంద్రేస్యాత్కుట జార్జున భూరుహోః, అని విశ్వము. కాంచన = చంపకవృక్షములచేతను, ని కాంచనారేస్యా చ్చంపకే నాగ కేసరే, అని విశ్వము జరఠ = ముదిసినటు వంటి, కేశవ = పొన్నవృక్షములచేతను, ని. కేశవో వాసుదేవేస్యా త్పున్నాగే కేశవత్యపి, అని విశ్వము. శివ = గుగ్గిలపు చెట్లచేతను, ని శివో హరే వేదే యోగాంతరే కీలే వాలుకే గుగ్గిలావపి, అని విశ్వము సంగతమ్ము = కూడు కొనఁబడినదియును, చూడ సొంపుగన్ = చూచుటకు శృంగారముగా, ఒక్క చోటన్ = ఒక తావునందున, ఇంద్రాణీ = వావిలిచెట్లచేతను, ని ఇంద్రాణీ కరణే స్త్రీణాం పౌలోమీ సింధువారయోః, అని విశ్వము కుమార = ఉలిమిడి చెట్లచేతను, ని శుకేఽపి వరుణద్రౌచ కుమారం జాత్యకాంచనే, అని విశ్వము. మన్మథ = వెలగచెట్లచేతను, ని మన్మథః కామచింతాయాం కపిత్థే కుసుమాయుధే, అని విశ్వము గుహా = నక్కతోక పొన్నచెట్లచేతను, ని. గుహాతుగహ్వరే సింహపుచ్ఛ్యాంస్కందే గుహోమతః, అని విశ్వము మండితమ్ము = అలంకృతమైనదియును, పరికింపఁగాన్ = పరీక్షింపఁగా, ఒక్కదరిన్ = ఒకప్రక్కయందున, శచీ = పిల్లపీచర చెట్లచేతను, ని శచీంద్రాణ్యాం శతావరౌ, అని విశ్వము మాధవీ = పూలగురివెందలతల చేతను, ని. మాధవీ మదిరాయాంచ కుట్టన్యా మతిముక్తకే, అని విశ్వము హైమవతీ = కరకచెట్లచేతను, ని హైమవత్య భయాస్వర్ణ క్షీర్యోః శ్వేతవచో మయో, అని విశ్వము. శారద = ఏడాకులరఁటిచెట్లచేతను, అంచితమ్ము = ప్రకాశించునదియును, తిలకింపఁగాన్ = విలోకింపఁగా, ఒక్కదిశయందున్= ఒక్కదిక్కున, గాలవ = లొద్దుగ చెట్లచేతను, ని గాలవో మునిలోధ్రయోః, అని విశ్వము శాండిల్య = మారేడుచెట్లచేతను, నారద = నారింజచెట్లచేతను, సంయుతమ్ము = కూడుకొన్నదియును, కాంచన్ = చూడఁగా, ఒకచోన్ = ఒక్కచోట, భరద్వాజ = ఏట్రింతపక్షులు, కౌశిక = గుడ్లగూబలు, ఆది =

మిత్రవర్తనములు ♦ మిగులఁ దిన్నఁగ సాగ
దోషాతిశయ మరు ♦ దుగను తఱుఁగ
నలరునట్టులను ది ♦ వ్యాశీ గీతముల్దెచ్చ
విప్రయోగుల దెసల్ ♦ పెంపుఁగాంచ

గీ॥ విశ్వభీమహిమంబెల్ల ♦ విలయ మొంద
నఖిలము మహాబలాన్విత ♦ మై పొసంగ
బహువిధముల నిజ ప్రతా ♦ పంబు దిశలఁ
బొదలనయ్యెడ మాధవా ♦ భ్యుదయ మొదవె॥ 90

ఈ పద్యమునందున మాధవాభ్యుదయ మొదవె ననుటచే మూఁడు కథల యందును సమాసముగా వసంత ఋతు శుభోదయము పరముగను నప్రస్తుత విష్ణు శుభోదయము పరముగను నర్థద్వయము గలుగునట్లు రచియింపబడినది.

టీక భూజనులెల్ల సంపూర్ణ తేజమునొందన్ = వృక్షములన్నియును నిండైన కాంతి వహింపఁగా నని వసంతశుభోదయము పరముగను, భూలోక మందలి ప్రజలెల్లరు నిండైన ప్రభావము నెనయఁగా,నని విష్ణుశుభోదయము పరముగను, అంతటనిట్లే గ్రహించునది, దుష్ఫలాశావళితూలిబ్రాలన్ = చెడా కులగమి చెదరి పడిపోవఁగాననియును, చెడు రాక్షసుల గుంపు చలించి డుల్లఁగా ననియును, సుమనోవితానంబు శోభనములు జెందన్ = పుష్పసముదాయము శుభములు పొందఁగా ననియును, దేవతాసముదయము శుభములనొందగా ననియును, లలిసద్వితతిసఫలతఁదనర్చన్, లలిన్ = ఉత్సాహముతో, సత్ = శ్రేష్ఠమైన, వి = పక్షులయొక్క, తతి = సముదయము, సఫలతన్ = ఫల యుక్తతచే (అనఁగా ఫలములతోఁ గూడి యనుట), తనర్చన్=అతిశయింపఁగా ననియును, లలిన్ = ఉత్సాహముతో, సత్ = విద్వాంసులయొక్క, వితతి = సముదయము, సఫలతన్ = సార్థక్యముచే, తనర్చన్ = అతిశయింపఁగా ననియును, మిత్రవర్తనములు మిగులఁ దిన్నఁగసాగన్ = సూర్యుని నడకలు మిక్కిలి మందముగా జరుగుచుండఁగా ననియును, స్నేహి

తస్థితులు మిక్కిలి మనోజ్ఞముగా జరుగుచుండఁగా ననియును, దోషాతి
శయము = రాత్రియొక్క యతిశయము, అరుదుగన్ = ఆశ్చర్యముగా
తఱుఁగన్ = తగ్గిపోవఁగా ననియును, పాపములయొక్క యతిశయమా
శ్చర్యముగాఁ సన్నగిల్లగా ననియును, అలరునట్టులను = పూలనట్లయం,
దున,ద్విరాళి = మనోజ్ఞమైన తుమ్మెదల యొక్క, గీతము లెచ్చన్ = ప
లుకఁబడిన రవములు హెచ్చఁగానని యును, ప్రకాశించు నట్లుగా దేవ సము
దయముయొక్క పాటలు హెచ్చఁగాననియును, విప్రయోగులదెసల్ పెంపుఁ
గాంచన్ = విరహుల కష్టములు వృద్ధినొందఁగా ననియును,
బ్రాహ్మణయోగుల కష్టములు నాశనమునొందఁగా ననియును, విశ్వన్=
భూమియందున, భీమ = భయంకరమైన, హిమంబెల్లన్ = మంచంత
యును, విలయమొందన్ = నాశనమొందఁగా ననియును, విశ్వ = సమస్త
మైన, భీ = భయములయొక్క, మహిమంబెల్లన్ = గొప్పతనమంతయును,
విలయమొందన్ = నాశనమొందఁగాననియును. అఖిలమునీ = సర్వమును,
మహాబల = వాయువుచేత, అన్వితమై = కూడకొనఁ బడినదియై, పొసంగన్
= ఒప్పఁగాననియును, అఖిలమున్ = అన్నియును, మహాబల = అధిక
బలముతో, అన్వితమై = కూడుకొనఁబడినదియై, పొసంగన్ = ఒప్పఁగా
ననియును, బహువిధములన్ = అనేక విధములచేత, నిజప్రతాపంబున్ =
స్వకీయమైన వేడిమి, అనియును, పలుతెఱుఁగుల తనయొక్క పరాక్రమ
ము, అనియును, దిశలన్ = దిక్కుల యందున, పొదలన్ = వృద్ధి
నొందఁగా, అయ్యెడన్ = అట్టి సమయమునందున, మాధవ = వసంత
ఋతువుయొక్క యనియును, విష్ణుమూర్తి యొక్క, యనియును, అభ్యుదయ
మొదవెన్ = శుభోదయ మాయెను, అనగా చెట్లుప్రకాశింపఁగాఁ గారాకులు
రాలఁగా పుష్పములు వికసింపఁగాఁ బక్షులు ఫలములతోఁ గూడియుండఁగా
సూర్యుని నడకలు మందమై పవలు హెచ్చఁగా రాత్రులుతగ్గఁగాఁ బూలచెంకుల
యందునఁదుమ్మెదలు ఝుంకారములు సేయఁగా విరహులకు బాధలు హెచ్చఁగా
మంచునశియింపఁగా నెల్లెడల వాయువులు బర్వంగా దిక్కులందంతట
వేడిమి వ్యాపింపఁగా వసంతఋతువు వచ్చెనని తాత్పర్యము

## ఆశ్వాసాంతము

ఉ॥ సరసాలాప కలాపకామిత సుధీ సంతాన సంతాన భా
స్కర బాధార్మిక ధార్మికాకృత సుదృక్ కల్యాణ కల్యాణ సుం
దర దేహా యసహాయ సాహసవహా దాక్షిణ్య దాక్షిణ్య సం
తోషరసాలోకన లోకనాయకమణీ సన్మానస సన్మానసా॥ 91

టీక. సరస = రసయుక్తమైన, ఆలాప = వాక్యములచే, కలాప = భూషణములుగాఁ గలవాఁడా, కామిత = కోరఁబడిన, సుధీ = పండితుల యొక్క, సంతాన = పుత్రపౌత్రపారంపర్యమునకు, సంతాన = కల్పవృక్షమువంటివాఁడా, భాస్కర = సూర్యునివంటి, భా = కాంతిగలవాఁడా, ధార్మిక = విటుకాండ్రలో, ధార్మికా = పుణ్యాత్ముఁడవైనవాఁడా, కృత = చేయఁబడిన, సుదృక్ = పండితుల యొక్క, కల్యాణ = పెండ్లిండ్లుగలవాఁడా, కల్యాణ = మంగళకరమైన, సుందరదేహా = విలాసవంతమైన దేహము గలవాఁడా, లేక, కల్యాణ = బంగారువంటి, సుందర = మనోజ్ఞమైన, దేహా = శరీరముగలవాఁడా, అసహాయ = సహాయరహితమైన, సాహస = పరాక్రమమును, వహా = వహించినవాఁడా, దాక్షిణ్య = దక్షిణకు దిగిన వారలయందు, దాక్షిణ్య = దయగలవాఁడా, లేక, మర్యాదయైన మొగమోటముగలవాఁడా, తోషరస = సంతోష రసయుక్తమైన, ఆలోకన = చూపుగలవాఁడా, లోకనాయకమణీ = జననాథశ్రేష్ఠుఁడా, సన్మానసా = గౌరవమైన, సన్మానసా = మంచిమనస్సుగలవాఁడా

క॥ శూరీడిత గుణరత్నా గుణ
హారీకృత శౌర్యఖ్యాతి యశస్స్ఫూర్తీ
దూరీకృత దురితా కుజ
నారీహిత హృదయధరిత యనిలత్వరితా

టీక. సూరి = పండితులచేత, ఈడిత = కొనియాడఁబడిన, చరితా = చారిత్రముగలవాఁడా, గుణ = గుణములయందు, హారీ = మనోజ్ఞుఁడైన వాఁడా, తత = విస్తృతమైన, శౌర్యశ్రీ = శౌర్యశ్రీచే, స్ఫారిత = వెలుఁగొందువాఁడా, అర్థి = యాచకులచేత, స్ఫురితా = తలంపఁబడువాఁడా, దూరీకృత = దూరముగా చేయఁబడిన, దురిత = పాపములుగలవాఁడా, కుజన = దుర్జనులకు, అరి = శత్రుఁడవైనవాఁడా, హిత = మిత్రులయొక్క, హృదయ = ఆత్మలచేత, ధరిత = ధరింపఁబడినవాఁడా, అనిల = వాయుదేవునివంటి, త్వరితా = వేగము గలవాఁడా

కవిరాజవిరాజితము

శ్రితజనపోషణ సద్గుణభూషణ ♦ శ్రీపసదీషణ దీనధరా
చతురిమభాషణ సారవిశేషణ ♦ శాస్త్రగవేషణ ధీరవరా
గతపరదూషణ మంగళఘోషణ ♦ గౌరవతోషణ కాంతకరా
కృతరిపుశోషణ సంగరభీషణ ♦ కృష్ణమతేషణ ధైర్యధరా। 91

టీక. శ్రితజన = ఆశ్రితజనములను, పోషణ = పోషించువాఁడా, సద్గుణ = మంచిగుణములే, భూషణ = సొమ్ములుగాఁగలవాఁడా, శ్రీప = విష్ణుమూర్తివంటి, సత్ = శ్రేష్ఠమైన, ఈషణ = ప్రేమగలవాఁడా, దీన ధర = దీనజనులను ధరించువాఁడా, చతురిమ = నేర్పరితనముగల, భాషణ = వాక్యములుగలవాఁడా, సార = శ్రేష్ఠములైన, విశేషణ = గుణవాచక శబ్దములుగలవాఁడా, శాస్త్రగవేషణ = శాస్త్రములను వెదకువాఁడా, గత = నశించిన, పరదూషణ = అన్యనిందలుగలవాఁడా, మంగళ = శుభములైన, ఘోషణ = ధ్వనులుగలవాఁడా, గౌరవ = గురుత్వమైన, తోషణ = సంతోషములుగలవాఁడా, కాంతకరా = నేర్పరితనముగలవాఁడా, కృత = చేయఁబడిన, రిపుశోషణ = శత్రుశోషణముగలవాఁడా, సంగరభీషణ = యుద్ధభయంకరుఁడవైనవాఁడా, కృష్ణమత = విష్ణుమతమునందున, ఇషణ = ఇచ్ఛగలవాఁడా, ధైర్యధరా = ధైర్యమునందునఁ బర్వతమువంటివాఁడా.

గద్యము

ఇది శ్రీ పరమేశ్వర వరప్రసాద లబ్ధచతుర్విధ కవితా విచిత్ర
విశ్వకర్మకుల పవిత్ర భద్రదత్త గోత్ర పోకూరివంశార్ణవ

కైరవమిత్ర రామలక్ష్మ్యంబాసుబ్బయాచార్య తృతీ
యపుత్ర కవిసింహబిరుదపాత్ర బుధజనాను
మతి కాశీపతి ప్రణీతంబైన సారంగధ
రీయంబను త్ర్యర్థికావ్యంబునందు
ప్ర థ మా శ్వా స ము
సంపూర్ణము

టీక ఇది = ఈ ప్రబంధము, శ్రీ = సంపద్యుక్తమైన, పరమ= ఉత్కృష్టుఁడైన, ఈశ్వర = శంకరునియొక్క, వరప్రసాద = వరానుగ్రహమువలన, లబ్ధ = పొందఁబడిన, చతుర్విధ = నాల్గువిధములైన, అనఁగా బంధగర్భ చిత్రాశువులను తెఱఁగులైన, కవితా = కవనముల యొక్క, విచిత్ర = వైచిత్ర్యముగలట్టియు, విశ్వకర్మకులపవిత్ర = విశ్వకర్మయొక్క వంగడమునందున పావనుఁడైనట్టియు, భద్రదత్తసగోత్ర = భద్రదత్తుని యొక్క గోత్రముతోఁగూడినట్టియు, పోకూరివంశ =పోకూరివంశమనే, అర్ణవ= సముద్రమునకు, కైరవమిత్ర = కుముదబాంధవుఁడైనట్టియు అనఁగాఁ జంద్రప్రాయుఁడైనట్టి యనుట, రామలక్ష్మ్యంబా = రామలక్ష్మమ్మకును, సుబ్బయాచార్య=సుబ్బయాచార్యునకును, తృతీయపుత్ర=మూడవ కుమారుఁడైనట్టియు, కవిసింహబిరుదపాత్ర = శ్రీమద్విద్వద్గద్వాల సంస్థానాధీశ్వరుఁడైన శ్రీమంత మహారాజముష్టిపల్లి శ్రీ సీతారామ భూపాలరావు బలవంత్ బహద్దరువారి వలన నొసఁగఁబడిన కవిసింహంబను బిరుదునకుఁదగిన వాఁడైనట్టియు, బుధజనానుమతి = పండితలోకమునకు సమ్మతియైనట్టియు, కాశీపతిప్రణీతంబైన = కాశీపతియను పేరుగల కవీశ్వరునిచే రచియింపబడినట్టి, సారంగధరీయంబను = సారంగధరీయమను నటువంటి, త్ర్యర్థికావ్యంబునందున్ = మూఁడర్థములు గల ప్రబంధంబునందున, ప్రథమాశ్వాసము = మొదటి యాశ్వాసము, సంపూర్ణము = సంపూర్తియైనది



# సారంగధరీయము

## త్ర్యర్థికావ్యము

## ద్వితీయాశ్వాసము-సవ్యాఖ్యానము

క॥ శ్రీ రమణీయౌదార్యా
వారిధి గాంభీర్య యాత్మ ♦ వసుసూర్యా కం
ఠీరవతుల శౌర్యా సీ
తారామ నృపాలవర్య ♦ ధార్మికచర్యా॥ 1

టీక శ్రీ = సంపత్తుచేత, రమణీయ = ఒప్పిదమైన, ఔదార్యా = ఉదారత్వముగలవాఁడా, వారిధి = సముద్రునివంటి, గాంభీర్య = గంభీరభావము గలవాఁడా, ఆత్మ = స్వకీయమైన, వసు = కాంతియందున లేక, ఆత్మవసు = దేహకాంతియందున, సూర్యా = సూర్యునివంటివాఁడా, కంఠీరవ = సింహమునకు, తుల = సమానమైన, శౌర్యా = శూరత్వముగలవాఁడా, ధార్మిక = పుణ్యాత్ములవంటి, చర్యా = ప్రవర్తనముగలవాఁడా, సీతారామ నృపాలవర్య = సీతారామ నరపాలక శ్రేష్ఠుఁడా

గీ॥ అవధరింపుము నేఁడెల్ప ♦ నట్టి త్ర్యర్థి
కావ్యమందలి శైలజా ♦ కామినీశ
చంద్రసారంగధరుల స ♦ చ్చరితలందు
నెసఁగు నావలికథల టీ ♦ రెట్టులనిన॥ 2

టీక. సుగమము

గీ॥ అల్ల సారంగధర గురుం • డటువలె సవ
నాచలాంతరమ నను హ • ర్యక్ష జంబు
కాదులు సనన్ స్వధర్మకృ • త్యములఁ దీర్చు
కొనియుఁ బ్రియదారజ్ఞప్తిరాఁ • గుతుకముడిగి॥ 8

టీక శివ॥ అల్ల = అయొక్క, సారంగధరగురుండు = జింకతాల్పరియైన మహాత్ముఁడు (అనఁగా శంకరుఁడనుట) అటువలెన్ = ఆవిధముగా, సవన = అడవితోఁగూడిన, అచల = పర్వతముయొక్క, అంతరమునను = మధ్యప్రదేశమునందున, (అనఁగా హిమవత్పర్వత మధ్యమునందనుట) హర్యక్ష = సింహములు, జంబుక = నక్కలు, ఆదులు = మొదలైనవి చనన్ = బెగరిపోవఁగా, స్వధర్మకృత్యములన్ = తన నియమకార్యములను, (అనఁగా నిత్యకృత్యములననుట), తీర్చుకొనియున్ = నెఱవేర్చుకొనినవాఁడై, ప్రియదార = ఇష్టురాలైన భార్య (అనఁగా గతించిన సతీదేవియనుట) జ్ఞప్తిరాన్ = జ్ఞాపకమురాఁగా, కుతుక ముడిఁగి = సంతసముఁజెడినవాఁడై.

టీక చంద్ర॥ అల్ల = అయొక్క, సారంగధర = జింకతాల్పరియైన చంద్రునియొక్క, గురుండు = ఉపాధ్యాయుఁడైన బృహస్పతి, అటువలెన్ = ఆవిధముగా, సవనాచలాంతరమునను = యజ్ఞభూమిమధ్యమునను, హర్యక్ష = కుబేరుఁడు, జంబుక = వరుణుఁడు, ఆదులు = మొదలైన దిక్పతులు, చనన్ = ఒప్పునట్లుగా, స్వధర్మకృత్యములన్ = తానుచేయఁదగిన పనులను, తీర్చుకొనియున్ = నెఱవేర్చుకొన్నవాఁడై, ప్రియదార = ఇష్టురాలైనభార్య, జ్ఞప్తిరాన్ = జ్ఞాపకమురాఁగా, కుతుకముడిఁగి సంతసముఁజెడినవాఁడై, హర్యక్ష శబ్దము కుబేరుఁడనుటకు శబ్దార్థచంద్రికలోఁ జూఁడనగును, ని జంబుకవ్యాపదేసిచే ప్రతీచీ దిక్పతావపి, అనివిశ్వము.

టీక సారంగ॥ అల్ల = అయొక్క, సారంగధరగురుండు = సారంగధరుని తండ్రియైన రాజనరేంద్రుఁడు, అటువలెన్ = ఆవిధముగా, సవన =

అడవితోఁగూడిన, అచల = పర్వతముయొక్క, అంతరమునను = మధ్య భాగమునందున (అనఁగా వింధ్యపర్వత మధ్యభాగమునందనుట) హర్యక్ష = సింహములు, జంబుక = పెద్దపులులు, ని. జంబుక శ్వాపదేనీచే, అని విశ్వము ఆదులు = మొదలైనవి, చనన్ = చచ్చునట్లుగా, స్వధర్మకృత్యము లన్ = తన ధనస్సుయొక్క పనులను (అనఁగా వేటాఁడుటయనుట), తీర్చు కొనియున్ = చక్కఁజేసుకొని, ప్రియదార = ఇష్టురాలైన భార్య (అనఁగాఁ జిత్రాంగి యనుట), జ్ఞప్తిరాన్ = జ్ఞాపకమురాఁగా, కుతుకముడిఁగి = సంతోషము తఱిగిపోయినవాఁడై.

మ॥ సతినిన్నెన్నఁడుఁ గందునే యెపుడు నీ • సాంగత్యముంగల్గునే
ధృతియేనాటికిఁ దీరునే కనులలో • దీపించు యుష్మత్సదా
కృతినేలీల మనంబునన్ మఱుతునే • యీసత్రమందింకనే
గతివర్తింతునె యీవిరాళికెటు ని • గ్గన్నేర్చిజీవింతునే॥ 4

టీక శివ॥ సతీ = ఓసతీదేవీ, నిన్నెన్నఁడుఁ గందునే = నిన్నెప్పుడు జూచదనే, ఎపుడు నీసాంగత్యముంగల్గునే = ఎన్నఁడునీచేరికలభించునే, ధృతి= సంతోషము, ఏనాటికిఁదీరునే = ఎవ్వటికి తీరఁగలదే, కనులలోన్ = నేత్ర ముల యందున, దీపించు = ప్రకాశించునట్టి, యుష్మత్ = నీయొక్క, సత్= శ్రేష్ఠమైన, ఆకృతిన్ = రూపమును, ఏలీలన్ = ఏవిధముగా, మఱుతునే = మఱచిపోఁగలనే, ఈ సత్రమందు = ఈయడవియందున, ఇంకన్ = ఇఁక మీదట, ఏగతివర్తింతునె = ఏరీతి ప్రవర్తించెదనే, ఈవిరాళికిన్ = ఈ వలపు నకు, ఎటునిగ్గన్నేరిగ = ఏతీరు నిర్వహింపఁగా నేర్చుకొని, జీవింతునె = బతుకుదునే, ని. ధృతిర్యోగాంతరే ధైర్యే ధారణాధ్వరతుష్టిషు, అని విశ్వము. సత్రశబ్దము అడవియనుటకు శబ్దార్థచంద్రికలోఁ జూఁడనగును

టీక చంద్ర॥ సతీ = ఓయిల్లాలా, ధృతి = యజ్ఞము, ఏనాటికిఁ దీరునే = ఎప్పటికి పూర్తికాఁగలదే, ఈ సత్రమందు = ఈ యజ్ఞము సందున, ని సత్రమాచ్ఛాదనేయజ్ఞే, అని విశ్వము తతిమ్మా విషయము పైకథకు సమానము.

టీక సారంగ॥ సతీ = ఓసాధ్వీ, తతిమ్మా విషయము శివకథకు సమానము

గీ॥ తమిని నాతోఁడ నీవు స ♦ త్రమునకరుగు
దెంతునని సాగునప్పుడు ♦ దృఢతరముగ
వలదనుచు వెంటఁగొని రాని ♦ ఫలముగాదె
నేడు నినుబాసి కుందుట ♦ నీరజాక్షి॥ 6

టీక శివ॥ తమిని = మోహము చేత, నాతోడఁ నీవు = నీవు నాతో, సత్రమునకు = దక్షుఁడుచేయు యజ్ఞమునకు, అరుగుదెంతునని = పోయెదననిపల్కి, సాగునప్పుడు = బయలుదేఱునప్పుడు, దృఢతరముగన్ = కాఠిన్యముగా, వలదనుచున్ = వద్దురమ్మటంచు, వెంటఁగొనిరాని = తోడ్కొని యింటికి రానటువంటి, ఫలముగాదె = లాభముగదా, నేడు = ఇప్పుడు, నినుబాసి = నిన్నుఁ బోఁగొట్టుకొని, కుందుట = దుఃఖపడుట, నీరజాక్షి = ఓతమ్మికంటీ,

టీక చంద్ర॥ నీరజాక్షి = ఓకమలనేత్రీ, తమిని = వలపుచేత, నాతోఁడనీవు = నీవు నావెంబడిగా, సత్రమునకు = ఇంద్రుడుసేయు యజ్ఞమునకు, అరుగుదెంతునని = వచ్చెదనటంచు, సాగునప్పుడు = బయలుదేఱునపుడు, దృఢతరముగన్ = కర్కశముగా, వలదనుచున్ = వద్దనినవాఁడనై, వెంటఁగొనిరాని = వెంబడించుకొని రానందులకు, ఫలముగాదె = ప్రయోజనము గదా, నేడు = ఇప్పుడు, నినుబాసి = నిన్నుబాసినవాఁడనై, కుందుట = చింతిల్లుట, అరుగుదెంతునను శబ్దము వచ్చెదను, పోయెద ననుటకుఁ జెల్లునని గ్రహించునది

టీక సారంగ॥ సత్రమునకు = అరణ్యమునకు, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము

క॥ అని విటజాత్యగ్రణి పే
ర్చిన జాలిన్ సతినిఁదారఁ ♦ జిత్రాంగిని నె

మ్మనమునఁ దలపోయుచు నొ
య్యన వర్ణింపం దొడంగె • నదియెట్లన్నన్॥ ౧

టీక శివ॥ అని = ఈ విధముగా ననుచు, విబుజాతి = బ్రహ్మ కుమారులలో, అగ్రణి = శ్రేష్ఠుఁడైన శంకరుఁడు, ఈశ్వరుఁడు బ్రహ్మ కుమారుఁడని పురాణాంతర్గతమని గ్రహింపనది, హెచ్చిన బాళిన్ = అతిశయించిన మోహముచేత, సతినిన్=సతీదేవిని, దారన్ = భార్యను, చిత్రాంగిని = చిత్రమైన యవయవములు గలదానిని, నెమ్మనమునన్ = హృదయమునందున, తలపోయుచున్=చింతింపుచు, ఒయ్యనన్ = మెల్లనగా, వర్ణింపందొడంగెన్= వర్ణనఁ జేయఁబూనుకొనియెను, అదియెట్లన్నన్ = అయ్యది యేలాగంటె, విబుశబ్దము బ్రహ్మయనుటకు శబ్దార్థచంద్రికఁ జూఁడనగును.

టీక. చంద్ర. విబుజాత్యగ్రణి = బ్రహ్మకులశ్రేష్ఠుఁడైన బృహస్పతి (అనఁగా బ్రాహ్మణుఁడనుట), సతిని = యిల్లాలిని, తారన్ = తారయను నామముగలదానిని, చిత్రాంగిన్ = చిత్రావయవములు గల దానిని, తతిమ్మా విషయము పైకథకు సమానము

టీక సారంగ విబుజాత్యగ్రణి = రాజకుల శ్రేష్ఠుఁడైన రాజనరేంద్రుఁడు, సతిని = యిల్లాలిని, దారన్ = భార్యను, చిత్రాంగిని = చిత్రాంగియను పేరుఁగల దానిని, తతిమ్మా విషయము పైకథకు సమానము.

గీ॥ అల ముకుందస్ఫూర్తి • చెలి పాదములకుఁ గ
చ్ఛప మనోజ్ఞము లేమ • ప్రపదములకు
మకరమంజులము కో • మలి జంఘలకు మహా
పద్మశ్రీ సకి రోమ • వల్లికకును
శంఖ శృంగారము • దానగళమునకు
వరశోభ తొయ్యలి • వాతెఱకును
కుందలావణ్యము • కొమ్మ పల్వరుసకుఁ
బద్మకోమలము చె • ల్వముఖమునకు

గీ॥ నీల భాస్వరమెలనాగ ♦ నెఱకలకును
గలిగి మనమున కెంతయో ♦ వలపుఁ గూర్చు
నవయవ విలాస నిధియునై ♦ యలరు కతన
నవనిధులఁగాంచి నట్టియా ♦ నాతిఁగనిన 7

ఈ యాశ్వాస మిదిమొదలు నొకానొక చోట నించుక భేదముతో మూఁడు కథలకు సమానార్థముగా వర్ణింపఁబడియెనని గ్రహించునది

టీక. అల = ఆయొక్క, ముకుంద = ఎఱ్ఱదామరలవంటి, స్ఫూర్తి = ప్రకాశము, చెలి = ఆసఖియయొక్క, పాదములకున్ = చరణములకును, కచ్ఛప = తాబేలు వంటి, మనోజ్ఞము = మనోహరము, లేమ = ఆతరుణి యొక్క, ప్రపదములకున్ = మీఁగాళ్లకును, మకర = మొసలి వంటి, మంజులము = మనోహరము, కోమలి = ఆసుకుమారియొక్క, జంఘల కున్ = పిక్కలకును, మహాపద్మ = సర్పము వంటి, శ్రీ = అలంకరణము, సకి = ఆ చెలియయొక్క, రోమవల్లికకును = నూగారునకును, ని. మహా పద్మస్సృతో నాగ నిధిసంఖ్యాంతరేఽపిచ, అని విశ్వము శంఖ = శంఖము వంటి, శృంగారము = అలంకారము, దాన = ఆవెలఁదియొక్క, గళము నకున్ = కంఠమునకును, వర = కుంకుమపూవు వంటి, ని వరంకాశ్మీరజే మతం అని విశ్వము, శోభ = కాంతి, తొయ్యలి = ఆచేడియయొక్క, వాతెఱకును = పెదవికిని, కుంద = మొల్ల వంటి, లావణ్యము = సౌంద ర్యము, కొమ్మ = ఆభామినియొక్క, పల్వరుసకున్ = రదనపంక్తికిని, పద్మ = కమలము వంటి, కోమలము = మృదులము, చెల్వ = ఆచేడియ యొక్క ముఖమునకున్ = మోమునకును, నీల = ఇంద్రనీలము వంటి, భాస్వరము = ప్రకాశము, ఎలనాగ = అలలనయొక్క, నెఱకలకును = కురులకును, కలిగి = కల్గినదియై, మనమునకెంతయో = హృదయమునకు మిక్కిలి, వలపుఁగూర్చు = మోహమును చేకూర్చునట్టి, అవయవ విలాస నిధియునై = అంగ శృంగారములకు స్థానభూతమై, అలరు కతనన్ = ప్రకాశించుట వలన, ఆ నాతిఁగనినన్ = ఆకాంతను

జూచినట్లైన, నవనిధులఁగాంచినట్లై = కుబేరుని తొమ్మిది నిధులను దర్శించినట్లై యగును. (అనఁగా నీ చేడియ యవయవములందునఁ గుబేరుని నవనిధుల పేళ్ళు ధ్వనిగల వస్తువుల ప్రకాశమున్నందువలన నాయింతినిఁ గాంచినచో నవనిధులం గాంచినట్లే యని తాత్పర్యము, ముకుందాదులు నవ నిధులనుటకు, ని మహాపద్మశ్చ పద్మశ్చ శంఖోమకర కచ్ఛపౌ, ముకుంద కుందనీలాశ్చ వరశ్చ నిధయోనవ, అని యమరము ముకుంద మెట్టదామరనుటకు శబ్దార్థచంద్రికలోఁ జూఁడనగును.

గీ॥ శ్రీగిరిస్తని సూక్ష్మకాం • చీప్రదేశి
కాలహస్తి గమన మహా • కాశియుక్త
శేషధరకీర్తి శ్రీరంగ • సీమ మధుర
వాణి యగు నిట్టి క్షేత్ర మె • వ్వనికిఁ దొరకు॥ 8

టీక. శ్రీ = శోభాయుక్తమైన, గిరిస్తని = పర్వతములవంటి కుచ ములుగలదియును, సూక్ష్మ = స్వల్పమైన, కాంచీప్రదేశి = మొలనూలు చోటు గలదియును (అనఁగా నడుముగలది యనుట) కాలహస్తి = నల్ల యేనుఁగు నడకలవంటి, గమన = నడకలుగలదియును, మహా = అధికతరమైన, ఆకాశి = సౌఖ్యములతో, యుక్త = కూడుకొనినదియును, శేషధర = ఆది శేషుని ధరించిన శంకరునివంటి తెల్లనైన, కీర్తి = యశముగలదియును, శివ కథలో మాత్రము, శేష = ఆదిశేషునివంటియు, ధర = ప్రతివంటియు తెల్ల నైన, కీర్తి = యశముగలదని మార్చుకొనవలయునని గ్రహించునది. ని ధరస్తుశైలే కార్పాస తూలకే కమరాధిపే, అని విశ్వము, శ్రీ = సంపత్తులకు' రంగసీమ = నాట్యస్థానమైనదియును, మధుర = తేనెవంటి తియ్యనగు' వాణి = పలుకులుగలదియును, అగునిట్టి = ఐన యీలాఁటి, క్షేత్రము = భార్య, ఎవ్వనికిఁ దొరకున్ = ఎవ్వానికి లభించును, అనఁగా వరుసగా నీ కొమ్మయవయవ గుణాదులందు శ్రీశైల కాంచీ కాలహస్తి మహాకాశి శేషా చలము శ్రీరంగము మధుర మొదలైన పుణ్యక్షేత్రముల నామములు ధ్వనిం చుచున్నందున నాకుఁదప్ప నిట్టి క్షేత్రమెవ్వరికి లభించదని తాత్పర్యము

గీ॥ కృష్ణవేణి సురాపగా • కీర్తి నర్మ
దాళి సింధుగభీర వి • ద్యాసరస్వ
తీరమణి తుంగభద్రా గ • తి యగుభువన
దీపక యెసంగ నింకవేరె • తీర్థమేల 9

టీక కృష్ణ = నల్లనైన, వేణి=జడఁగలదియును, సురాపగా = గంగా నదివంటి తెల్లనైన, కీర్తి=యశము గలదియును, నర్మ=సంతోషములను, ద = ఇచ్చునట్టి, ఆళి = చెలికత్తెలు గలదియును, సింధు = సముద్రమువంటి గభీర = లోతైన భావముగలదియును, విద్యా = విద్యలయందున, సరస్వతీ రమణి=సరస్వతీదేవివంటిదియును, అగు = ఐనట్టి, భువనదీపక = లోకము లను ప్రకాశింపఁజేయునదియగు నీకాంత, ఎసంగన్ = తనరుచుండఁగా, ఇంకన్ = ఇంకను, వేరె = అన్యమగు, తీర్థమేల = పుణ్యతీర్థమేటికి,అనఁగా నీకొమ్మ గుణావయవముల వర్ణనలో వరుసగా, కృష్ణవేణి, గంగ, నర్మద, సింధువు, సరస్వతి, తుంగభద్ర మొదలైన పుణ్యతీర్థములు ధ్వనించుటవలనను ఈకాంతను భువనదీపకయనుటచే, ఉదకములను ప్రకాశింపఁజేయునదియను భావము తోఁచుటచేతను, ఈ చిన్నది గల్గినచో వేరే పుణ్యతీర్థమేల యని తాత్పర్యము.

గీ॥ అంగలావణ్య విభవ మ • త్స్యతరళాక్షి
మగధ సన్నుత కాశ్మీర • మంజులోష్ఠి
శ్యామబర్బర కాంభోజ • చారునాభ
యగుట నాకొమ్మ దేశవి • ఖ్యాతసుమ్మ 10

టీక అంగ = అంగదేశమువంటి, లావణ్యవిభవ = శృంగారసంపద గలది యని కాకువు, అంగలావణ్య = శరీర శృంగారమె, విభవ = వైభవ ముగాఁ గలది యని స్వభావార్థము, మత్స్య = మత్స్య దేశము

వంటి, తరళాక్షి = చలించునట్టి కన్నులు గలదియని కాకువు, మత్స్య = చేపలవంటి, తరళాక్షి = చలించు కన్నుగలదియని స్వభావార్థము, మగధ = మగధదేశము చేత, సన్నుత = స్తుతింపఁబడునది యనికాకువు, మగధ = స్తుతి పాఠకులచేత, సన్నుత = నుతింపఁబడునది యని స్వభావార్థము, కాశ్మీర = కాశ్మీరదేశమువంటి, మంజుల = మనోజ్ఞమైన, ఓష్ఠి = పెదవిగల దియని కాకువు, కాశ్మీర = కుంకుమపూవువంటి, మంజుల = మనోజ్ఞమైన, ఓష్ఠి = పెదవిగలదియని స్వభావార్థము, శ్యామబర్బర = మనోజ్ఞమైన బర్బరదేశముగలది యని కాకువు, శ్యామ = నల్లనైన, బర్బర = కేశ పాశముగలది యనిస్వభావార్థము, కాంభోజ = కాంభోజదేశమువంటి, చారు = ఒప్పిదమైన, నాభి = బొడ్డుగలది యని కాకువు, కాంభోజ = పొన్నపూవు వంటి, చారు = శృంగారమైన, నాభి = పొక్కిలి గలది యని స్వభావార్థము, అగుటన్ = అవుటవలన, అకొమ్మ = ఆచేడియ, దేశవిఖ్యాత = దేశముల పేరుల యొక్క ప్రసిద్ధినిఁ బొందినదియని కాకువు, దేశప్రసిద్ధినిఁ బొందినది యని స్వభావార్థము, సుమ్మ = చూఁడుమా, సి కాశ్మీరం కుంకుమే ప్రోక్తం, అనియును, బర్బరః పామరే కేశవిన్యాసే సీ వృదంతరే అనియును, కాంభోజ స్తురగేసోమవల్కే పున్నాగపాదపే, అని విశ్వము

క॥ ప్రభవానంద శ్రీముఖ
విభవాక్షయ చిత్రభాను • విక్రమజయయున్
శుభకృద్భావ యగుట నా
యిభగమన గుణములనెన్న • నేండ్లానాకో॥ 11

టీక ప్రభవ = జనించినట్టి, ఆనంద శ్రీ = సంతోషసంపద, ముఖ = మొదలైన, విభవ = వైభవముల యందున, అక్షయ = నాశనము లేనిదియును, చిత్ర = ఆశ్చర్యమైన, భాను = కాంతియును, విక్రమ = పరాక్రమమును, జయయున్ = జయములు గలదియును, శుభకృత్ = మంగళములు గలుగఁజేయు, భావ = హృదయముగలదియును, అగు

టన్ = జనందుచేత, ఆయిభగమన గుణముల నెన్నన్ = అగజగామిని గుణముల నెంచఁగా, ఏండ్లౌనౌకో = సంవత్సరములు పట్టునేమొ, అని స్వభావార్థము, ఇఁకను, ప్రభవ ఆనంద శ్రీముఖ విభవ అక్షయ చిత్రభాను విక్రమ జయ శుభకృత్ భావ అను వత్సరనామములు ధ్వనించు గుణవిశేషము లగుటవలన నా గజయాన గుణంబుల నెంచి చూడఁగా సంవత్సరములగునా యేమి యని విశేషార్థము.

గీ॥ ఆదిశేషాహి వేణి సో • మాననయును
మంగళాకార బుధనుత • మాన్యచరిత
మంజు గురుకుచ కావ్యజ్ఞ • మందయాన
గాన సఖి శుభవార యు • క్తయగునేమొ 12

టీక. ఆదిశేషాహి = ఆదిశేషఫణివంటి, వేణి = జడగలదియును, సోమ = చంద్రునివంటి, ఆననయును = ముఖముగలదియును, మంగళా కార = కల్యాణమైన రూపముగలదియును, బుధ = పండితులచేత, నుత = కొనియాడఁబడు, మాన్యచరిత = పూజ్యచారిత్రములు గలదియును, మంజు = మనోజ్ఞములును, గురు = గొప్పలునగు, కుచ = స్తనములు గలదియును, కావ్య = ప్రబంధములను, జ్ఞ = ఎఱిఁగినదియును, మంద = మెల్లనయైన, యాన = నడకలు గలదియును, కానన్ = అగును గావున, సఖి = అప్రియురాలు, శుభవార = మేలుల సముదయముతో, యుక్త = కూడుకొనినది, అగునేమొ = ఔనో యేమొ, అని స్వభావార్థము. ఇఁకను, ఆది సోమ మంగళ బుధ గురు కావ్య మంద అను సప్తవార నామములు ధ్వనించు విశేషణోపేత గుణములుగలది యగుటచే, నా చెలియ శుభమైన వారములతోఁ గూడుకొనినది యగునేమొ యని విశేషార్థము

క॥ అకార స్వాతి లస
చ్ఛ్రీకార శ్రవణ శేము • షీ జ్యేష్ఠ సతీ

లోకో త్తర మృదుహ స్తయు
నౌ కామిని సదమలాంగి • యనసార్థమెకా. 13

టీక అకార= రూపమందున, స్వాతి = స్వాతీనక్షత్రమని కాకువు, సజ్జాదేవియని స్వభావార్థము, లసత్ = మనోజ్ఞమైన, శ్రీ=సంపదలను, కార = కలుగఁజేయుటయందున, శ్రవణ = శ్రవణానక్షత్ర మని కాకువు, లసత్ = ఒప్పిదమైన, శ్రీకార = శ్రీయనే వర్ణమువంటి, శ్రవణ = చెవులు గలదియని స్వభావార్థము, శేముషి బుద్ధియందున, జ్యేష్ఠ = జ్యేష్ఠానక్షత్ర మని కాకువు, శ్రేష్ఠురాలని స్వభావార్థము, సతీలోక = స్త్రీజనములందున, ఉ త్తర = ఉత్తరానక్షత్రమని కాకువు, ఉత్తమురాలని స్వభావార్థము, మృదు = కోమలమునందున, హ స్తయున్ = హస్తానక్షత్రమని కాకువు, మృదుకరములు గలదియని స్వభావార్థము, ఔకామిని = అగునట్టిచేడియను, సత్ = నక్షత్రములనే, అమల = కల్మషరహితమైన, అంగి = శరీరముగాఁగలది, అనన్ = వచింపఁగా, సార్థమెకా = అర్థయు క్తమ కదాయని కాకువు, సదమలాంగి = శ్రేష్ఠమైన కల్మష రహితనుగు నవయవములుగలది, అనన్ = అనంగా, సార్థమెకా = సార్థకమే యగునుగదా యని స్వభావార్థము.

ఆ॥వె॥ మకర జంఘసింహ • మధ్య కుంభ స్తని
కటక భూషిత కర • కమల మీన
నయన చాప భ్రూద్వి • తయయు సాక్షాత్కన్య
యగుట రమ్యరాశి • యనరె దాని. 14

టీక మకరజంఘ = మొసళ్ళవంటి పిక్కలు గలదియును, సింహ మధ్య = సింహమునడుమువంటి నడుముగలదియును, కుంభ స్తని = కడవలవంటి కుచములు గలదియును, కటక = కంకణములచేత, భూషిత = అలంకరింపఁబడిన, కరకమల = హ స్తపద్మములుగలదియును, మీననయన = చేపలవంటి కన్నులుగలదియును, చాప=ధనుస్సులవంటి, భ్రూద్వితయయున్ = కనుబొమ్మల జంటఁగలిగినదియును, సాక్షాత్ = ప్రత్యక్షమగు, కన్య =

స్త్రీయును, అగటన్ = ఐనందువలన, రమ్యరాశియనరెదానిన్ = ఆ చేడియను, ఒప్పులకుప్పయని వచింపరా (వచింతురనుట) కటకము కంకణమనుటకు, ని కటకం వలయేసానౌ అని విశ్వము, అనఁగా నిందు తత్కాంతావయవములకు వరుసగా, మకరము సింహము కుంభము కర్కాటకము మీనము ధనుస్సు కన్య అను రాసులను, ఉపమించుటవలన నాబిడను రమ్యరాశియని వచియింపుదురని విశేషము, కటకము కర్కాటకమనుటకు ని కుళీరః కర్కిటకః, అని ముహూర్త దీపిక.

గీ॥ బొమల కేకాదశి సమాన • ముగను రామి
నవమి యిరువైపులన్ వచ్చి • నన్ శ్రుతులకుఁ
బ్రతిన గాదాయె నొకఁడు నౌ • పాద్యమి యిఁక
నతివ నుదుటికిఁ దలక్రిందు • లైన సరియె ॥ 15

టీక. బొమలకుఁ = ఆ చేడియ కనుబొమ్మలకు, ఏకాదశి = పదనొకండవతిథి (అనఁగా ౧౧ ఈ స్వరూపముతో నుండునది) సమానముగను రామి = సరిరాకపోవుటవలన, నవమి = తొమ్మిదవతిథి (అనఁగా ౯ ఈస్వరూపముతో నుండునది) ఇరువైపులఁ వచ్చినన్ = రెండువైపుల వచ్చినప్పటికిని, శ్రుతులకున్ = ఆ యువతి చెవులకు, ప్రతినగాదాయెన్ = సమానముగాకపోయెను, ఇఁకఁ = ఇంకను, ఒకఁడునౌపాద్యమి = ఏక సంఖ్యాకమయిన మొదటి తిథి (అనఁగా ౧ ఈ స్వరూపముతో నుండునది) అతివ నుదుటికిన్ = ఆ చేడియ నొసలునకు, తలక్రిందులైనన్ = మీదు క్రిందైనప్పటికిని, సరియె = సమానమగునా (కాదనుట) అనఁగా స్త్రీలకనుబొమ్మలకు పదకొండవసంఖ్యయును చెవులకు తొమ్మిదవ సంఖ్యయును సామ్యములుగాఁ బోల్చుట కవిసమయ సిద్ధములనియును, నుదుటికి బాలచంద్రునిఁ బోల్చుటవలన నట్టి బాలచంద్ర రేఖాకృతిఁ గల యొకటవ సంఖ్య నుపమానముగాఁ గై కొనఁబడినదనియును గ్రహింపునది

క॥ అమవస రేయేశిఖ పు
న్నమ రేయే ముద్దుఁగుల్కు • నగవెన్నఁగ సం
క్రమణము రే చన్గవ వ
ర్వములేల నెలంతగలుగఁ • బండుగలేలా॥ 16

టీక॥ శిఖ = ఆచేడియయొక్క కేశపాశము, అమవసరేయే = అమావాస్య రాత్రియే యగును, ముద్దుఁగుల్కునగవెన్నఁగన్ = మనోజ్ఞముప్పతిల్లు నవ్వు నెంచఁగా, పున్నమ రేయే = పూర్ణిమమునాటిరాత్రియే, చన్గవ = స్తన యుగళము, సంక్రమణము = ఒండొంటిని దొరసినవి, అరే = ఆశ్చర్యము, నెలంత గలుగన్ = ఆకోమలి గలుగఁగా, పర్వములేల = అమావాస్య పూర్ణిమాది పర్వదివసము లెందుకు, పండుగలేలా = సంక్రమణమాది పండుగ లెందుకు (అనఁగా నవసరము లేవనుట)

గీ॥ కలికి ముఖమును వర్ణింపఁ • గా నెలయగు
నతివ కురులెన్నఁగా నొక్క • యబ్దమగును
నెలఁత కనుఁగవ రీవి వ • ర్ణింప నెంత
యుత్తమునకైన ననిమిష • యుగముగాదె॥ 17

టీక కలికి ముఖమును వర్ణింపఁగాన్ = ఆ చేడియ మోమును వర్ణనముసేయఁగా, నెలయగున్ = మాసము దివసములగునని యర్థాంతరము, చంద్రుఁడగునని భావము, అతివకురులెన్నఁగాన్ = ఆ తొయ్యలి శిరోజముల గణింపఁగా (అనఁగా వర్ణింపగాననుట), ఒక్క యబ్దమగును = ఒక సంవత్సరమగునని యర్థాంతరము, ఒక మేఘమగునని భావము, నెలఁతకనుఁగవ రీవి వర్ణింపన్ = ఆ పొలతి కన్నుదోయి సీటును వర్ణనసేయఁగా, ఎంత యుత్తమునకైనన్ = ఎంతటి శ్రేష్ఠునకైనను, అనిమిషయుగముగాదె = దేవతా యుగముగాదా యని యర్థాంతరము (మహాయుగమనుట) చేపల జంట గాదాయని భావము, నెలయనిన మాసమునకును చంద్రునకును జెల్లుననుటకు,

నెలకు జాబిల్లికౌ నెలయనంగ, అని సాంబనిఘంటువు అబ్దమనిన సంవత్సర మునకును మేఘమునకును చెల్లుననుటకు, ని అబ్దస్సంవత్సరే మేఘే అని విశ్వము అనిమిషమనిన దేవతలకును చేపలకుఁ జెల్లుననుటకు ని. అనిమేష శ్చానిమిషోఽ ప్యేతౌద్వౌ సురమత్స్యయోః, అని నానార్థ రత్నమాల, యుగ మనిన జంటకును యుగమునకుఁ జెల్లుననుటకు, ని యుగం యుగ్మే కృతా దిషు, అని యమరము

గీ॥ పొలఁతి నాసిక నువుపూతఁ ♦ బూచినట్లుఁ
గలికి వ్రేళ్ళు పెసరకాపుఁ ♦ గాచినట్లు
నింతి జంఘలు వరిపొట్ట ♦ లేర్పడినటు
లుండె సతిగల్గనిఁకఁ బంటఁ ♦ బండకున్నె 18

స్త్రీల ముక్కునకు నువ్వుబువ్వను వ్రేళ్ళకుఁ బెసరకాయలును పిక్క లకు వరిపొట్టలను పోల్చుట కవి సమయ సిద్ధము గావున నాకామిని ముక్కు నువ్వుపూతఁ బూచినట్లును వ్రేళ్ళు పెసరకాపుఁ గాచినట్లును పిక్కలు వరిపొట్ట లేర్పడినటు లుండెను గావున నాపె గల్గినచో పంటఁబండక పోవునా (అనఁగా మనోరథ మీడేరక పోవునా యని తాత్పర్యము)

గీ॥ వదన మబ్జము కనులు క ♦ ల్వలు రదాళి
కుందములు నాస సంపఁగి ♦ కుచము లలరు
చెండ్లు పొక్కిలి పొన్నయై ♦ చెలఁగు కతనఁ
గామినీమణి సుమగంధి ♦ గాక యున్నె॥ 9

ముఖము కమలముగను కన్నులు కలువలుగను పలువరుస మొల్లలు గను ముక్కు సంపంగిగను స్తనములు పూలగుత్తులుగను బొడ్డు పొన్నపువ్వ గను దనరుచుండుటవలన వకాంతారత్నము పువ్వులవంటి పరిమళముగలది గాకపోవునాయని తాత్పర్యము

గీ॥ రీవి గుబ్బలు నిమ్మపం • డ్లే చుబుకము
తియ్యమామిడి పండె వా • తెఱయు దొండ
పండె నుడితేనె పండె స • ఫలముగ నల
కొమ్మ యిటనున్నఁ బంట నా • క్కుదునుగాదె॥ 20

స్తనములు నిమ్మపండ్లే యగుననియును గడ్డము తియ్యమామిడిపండే యగుననియును పెదవి దొండపండే యగుననియును వాక్యము తేనెపండే యగుననియును ఫలయుక్తముగా నాకొమ్మ యిచ్చటనుండినచో॥ పంటనొక్కి చవిఁజూతునుగదా ? అనఁగా నాకాంత యిటనుండినట్లైన ముద్దాడుదునుగదాయని తాత్పర్యము

గీ॥ పరమ కల్యాణి శంకరా • భరణవేణి
సుతర శ్రీశ్రోత్ర పున్నాగ • నుతచరిత్ర
మోహనాకార యగుటనా • ముద్దుగుమ్మ
గణనసేయఁగ రాగ సం • కలితగాదె 21

టీక పరమ కల్యాణి = ఉత్కృష్టమైన కల్యాణిరాగము గలదియని కాకువు, శ్రేష్ఠమైన మంగళములు గలదియని స్వభావార్థము, శంకరా భరణ వేణి = శంకరాభరణ రాగమును జడగాగలదియని కాకువు, శంకర = ఈశ్వరునియొక్క, ఆభరణ = భూషణమయిన శేషునివంటి, వేణి = జడ గలదియని స్వభావార్థము సుతర = శ్రేష్ఠతరమయిన, శ్రీశ్రోత్ర = శ్రీ రాగమును చెవులుగాగలదియని కాకువు, శ్రీకారములవంటి చెవులుగలదియని స్వభావార్థము, పున్నాగనుతచరిత్ర = పున్నాగ రాగముచేత కొనియాడఁబడు చారిత్రములు గలదియని కాకువు,పున్నాగులను దేవతలలో నొకతెగవారిచే కొని యాడఁబడు చారిత్రములుగలదియని స్వభావార్థము, మోహనాకార = మోహన రాగమునే స్వరూపముగాగలదియని కాకువు, వలపుఁగలిగించు రూపముగలది యని స్వభావార్థము, అగుటన్ = ఐనందువలన, ఆముద్దుగుమ్మ = ఆమ

నోజ్జ్వరాలు, గణనసేయఁగన్ = వర్ణనఁ జేయఁగా, రాగసంకలితగాదె = రాగములతోఁ గూడుకొన్నదిగాదా యని కాకువు, ప్రేమతో నొప్పుచున్నది గాదా యని స్వభావార్థము రాగము ప్రేమయనుటకు, ని ప్రేమాభిలాష ఆలంభో రాగ స్నేహపోహ్యతః వరం అని ధనంజయ నిఘంటువు.

గీ॥ మత్తకోకిల వాణి చం • పకసునాస
కందకచ యుత్పలాక్షి శ్రీ • కర్ణయుగళ
అంబురుహముఖి మత్తేభ • యానయగుటఁ
గలికి వృత్తాదులగణింపఁ • గావ్యమగుఁగ 22

టీక॥ మత్తకోకిలవాణి = మత్తకోకిల వృత్తమునే పలుకులుగాఁ గలదియని ధ్వనియును, మదించిన కోయిలవంటి పలుకులుగలదియని స్వభావార్థమును, చంపకసునాస = చంపకవృత్తమునే ముంచిముక్కుగాఁ గలదియని ధ్వనియును, సంపంగిపూవువంటి శ్రేష్ఠమయిన నాసికముగలదియని స్వభావార్థమును, కందకచ = కందపద్యమునే కురులుగాగలదియనిధ్వనియును, మేఘమువంటి కురులుగలదియని స్వభావార్థమును, కందము మేఘమనుటకు, ని. కందస్స్యాత్పూరణేసస్యమూలే జలధరేఽపిచ, అని విశ్వము ఉత్పలాక్షి = ఉత్పలమాలికావృత్తమునే కన్నులుగాఁ గలదియని ధ్వనియును, కలువల వంటి కన్నులు గలదియని స్వభావార్థమును, శ్రీకర్ణయుగళ = శ్రీవృత్తమునే శ్రవణద్వయముగాఁ గలదియని ధ్వనియును, శ్రీకారమువంటి వీనుల జంట గలదియని స్వభావార్థమును అంబురుహముఖి – అంబురుహవృత్తమునే ముఖముగాఁ గలదియని ధ్వనియును, పద్మమువంటి మోముగలదియని స్వభావార్థమును, మత్తేభయాన = మత్తేభవృత్తమే నడకగాఁ గలది యని ధ్వనియును, మదించిన యేనుఁగు నడకలవంటి నడకలు గలది యని స్వభావార్థమును అగుటన్ = ఔటచేత, కలికి – ఆకోమలియొక్క, వృత్తాదుల గణింపన్ = మత్తకోకిలాది వృత్తముల నెంచఁగాన

నిధ్వనియును, ఒక ప్రబంధమునకగునుగా యని స్వభావార్థమును, వృత్తము నడతయనుటకు, ని. వృత్తం చరిత్రచ్ఛందసోరపి, అని విశ్వము మత్తకోకిలాదులు వృత్తములగుటవలనను కందము జాతులలో జేరిన పద్య మగుటవలనను వృత్తాదుల గణింపఁగావ్యమగుఁగ, అని ప్రయోగింపఁబడెనని గ్రహించునది.

క॥ పొలతుక చెక్కులు కపురపు
పలుకుల తళుకులను గెలుచుఁ ♦ బలుకులు కొలుకుల్
చిలుకలకులుకున్ గెలుచున్
జెలిచూపులు నలరువిలుతు ♦ చిలుకుల గెలుచున్॥ 23

ఈపద్యమునందున పలుకులు కొలుకుల్ చిలుకలకులుకున్ గెలుచున్ అనుటచే చిలుక పలుకులవంటి పలుకులు గలది యనియును చిలుకముక్కుల వంటి కనుఁగొలుకులు గలదియనియును గ్రహించునది, తతిమ్మావిషయము సుగమము.

గీ॥ అళులు సుమములఁ దిరిగెడు ♦ నవియగుటను
నాభియను పొన్నపువునుండి ♦ నాతిచనులు
పూలగుత్తులనుచు నెంచి ♦ పోవు తేటి
బాలు గాఁబోలుననవొప్పు ♦ నతికినారు॥ 24

టీక॥ సుగమము.

గీ॥ ఇంతి కటినెంతురే యిసు ♦ మంతయైన
దంతరుచి నెంచగలరె ర ♦ వ్వంతయైన
కాంత తనువెన్నఁగునె కా ♦ సంతయైన
నిఁక మిగిలినట్టి సౌరెన్న ♦ నెట్టులగును॥ 25

టీక. ఇంతి = ఆచేడియయొక్క, కటిన్ = పిరుదును, ఇసుమంత యైనన్ = కొంచమైనను, ఎంతురే = వర్ణించఁగలరా, అని యర్థాంతరము,

ఇసుమంతయైన = ఇసుక దిబ్బంతదియగు, కటినెంతురే = పిరుదునెన్నఁ గలరా, అనిభావము, రవ్వంతయైనన్ = కొంచమైనను, దంతరుచి నెంచఁగలరె = పలుఛాయన్ వర్ణింపఁగలరా, అనియర్థాంతరము, రవ్వంత యైన = వజ్రమంతకాంతిగలవియైనట్టి, దంతరుచిన్ = పలుఛాయన్, ఎంచఁ గలరె = వర్ణింపఁగలరా, అని భావము, కాసంతయైనన్ = కొంచమైనను, కాంత = మనోజ్ఞమగు, లేక, ఆచేడియయొక్క, తనువెన్నఁగునె = శరీర మును వర్ణింపనౌనా, అని యర్థాంతరము, కాసు = బంగారునాణెము, అంత యైన = అంతటిదియైనట్టి, కాంతతనువున్ = మనోహరమైన శరీరమును, ఎన్నఁగునే = ఎంచశక్యమగునా, అనిభావము, ఇఁక మిగిలినట్టి సౌరెన్నన్ = ఇంకశేషించినట్టి చక్కదనమును వర్ణింపఁగా, ఎట్టులగును = ఏవిధముగా శక్యమగును (కాదనుట)

గీ॥ కోమలాంగి సుగుణములు • కోటియగును
కొమ్మ రదనాళియో శత • కోటియగును
సుదతి కటిసీమయందుమా • క్షోణియగును
పల్కుబల్కిన నిఁకనెంత • పైకమగునొ॥ 26

టీక కోమలాంగి = ఆభేడియయొక్క, గుణములు = మంచి గుణ ములు, కోటియగును = కోటినాణెములగునని యర్థము, అతిశయమ గుననిభావము, ని కోటిరశ్రాచాపాగ్రే సంఖ్యాభేదే ప్రకర్షయోః, అని విశ్వము కొమ్మరదనాళియో = ఆకాంత దంతపంక్తియన్ననో, శత కోటియగును = శతకోటినాణెములగునని యర్థము, వజ్రాయుధమే యగు నని భావము, ని శతకోటి స్స్వరుశ్శంబో, అని యమరము సుదతి కటి సీమయందుమా = ఆనారియొక్క శ్రోణిప్రదేశమందామా, క్షోణియగును = క్షోణిసంఖ్య నాణెములగునని యర్థము, భూమియేయగునని భావము, ఇఁకన్ = ఇంకను, పల్కుబల్కినన్ = మాట్లాడినటులైన, ఎంతపైకమగునొ = ఎంతధనమగునో యని యర్థము, ఎంతటి ఫికస్వముధ్యమగునో యని భావము, అనఁగా నాకాభిని సుగుణము లతిశయించినవనియును, పలువర్ణస

నూఱంచుల వాలును పోలుననియును (వజ్రాయుధమునునుట), కటిప్రదేశము భూమిని పోలుననియును, పలుకులు కోకిలలను పోలుననియును, ఫలితార్థము

గీ॥ కీర్తినెన్నఁగ సర్వజ్ఞ • మూర్తికైన
దానమెన్నఁగ వానిపై • వానికైన
నరితి వర్ణింపఁగా వాని • యబ్బకైనఁ
దరమె నాకౌనె దానివృ • త్తముల నెన్న॥ 2'

టీక. కీర్తినెన్నఁగన్ = అయింతి యశమును గణింపఁగా, సర్వజ్ఞమూర్తికైనన్ = సమస్తము నెఱిఁగినవానికైననని యర్థము, సాంబమూర్తికైన నని భావము, దానమెన్నఁగన్ = ఆపె యీవిని యెంచఁగా, వానిపై వానికైనన్ = అసర్వము నెఱిఁగిన వానికంటె నతిశయునకయిన నని భావము, అసాంబమూర్తిపైవాఁడు చంద్రుఁడగను గాన నాచంద్రునకైన నని భావము, అరితిన్ = ప్రేమను, వర్ణింపఁగా = వర్ణనఁ జేయగా, వాని యబ్బకైనన్ = అయతిశయుని తండ్రికైన ననియర్థము అ చంద్రుని తండ్రియైన సముద్రుని కైన నని భావము, తరమె = శక్యమగునా, దాని వృత్తములనెన్నన్ = ఆ కొమ్మ ప్రకర్షము నెంచఁగా, నాకౌనె = ఇంక నాశక్యమగునా (కాదనుట) అనఁగా కీర్తికి తెలుపువర్ణమును, ఈవికి చంద్రుని, ప్రేమకు సముద్రుని, పోల్చుట కవిసమయసిద్ధము గావున, శంకరునిశరీరమును కీర్తియును చంద్రునిన్ దాతృత్వమును సముద్రునిన్ దయయను మించివచని ఫలితార్థము.

గీ॥ చక్కనై యొప్పు నాలేమ • యొక్క నడయె
భూరి సద్రాజ హంసాళిఁ • గేరుచున్న
నంగ నఖ ముఖ కరుణా క • దాళి కిఁ కను
భూరిసద్రాజహంసాళి • పూగమరుదె॥ 28

టీక. చక్కనై యొప్పు — అందమైయొప్పునట్టి, ఆలేమ అయింతి

తియొక్క, ఒక్కనడయె = ఒక్కనడకయే, భూరి = విస్తారమగు, సత్ = శ్రేష్ఠమయిన, రాజహంసాళిన్ = రాజహంసల సముదయమును, తేరుచున్పన్ = తిరస్కరింపుచుండఁగా, అంగ = శరీరమునకు, నఖ = గోళ్లకు, ముఖ = మోముకు, కరుణ = దయకు, కచాళికి = వెండ్రుకల సముదాయమునకు, ఇఁకిను = ఇంకను, భూరి = బంగారును, ని. భూరిప్రాజ్య సువర్ణయోః, అని విశ్వము సత్ = నక్షత్రములును, ని సత్త్రికబమ్సృషే, అని నానార్థరత్నమాల, రాజ = చంద్రుఁడును, ని రాజా మృగాంకే క్షత్రియే నృపే, అని యమరము, హంస = విష్ణుమూర్తియును, అళి పూగము = తుమ్మెదల సముదయమును, ని హంసో నారాయణే బ్రధ్నే, అనిధనంజయ నిఘంటువు, ఆరుదె = తిరస్కరించు టొక యాశ్చర్యమా (కాదనుట) అనఁగా నాకాంతయొక్క నడకయే మిక్కిలి శ్రేష్ఠమైన రాజహంసల సముదయమును తిరస్కరింపుచుండఁగా, శరీరమునకు బంగారును, గోళ్ళకు చుక్కలను, మోమునకు చంద్రుని, దయకు విష్ణువును, కురులకు తుమ్మెదలను, తిరస్కరించుట యొక యరుదు గానేరదని తాత్పర్యము.

క॥ సారంగము దూఱునుడి
సారంగముఁ దారుమారు, సలుపుఁగచంబుల్
సారంగముఁ గేరుఁ గనుల్
సారంగము మీఱు నడల సౌభాగ్యంబుల్॥ 29

టీక నుడి = ఆకొమ్మయొక్క పలుకు, సారంగమున్ = చాతక పక్షిని, దూఱున్ = నిందించును, కచంబుల్ = వెండ్రుకలు, 'సారంగమున్ = తుమ్మెదను, తారుమారు సలుపున్ = వ్యత్యస్తముఁ జేయును, కనుల్ = నేత్రములు, సారంగమున్ = జింకను, కేరున్ = తిరస్కరించును, నడల సౌభాగ్యంబుల్ = నడకలయొక్క సుభగత్వములు, సారంగమున్ = ఏనుఁగును, మీఱున్ = అతిశయించును, ని సారంగశ్చాతకే భృంగే కురంగే చ మతంగజే, అని విశ్వము

అనఁగా నాయింతిపలుకులు వానకోయిల పలుకులకంటెను, వెండ్రుకలు తుమ్మెదచాయకంటెను, కన్నులు జింక కన్నులకంటెను, నడకలు ఏనుంగు నడకలకంటెను, మించియుండెనని తాత్పర్యము

పంచచామరము

అనంతసన్నిభంబునౌ నా • యారివేణిఁజూడఁగా
ననంతతుల్యమౌ సరోరు • హాక్షికౌనుఁగాంచఁగా
ననంతయే యనందగున్ ల • తాంగిశ్రోణి నెన్నఁగా
ననంతసద్గుణప్రకాండ • యౌను తత్సతిన్ గనన్॥ 30

అయింతి జడ శేషునకు సమానమైన దనియును, నడుము గగనమునకు సమానమైనదనియును, పిరుదు భూమియేయగుననియును, అనంత సంఖ్యాకమైన సుగుణ సముదయముగలదియనియును తాత్పర్యము, ని అనంతశ్శేష విష్ణ్వోస్స్యాదనంతం సురవర్త్మని, అనంతా హైమవత్యాంచ గుడూచ్యాం చావనావపి, అని విశ్వము.

చ॥ అచలను బోలునట్టి కటి • నారసి యాలలనా కుచద్వయం
బచలయుగంబునాయెఁ గటి • యాదటనే యరియైనఁగాంచి త
త్కుచము లరిద్వయంబయి యె • దుర్కొని చంకలదూఱిగూడలం
టుచుఁ జెవులందఁ బైకెగసె • దు న్నడిమంత్రపుఁ గల్మికిబ్లైకా॥

టీక॥ అచలనుబోలునట్టి కటిన్ = భూమినిబోలునటువంటి పిరుదును, అరసి = చూచి, ఆలలనా = ఆయెలనాగయొక్క, కుచద్వయంబు = స్తనయుగ్మము, అచలయుగంబునాయెన్ = అచలవాచ్యమైన పర్వతయుగళమాయెను, కటి = పిరుదు, అదటనే = వెంటనే, అరియైనన్ = శత్రువు కాఁగా, కాంచి=చూచి, అని యర్థము, రథచక్రము కాఁగాఁజూచి యనిభావము, తత్కుచములు = ఆస్తనములు, అరిద్వయంబయి = శత్రుయుగళమై అని యర్థము అరివాచ్యమయిన చక్రవాకపక్షి యుగ్మమై యనిభావము, ఎదుర్కొని = ఒండొండభిముఖములై, చంకలన్ = చంకలయందున, దూఱి = దొచ్చి

నఖియై, గూడలన్ = భుజాగ్రములను, అంటుచున్ = అంటుకొనుచును, చెవులందన్ = చెవులనందుకొనుటకు, పైకెగసెడున్ = మీదికెగయును, నడిమంత్రపుఁగల్మికిట్లైకా = మధ్యకాలమునఁ గల్గిన సంపత్తున కింతయే కదా, అనఁగా నచలకుతుల్యమయిన పిరుదులనుఁ గాంచి స్తనద్వయము, అచలయుగ్మమాయెననియును, తదుపరి పిరుదు, అరియయినన్ గని స్తనము లరిద్వయమాయెననియును, అంతట నాగక చంకల క్రిందిదనుకాపోయి దూటి గూడలందుకొని చెవులు బట్టుకొన పయికెగరబోవుననియును, శ్రీగల్గినవాడే పిరుదు జనించినదనియును పిరుదుతోడనె చంకలు గూడలు చెవులు గల్గినవి యనియును, కావున అందువలన తదవయవములు పిరుదునకు సంబంధించినవి యనియును, వాటినాక్రమించి చెవులు బట్టుకొని యాడించుటకు స్తనములు పయికెగయుననియును నడిమంత్రపుకల్మియనుటచే కుచములు మధ్యకాలముతో వృద్ధిఁబొందినవి యనియును ఫలితార్థము శ్రీలకుచములెగుమొనలు గలవిగా వర్ణించుట కవిసమయసిద్ధమని గ్రహించునది

గీ॥ ఎందును పయోధరంబులు • గ్రిందుఁజూచుఁ
చికురములు మీదుఁజూచుఁ గూ • డుకొనుఁగాని
నాదుసతిపయోధరములు • మీదుఁజూచుఁ
చికురములు గ్రిందుఁజూచు వి • చిత్రమహహ॥ 32

టీక ఎందును = ఎచ్చటనయినను, పయోధరంబులు = మేఘములు, క్రిందుఁజూచున్ = క్రిందికిఁ జూచును, చికురములు = పర్వతములు, మీదు జూచున్ = మీదికిఁజూచును, కూడుకొనున్ = మేఘములు పర్వతాశ్రయము లగుటచేత నొకానొక వేళ కలసుకొనుచుండును, కాని= అట్లుండుట స్వాభావికముగాని నాదుసతి పయోధరములు = నాభార్య యొక్క పయోధరములు (స్తనములనుట) మీదుఁజూచున్ = పయికిఁజూచును, చికురములుగ్రిందుఁ జూచున్ = నాసతియొక్క చికురములు క్రిందికిఁజూచును, విచిత్రమహహ, ఆహా మిక్కిలియాశ్చర్యము (చికురములనఁగా కురులనుట) ని శ్రీ స్తనాగ్ర

యోధరౌ, అని యమరము, చికురశ్చంచలే కేశేగృహబభ్రుభుజంగయోః, పక్షిభ్రమభేదయోశ్శైలే, అని విశ్వము.

క॥ అన్నన్న నునుమొగము సిరి
యన్నన్నను గెల్చె నతివ ♦ యధరమ్మృదులమో
యన్న న్నన గెల్చును దెలి
య న్నన్నన నొక్క లెక్క ♦ యా గెల్చుటకున్॥ 33

టీక. అన్నన్న = ఆశ్చర్యము, నునుమొగము = మెఱుఁగయిన వదనము, సిరియన్న = లక్ష్మీదేవియను స్త్రీయొక్క, అన్నను = అగ్రజుని (చంద్రుసనుట) గెల్చెన్ = జయించెను, అతివ = ఆ చేడియయొక్క, అధరమ్మృదులమోయన్నన్ = పెదవి కోమలమోయనినను, ననన్ గెల్చును = చిగురుటాకును జయించును, తెలియన్ = తెలుసుకొనినచో, నన్న+అనన్ = నన్ననఁగా, నొక్క లెక్కయా గెల్చుటకున్ = జయించుట యొక్క లెక్కయగునా (కాదనుట)

క॥ కం బాకంఠరము వాణి పి
కం బామా పతనుసాయ ♦ కం బామధు పా
కం బామోవి కుచము కో
కం బాసంపంగి నాసి ♦ కం బాసలికన్॥ 34

టీక సుగమము

క॥ బింబము శశిబింబముఁ బ్రతి
బింబములనఁ జాలేదు పెద ♦ వియు మొగము మదే
భంబుల కుంభంబులకుం
భంబులకు శుభంబులిడు న♦ బల కుచ నఖముల్॥ 35

టీక బింబమున్ = దొండపండును, శశిబింబమున్ = చంద్రబింబ

ము, ప్రతి బింబములు = మానిదలు, అనన్జాలెడు = అనుటకు తగినటు వంటి, పెదవియు మొగము = అధరమున్ను ముఖమున్ను, మదేభంబుల = మత్తగజములయొక్క, కుంభంబులకున్ = కుంభ స్థలములకును, భంబుల కున్ = నక్షత్రములకును, శుభంబులు = మంగళములు, అబల కుచ నఖ ముల్ = ఆతన్వియొక్క స్తనములును గోళ్ళున్ను, ఇడున్ = ఇచ్చును, అనఁగా బింబ శశిబింబములకు పెదవియు మొగమున్ను గజకుంభ భంబులకు కుచ నఖములు క్రమము గ్రహించునది

ఆ॥వె॥ బోటి సాటి మేటి • ఁకోటి లేదెటఁ దేటి
జారు సౌరుఁ గేరు • నారు తీరు
ప్రోద తోడఁ గూడ • కీడ నేడయుఁ జూడ
లేము సోము నోము • మోము గోము॥ 36

టీక సుగమము.

క॥ మందమ్ములు నవులు నడల్
మందమ్ములు కన్నులు గరి • మందమ్ములు నే
మందమ్ములు చూపులగో
మందమ్ములు బొమ్మలు పిచు • మంద దళములౌఁ॥ 37

టీక మందమ్ములు నవులున్ = నగవులు మెల్లనయును, నడల్ మందమ్ములున్ = నడకలు మెల్లనయును, కన్నులు = నేత్రములు, గరి మన్ = శ్రేష్ఠమునందున, తమ్ములు = పద్మములగును, చూపుల = చూడ్కులయొక్క, గోము = మృదులములయిన, అందమ్ములు = చక్కదన ములు, ఏమందు = ఏమిజెప్పుదును, అమ్ములు = బాణములగును, బొమ్మలు = కనుబొమ్మలు, పిచుమంద దళములు = వేపయాకులు, ఔన్ = అగును,

ఆ॥వె॥ వాలుగన్నులగును • వాలుఁగన్నుల తక్క
భ్రమరకములె యగును • భ్రమరకములు

యుగ లికుచములెక ♦ యుగ్మలి కుచములు
మించుమించు దేహ ♦ మించుమించు॥ 38

టీక. వాలుఁగన్నుల తళ్కు = వాలైన కన్నులయొక్క కాంతి, వాలుగ + అన్నులు + అగును = అడుచేపలే యగును, భ్రమరకములు = కురులు, భ్రమరకములె యగును = తుమ్మెదలే యౌను, ఉగ్మలి కుచములు = అచేడియ స్తనములు, యుగ్మ లికుచములెక = రెండు నిమ్మపండ్లే కద, దేహము = శరీరము, ఇంచుమించు = రమారమి, మించున్ మించున్ = మెరపుతీగె నతిక్రమించును.

సీ॥ సరసు తత్సతి నాభి ♦ జతగాక నుడల జో
దొందనెంచియుఁ దల ♦ క్రిందులయ్యె
నటుఁగాక వేరర్థ ♦ మై జడ కెనగాఁ బె
నంగి గామికి ముఖ ♦ భంగమయ్యె
నటులయ్యు మోవి సా ♦ మ్యముగాఁ దలఁచి గాక
తిరిగి కేలున కుద్ది ♦ దొరయనెంచె
నటులేనిగాక దు ♦ రాశచే మఱలను
తిరిగి శ్రోణికి సీడు ♦ దేలనెంచె
గీ॥ నటులఁగాక నొకట రెంట ♦ నరయ మూఁట
నాల్గిఁ బైదిఁట నాఱిట ♦ న్సమతగామి
వంక మూనియుఁ ఋరుగులు ♦ వడియు విషముఁ
గనియు నీరయి జాతియుఁ ♦ గలిసెనేల॥ 39

టీక. సరసు = కొలను, తత్సతి నాభి జతగాక = అచేడియ బొడ్డు సమానము గాఁజాలక, నుడులజోదొంద నెంచియున్ = మాటల సమానమును వహింపఁదలచి, తలక్రిందులయ్యెన్ = మీదుక్రిందాయెనని యర్థము, సరసు, అనుశబ్దము తలక్రిందు కాఁగా, సురస, అని యాయెనని భావము, సురస (అనఁగా శ్రేష్ఠమయిన తేనెయనుటఁ అటుఁగాక = తేనెమై మాటలతో సమానము

కాఁజాలక, వేరర్థమై = ఇంకొక యర్థమును పొందినదియై, (సురసఁ అనఁగా నాగమాతయనుట) జడకెనగాఁబెనంగి = జడకు సమానమగుటకుఁ బెనుగులాఁడి, కామికి = కానందులకు, ముఖభంగమయ్యెన్ = ముఖవర్ణస్స తగ్గినది యాయెనని యర్థము, ముఖాక్షరము లేనిదియైనదని భావము, ముఖాక్షరము పోఁగా, రస యని నిల్చెను (రస యనఁగా నమృతరస మనుట), అటులయ్యున్ = అట్లు నమృతరసమయ్యును మోవి సామ్యముగాఁ దలఁచికొక = పెదవితో సమానము కానెంచి కాకపోవుటవలన, తిరిగి = తలక్రిందై, రస తలక్రిందుకాఁగా, (సర అని యాయెననుట), కేలునకున్ = హస్తమునకు, ఉద్ధి = సమానము, దొరయనెంచెన్ = వహింపనెంచుకొనియెను (సర అనఁగా హార మనుట), అటులేనిగాక = అట్లు హారమై హస్తముతో సమానము రాఁజాలక, దురాశచే = చెడ్డయాసతో, మఱలను = మళ్ళి, తిరిగి = తలక్రిందై (సర, తలక్రిందుకాఁగా, రస అని యాయెననుట) శ్రోణికి నీడు దేలనెంచెన్ = పిరుదునకు సమానముగా తేలుటకు నూహించెను (రస యనఁగా భూమి యనుట), అటులఁగాక = అట్లు భూమియై పిరుదునకు సమానము రాజాలఁక, ఒకట రెంట నరయమూఁట నాల్గిఁ నైదిఁట నాఱిఁటన్ సమతగామి = ఒక్కంట రెండింట విచారింపఁగా మూడింట నాల్గింట నైదింట నాఱింటన్ సమానము కాఁజాలక పోవుటవలన, పంకమూనియున్ = పాపమును వహించియని యర్థము, బొడ్డుతో సమానము వచ్చుటకుఁ బూనిన కొలను బురదను వహించి యని భావము, పురుగులు వడియున్ = పాపమును వహించిన మీదట పురుగులు పడినవి యని యర్థము, మాటలతో సమానము వచ్చుటకుఁ బూనిన తేనెలో పురుగులు పడినవి యని భావము, విషముఁగనియున్ = పురుగులు పడినమీదట విషమును వహించియునని యర్థము జడకు సమానము వచ్చుటకుఁ బూనిన నాగమాత విషమును వహించియునని భావము, నీరయి = విషమువహించిన మీదట కుళ్ళి నీరై యనియర్థము, పెదవితో సమానము రాఁబూనిన యమృతరసము వల్ల

నయ్యెయని భావము జాతియున్ = కుళ్ళుపట్టి నీరై దిగజాతి యని యర్థము, హస్తములతో సమానము రాఁబూనిన హారము (వ్రేలకాడియని భావము, కలిసె నేలన్ = కుళ్ళుపట్టి నీరై జాతిన మీదటభూమి యందు కలిసెనని యర్థము, పిరుదుతో సమానము రాఁబూనిన భూమి మంటియందుఁ గలిసెనని భావము, అనఁగా కొలనులో బురదయుండుట, తేనెలో పురుగులు పడుట సర్పములకు విషముండుట, సుధ నీరుగానుండుట, హారము జాతియుండుట భూమి మన్నే యగుట సహజమని గ్రహించునది

చ॥ కు మగువశ్రోణిఁ బోలమికిఁ • గుందుచు సున్నకుఁ దెల్పనేను మ
ధ్యమును జయింతునంచుఁ జని • తా జతగాక భయన్ వయస్యకా
క్రమమును దెల్పెఁదాఁ జని న • ఖంబులఁ బోలక మూఁడునేకశ
బ్దముగను పోయి చన్గవకు • తగ్గెను కల్గవె నెత్తి పోట్లఁకన్॥ 40

టీక. కు = భూమి, మగువశ్రోణిన్ = ఆచేడియ పిరుదును, పోల మికిన్ = సమానము రానందుకు, కుందుచున్ = చింతింపుచు, సున్న కుఁదెల్పన్ = సున్నతోఁ దెల్పుకొనఁగా నేను మధ్యమును జయింతు నంచుఁ జని = ఏను నడుమును గెల్తుననిపోయి, తాన్ = తాను, జతగాక = సమా నము గాఁజాలక, భయన్ వయస్యకు = భ యనే చెలికత్తియకు (భ యనఁగా నక్షత్రమనుట), ఆక్రమమును దెల్పెన్ = ఆవిధమును తెలియపరిచెను, తాఁజని = అనక్షత్రముపోయి (అనఁగా భ యనుట) నఖంబులన్, బోలక = గోళ్ళతో సమానమురాఁజాలక (గోటిమాత్రము చేయక యనుట), మూఁడున్= ఆమూడును (అనఁగా, కు, యును, ం, యును, భ, యును, అనుట) ఏక శబ్దముగను పోయి = ఒక్కమాటమీదఁ బోయినవియై, చన్గవకుఁదగ్గెను = స్తనద్వయమున్నకు తగ్గినవాయెను, అనఁగా నామూఁడక్షరములు నేకశబ్దము కాఁగా, కుంభ, అనియాయెనని గ్రహించునది, కల్గవెనెత్తిపోట్లఁకన్ = ఇంక నెత్తిపోట్లు కలుగకుండునా (కలుగునే యనుట) కుంభశబ్దము కిదవల

యందును గజ కుంభములయందును వర్తించుటవలన, కడవలకు గట్టియు నోడునుఁజూచుకొనుటకు నెత్తి పోట్లుండుటయు గజకుంభములకు మావటి వాని యంకుశ సంబంధమైన నెత్తిపోట్లుండుటయు సహజమని ఫలితార్థము, ఇందు రెండవపాదము యతిదగ్గరనుండి, యాగక భమ్మను నేస్తురాలికా, అని పాఠాంతరమును రచింపఁ బడినది

క॥ కుధర సమాకృతి లాభ
మ్మధికముగాఁ గొనెఁ గుచద్వ • యం బొండొండా
కుధముఖ లిపులు సనినఁ గ
ట్యధర దృగంగోక్తి నాసి • కాస్య నఖములౌ॥ 41

టీక కుచద్వయంబు = ఆ చేడియస్తనద్వంద్వము, కుధర = పర్వ తములకు, సమ = సమానమైన, ఆకృతిలాభమ్మున = రూపప్రాప్తిని, ఆ ధికముగాఁ గొనెన్ = అతిశయముగా వహించెను, ఆ కుధముఖలిపులు = ఆయొక్క, కు ధ, మొదలైన యక్షరములు, ఒండొండు = ఒక్కటొక్కటి, చనినన్ = నశించినను, కటి = పిరుదును, అధర = పెదవియును, దృక్ = కనులును, అంగ = శరీరమును, ఉక్తి = పలుకులును, నాసిక = ముక్కును, ఆస్య = మోమును, నఖములు = గోళ్ళును, ఔన్ = అగును. అదెట్లనఁగా కుచద్వయము, కుధర సమాకృతి లాభమ్మధికముగాఁ గొనెఁ గదా, అందులో, ఒండొండా కుధముఖలిపులు సనినఁ = ఒక్కటొక్కటియు నా కు ధ మొదలైన యక్షరములు నశించినను, అనుటచే మొదటి యక్షరము పోఁగా, ధర సమాకృతిలాభమ్మని నిల్చెను, కటి = పిరుదు, ధర = భూమియొక్క సమ = మిట్టపల్లములేని, ఆకృతిలాభమ్మున = రూపప్రాప్తిని అధికముగాఁ గొనెన్ = అతిశయించునట్లుగా వహించెను, అంతట నిట్లే గ్రహించునది, అధర = పెదవి, ధ యను, నక్షరముపోఁగా మిగి లిన, రసమాకృతిలాభమున, రస = అమృతముయొక్క, మా = సంపదపండి (అనఁగా తీయదనము, అనుట) ఆకృతిలాభమ్మున్ =

రూపప్రాప్తిని, కొనెన్ = వహించెను, దృక్ = కన్నులు, ర యను నక్షరము పోఁగా మిగిలిన, సమాకృతిలాభమ్మున్, సమ = ఎగుడుదిగుడుగాని, ఆకృతిలాభమ్మున్ = రూపప్రాప్తిని, కొనెన్ = వహించెను, అంగ = శరీరము, స యను నక్షరముపోఁగా మిగిలిన, మాకృతిలాభమ్మున్, మా = లక్ష్మీదేవివంటి, ఆకృతిలాభమ్మున్ = రూపప్రాప్తిని, కొనెన్ = వహించెను, ఉక్తి = పలుకులు, మా అను నక్షరముపోఁగా మిగిలిన, కృతిలాభమ్మున్, కృతి = ప్రబంధరచన యొక్క, లాభమ్మున్ = ప్రాప్తిని (అనఁగాఁ జమత్కార మనుట) కొనెన్ = వహించెను, నాసిక = ముక్కు, కృ అను నక్షరముపోఁగా మిగిలిన, తిలాభమ్మున్, తిల = నవ్వుఁబువ్వు వంటి, ఆభమ్మున్ = దీప్తిని, కొనెన్ = వహించెను, ఆస్య = ముఖము, తి అను నక్షరముపోఁగా మిగిలిన లాభమ్మున్, ల = చంద్రుని వంటి, ఆభమ్మున్ = మిక్కిలి దీప్తిని, కొనెన్ = వహించెను, ని: లఃఖణ్డితే త్రిష్వాదానే శ్రీ నేంద్రౌలవణే తులమ్, అని నానార్థ రత్నమాల, నఖ = గోళ్ళు, ల, అను నక్షరముపోఁగా మిగిలిన, భమ్ము = నక్షత్రముయొక్క, అధికమున్ = అతిశయమును, కాన్ = అగుటకు, కొనెన్ = వహించెను, ఔ = ప్రశంసనీయము, అట్లు గాదేని, ప్రథమ పాదమునకును చతుర్థ పాదమునకును, కొనెన్ = అను క్రియతో పైవిధముగా నొక్కొక్క యక్షరము పోఁజేసి క్రమముఁ జూచు కొనవలయును.

గీ॥ చిన్నెలందు మొగము పున్న • పు న్నె లందుఁ;
గ్రొన్నె లందు నాసల్, తుంటి • తిన్నె లందు,
గిన్నె లందుఁ జనుల్; నవ్వు • వెన్నె లందు,
వన్నెలం దీపె సరిలేదు • కన్నెలందు. 42

టీక. సుగమము.

క॥ మేలందమునకు శ్రీలే;
శ్రీలే యగు త్రుటులు; సొగస • రేలె సరేలే;

రేలే జడ వెనుకేలే,
కేలే తమ్మి, తొడ గౌరు • కేలే యౌలే. 43

టీక గౌరు కేలు = ఏనుఁగు తుండము; తక్కినది సుగమము.

గీ॥ అలివ వదనంబు కమలజా • కృతిని గెల్చె
నబల యవలగ్న సీమ యా • హరిని గెల్చె
నింతిపాలిండ్ల సొరు గి • రీశు గెల్చె
లేమ నను గెల్చు టన నొక • లెక్కయగునె 44

టీక అలివ వదనంబు = ఆచేడియముఖము, కమలజ = బ్రహ్మదేవునియొక్క, ఆకృతినిగెల్చెన్ = రూపమును జయించెనని యర్థాంతరము, కమలజ = పద్మముయొక్క, ఆకృతిని = రూపమును, గెల్చెన్ = జయించెనని స్వభావార్థము అబల యవలగ్నసీమ = ఆ కొమ్మయొక్క మధ్యప్రదేశము, ఆ హరినిగెల్చెన్ = ఆ విష్ణు నోడించె నని యర్థాంతరము, ఆ సింహమును జయించెనని స్వభావార్థము. ఇంతిపాలిండ్లసొరు = ఆ కామిని స్తనముల చక్కఁదనము, గిరీశు గెల్చెన్ = ఈశ్వరుని జయించెనని యర్థాంతరము. పర్వతరాజు నోడించెనని స్వభావార్థము. శివకథావక్షమున మాత్రము, బృహస్పతిని గెల్చెనని యర్థాంతరము నూహించవలయును. గిరీశుఁడు బృహస్పతి యనుటకు శబ్దార్థ చంద్రికలోఁ జూడనగును. లేమ నను గెల్చుటనన్ = ఆ కోమలి నన్ను నోడించు టనఁగా, ఒక లెక్కయగునె = ఒక యెన్నికయగునా (కా దనుట) అనఁగా నాపె యవయవములు బ్రహ్మవిష్ణ్వాదులను లేక, పద్మసింహాదులను జయించె నిఁక నన్ను గెల్చుట లెక్కగాదని తాత్పర్యము.

ఆ॥వె॥ తరుణి నడల కెంత • పరమ హంసలుగాని
కలికి కురుల కెంత • ఘనులుగాని
సతి నడుమున కెంత • జటిలమణులుగాని
యోడి ధనము లంటి • యుంట నిజము. 45

టీక॥ తరుణి = ఆ చిన్నదానియొక్క, నడలకు = నడకలకు, ఎంత పరమహంసలుగాని = ఎంతటి యుత్తమ పదమునొందిన సన్యాసులుగాని యనియర్థము, ఎంత యుత్కృష్టములైన మరాళములుగాని యని స్వభావము, కలికి కురులకు = ఆరోగ్యాలి వెండ్రుకలకు, ఎంత ఘనులుగాని = ఎంతటి మహాత్ములుగాని యని యర్థము, ఎట్టి మేఘములుగాని యని స్వభావము సరి నడుమునకు = ఆ క్రొత్తడి (మగనాలి) మధ్యమునకు, ఎంత జటిలములు గాని = ఎంతటి శ్రేష్ఠులైన జడదారులుగాని యని యర్థము,ఎట్టిసింహశ్రేష్ఠములు గాని యని స్వభావము ఓడి = తగ్గిపోయి, వనములంటి యుంట నిజము = జల ముల నాశ్రయించి యుండుట వాస్తవము అనియును, అడవుల నాశ్రయించి యుండుట నిక్కము, అనియును, ద్వివిధము. అనఁగా సన్యాసులు మహాత్ములు జడదారులు సింహములు నరణ్యము నాశ్రయించి యుండుట స్వభావసిద్ధమగుట వలనను హంసలు మేఘములు జలము నాశ్రయించి యుండుట స్వభావ సిద్ధమగుట చేతను వనశబ్ద ప్రయోగము చేయఁబడినదని గ్రహించునది

చ॥ మొకమల రాజయోగమును ‌ మోవి జపాధ్యత సద్రదాళి తా
రకమును గోళ్లు సత్తుఁ గుచ ‌ రమ్యము భూర్యచలంబు మధ్య మీ
సకలము మిథ్యగాఁ దెలుపఁ ‌ జాలుట నార్యపదాబ్జసేవ మా
నకఁ గొన దాని కారణము ‌ నన్ బరిపూర్ణముసుఖంబు లబ్బవే॥ 46

టీక మొకము = ఆ యెలనాగయొక్క వదనము, అల రాజయోగ మును = ఆ సులభమగు ధ్యానపద్ధతిని యనియర్థాంతరము, ఆ చంద్రుని యొక్క యుపయోగమునని స్వభావార్థము, మోవి = పెదవి, జపాధ్యతన్ = మంత్రావృత్తియొక్క సంపన్నత్వమునని యర్థాంతరము, జాసన పువ్వుయొక్క సంపన్నత్వమునని స్వభావార్థము, సద్రదాళి = మంచి పల్వరుస, తారక మును = తారక యోగమునని యర్థాంతరము, సత్యమునని స్వభావము, గోళ్ళు = నఖములు, సత్తున్ = సత్యమునని యర్థము, నక్షత్రమునని స్వభా

వార్థము, కుచరమ్యము = చనులయందము, భూర్యచలంబున్ = అతిశయమైన అచలమార్గముననియర్థాంతరము, బంగారు పర్వతముననిస్వభావార్థము, మధ్యము = నడుము, సకలమున్ = ఈ సమస్తమును, మిథ్యగాన్ = అసత్యముగాననియర్థాంతరము, లేనిదిగా ననిస్వభావార్థము తెలుపఁ జాలుటన్ = ఎఱిఁగింపఁ గల్గినందున, ఆర్యపదాబ్జసేవన్ = శివకథలో నాసతీదేవియొక్క పాదపద్మముల సేవ ననియును, చంద్ర సారంగధర కథలలో నావదియాజేంద్ల చిన్నదానియొక్క పాదపద్మముల సేవ ననియును, మానకజానన్ = వేమారక పరిగ్రహించినటులైన, దాని కారణమునన్ = ఆ చేడియ యుపదేశమువలన ననియును, ఆపె మూలముననవియును, పరిపూర్ణసుఖంబు లబ్బవే = సంపూర్ణమైన సౌఖ్యములు లభింపవా (లభించు ననుట).

గీ॥ వేణి కృష్ణాభ, మాస్యంబు, విధు రుచిరము
కటి యనంతోపమానంబు, కౌను హరి వి
లాస మగుఁ గాన గేవల, మా సుదతి ర
మాధిపతి మోహినీ రూప, మనఁగఁ దోఁచు॥ 47

టీక. వేణి = ఆ చేడెయొక్క జడ, కృష్ణాభము = విష్ణుని కాంతి వంటి కాంతి యని యర్థాంతరము నల్లని కాంతియని స్వభావార్థము, ఆస్యంబు = ముఖము, విధురుచిరము = విష్ణునివలె మనోజ్ఞమని యర్థాంతరము. చంద్రుని వలె మనోజ్ఞమని స్వభావార్థము. కటి = పిరుదు, అనంతోపమానంబు = విష్ణుని సమానమనితో యర్థాంతరము భూమితో సమాన మని స్వభావార్థము. కౌను = నడుము, హరివిలాసము = విష్ణునివంటి శృంగారమని యర్థాంతరము. సింహమువంటి శృంగారమని స్వభావార్థము. అగుఁ గానన్ = అవునుగావున, ఆసుదతి = ఆకాంత, కేవలమున్ = స్వచ్ఛముగా, రమాధిపతి = విష్ణుమూర్తియొక్క, మోహినీరూప మనఁగఁ దోఁచున్ = మోహినీస్వరూప మన్నట్లుగా మదికిఁ దోఁచును.

క॥ గోరులు చుక్కలు ముఖ మ
బ్జారి తుఱుము మొగులు మేని • యందము మించౌ
రౌర నడుము నభమగుటఁ
గోరినపుడె యందనౌనా • కో గగనముగా॥ 48

టీక గగనముగా = దుర్లభము గదా అనియును ఆకాశమే కదా అనియును అర్థము తతిమ్మావిషయము సుగమము

క॥ మోవి యమృతమగుఁ బొక్కిలి
యావర్తంబగును వళులు • నలలగుఁ గటియో
దీవియగు నెదదలోతగుఁ
గావున సతి చారురసధి • గాఁబోలు నహో॥ 49

టీక సుగమము.

గీ॥ కోకిలాలాప చిలుకల • కొలికి రాజ
హంస గామిని వరచకో • రాక్షి చక్ర
వాక కుచయౌట ద్విజరాజ • వదనఁ బడయఁ
గలనె నేనిట్లు వలరాజుఁ • గాకయున్న॥ 50

టీక. నేనిట్లు వలరాఁజుఁ గాకయున్నఁజా = నేనీవిధముగా వలగల ప్రభువునుగాక పోయినట్లైతే యనియును మన్మథుఁడనుగాక పోయినట్లైతే యనియును, ద్విజరాజవదనఁ బడయఁగలనె = ఆ పక్షి రాజముఖిని పొందగలనా యనియును, ఆ చంద్రముఖిని పొందఁగలనా యనియును, అర్థము. తతిమ్మావిషయము సుగమము, అనఁగానాచేడియ యవయవగుణాదులు పక్షిసాంప్రదాయకములే యగుటవలన, వలలుగలవాఁడనై ననేగాని యిట్లుండినఁ బడయలేనని భావము

సీ॥ గరితమోమున కుద్ది • గాకచంద్రుఁడుదెల్ల
వాఁరి దోషాకర • త్వమునఁజిక్కె

కలికినేత్రములకుఁ • గైరవంబెనగాక
ప్రతిదివసముఁగుము • దతను ముడిగె,
సకిమిన్న వళులకు • సామ్యంబుగాక త
రంగంబు భంగమై • పొంగడంగె
చిన్నారి యవలగ్న • సీమకుజతగాక
ధన్యమౌ గగనంబు • శూన్యమయ్యె
గీ॥ కామినీమణి పాద న • ఖంబు లకును
జోడుగాలేక తారకల్ • జుక్కలయ్యె.
నట్టుఁగాకుండెనేని చం • ద్రాదులకును
జగతి నెందుల కిట్లు హై • న్యగతి వచ్చు॥ 51

టీక గరితమోమునకు = ఆ చేడియ ముఖమునకు, ఉద్దిగాక = సమానముగాక, చంద్రుఁడు = చందమామ, తెల్లవ్వారి = వెల్లవారిన వాఁడై, దోషాకరత్వమునఁ = పాపముల కాకరత్వముచేత ననియును, నిశాకరత్వము చేతననియును, చిక్కెఁ = లోఁబడియెననియును, కృష్ణపక్షమునఁ గృశించెననియును, కలికినేత్రములకుఁ = ఆ యింతి కన్నులకు, కైరవంబెనగాక = తెల్లగలువ సమానముగాక, ప్రతిదివసముఁ = ఎల్లవగళ్లయందును, కుముదతను ముడిగెఁ = కుత్సితసంతోషత్వముచేత ముడుచుకొనియెననియును, కుముద నామత్వముచేత ముడుచుకొనియెననియును, సకిమిన్న వళులకుఁ = సఖీలలామ కడుపుపై ముడతలకు, సామ్యంబుగాక = సమానముగాక, తరంగంబు = నీటితొలకు, భంగమై పొంగడంగెఁ = భంగపాటునొంది సంతోషమడఁగిన దాయెననియును, భంగమనే పేరుగలదియై యుప్పొంగుట లడంగిన దాయెననియును, చిన్నారి యవలగ్నసీమకుఁ = ఆ చెలియ మధ్యప్రదేశమునకును, జతగాక = సమానముగాక, ధన్యమౌ గగనంబు = భాగ్యవంతమగు నాకాశము, శూన్యమయ్యెఁ = లేనిదియాయెననియును, శూన్యనామము నొందినదాయెననియును, కామినీమణి పాదనఖంబులకును = ఆ కాంతారత్నముయొక్క కాళ్లగోళ్లకు, జోడుగాలేక = జత

గానేరక, తారకల్ చుక్కలయ్యెన్ = నక్షత్రములు చిన్నిబొట్లాయెననియును, చుక్కలనే పేరుగలవియాయెననియును, అట్లుగాకుండె నేని = అటులే కాక పోయినట్లైతే, చంద్రాదులకును = పై దెల్పిన చందమామ మొదలైన వానికి, జగతిన్ = భూమియందున, ఎందులకిట్లు హైన్యగతివచ్చున్ = ఈవిధముగా హీనస్థితిరానేటికి (అనఁగా చంద్రకథలోని యీచంద్రుఁడుగాక ప్రత్యేక మొక చంద్రుఁడు రాత్రించరుఁడై యాకసంబున నుండనే యుండెనని గ్రహించునది).

సీ॥ చంచలాక్షిని గౌఁగి • లించిన వేళ నా
కబ్బారె బంగార • మబ్బినట్లె
బిబ్బోకవతి గబ్బి • గుబ్బలంటిన వేళ
దుర్గాధిపత్యంబు • దొరికినట్లె
లావణ్యఖని తీయ • మోవినొక్కిన వేళ
సేవింప నమృతంబు • చిక్కినట్లె
చాన నామొర విన • వీనులొగ్గిన వేళ
మించిన శ్రీలు ల • భించినట్లె
గీ॥ సకియ నీవిని కేలఁ బ • ట్టుకొను వేళ
వేడ్క మూలధనపు ముల్లె • విప్పినట్లె
వెలఁది గలసియు మెలసిన • వేళ నాక
భోగముల నొంది నట్లుండుఁ • బో తలంప॥ 52

అనఁగా నాచేడియ మేను బంగారువలె నుండును గాన కౌఁగిలించినచో బంగారమబ్బినట్లే యుండుననియును, కుచములు కోటబురుజులవలెనుండును గాన కేలనంటినచో కోటదుర్గముల కాధిపత్యము గల్గినవాఁడనై నట్లేననియును, శివకథలో దుర్గ యనఁగా పార్వతి గావున పార్వతికి విభుఁడనగుట చేకూరినట్లే యుండుననియును, మోవియమృతమువలె తీయనై యుండును గాన పెదవి నొక్కినచో సుధారసము దొరికినట్లే యుండుననియును, చెవులు శ్రీకారముల వలె నుండును గాన తన మొఱవినుటకు వీనులొగ్గినచో శ్రీలు (అనఁగా

సంపత్తులు లభించినట్లయుండు ననియును, పోకముడిపై చేయివేసినచో మూల ధనపు ముడివిప్పినట్లే యుండుననియును కలసిమెలసినచో స్వర్గ భోగముల నొందినట్లే యుండుననియును స్వారస్యము

గీ॥ అతుల మంగళరూపిణి • యనఁగ నెసఁగు
నాత్త మంగళదేవత • యనఁగ నొప్పు
ననిశ మంగళదాయిని • యనఁగఁ దగుట
సర్వమంగళ యనుట కా • శ్చర్యమేమి. 53

టీక అతుల = సమానరహితమైన, మంగళ ... . నెసఁగున్ = శుభస్వరూపము గలదియనంగా నొప్పును, ఆత్త = పొందఁబడిన, మంగళ . నొప్పున్ = లక్ష్మీదేవి గలదియనంగా నొప్పును (అనఁగా సంపత్తు ననుట), అనిశ = నిరంతరమును, మంగళ . ... తగుటన్ = శుభముల నిచ్చునదియనంగా నొప్పుటవలన, సర్వమంగళ యనుట కాశ్చర్యమేమి = సమస్తమైన మంగళములు గలదియనుటకు వింతయేమి, అనియును శివకథలో మాత్రము, సర్వమంగళా నామముగలది యనుటకు వింతయేమి యనియు నర్థము.

క॥ తారయె రూపమునందునఁ
దారమె వివరింప నార్య • దళనప్రభలన్
దారయె నఖరుచియందునఁ
దారయగుట సార్థకమె క • దా యా సతికిన్ ॥ 54

టీక తారయె . నందునన్ = ఆకారమునందున తారయను నప్సరసయే యగును, తారమె . ప్రభలన్ = స్వకీయమైన దంత కాంతులందున వివరింపఁగా ముత్యమేయగును తారయె .. .. .. యందునన్ = గోళ్ల కాంతియందున నక్షత్రమేయగును, ఆ సతికిన్ = ఆ సతీదేవికి యని శివకథలోనున్ను, ఆ సాధ్వికియని చంద్ర

సారంగధర కథలలో నున్న, దారయగుట సార్థకమెకదా = నాకు భార్య యౌట సఫలమే గదా యనియును, చంద్రకథలో మాత్రము, తారయని వచించుట సార్థకనామధేయమే యగునుగదాయని యర్థము తార, దార యగుటకు ద్రుత ప్రకృతికముల మీదవచ్చు కచటతపలకు, గజడదబలు నిత్యముగా నిల్చునని గ్రహించురది.

గీ॥ కలికి మధ్యముఁ గనుఁగొన • గగన మగును
కాంత వేనలియోయంత • కన్న ఘనము
గరిత మైచాయ యిఁక నంత • కన్నమించుఁ
గాన నాసతి చిత్రాంగి • గాక యున్నె॥ 55

టీక. కలికి మధ్యమున్ = ఆచేడియ నడుమును, కనుఁగొనన్ = చూడఁగా, గగనమగును దుర్లభమగునని యర్థము, ఆకాశమగునని భావము, కాంతవేలియో = ఆయింతి జడయో, అంతకన్న ఘనము = దానికంటె గొప్ప దుర్లభమని యర్థము, అంతయుఁ జూడగా మేఘమని భావము, గరితమైచాయ = ఆనారి శరీరకాంతి, ఇఁక నంతకన్నమించు = ఇంకా దానికంటె యతిశయమైన దుర్లభమని యర్థము, మఱియు నంతయున్ జూడ మెఱుపుటిగె యని భావము. కానన్ = కావున, నాసతి చిత్రాంగి గాకయున్నె = శివకథలో నాసతీదేవి యాశ్చర్యమైన శరీరముగలది గాకుండునా యనియును, చంద్రకథలో నాభార్య యరుదైన దేహముగలది గాకుండునాయనియును, సారంగధర కథలో నాభార్య చిత్రాంగియను నామమునుగలది గాకుండునా యనియును భావము. (అనగా సార్థకనామమే యనుట)

క॥ అని తలపోయుచు నించుక
గొన కొని మది నుపశమించు • కొని యెందులకై
చనుదెంచెనో యందులకున్
జని నిజ కృత్యముల నతఁడు • సలుపుచునుండెన్॥ 56

టీక శివ॥ అతఁడు = ఆ శంకరుఁడు, ఎందులకై చనుదెంచెనో ఏచ్చోటికొఱకై బయలుదేరి వచ్చెనో, అందులకున్ జని = అచ్చటికి నేగి (అనఁగా కైలాసమునకనుట) నిజకృత్యములన్ = స్వకీయకార్యములను (నిత్యకృత్యములననుట), సలుపుచునుండెన్ = చేసుకొనుచుండెను తతిమ్మా విషయము సుగమము

టీక చంద్ర॥ అతఁడు = ఆ బృహస్పతి. ఎందులకై చనుదెంచెనో = దేనికొఱకై వచ్చెనో, అందునకున్ జని = ఆపనికినేగి, (అనఁగా యజ్ఞకార్యమునకనుట) నిజకృత్యములన్ = తనపనులను (వైదికకర్మ లనుట) సలుపుచునుండెన్ = చేయుచుండెను.

టీక। సారంగ॥ అతఁడు = ఆరాజనరేంద్రుఁడు, ఎందులకై చనుదెంచెనో = దేనికొఱకై వచ్చెనో, అందులకున్ జని = ఆపనికినేగి (అనఁగా వేటాడు పనియనుట), నిజకృత్యములన్ = తనపనులను, సలుపుచునుండెన్ = చేయుచుండెను

క॥ ఇట నీ ధన్యుని విషయం
బిటులుండ ద్వితీయ యన ర • హించిన సతి య
చ్చట సారంగధరుని పై
బటువుగఁ దమిఁ జెంది కించ • పాలై తనలోన్॥ 57

టీక శివ॥ ద్వితీయయన రహించిన సతి = రెండవదియనంగా వర్ధిల్లుచుండిన సతీదేవి (అనఁగా సతీదేవి రెండవ యవతారమైన పార్వతియనుట) సారంగధరుని పైన్ = జింకతాల్పరియైన శంకరుని పైన, బటువుగఁ దమిఁజెంది = దృఢముగా వలపునొందినదియై తతిమ్మా విషయము సుగమము.

టీక చంద్ర॥ ద్వితీయయనన్ = భార్యయనంగా, రహించిన సతి = వర్ధిల్లినచేడియ (అనఁగా తారయనుట), సారంగధరునిపైన్ = జింకతాల్పరియైన చంద్రునిపైని, బటువుగఁ దమిఁజెంది = దృఢముగా వలపునొందినదియై,

టీక. సారం॥ ద్వితీయ యనరహించిన సతి = రెండవదియై వర్తిలిన చేడియ (అనఁగా రెండవ భార్యయైన చిత్రాంగి యనుట); తతిమ్మా విషయము సుగమము

ఉ॥ అంగజు కేళి నొక్కరసి ♦ కాగ్రణిఁగూడి సుఖింపఁ గల్గు ప్రా
యాంగననైన నాకు సమ ♦ యంబిదియే కద లాతివారిఁ గో
రంగను భాగ్యమా తరుణ ♦ రాజ శిఖామణి సోమమూర్తి సా
రంగధరుండె కావలె వి ♦ రాళినిఁ దీర్చినఁ దీర్పఁగావలెన్॥ 58

టీక శివకథలో॥ తరుణరాజ = బాలచంద్రుని, శిఖామణి = చూడా రత్నముగాఁ గలిగినవాఁడును, సోమమూర్తి = సాంబమూర్తి యగువాఁడును, సారంగధరుండు = జింకతాల్పరియైనవాఁడును (అనఁగా శంకరుఁడనుట), చంద్రకథలో, తరుణరాజ = బాలచంద్రుఁడనే, శిఖామణి = శ్రేష్ఠుఁడును, సోమమూర్తి = సోమనామయుక్తమైన శరీరముగలవాఁడును, లేక కర్పూరము వంటి శరీరముగలవాఁడును, సారంగధరుండు = జింకతాల్పరియైనవాఁడును (అనఁగా చంద్రుఁడనుట) సారంగధరకథలోఁ తరుణరాజ శిఖామణి = యువ రాజశ్రేష్ఠుఁడును, సోమమూర్తి = చంద్రునివంటి శరీరముగలవాఁడును, అని మాత్రము భేదము; తతిమ్మా విషయము మూఁడిఁట సమానము సుగమము

క॥ సారంగధరుని నామన
సారంగణ గూడకున్న ♦ జవ్వనమేలా
సారాచార మదేలా
సౌరేల యొయారమేల ♦ జన్మంబేలా॥ 59

టీక సుగమము.

ఉ॥ అవగకాఁడు నావినుతు ♦ లారసి కోరికఁ దీర్పకున్న నా
యౌవనమేల నాయొదలి ♦ యందమదేల యొయారమేల నా

జీవన మేల భూషణ వి • శేషములేల సుజాత మేల వి
ద్యావిభవంబులేల ధర • యందున నాతనువేల నక్కటా॥ 60

టీక. సుగమము

సీ॥ సారంగధరుఁడునన్ • జేరకుండిన మన
సారంగధర నీల్గ • తీరవలయు
నలరు తీరుననుదాఁ • గలియ కుండిన మరు
నలరుతీరున కెట్లు • మెలఁగవలయు
జనమెల్ల నిందించు • ననియు రాకున్న భో
జన మెల్లప్పుడు మాను • కొనఁగ వలయు
గురునకు లొంగి యీ • దరికి రాకున్న నా
గురునకు లొంగి క్రమ్మ • క్కులిదవలయు

గీ॥ చారు సారంగధర కర • స్పర్శనమునఁ
దేటగాఁ దమి విలసిల్లి • తీరినట్లు
చారు సారంగధర కర • స్పర్శనమునఁ
దేటగాఁదమి విలసిల్ల • తీరవలయు 61

టీక. సారంగధరుఁడు = శివ చంద్ర సారంగధరులనుట, నన్ జేరకుండినచో, మనసారంగన్ = మనస్ఫూర్తిగా, ధరన్ = భూమి యందున, నీల్గితీరవలయుల్ = చచ్చితీరవలయును, అలరుతీరున్ = ప్రకాశించు విధముగా, ననుదాన్ = నన్నుతఁడు, కలియకుండినన్ = కలుసుకొనక పోయినట్లైతే, మరుని = మన్మథునియొక్క, అలరుతీరు నకున్ = పుష్పబాణమునకు, ఎట్లు మెలఁగ వలయున్ = ఏ విధముగా వర్తింపవలయును, గురునకు లొంగి = శివకథలో నాతండ్రికి వెను దీసిన వాఁడై యనియును, చంద్రకథలో, బృహస్పతికి వెనుదీసిన వాఁడై యనియును, సారంగధర కథలో, తన తండ్రియైన రాజనరేంద్రు నకు వెనుదీసిన వాఁడైయనియును, ఈదరికి రాకున్నఁ = ఈవైపు నకు రాకుండినచో నాగురునకు లొంగి = శివకథలో నాతండ్రియగు హి

మవంతునకు లోఁబడినదాననై యనియును, చంద్ర సారంగధర కథలలో ఆ యధికునకు లోఁబడినదాననై యనియును (చంద్ర సారంగ ధరులకనుట), చారు = మనోజ్ఞమైన, సారంగధర = అంబరవీథి నున్న చంద్రుని యొక్క, కరస్పర్శనమునన్ = కిరణములు సోకుటవలన, తేటగాన్ = స్వచ్ఛమగు నట్లు, తమి రాత్రి, విలసిల్లితీరినట్లు = ప్రకాశించి పూర్తియైన విధముగా, చారు = మనోజ్ఞమైనట్టి, సారంగధర = వరుసగా శివ చంద్ర సారంగధరుల యొక్క, కరస్పర్శనమునన్ = హస్తము సోకుటచేత, తేటగాన్ = స్వచ్ఛముగా, తమివిలసిల్లి తీరవలయున్ = వలపు ప్రకాశించి తగ్గిపోవలయును, తతిమ్మా విషయము సుగమము.

చ॥ సరసములాడుచున్ బిగువు • సందిటఁ దూర్చియుఁ బాన్పుఁ జేర్చితా
మురువొలయన్ బయిన్ బడియు • మోమున మోమెనయించి మోవితే
నెరమణఁ జుట్టుచున్ జనుల • నీటుదుగన్ మథియింపుచున్ మనో
హరణములోన నన్ జెమట • జాఱ సరాసరిఁ బోరుటెన్నఁడో॥

టీక. సుగమము.

సీ॥ సారంగధరుని హ • స్తములలో మెలఁగని
సిబ్బెపు నును గబ్బి • గుబ్బలేల
సగ్గణేశ్వరుని వ • ల్చెగ్గాట్ల నందని
చక్కనై చొక్కమౌ • చెక్కులేల
తరుణరాజాంకు వ • క్త్రమునిండి పొర్లని
మధురమున్ వృథఁజేయు • నధరమేల
కలధౌత ధాముని • కౌఁగిటఁ జేరని
చాయ గాంగేయమౌ • కాయమేల
గీ॥ సోమమూర్తిని వలపులన్ • జొనుపలేని
చిలుకలను చక్కఁగా బల్కు • పలుకులేల
కువలయేశుని పొందుచే • కూడలేని
కులకమతుకువ మెతకయౌ • బ్రతుకదేల॥ 69

టీక. శివ॥ సారంగధరుని = జింకతాల్పరియైన వానియొక్క, సద్గణేశ్వరుని = శ్రేష్ఠుఁడైన ప్రమథాధీశ్వరుని యొక్క, తరుణరాజాంకు = బాల చంద్రుడు సంకముగాఁగల వానియొక్క, కలధౌతధాముని = వెండి నిలయముగల వానియొక్క, సోమమూర్తినిఁ = సాంబమూర్తిని, కువలయేశునిన్ = జగదీశ్వరుని, తతిమ్మా విషయము సుగమము

టీక చంద్ర॥ సారంగధరుని = జింకతాల్పరి యొక్క, సద్గణేశ్వరుని = నక్షత్ర గణాధీశ్వరునియొక్క, తరుణరాజాంకు = బాలచంద్రుఁడనే చిహ్నములు గల వానియుక్క, కలధౌతదాముని = వెండి వంటి శరీరముగల వానియొక్క, సోమమూర్తిఁ=సోమనామ దేహముగలవానిని, కువలయేశునిఁ = కలువలరాజును.

టీక సారంగ॥ సారంగధరుని = సారంగధర నామముగలవాని యొక్క, సద్గణేశ్వరుని = పండితలోకేశ్వరునియొక్క, తరుణరాజాంకు = యువరాజ చిహ్నముగల వానియొక్క, కలధౌతధాముని = బంగారు వంటి శరీరముగలవానియొక్క, సోమమూర్తిఁ = చంద్రునివంటి మూర్తిగలవానిని, కువలయేశుని = భూవలయాధీశ్వరుని, తతిమ్మా విషయము సుగమము

సీ॥ సారంగధరుని భా • స్వద్ధసితాస్యంబు
పూర్ణచంద్రోదయం • బుగ నెసంగు
సారంగధరుని వా క్చతురిమాతిశయంబు
నమృతరసాయనం • బై పొసంగు
సారంగధరుని ప్రాం • చత్స్వరూపము మక
రధ్వజాకారమై • రమణ నలరు
సారంగధరుని పే • శలగంధములు వసం
తకుసుమాకరమునై • తనరుఁగాన
గీ॥ నతఁడు దివ్యౌషధీశుఁడే • యగుట నాదు
విరహతాపజ్వరంబునఁ • బెరుఁగు దోష

గుణము లాతని కరముసో • కినను గాని
మానవింతకు వేరొండు • మందులేదు॥ 64

టీక. సారంగధరుని = శివుని, చంద్రుని, సారంగధరుని, అని యంతట గ్రహించునది. భాస్వత్ = ప్రకాశమానమైన, హసితాస్యంబు = నగుమొగము, పూర్ణ చంద్రోదయంబుగ నెసంగున్ = పూర్ణచంద్రోదయమనే యౌషధముగా నతిశయించునని యర్థాంతరము, పూర్ణిమనాటి చంద్రోదయము వలె ప్రకాశించునని స్వభావార్థము. వాక్చతురిమాతిశయంబు = మాటల యందలి నేర్పుయొక్క యాధిక్యము, అమృతరసాయనంబై పొసంగున్ = అమృతరసాయనమనే యౌషధముగా నొప్పునని యర్థాంతరము. అమృతరస = సుధారసముయొక్క, అయనంబై పొసంగున్ = మార్గమైయొప్పునని స్వభావార్థము, ప్రాంచత్స్వరూపము = ప్రకాశించెడు నిజరూపము, మకర ధ్వజాకారమై రమణనలరున్ = మకరధ్వజమనే యౌషధరూపమై యొప్పారు నని యర్థాంతరము మన్మథునియాకారమువలె యొప్పై ప్రకాశించునని స్వభా వార్థము. పేశలగంధములు = కోమలమును పరిమళమును, వసంతకుసుమా కరమునై తనరుఁ = వసంతకుసుమాకరమనే యౌషధముగా ప్రకాశించునని యర్థాంతరము వసంత = వసంతఋతువునందలి, కుసుమ = పుష్పముల యొక్క, ఆకరమునై = సమూహమునై, తనరున్ = ఒప్పును, లేక, వసంత = వసంతునివలెను, కుసుమాకరమునై తనరుఁ = పుష్పసమూ హమువలెను ఒప్పునని స్వభావార్థము, పేశలమునకు వసంతుఁడును పరిమళ మునకు పుష్పసమూహమునని క్రమముగ్రహించునది, ని ఆకరో నివహోత్పత్తి స్థానశ్రేష్ఠఖనిష్వపి, అని విశ్వము, కానఁ = కాబట్టి, అతఁడు = ఆసారంగ ధరుఁడు, దివ్య = స్వర్గజన్యమైన, ఔషధి = ఔషధములుగల వారియందున (అనఁగా వైద్యులయందనుట), ఈతఁడే, అగుటఁ = ఐనందువలన, చంద్ర కళలో మాత్రము, దివి = ఆకాశమునందలి, ఓషధీశుఁడే యనుటన్ =

చంద్రుఁడేయైనందు వలసనని భావమగుపడుచున్నది,నాదు=నాయొక్క, విరహతాపజ్వరంబునన్ = విరహతాపమనే జ్వరమునందున, పెరుఁగు = వృద్ధిపొందునట్టి, దోషగుణములు = రోగస్వభావములు, అతని కరముసోకినను గాని = వానిహస్తముసోకితేనేతప్ప చంద్రకథలోమాత్రము, దోష = రాత్రియొక్క, గుణములు = స్వభావములు, అతని, ఆ చంద్రునిసంబంధమైన, కరముసోకిననుగాని = కిరణస్పర్శవల్లగాని, అనిభావము తోచుచున్నది, మానవు = మానిపోనేరవు (అనఁగా నతని కరస్పర్శ తగిలిననేగాని లేనిచో తద్దోషగుణములు మాననేరవనుట), ఇంతకు వేరొండు మందులేదు = ఇంతకంటే మఱియొక్క యౌషధములేదు

గీ॥ ఒరు లెఱుంగకుండు నట్టులా • సరసుదరికిఁ
బోయి కల్యాణ మిపుడునఁ • బొందుమనుచుఁ
బలుక నాగురునకు భయ • పడియు వరుస
గాదు పొమ్మనునేమొ యిం • క నెటు లైతు॥ 65

టీక శివ॥ ఆ సరసుదరికిఁబోయి = ఆ రసికుఁడైన శంకరుని చెంతకునేగి, కల్యాణ 'మిపుడునన్ బొందుమనుచుఁ బలుకఁ = ఈ సమయమున నన్ను వివాహముఁ గైకొనుమటంచు వచించినచో, నా గురునకు భయపడియుఁ = నా తండ్రియైన హిమవంతునకు వెఱచినవాఁడై, వరుసగాదు పొమ్మనునేమొ = క్రమముగాదు చనుమనియనునేమొ, తరిమ్మావిషయము సుగమము

టీక చంద్ర॥ ఆసరసుదరికిఁ బోయి = ఆ రసికుఁడైన చంద్రుని వద్దకు నేగినదాననై, కల్యాణము = నీకు శుభము, ఇపుడునఁ బొందుమనుచుఁ బలుకన్ = ఈ సమయమున నన్నుఁ గూడుమనివచించినచో, ఆ గురునకు 'భయపడియుఁ = ఆ బృహస్పతికి భయపడినవాఁడై, వరుసగాదు పొమ్మనునేమొ = మీకు శిష్యుఁడను క్రమముగాదేగుమనునోయేమో॥

టీక సారంగ॥ అసరసుదరికిఁబోయి = ఆ రసికుఁడైన సారంగధరుని చెంతకుఁ బోయినదాననై, కల్యాణమిపుడు = ఇది శుభమైన సమయము, నన్ బొందుమనుచుఁ బలుకఁగ = నన్ను నీవు పొందవలయునని వల్కినచో, ఆ గురునకుభయపడియున్ = ఆ తండ్రికిభయపడినవాఁడై (అనఁగా వేటకు నేగిన రాజనరేంద్రునకుననుట), వరుసగాదు పొమ్మనునేమొ = నీకున్ గుమారుఁడఁ గావలయును క్రమముగాదు పో యనునో యేమొ.

వ॥ అని యిట్లు వితర్కింపుచు. 66

టీక సుగమము

ఆ॥వె॥ బాలరాజమౌళి ♦ పైఁదమి నల విశా
లాక్షి కిరవుకాశి ♦ యయ్యెనాఁడు
బాలరాజమౌళి ♦ పైఁదమి నలవిశా
లాక్షి కిరవుకాశి ♦ యగుట యరుదె॥ 67

టీక. శివ॥ నాఁడు = అప్పుఁడు, బాలరాజమౌళిపై = తరుణ చంద్రమౌళియైన శంకరునిమీద, తమిన్ = వలపువలన, అలవిశాలాక్షికి = ఆ వెడల్పు కన్నులుగల పార్వతికి, కాశి = కష్టము, ఇరవు = ఉనికిపట్టు, అయ్యెన్ = ఆయెను, బాలరాజమౌళిపైఁ దమిన్ = తరుణేందుశేఖరుఁడైన విశ్వనాథస్వామి మీద వలపువలన, అలవిశాలాక్షికి = ఆ విశాలాక్షియను పేరుగల జగదీశ్వరికి, కాశి = కాశియనుపట్టణము, ఇరవు = ఉనికిపట్టు, అగుటయరుదే = కావదమొకయాశ్చర్యమా (సహజమే యనుట)

టీక చంద్ర బాలరాజమౌళిపైఁదమిన్ = బాలుఁడైన చంద్రశ్రేష్ఠునిపై మోహముచేత, తతిప్మా విషయము పైకథకు సమానము.

టీక. సారంగ॥ బాలరాజమౌళిపైఁ దమిన్ = యువరాజశ్రేష్ఠునిపై మోహముచేత, తతిప్మా విషయము సుగమము.

వ॥ అట్టియెడ. 69

టీక. సుగమము.

క॥ సారంగధరునిఁ దన మన
సారంగ ధరణ రమింప • సాలోచనయై
యారామ ముదితలన్ గొని
యారామముఁ జేరెఁ గాల • యాపనమునకున్॥ 69

టీక ఆరామ = ఆ చేడియ, ఆరామముఁజేరెన్ = ఉద్యానవనమునకు చేరినదాయెను, తక్కిమ్మావిషయము సుగమము

ఉ॥ చేరిన నొక్కలేమ వన • సీమ నికుంజము నొందుఁగాంచి చె
న్నారఁగ నొక్కవేదిక నొ • నర్చె మఱొక్కతె పండుటాకులన్
దూరముఁజిమ్మె వేరొకతె • తోయముఁజిల్కె నొక ర్తెపువ్వొడిన్
జారుగ్రముగ్గుదీర్చె నొక • బామ తివాసి వితర్దిపై నిడెన్॥ 70

టీక వనసీమణ = ఉద్యానవన ప్రదేశమునందున, నికుంజమున్ = పొదరింటిని, వేదిక = అరుగు, తోయము = ఉదకము, వితర్ది = అరుగు, తక్కిమ్మావిషయము సుగమము

చ॥ ఒక చెలి నీట దేవి పద • యుగ్మమునుం గడిగెన్ ముదంబుతో
నొకతె వితర్దిపైని కర • మూనియుఁదోడ్కొనివచ్చి జేర్చెనో
రొకతె పదాబ్జముల్ బిసుకు • చుండె మఱొక్కతె తాళవృంతమా
పక వడి వీచుచుండె నడు • పన్ నడుమన్ గల సోమదీరఁగణ॥

టీక తాళవృంతము = విసనకఱ్ఱ, సోమ = ఆయాసము, తక్కిమ్మావిషయము సుగమము

వ॥ ఇటుల సేవింపుచున్నం గని తద్దేవి యాచెలికత్తియల కిట్లనియె.

టీక సుగమము

మ॥ సకులారా యొకనాయికామణి వయ • స్యాపాళి నారామ సీ
మకు వేళోద్యానిపోయి యందునొకలే • మజా జేరి యేలీలఁబూ
నికతోఁజేసెనొ యావిధంబుగ నిట • న్జేఁజేయఁగా నెంచి దా
పక మీతోవచియింపు చుండితిని స • ర్వస్వంబు నాలింపరే॥ 78

టీక. వయస్యాపాళిన్ = చెలికత్తియల సముదయమును, ఆ రామసీమ
కున్ = ఉద్యానవన ప్రదేశమునకు, తతిమ్మా విషయము సుగమము.

వ॥ అది యెట్లంటిరేని.

టీక. సుగమము.

సీ॥ ప్రియసహకారాళిఁ జెయిఁబట్టినెట్టు స
తృర్ణికా రమ్మని • గదిమి పల్కుఁ
బొలుపొందు మమచును • పొగడపై నుమియును
నెఱివాఖిలేయన • నిశ్వసించు
నెత్తురు గోరంట • నొత్తిసందిఁటఁబట్టుఁ
జెలి యశోకముఁ గనఁ • జెలఁగిరన్ను
సంపెఁగయన మోము • సజ్జనఁబై కెత్తుఁ
దిలకమేదీయని • తేఱిచూచుఁ

గీ॥ గొమ్మయందునఁ గనికిఁదా • నిమ్మటంచుఁ
బొగలునొందించు నేమందుఁ • బొలఁతియుదుటు
నేనటులె సేయనగుఁగదా • నెలఁతలార
ఇంతులారా చెలులమేలు • బంతులార॥ 79

ఈ పద్యమునందున నౌకానౌక నాయికా రత్నమునకు బొట్టుఁబెట్ట నందులకు చెలికత్తియనోర్తుకన్ బిలచి యీ చెప్పఁబోవు విధముగా శిక్షించె నను లెపము నారోపించి పుష్పదోహదము నొనరించెననే విషయము గూర్చి భావగర్భితముగా వచియించెనని యర్థద్వయమును గ్రహించునది.

టీక ప్రియ = ప్రియమైన, సహకార = సహాయమొనర్చునట్టి, అళిన్ = చెలికత్తెను, చెయిఁబట్టినెట్టున్ = కరమునంది నెట్టునని యర్థము, దోహద విషయమై, ప్రియ = ప్రియమైన, సహకారాళిన్ = తియ్య మామిడి చెట్ల సముదయమును, చెయిఁబట్టినెట్టున్ = హస్తముతో నెట్టునని భావము। తరుగుల్మలతాదీనామకాలే ఫలపుష్పయోః, అధానాక్రియాయాస్య త్సదోహద ఇతీర్యతే, అనుటచే దోహదమనఁగా తరుగుల్మలతాదుల అకాలమందుపుష్పఫలాది నిమిత్తమై చేయు క్రియా విశేషము, చూతోయోషిత్కరస్పర్శాత్, అనుటచే మామిడి ఫలించుటకు హస్తస్పర్శన మొనర్చెనని గ్రహించునది. సత్కర్ణికా = మంచిచెవి కమ్మలు గలదానా, రమ్మని గదిమిపల్కున్ = ఎక్కడికేగెదవిటు రమ్మని గద్దించి పలుకునని యర్థము, సత్ = శ్రేష్ఠమైన, కర్ణికారము=కొండ గోగుచెట్టు అని=అఁటంచు, గదిమిపల్కున్=బిగ్గరగా భాషించునని భావము, ఆకర్ణనాత్కర్ణికారస్తు = అనుటచే కొండగోగుమాట వినిన పుష్పించుట స్వభావము పొలుపొందుమనుచును పొగడన్ = ఒప్పును వహించుమని స్తోత్రము సేయంగా, పైనుమియును = అచెలికత్తియమీద నుమ్మివేయునని యర్థము. ఒప్పును వహించుమని, పొగడపై నుమియును = పొగడ వృక్షము మీద నుమ్మివేయునని భావము, ముఖసీధువువలనఁ బొగడవృక్షము వికసించుట స్వభావముఁ నెఱివావిలే యన నిశ్వసించున్ = గొప్ప వరుసయేలే యనఁగా నిట్టూర్పునిగుడించునని యర్థము, నెఱివావిలేయనన్ = పెద్దవావిలి వృక్షమేలే యనఁగా, నిశ్వసించున్ = ఊర్పును వెలిబుచ్చునని భావము ఊర్పుల వలన వావిలి చెట్లు వికసించుట స్వభావము. నెత్తురుగోరంటన్ = రక్తముగోటి

కంటునట్లుగా, ఒత్తిసరందిటఁబట్టన్ = అదిమిసందిటఁ బట్టుకొనునని యర్థం. ఎఱ్ఱగోరంటచెట్టును గాఢాలింగనముఁ జేసెనని భావము, ఆలిఙ్గనాత్కురుపకః, అనుటచే కౌఁగిలించుకొనుటవలన గోరంట వికసించుట స్వభావము, చెలియ= చెలికత్తియ, శోకముఁనన్ = దుఃఖమును వహింపఁగా, పెలగి తన్నున్ = చెలరేగి కాలఁదన్నునని యర్థము, చెలి=ఆచేడియ, అశోకఁగనన్ఁము=అశోక వృక్షమును జూడఁగా, చెలఁగి తన్నున్=ఉత్సహించి పాదతాడనముఁజేయును, అనిభావము అశోకఃపాదతాడనాత్, అనుటచే పాదతాడనమువలన నశోకము వికసించుననిస్వభావము, సంపెఁగయనన్ = చంపెనుగాయనఁగా, మోము సెత్తునఁబై కెత్తున్ ము ముఖమును బిరాన పైకెత్తునని యర్థము, సంపంగి చెట్టు అనంగా ముఖమెత్తిచూపునని భావము చంపకో ముఖదర్శనాత్, అనుటచే సంపఁగిచెట్టు ముఖదర్శనము వలన వికసించునని స్వభావము. తిలకమేదీయని తేఱిచూచున్ = బొట్టేదీయని యుఱిమిచూచునని యర్థము. బొట్టుగుచెట్టేదీయని దృష్టించి చూచునని భావము తిలకోదృక్ప్రసారణాత్, అనుటచే బొట్టుగుచెట్టు వీక్షించుటవలన వికసించునని స్వభావము కొమ్మలందునన్ = స్త్రీలయందున, కసికిన్ = కక్షకు, తాను = ఆ చెలికత్తియ, ఇమ్మువటంచున్ = స్థానభూత వటంచు, పొగలు నొందించున్ = పరితాపము నొందజేయును, అనియర్థము కొమ్మలందునన్ = శాఖలలోపల, కసికిన్ = లేతతనమునకు, దానిమ్మ టంచున్ = దాడిమివృక్షమే యటంచు, పొగలు నొందించున్ = ధూమములు నొందించునని భావము దాడిమా ధూమసందోహాత్, అనుటచే దానిమ్మచెట్టుకు పొగబెట్టిన ఫలించునని స్వభావము, ఏమందుఁ బోలఁతియుదుటు = ఆనాయిక యొక్క యుద్ధతి నేమిజెప్పుదును, నెలఁతలారా = ఓకొమ్మలారా, ఇంతులారా ఓచేడియలారా, చెలుల మేలు బంతులారా = ఓ సఖీలలామలారా, నేనటుతె సేయనగఁ గదా = బొట్టుపెట్టనందుల కానాయికారత్వము తన చెలికత్తియ

నెటులుఁజేసెనో యటులె సేయనగును గదా యని యర్థము. నేనా నాయిక వలెనే దోహదము సేయవలయును గదా యని భావము.

గీ॥ అనిన నొకచెలి పన్నీట • వనితముఖముఁ
దుడిచి యలికంబునందుఁ గ • స్తూరి తిలకముఁ
దీర్చి వేరొకతేమ యా • దేవిభావ
మెఱిఁగి యుత్తలఁగున వచి • యింపఁదొడఁగె॥ 76

టీక. సుగమము.

సీ॥ ఆడఁగావలెఁ దీయ • నౌ సుడుల్ సత్కర్ణి
కారాళులకును వి • కాసమొదవఁ
బాడఁగావలె మంచి • పాటలు దేవి ప్రి
యాళుల కామోద • మావహిల్ల
నాడఁగావలెఁ గుల్కు • టడుగిడి యతివ య
శోకాళులకు లెస్స • శోభగలుగఁ
జూడఁగావలె దయ • తోడ నెప్పుడు సఖీ
తిలకాళులకును బ • త్తైట గలుగఁ
ఆ॥వె॥ గయిఁగరమున నంద • గావలెను సహకా
రాళులకు విలాస • మతిశయిల్ల
లలిని పొన్నకొమ్మ • లన్ జేరి నాయిక
నవ్వవలయుఁ గాని • నలఁచ దగునె॥ 77

ఈ పద్యమునందునఁ జెలికత్తియలను కలఁచరాదను విషయమును తేటపడునట్లుగా నొకానొక సఖీమణి దోహదమును గూర్చి భావగర్భితముగా వచియించెనని గ్రహించునది

టీక సత్కర్ణికా = ఓ మంచి చెవికమ్మలు గల దేవీ, ర = చుఱుకైన, అళికులను = చెలికత్తియలకు, వికాసమొదవన్ = తెలివి గలుగునటులుగా, తీయనౌసుడుల్ = మాధుర్యమైన మాటలు,

ఆడఁగావలెన్ = పలుకఁగా వలయును, అని యర్థము, ర, చయుక నుటకు, ని, రః పావకేచ తీక్ష్ణేచ, అని విశ్వము,సత్=శ్రేష్ఠమైన, కర్ణికారాళులకును = కొండగోగు చెట్ల సముదయమునకు, వికాస మొదవన్ = వికసన మొందునటులుగా, అడఁగావలె తీయనౌనుడుల్ = మాధుర్యమైన మాటలు బల్కవలయును, అని భావము, దేవి = నాయికయైన చేడియ, ప్రియాళులకు = ప్రియురాండ్రైన చెలికత్తియలకు, ఆమోద మావహిల్లన్ = సంతోషము గలుగునటులుగా, మంచి పాటలు = సమీచీనమైన కీర్తనలు, పాడఁగావలెన్ = గానము సేయఁగా వలయును, అని అర్థము, ప్రియాళులకు = మోరటి చెట్లకు ఆమోద మావహిల్లన్ = పరిమళములు గలుగునటులుగా (అనఁగా పుష్పించిననే గాని పరిమళములు గలుగనేరవనుట), పాడఁగావలె మంచిపాటలు = శ్రేష్ఠమైన గానము సేయఁగావలయునని భావము ప్రియాతుర్గాన సంపదః అనుటచే మోరటి చెట్టు గానమువలన పుష్పించుట స్వభావమని గ్రహించునది, అతివ = నాయికయైన తొయ్యలి, అశోక = దుఃఖరహితమైన, అళులకున్ = చెలికత్తియలకు, లెస్స శోభగలుగన్ = మిక్కిలి కాంతిగలుగునటులుగా, కులుకుటడుగిడి = కులుకైన యడుగులిడుచు, ఆఁడగావలెన్ = నృత్యము సేయఁగావలయును, అని యర్థము అశోకాళులకు లెస్సశోభగలుగన్ = అశోకవృక్ష సముదయమునకు మిక్కిలి కాంతిగలుగునటులుగా (అనఁగా పుష్పించిననేగాని కాంతిగలుగ నేరదనుట), ఆడఁగావలెఁ గుల్కుటడుగిడి యతివ = ఓకోమలి యడుగుబెట్టి యాడవలయునని భావము, సఖీతిలకాళులకును = నారీలలామలైన చెలికత్తియలకు, బత్తేటగలుగున్ = మిక్కిలి తెలివిగలుగునటులుగా, ఎప్పుడున్ = వీక్షింపఁగావలయునని యర్థము,సఖీ = హితులారా,తిలకాళులకును బత్తేట గలుగన్=బొట్టుగుచెట్ల సముదయ మునకు మిక్కిలి వికసనముగల్గునటులుగా, ఎప్పుడున్ =ఏవేళనైనను,చూడఁగావలెదయతోడన్=కరుణతోవీక్షింపవలయును,అని

భావము సహకార = సహాయము సేయునట్టి, అళులకున్ = చెలికత్తియ
లకు, విలాసమతిశయిల్లన్ = శృంగారమధికమౌ నటులుగా, కయిన్ =
హస్తమును, కరమున నందఁగావలెను = చేతితోఁబట్టుకొనవలయును, అని
యర్థము, సహకారాళులకు విలాసమతిశయిల్లన్ = తియ్య మామిడిచెట్ల సము
దయమునకు శృంగార మెక్కువగునటులుగా (అనగా మామిళ్ల పూచినచో
ఫలించిననోగాని శృంగారమతిశయింపవనుట) కయిన్ = చేతిలో, కర
మున నందంగావలెను = అత్యంతముగా పట్టుకొనవలయునని భావము,
నాయిక = దేవియైన చేడియ, లలిని = ఉత్సాహముతో, పొన్న = దృగ్గో
చరమైనట్టి, కొమ్మలన్ జేరి = చెలులను సమీపించి, నవ్వవలయుఁగాని =
నగుచుండవలయుఁనే కాని, నలఁచఁదగునె = బాధపెట్టయుక్తమా అని,
యర్థము పొన్నకొమ్మలను జేరి = పొన్న చెట్ల కొమ్మలనెక్కి, నవ్వవల
యుఁగాని నలఁచఁదఁగునె = నవ్వఁగావలెనే కాని నలతనొందించుట
యుక్తముకాదని భావము పొన్న, దృగ్గోచరమైన దనుటకు శబ్దార్థ చంద్రి
కలోఁ జూడనగును అనఁగా నో నాయికా నీయభిప్రాయ ప్రకారము, కొండ
గోగునకు సల్లాపమును, మోరటికి పాటయును, అశోకమునకు పాదతాడన
మును, బొట్టుగునకు వీక్షణమును, మామిడికి కరస్పర్శమును, పొన్నకు
నవ్వును, దోహదవిశేషంబులు గావుననట్లే యొనరింపుమని తాత్పర్యము

గీ॥ అనిన నాలించి తనభావ ♦ మును గ్రహించి
వలుకునట్టి చెలినిగాంచి ♦ లలినిమించి
చాతురి గణించి మదినెంతొ ♦ సంతసించి
దోహదముఁజేసెఁ గృపనించి ♦ తోటనెంచి॥ 78

టీక సుగమము

గీ॥ వనమునందున దేవి పె ♦ వనముగఁ గుజ
చయములోపలఁ బుష్పాప ♦ చయము సలుపఁ

గొమ్మలఁ జూలఁగాంచి తాఁ ♦ గొమ్మలఁ గని
తీయ నొడుగులతో నాన ♦ తీయనోర్తు॥ 79

టీక. కుజ = వృక్షములయొక్క, చయము = సముదాయము, పుష్పావచయము = పువ్వులనుగోయుట, కొమ్మలన్ = శాఖలను, కొమ్మలన్ = స్త్రీలను, తతిమ్మావిషయము సుగమము

సీ॥ తిలకంబును గటాక్ష ♦ దృష్టిచేఁగని పొన్న
హనియింతు వదియేమి ♦ దొసఁగుఁజేసె
కురువకంబును సంది ♦ ట రహింపఁజేర్చి కం
కేళిఁ దన్నెదవేమి ♦ కినుకఁదెచ్చె
మాకందమును కేల ♦ మన్నించి పొగడపై
నుమియుదు వదియేమి ♦ యోగుఁజేసె
గోగుతోఁ బ్రీతిఁ బ ♦ ల్కుచును దానిమ్మకు
పొగఁబెట్టెదవదేమి ♦ వెగడుఁజేసెఁ

గీ॥ జంపకంబున కాస్యద ♦ ర్శనమొసంగి
సిందువారము నిట్టూర్పుఁ ♦ జెందుచూతు
వహహ యదియేమి పగజేసె ♦ ననుచుఁజెలులు
పలుకదోహదములు దేవి ♦ సలిపెనపుడు. 80

టీక తిలకము = బొట్టుగుచెట్టు, కురువకము = గోరంటచెట్టు, కంకేళి = అశోకవృక్షము, మాకందము = మామిడిచెట్టు, సిందువారము = వావిలిచెట్టు, తతిమ్మావిషయము సుగమము.

అనఁగా, శ్లో తరుగుల్మలతాదీనా మకాలే ఫలపుష్పయోః। అథానాయ క్రియాయాస్యాత్సదోహద ఇతీర్యతే॥ ఆలిఙ్గనాత్కురువకశ్చంపకో ముఖదర్శనాత్। చూతో యోషిత్కరస్పర్శాత్తిలకో దృక్ప్రసారణాత్। ఆకర్ణనాత్కర్ణికారా స్త్వశోకః పాదతాడనాత్। దాడిమీ ధూమసందోహా త్ప్రియాకుర్గాన సంపదః,

ఇత్యాదులు దోహద విశేషములగుటచే బొట్టుగుచెట్టును కటాక్షవీక్షణంబులం జూచుచు పొన్నచెట్టును జూచి నవ్వెదవదియేమి తప్పుజేసెను, గోరంట చెట్టును జూచి యాలింగనము జేసుకొని యశోకవృక్షమును పాదతాడనముఁ జేసెద వదియేమి కోపమునొందించెను, మామిడిచెట్టును చేతఁబట్టికొని పునుకుచు పొగడచెట్టు మీద నుమ్మివేయుదు వదియేమి చెడుగుఁజేసెను, గోగుచెట్టునుఁ జూచి ప్రియములు పల్కుచు వానిమ్మచెట్టుకు పొగఁబెట్టెద వదియేమి తడబాటు జేసెను, చంపకవృక్షమునకు ముఖదర్శనమిచ్చి, వావిలిచెట్టును జూచి నిట్టూర్పు పుచ్చెద వదియేమి పగజేసెనుఁ అని చెలికత్తియలు వచింపుచుండఁగా నాదేవి దోహదము సలిపెనని తాత్పర్యము

వ॥ అట్టియెడ నొక చెలికత్తియ యిట్లనియె 81

టీక సుగమము

సీ॥ అమరసంగతముగా • దాశక్రకేశవ
మన్మథార్కాదులు • మలయుచుంట
దైత్యాన్వితంబుగా • దా విభీషణి బక
కర్బురాదులు నిట • గ్రాలుచుంట
మహిళాయుతము గాద • మాధవీ శారదేం
ద్రాణీ శివాదులు • దనరుచుంట
మునిసమేతముగాద • ఘనత శాండిల్యగా
లవ నారదాదులె • లర్చుచుంట
గీ॥ సద్ద్విజోపేత మనఁగ నె • సంగుఁగాద
అల భరద్వాజశుక-కౌశి • కాదులుంట
వాహ్వరే యీమహోద్యాన • వనము నెన్నఁ
దరమె మాబోటి చెలులకీ • ధరణి తరుణి॥ 82

ఈ పద్యమునందు ప్రస్తుత విషయమగు నుద్యానవనవృక్షాదులను గూర్చియు నర్థద్వయము గలుగునటులుగా రచియింప బడినదని గ్రహించునది.

టీక శక్ర = మద్దులు, కేశవ = పొన్నలు, మన్మథ = వెలగలు, అర్క = జిల్లెళ్లు, ఆదులు = మొదలైన చెట్లు, మలయుచుంటన్ = వ్యాపించియుండుటవలన, అమర = పొగడచెట్లతో, సంగతము గాదా = కూడుకొనఁబడినది కాకపోవునా యనియును, శక్ర = ఇంద్రుడు, కేశవ = విష్ణుఁడు, మన్మథ = మదనుఁడు, అర్క = సూర్యుఁడు, ఆగులు = మొదలైన దేవతలు, మలయుచుంటన్ = వ్యాపించియుండుటవలన, అమర సంగతము గాదా = దేవతలతో కూడుకొనఁబడినది కాకపోవునా యనియును అర్థము ని అమరత్రిద శేఽప్యస్థిహారేచ వకుళద్రుమే, అనియును, శక్రో మహేంద్రేస్యాత్కుట జార్జునభూరుహోః, అనియును కేశవోవాసుదేవేస్యాత్పున్నాగే కేశవత్యపి, అనియును, మన్మథః కామచింతాయాం కపిత్థే కుసుమాయుధే అనియును అర్కోఽర్కపర్ణే స్ఫటికే రవౌ తామ్రేవనస్పతౌ, అనియును విశ్వము. విభీషణ = కిక్కసకసవు, బక = బక పుష్పపుచెట్లు, కర్పూర = కలిగొట్టుచెట్లు, ఆదులు = మొదలైనవి, ఇటఁ = ఇచ్చోట, గ్రాలుచుంటఁ = ప్రకాశింపుచుండుట వలన, దైత్యా = చండమను నోషధీవిశేషముతోడ, లేక మురయను సువాసనగల చెట్లతోడ, అన్వితంబు గాదా = కూడుకొనఁబడినది గాకపోవునా, అనియును విభీషణ = విభీషణుఁడు, బక = బకాసురుఁడు, కర్పూర = కిమ్మీరుఁడు, లేక నిర్ఋతి, ఆదులు = మొదలైన రాక్షసులు, ఇటగ్రాలుచుంటన్ = ఇచ్చట ప్రకాశించుచుండుట వలన, దైత్యాన్వితంబు గాదా = రాక్షసులతో కూడుకొనఁబడినది గాకపోవునా, అనియును అర్థము నీ దైత్యాగంధ కుటీమురా, అనియును, కర్బురో నికషాత్మజః, అనియును, అమరము, బకస్తు బకపుష్పేస్యాత్కహ్వే శ్రీదేచ రక్షసి, అనియును, కర్బురా కృష్ణవృంతాయాం కిమ్మీరే కర్బురాన్యవత్, అనియును, దైత్యా చండౌషధావపి, అనియును విశ్వము. విభీషణ శబ్దము శబ్దార్థచంద్రి

కలోఁ జూడనగును మాధవీ = పూలగురువింద చెట్లు, శారద = ఏడాకు లరటిచెట్లు, ఇంద్రాణీ = వావిలిచెట్లు, శివా = ఉసిరిక చెట్లు, ఆదులు = మొదలైనవి, తనరుచుంటన్ = అతిశయించుటవలన, మహిళా = ప్రేంకణపు చెట్లతో, యుతము గాదా = కూడుకొనఁబడినది కాకపోవునా, అనియును. మాధవీ = లక్ష్మీదేవి, శారదా = సరస్వతీదేవి, ఇంద్రాణీ = శచీదేవి, శివా= పార్వతీదేవి, అదులు దనరుచుంటన్ = మొదలైనవార లతిశయించు చుండుట వలన, మహిళా యుతముగాద = స్త్రీలతో కూడుకొనఁబడినది కాక పోవునా యనియును అర్థము ని మహిళా భీరుగుంద్రయాః, అనియును, మాధవీ మదిరాయాంచ కుట్టన్యాం మతిముక్తకే, అనియును విశ్వము. ఇంద్రాణీస్యా త్సిందువారే పౌలోమీరలిఐస్త్రియోః, అనియును, శివా భవే దామలకీ భవానీ, అనియును, రత్నమాల, శారద, మాధవీ, శబ్దములు శబ్దార్థచంద్రిక లోఁ జూడనగను శాండిల్య = మారేడు చెట్లు, గాలవ = లొద్దుగు చెట్లు, నారద = నారింజచెట్లు, ఆదులు = మొదలైనవి, ఘనతన్ = అధిక్యతగా, ఎలర్పుచుంటఁ = వికసింపుచుండుటవలన, ముని = అగి సెచెట్లతో, సమేతము గాదా = కూడుకొనఁబడినది కాకపోవునా, అని యును, శాండిల్యుఁడు, గాలవుఁడు, నారదుఁడు మొదలైనవారలు, అతిశయించుట వలస, మునులతో కూడుకొనఁబడినది కాకపోవునా, అనియును' అర్థము ని మునిర్వ్యమీంగుదీ బుద్ధ ప్రియాలాగస్తి కింశుకే, అని విశ్వముః మునిః లోద్రౌతు గాలవౌ, అనియును శాండిల్యో ముని మాలూరో, అనియును రత్నమాల, నారద, నారింజచెట్టనుటకు శబ్దార్థచంద్రికలోఁ జూడనగును, అల = ఆయొక్క, భరద్వాజ = ఏట్రింత పక్షులు, శుక = చిలుకలు కౌశిక = గుడ్లగూబలు, ఆదులు = మొద లైనవి, ఉంటన్ = ఉండుట వలస, సత్ = శ్రేష్ఠములైన, ద్విజ = పక్షులతో, ఉపేతమనఁగన్ = కూడుకొనఁబడినది య నఁగా, ప్రసంగుఁగాదా = ఒప్పునుగాదా, అనియును, అల = ఆయొ క్క, భరద్వాజుఁడు, శుకుఁడు, కౌశికుఁడు, మొదలైనవార లుండు

టవలన. సద్ద్విజోపేతమనఁగ నెసంగుఁగాద = మంచి బ్రాహ్మణులతో కూడు కొనఁబడినదిఁగా నొప్పను గాదా యనియును, అర్థము. ని. ద్విజోవిప్రోఒండ జేదంతే, అని విశ్వము భరద్వాజో మునౌద్రోణే వ్యాఘ్రాటే అనియును, కౌశికాః గుగ్గులూలూక నకులముని శక్రాహితుణ్ణికాః అనియును రత్నమాల, తరుణీ = ఓ బాలికా, ఈధరణిన్ = ఈ భూమియందున వాహ్వారే = అయ్యారే, ఈ మహోద్యానవనము నెన్నన్ = ఈ యతిశయమైన యుద్యాన వనమును వర్ణింపఁగా, మాబోటి చెలులకున్ = మావంటి చెలికత్తియలకు, తరమే = శక్యమా (కాదనుట), అనఁగా నీపద్యములో రెండవపాదము నందలి విభీషణాదులు, గీతి రెండవపాదమునందలి శుకాదులును, అప్పటికాలమునకు గల్గనివారగుటవలఁన దలంపఁబడుట యసంభవము గావున శివ చంద్రక థలతో ప్రస్తుత విషయిక వృక్షైకార్థమును మాత్రము పరిగ్రహించి సారంగధర కథ యందున నప్రస్తుతార్థమును గూడా స్వీకరించుట స్వారస్యముగా నుండును

ఆ॥వె॥ తరణి మదన శక్ర • వరుణ కేశవ శివా
ద్యమల తరులచేత • నలరు నట్టి,
ఈ వనాంతరమున • నే సుమనస్సును
దెచ్చి యొసఁగవలెనొ • తెలుపుమమ్మ ॥ 83

ఈ పద్యమునందున సుమనశ్శబ్దము పుష్పమునందును వేల్పునందును వర్తించును గావున, పుష్పముపై నెపమారోపించి యీ వనములో నుండునట్టి యేవేల్పును దెచ్చెదనని యొకానొక చెలికత్తియ భావగర్భితముగా వచియించె నని గ్రహించునది.

టీక. తరణి = పిన్నగోరంట చెట్లు, మదన = మంగచెట్లు, లేక ఉమ్మెత్తచెట్లు, శక్ర = కొడిశచెట్లు, వరుణ = ఉలిమిరిచెట్లు, కేశవ = పొన్నచెట్లు, శివ = ఉసిరికచెట్లు, ఆది = మొదలైన, అమల = స్వచ్ఛమైన, తరులచేతన్ వృక్షములచేక, అలరునట్టి = వికసించునటువంటి,

ఈ వనాంతరమునన్ = ఈ యారామము లోపల, ఏసుమనస్సును = పుష్పమును, తెచ్చి యొసఁగవలెనొ = తీసుకవచ్చి యీయవలయునో, తెలుపుమమ్మ = ఎఱిఁగింపుముతల్లి యనిమోను, తరణి = సూర్యుఁడు, మదన = మన్మధుడు, శక్ర = ఇంద్రుఁడు, వరుణ = వరుణుఁడు, కేశవ=విష్ణుఁడు, శివ = ఈశ్వరుఁడు, ఆది = మొదలయిన, అమల తరులచేతన్ = నిర్మల తరులచేత, అలరునట్టి = ప్రకాశించునటువంటి, ఈ వనాంతరమునన్ = ఈ యుద్యానవనసీమలో, ఏసుమనస్సును దెచ్చి యొసఁగవలెనొ = ఏవేల్పును తీసుకొనివచ్చి యప్పగించవలయునో, అమ్మ = ఓతల్లీ, తెలుపుము = ఎఱింగించుము అనియును అర్థము ని తరణి స్తరణే ఘానౌ కుమార్యోషధి నౌకయోః, అనియును, వరుణ స్తరుభేదేపి ప్రతీసీ పతి సూర్యయోః అనియును మదన స్మర ధుత్తూర, అనియును విశ్వము

వ॥ అనిన నాదేవి యచ్చెలికత్తియ భావమునెఱింగి యిట్లనియె. 84

టీక సుగమము

ఆ॥వె॥ సతి పొగడఁ గనిమన ♦ సారంగధృతి స్సుమ
నస్సుఁగై కొనియును ♦ నలువ్వమీఱఁ
దెచ్చి యొసఁగవలదె ♦ తెలిసిన చెల్యులకు
వేఱె నేర్పవలెనె ♦ విద్రుమోష్ఠి॥ 85

టీక సతి = సాధ్వియైనది, పొగడఁగని = పొగడవృక్షమును జూచి, మనసారంగన్ = మనస్ఫూర్తి యగునటులుగా, ధృతిన్ = సంతోషముతో, సుమనస్సున్ = పుష్పమును, కైకొనియును = చేకొనినదియై, నలువుమీఱన్ = నేర్పుమించునటులుగా, తెచ్చి యొసఁగవలదె = తీసుకొనివచ్చి యీయవలదా, అనియును, సతి పొగడఁగని = పార్వతీదేవి స్తోత్రముసేయఁగాఁజూచి, చంద్ర సారంగధర కథలలో, సాధ్వియైనది స్తోత్రముసేయఁగాఁజూచి, మన = మనయొక్క, సారంగధృతి సుమనస్సున్ = జింకతాల్పరియైన శంకరుఁడనే వే

ల్పును, జింకతాల్పరియైన చంద్రుఁడనే వేల్పును, సారంగధరుఁడనే పేరుగల విద్వాంసుని, అని మూఁడు కథలకు గ్రహించునది ని సుమనాః పుష్ప మాలత్యోస్త్రిదశేకోవిదే౽పిచ అని విశ్వము సారంగధరుఁడు విద్వాంసుఁడనుటకు అప్పకవీయమునందున గీ రాజరాజ నరేంద్ర తనూజుఁ డార్య । సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు । నన్నయరచించు నెదఁ బరనం బొనర్చె । నన్యులెవ్వరెఱుంగరీ యాంధ్ర పక్కి, యనుటచే నన్నయభట్టు చెంత వ్యాకరణాది శాస్త్రములను పరియించి విద్వాంసుఁడైనది ప్రసిద్ధము. కైకొనియును = చేకొనినదియై, నలువుమీఱఁదెచ్చి = నేర్పు మించునటులుగా తీసుకొనివచ్చి, ఒసఁగవలదె = అప్పగించవలదా. అనియును, భావార్థములు, తెలిసిన చెలులకును = విజ్ఞురాండ్రైన చెలికత్తియలకు, విద్రుమోష్ఠి = ఓ పగడము వంటి పెదవిఁగలదానా, లేక చిగురుటాకు వంటి పెదవిఁగలదానా, ని. విద్రుమో రత్నవృక్షేస్యాత్ప్రవాళే పల్లవే౽పిచ. అని విశ్వము. వేఱె నేర్పవలెనె = ప్రత్యేకముగా గఱపవలయునా (పన్ని లేదనుట)

వ॥ అనిన నాదేవిభావంబు సారంగధరుని యందుఁ దవిలెనను వారును కాదనువారును నైసంశయము నొందుచున్న యెడ మఱియుఁ కొక చెలికత్తియ యాదేవితో నిట్లనియె

## వృషభగతిరగడ దేవీ సఖుల సంవాదము

చెలి. ముదిత ముదితక్రొ౽లలచుట్టును • మొల్ల మొల్లముగ వికసించెను
పొదలు పొదలుగదా యనేకము • పూగ పూగములిచట మించెను

దేవి. కొమ్మ కొమ్మలు నిండగనుసిరిఁ • గోర గోరఁట పూచెఁబువ్వుల
నిమ్మ నిమ్మగురీతిఁగాచెను • నెమ్మి నెమ్మికి వలన దవ్వుల

చెలి కలికి కలికివనమున నల్లటుఁ • గాంచఁ గాంచనములను పూచెను

వెలగ వెలగల ఫలములగుపడె • విరిగి విరిగి పడంగఁగాచెను

దేవి అక్కయక్కడఁబూచి మల్లెలు • నలరు నలరులఁదెమ్ముపోఁగదె
ప్రక్కె పక్కెకదా యిటకునర • పరుగు పరుగున నేగిరాఁగదె

చేలి నిచ్చ నిచ్చన నేను దేవిరో • నీవనీవలయమునఁ దిరుఁగుదు
నెచ్చ నెచ్చటఁ బరిమళముతో • నింపు నింపును పొన్నలెఱుఁగుదు

దేవి. పొలఁతి పొలతినిశముల చెంతలఁ • బొగడఁబొగడలు పూచె తేగదె
తిలక తిలక స్థుమ్ములకడకే • తెంఛి తెంఛియ్యు నాకునీగదె॥

టీక ముదిత = ఓవెలఁది, ముదితక్కెలల చుట్టను = ముదిరిన తక్కెళ్లచుట్టును 'మొల్ల = మొల్ల చెట్టు, మొల్లముగన్ = తఱుచుగా, వికసించెను = పూచెను, పొదలు = తీగె పొదలు, పొదలుఁగదా యనేకము = అధికముగా వర్ధిల్లునుగదా, పూగ = పోకచెట్ల యొక్క, పూగములు = సముదయములు, ఇదట మించెను = ఇటనతిశయించెను, కొమ్మ = ఓనారి, కొమ్మలు నిండఁగను = శాఖలు నిండునట్లుగా, నిరిఁగోరన్ = శోభనుగోరునట్లుగా, గోరఁట = గోరంట చెట్టు, పూచెఁబువ్వులన్=పుష్పములనుపూచెను. నెమ్మిన్ = క్షేమముగా, నెమ్మికివలన దవ్వులన్ = వంజుల వృక్షమునకు కుడివైపు సమీపమునందున, నిమ్మన్ = నిమ్మచెట్టునందు, ఇమ్మగురీతిఁగాచెను=ఇంపగు విధమున ఫలించెను కలికీ = ఓ యువతీ, కలికితనమునన్ = మనోజ్ఞత్వముగా, అల్లటుఁగాంచన్ = అవైపునఁజూడఁగా, కాంచనములును పూచెను = సంపెఁగలు వికసించెను, వెలగన్ = వెలగచెట్టునందున, వెలగల ఫలములగుపడెన్ = కరీదుగల్గిన పండ్లునగుపడియెను, విరిగి = విరిగిచెట్టు, విరిగిపడంగఁగాచెను = ఖండములై పడునట్లుగా ఫలియించెను, అక్క = ఓ అప్పా, అక్కడన్ = అచ్చోటున, పూచి = పుష్పించినవియై, మల్లెలు = మల్లెచెట్లు, అలరున్=ప్రకాశించును, అలరులుదెమ్ముపోఁగదె=పుష్పములుతీసుకరావలెను పోవంగదె, ప్రక్కె=ప్రక్కెచెట్టుయొక్క, ప్రక్కెకదా=సరసననే

కదా, ఇటకు నరవరుగు=ఇచ్చటికినర్ధ క్రోశమె, పరుగున నేగిరాగదె = తీవ్ర ముగాఁ బోయిరాగదవే, నిచ్చన్ = నిరంతరమును, ఇచ్చన = అభిలాషతో, దేవిరో = ఓయజమానురాలా, నేను = ఏను, నీ = నీయొక్క, వనీవలయ మునఁ దిరుగుదున్ = వనప్రదేశమునందునఁ ద్రిమ్మరుదును, ఎచ్చన్ = హెచ్చునట్లుగా, ఎచ్చటన్ = ఎందైనను, పరిమళముతోన్ = సువాసనతోడ, ఇంపున్ = ఆనందమును, నింపున్ = నిండింపఁజేయును, పొన్న లెఱుఁ గుదున్ = పొన్నచెట్ల నెఱుంగుదును, పొలఁతి = ఓ తొయ్యలీ, పొలతినిళ ముల చెంతలన్ = అల్ల నెమ్మిచెట్ల ప్రక్కలయందున, పొగడన్ = గణిం పఁగా, పొగడలు పూచెఁ దేఁగదె = పొగడచెట్లు పుష్పించినవి తెచ్చియీయఁగ దవె, తిలకతిలక = శ్రేష్ఠమైన బొట్టుగుచెట్లయొక్క, సుమములకడకేతెంచి = పూవుల చెంతకుఁబోయి, తెంచియు నాకు నీగదె = తెంపుకొనివచ్చి నాకు నొసంగఁగదవె.

వ॥ అని యన్యోన్యానురాగంబుల భాషింపుకొనుచు నాచెలి కత్తియలు. 88

టీ. సుగమము

సీ॥ మెలఁత మోమునుబోలు • మెట్టదమ్ములు కొన్ని
దశనాలఁబోలు కుం • దములు కొన్ని
తరుణి మోవినిబోలు • దాసన పూల్కొన్ని
జిగి ముక్కుఁబోలు సం • పెఁగలు కొన్ని
సతి కరములఁబోలు • సరములు కొన్ని పా
లిండ్లనుబోలు పూ • చెండ్లు కొన్ని
పొలఁతి పొక్కిలిఁబోలు • పొన్నపూవులు కొన్ని
మెయితావిఁబోలు మ • ల్లియలు కొన్ని
ఆ॥ గళమునఁ దాల్చుటకును మం • గళము గలుగఁ
దుఖమునందున సొంపుగాఁ • దుఃఖముటకును

కూర్చుకొని చెలుల్ ముదముఁజే • కూర్చుకొఱకు
దేవి కర్పించి రప్పు డం • దే వినతిని॥ 89

టీక సుగమము.

క॥ చెలియ యొకతె వేఱొకతెకుఁ
బొలఁతీ జంటయగు లికుచ • ములు గోయుమనఁగా
లలి దేవి నిక్కమిది యు
గ్మలి కుచములు గోయుమని ప • కాపక నగియెన్॥ 90

ఈ పద్యమునందున, యుగ్మ = రెండునగు, లికుచములు గోయుమని = నిమ్మపండ్లను కోయుమటంచు, మఱియు, ఉగ్మలి = ఆ చేడియ యొక్క, కుచములు గోయుమని = స్తనములను గోయుమటంచు, ఇట్లు నొకభావమున్నందున నాదేవి ఈ భావగర్భితమైన వాక్యమును పల్కి పకాపక నవ్వెనని తాత్పర్యము

క॥ అంగన యొక్కతె యొడి నా
రంగఫలముఁ గోసి దాప • రముఁ జేసిన దే
విం గని యొకతె దెలుపఁ దా
పంగఁ బగులఁ దీయుఁడనుచుఁ • బకపక నగియెన్॥ 91

టీక దాపంగన్ = దాచిపెట్టుటవలన, పగులఁదీయుఁ డనుచున్ = ఒడినూడ దీయుఁడటంచు, పంగఁ బగులఁ దీయుడటంచు, అనియు నర్థమున్నందున నాదేవి పకపక నవ్వినదని గ్రహించునది

గీ॥ దేవి కొఱకయి యీపండ్లుఁ • దెంచి దాచి
పెట్టితి నొసంగనా యొడి • ముట్టుకోక
పదరె యన నిని యాపె కీ • వట్లముట్టు
కోకయఁట రారె యని దేవి • కోక నగియె॥ 92

టీక సుగమము

గీ॥ ఇంతి యొక్కతె పేనుండె నేమొ నెత్తి
జిలగలిగెఁ జూఁడుమని యొక • చేడె నడుగఁ
గొమ్మ నీపేను నే నిసీ • కుక్కననిన
కుక్కవా యనిదేవి ప • క్కనను నగియె॥ 93

టీక. సుగమము

ఉ॥ ఈగతి నవ్వఁగా ఫలము • లిచ్చుచు తేమలు చెట్టు లెక్కుచున్
బాగుగఁ దీయనైన పరి • పక్వఫలంబులఁ గోసి మెక్కుచున్
దీగియ నట్లఁజొచ్చియును • తేనెలు రాల్చుచు గ్రోలి సొక్కుచున్
దాగిలి మూతలాఁడఁగ ఘు • దంబున వేదిరి దేవి మ్రొక్కుచున్

టీక సుగమము

మ॥ పొదలన్ దేవినొకర్తె కేలిడికనుల్ • మూపెట్టఁగాఁ దక్కొరుల్
పొదలందే వివరింపదాగిరి వెద • ల్కం గన్నులన్ మూయుటల్
వదలన్ జూపులు చేరలన్ మిగిలి రే • వఁగా గానుపింపన్ బ్రియం
వదలఁగా జూపునికెట్టు దాఁగఁగల ర • న్వారా విశాలాక్షికిన్॥

టీక సుగమము

క॥ కొమ్మా వారలపై నొక
కొమ్మా రయ నెక్కె దాగి • కొందు ననున్ గ
న్గొమ్మా దాగిలి మూత
న్గొమ్మా నీవనుచు నొకతె • కున్ సతి నుడివెన్॥ 96

టీక సుగమము

క॥ సరి యంగని దాగిన సొగ
సరి యంగ విలాస రుచియు • నల సంపెఁగతో

సరి యౌ మైతావి సరా
సరి యౌరా యెల్లరికి వె • సఁగ గను పడియెని ॥ 97

టీక. సుగమము

క॥ ఆ లీలావతిఁ గన నగి
యాలీలా వనపు వనము • నందు మునిఁగియుఁ
దేలవలె నాఁటలిఁక నిం
దేలవలె సరోవరంబు • నెఱిఁగింపఁదగుఁ ॥ 98

టీక సుగమము.

క॥ ఈదవలె వడిజలముపై
యీదవలె నటంచు మిగుల • నీప్సితమును నా
తోఁ దవులఁ గోరితి వని
తో దవులన్ జూవరే చె • లుల్ కొలననిసఁ ॥ 99

టీక ఈదవలెపడిన్ = గాలివలె వేగముగా, తతిమ్మావిషయము సుగమము.

క॥ చెలియలు దేవికిఁ జూపిరి
కెలఁకునఁ దమ్ములకు సంపఁ • గెల కలసల కం
చల కళులకు నులచలకుఁ దొ
గలకున్ జలముల కలలకుఁ • గలఁకుఁ గొలఁకున్ ॥ 100

టీక. తమ్ములకుఁ = పద్మములకును, సంపఁగెలకున్ = చంపక వృక్షములకును, అలసలకుఁ = అల్లుకొనుతీగెలకును, అంచలకుఁ = హంసలకును, అళులకుఁ = తుమ్మెదలకును, ఉలచలకుఁ = చేపలకును, తొగలకుఁ = కలువలకును. జలములకుఁ = నీళ్లకును, అలలకున్ = తరంగములకును, కలఁకున్ = స్థానమును, కొలఁకున్ = సరోవరమును, కెలఁకునన్ = పార్శ్వమునందున, చెలియలు = చెలికత్తియలు, దేవికిఁ

జూపిరి = తమ యజమానురాలికి చూపించిన వారైరి

వ॥ ఇట్లుఁ జూపించిన నాదేవి యా చెలికత్తియలకు నిట్లనియె 101

టీక. సుగమము.

సీ॥ శైవలంబులునుండె • శైవాలకచ యేమొ
తామరలుండెఁ బ • ద్మముఖియేమొ
కైరవంబులునుండె • కలువకంటియొ యేమొ
కంబులునుండె శం • ఖగళయేమొ
జక్కవలుండెను • చక్రస్తనియొ యేమొ
యలలుండెను తరంగ • వళియొ యేమొ
బలుసుళ్ళునుండెనా • వర్తనాభియొ యేమొ
సికతలుండెను సైక • తకటి యేమొ
గీ॥ గ్రాహములునుండె నక్ర జం • ఘయగు నేమొ
చారు కమఠంబులుండె క • చ్ఛపపదాగ్ర
యేమొ యీ సరోవరలక్ష్మి • నెన్నఁదరమె
నాకు సరి దానిఁజూపించి • నారయారె॥ 102

టీక సుగమము.

గీ॥ అనుచుఁ జెలులను మెచ్చుచు • నపుడు దేవి
చికిలి సొమ్ములుదీసి పే • టికను జేర్చి
పట్టు పుట్టంబువీడి పా • వడ ధరించి
కొలను దరిఁజేరి మ్రొక్కి య • గ్గలముగాఁగ॥ 103

టీక. సుగమము

క॥ తానంబుఁ జేయుటకునై
తానంబుల దిగ సఖీ క • దంబమ్మపుడా

తానంబున దిగె వసనవి
తానంబు సరిత్తటమునఁ ♦ దగనిడి యంతన్॥ 104

టీక తానంబుఁ జేయుటకునై = స్నానముచేయుట కొఱకై, తాను + అంబులన్ దిగన్ = తాను నీళ్ళయందున దిగఁగా, అపుడు = ఆ సమయమందు, సఖీకదంబమ్ము = చెలికత్తియల గుంపు, వసన వితానంబున్ = వస్త్రముల సముదయమును, సరిత్తటమునన్ = కొలను దరియందున, తగనిడి = ఒప్పుగాఁ బెట్టినవారై, ఆతానంబునఁదిగెన్ = ఆ స్థానమునందే దిగినదాయెను, సఖీకదంబమ్మని సమూహార్థమగుటచే దిగెనని యేకవచనక్రియను ప్రయోగింపఁబడినదని గ్రహించునది, అంతన్ = అటు మీదట

చ॥ నకి కురులబ్దమంచును వె ♦ సన్ గల హంసలు బాఁఱెమోము శీ
తకరుఁడటంచు జక్కవలు ♦ తాపమునందుచుఁ దారె నాస చం
పకమని తుమ్మెదల్ జనియె ♦ మధ్యము సింహమటంచు నీటి యే
నికలట దాగె దేవి తటి ♦ నిల్వఁగనే రిపువర్గమాటచేన్॥ 105

అనఁగా హంసలకు మేఘమును, జక్కవపక్షులకు చంద్రుఁడును, తుమ్మెదలకు చంపకపుష్పమును, ఏనుగునకు సింహముటును వైరివర్గమగుటచే, ఆదేవి కొలనులో నిల్చినమాత్రనే కురులు మేఘమని హంసలును, ముఖము చంద్రుఁడని జక్కవలును, ముక్కు సంపఁగిపూవని తుమ్మెదలును, నడుము సింహమని నీటియేనుంగులును నిరంతరమట నుండునవి యయ్యును బెదరిపోయెనని తాత్పర్యము

చ॥ చెలియలు దేవియిట్లు సర ♦ సిన్ దిగి మున్గుచుఁదేలుచొండొరుల్
జలములఁ జల్లుకొంచు సహ ♦ జంబుగ ముందున కీదుచున్ వడిన్
వెలికిలఁ బవ్వళించియును ♦ వేగమయాడుచుఁ బ్రక్క కీదుచున్
నిలఁబడియాడుచున్ మఱి ము ♦ నింగియు నీదుచు నుందిరయ్యెడన్

టీక. సుగమము

గీ॥ తరుణి యొక్కతె నీట నీ • దంగ లేక
మునుఁగుచును దేలుచుండిన • ముదితలెల్లఁ
బరిహసింపుచు నందులోఁ • బడఁతియొకతె
నీవిఁగొని తిప్పఁగా నీత • నేర్పునంత॥ 107

టీక. సుగమము

చ॥ ఎదనొక కుంభమున్గొనివ • దేండ్ల నెలంత సరోవరంబునన్
బొదలఁగ నీదుచున్న బిడె • మున్ వలదా కుచకుంభయుగ్మమిం
పొదవఁగఁగల్గియున్ మునుఁగు • చుందువు ఇవ్వనియంచు దేవి నీ
ళ్ళదరఁగనెల్లు స్త్రీల పరి • హాసము లేమనవచ్చునజ్జరే॥ 108

టీక సుగమము.

సీ॥ మునిఁగి యీదఁగ గేశ • ములు దేలి కొలనెల్ల
శైవలంబుల యట్లె • సంగుచుండు
తలలెత్తి యీద వ • దనములున్ గొలనెల్ల
కమలజంబుల యట్లఁ • గ్రాలుచుండు
వెనుకకు నీదఁగాఁ • స్తనములు గొలనెల్ల
జలజకోరకము ల • ట్టులఁ జెలంగు
ముందున కీదఁ బి • రుందులు గొలనెల్ల
సైకత దీవుల • సరణి వెలయు
గీ॥ నొక్కొకప్పుడు పొక్కిళ్ళు • సుడికియాడు
లాఁడ గొలనెల్ల సుళ్లనై • యలరుచుండు
వళులు గనుపడ నీదఁగా • నలలటుఁదగు
సఖియ లెల్లరు జలక్రీడ • సలుపునప్డు॥ 109

టీక సుగమము

సీ॥ ప్రపదముల్ గనుపింపఁ ♦ బఁదతులీదెడువేళఁ
గొల్లనెల్లెడల నబ్జ ♦ ములనఁదోచు
జంఘలు గనుపింపఁ ♦ జాన లీదెడు వేళఁ
గొలనెల్లెడల నబ్జ ♦ ములనఁదోచు
కంఠముల్ గనుపింప ♦ గరిత లీదెడువేళఁ
గొలనెల్లెడల నబ్జ ♦ ములనఁదోచు
నయనముల్ గనుపింప ♦ నారు లీదెడువేళఁ
గొలనెల్లెడల నబ్జ ♦ ములనఁదోచు
గీ॥ నింతు లాస్యముల్ గనుపింప ♦ నీదువేళఁ
గొలనుతో నెల్లెడలఁ నబ్జ ♦ ములనఁదోచుఁ
గాన నబ్జాకరంబనఁ ♦ గాఁ గొలంకు
నకు నెసఁగె నాఁడు సార్థక ♦ నామ మహహ॥ 110

అబ్జ శబ్దము వరుసగా, తాబేళ్ళకును, మొసళ్ళకును, శంఖమునకును, చేపలకును, పద్మములకును, చెల్లుటవలన నా స్త్రీలీదునప్పుడు మీగాళ్ళు తాబేళ్ళుగను, పిక్కలు మొసళ్ళుగను, కంఠములు శంఖములుగను, కన్నులు చేపలుగను, ముఖములు పద్మములుగను, గనుపించుటచే నాకొలంకునకు నబ్జాకరంబను నామము సార్థకమైనదని తాత్పర్యము

గీ॥ ఇటుల నీదుచుఁ జేడియ ♦ లెల్లకొంత
సేపువాలాటలాఁడి య ♦ చ్చికము మీఱఁ
కొలనిలో దాగి కొందుఁ గ ♦ న్గొనరె మీర
లనుచు నాదేవి మునిఁగె న ♦ య్యవసరమున॥ 111

టీక సుగమము

సీ॥ వనిత పదాగ్రము ♦ లనుచుఁ గచ్ఛపములఁ
  గని పట్టుకొనఁబోవుఁ ♦ గాంత యొకతె
మగువ జంఘలటంచు ♦ మకరంబులను గనుఁ
  గొని పట్టుకొనఁబోవుఁ ♦ గొమ్మ యొకతె
చాన పిరుందని ♦ సైకత దీవినిన్
  గని పట్టుకొనఁబోవుఁ గలికి యొకతె
తరుణి హస్తములని ♦ తామరతూడులఁ
  గని పట్టుకొనఁబోవు ♦ గరిత యొకతె
గీ॥ ముదిత కంధరమని వల ♦ మురినిఁ గాంచి
కడఁకఁ బట్టుకొనఁగఁబోవుఁ ♦ బడఁతి యొకతె
లలన కురులంచు శై[illegible]ం ♦ బులను గాంచి
చేరి పట్టుకొనఁగబోవుఁ ♦ జేడె యొకతె॥ 112

టీక. సుగమము

చ॥ ఇటుల భ్రమప్రమాదముల ♦ నింతులు దేవియటంచుఁబట్టఁ బో
వుటకు మనంబులో నరుదు ♦ బొందుచు నిల్చెఁదరంబుగాని మి
క్కుట మగునవ్వగల్గి యల ♦ కొమ్మ కొలంకునఁదేలి యో మహో
త్కట కుచలార రారె నను ♦ గన్గొనలేరని పిల్చు నెంతయున్॥ 113

టీక సుగమము.

గీ॥ అనుచుఁ బిల్చుచు దరిఁజేర ♦ నతివ యొకతె
దేవితో నిట్టులనుచుఁ బం ♦ డెమును గట్టి
మునుఁగు మీసారి గను గొన్న ♦ మురుగు లిడుదె
నేను గనుఁగొనలేకున్న ♦ నాను నిడుదు॥ 114

టీక సుగమము

క॥ నాపుడు ముసిముసి నవ్వుచు
దేవి సరోవరమునందు • దిగి మున్గిన నే
శ్రీవఁ జెలికి నగుపడమికి
రావమ్మాదేవి కాన • రావని పిలిచెన్॥ 115

టీక సుగమము.

క॥ పిలిచిన నాసతిలేచియు,
బొలుపుగ నాలోఁడి పందె • మున నోడుట నీ
చెలి నొంటి కాలిమీద
న్నిలఁబెట్టుడటంచు నాజ్ఞ • నెంఁతల కిడియెన్॥ 116

టీక సుగమము.

గీ॥ అంత నాయెలనాగ ల• య్యతివఁ జేరి
పట్టి బలవంతముగ నిలఁ • బెట్టఁబోవ
విడువుఁడని నెట్టుకొని దేవి • కడకు నేగి
యచ్చ తెలుఁగున నేకాక్ష • రాళిఁ బలికె॥ 117

టీక సుగమము

ఏ కా క్ష రి

క॥ నే నాన నూన నన్నా
నా నేనున్ నిన్ను నెన్న • నన్నా నా నే
నే నాన నాని నా న
న్నా నానును నాను నీన • నన్నన నౌనా॥ 118

టీక నేను = ఏను, ఆనన్ = ఆజ్ఞను, ఊన నన్నానా = వహింప నని పల్కి నానా,నేను = ఏనునం, నిన్ను నెన్ననన్నానా = నిన్నుస్తోత్రము సేయనని యన్నానా, నేనే = ఏనే, నానన్ =సిగ్గును, అనినాను = పొందిన దానైతిని, అన్నా = ఓ ప్రభువా అన్న + అ, అనఁగా నుకారాంతములగు

తెలుగు నామములు నిత్యముగా సంబోధనమున నకారాంతములగుట స్వాభావికము, ఉదా తేఁడు, తేఁడా, బచ్చు, బచ్చా, దుసీడు, దుసీడా మొదలైనవని గ్రహించునది, నా = నాయొక్క, నును = మృదువైన, నాను సీన = నాను, అనే సొమ్మునీయనా, నన్ను = నన్నును, అననౌనా = అననొప్పునా, అన్న = అనఁగా స్త్రీ సామాన్యనామమగును, ఈ పద్యము నచ్చతెలుఁగు శబ్దములతో రచియింపఁబడినదని గ్రహించునది

వ॥ అని పల్కిన చెలికత్తియ చమత్కార వచనంబులకు నాదేవి సంత
సించి మన్నించిన యంత నెల్లరును స్వేచ్ఛావిహారంబుగా జలక్రీడలు
సలుపు నవసరంబున॥ 119

టీక. సుగమము.

గీ॥ చెలియలెల్లరు గుమికూడి ♦ జీవనంబు
కెలఁకు లెత్తఁగ నట జల ♦ క్రీడసలిపి
దరికిఁ జేరియు వసనముల్ ♦ దాల్చి కురుల
నార్చుకొనుచున్న దేవి కి ♦ ట్లనియె నొకతె॥ 120

టీక. సుగమము

గీ॥ రమణి మనమొక్క దేవతా ♦ రాధనంబు
సలిపి నట్లైన మన కోరి ♦ కలు ఫలించు
నెవరి సేవింతమన నన్యు ♦ లేల తరుణ
రాజమౌళినిఁ గొలుతమో ♦ రాజవదన॥ 121

ఈ పద్యమునందున, తరుణ రాజమౌళిని గొలుతమనుటచే, ముప్పురు నాయికలును సర్వసామాన్యముగా శంకరుని సేవింత మని బహిర్గతార్థముఁ దోచునట్లుగా, పార్వతీదేవి శంకరుని పెండ్లాడ నుద్యమించుటవలన బాల చంద్రమౌళిని సేవింతమనియును, తార, చంద్రుని మోహించినందువలన

బాలచంద్రశ్రేష్ఠుని గొలుతమనియును, చిత్రాంగి, సారంగధరుని మోహించి నందున యువరాజశ్రేష్ఠుని గొలుతమనియును, అంతరార్థము గలుగునట్లు వేర్వేర వచియించిరని గ్రహించునది

క॥ అన నొక తెలిదామర జే
కునఁ గాటుకతోఁద ద్రుణముఁ ♦ గొనియు మహాదే
వుని లిఖియించిన చెలి నే
ర్పున కబ్బురమంది దేవి ♦ పొలఁతుల కనియెన్॥ 122

టీక సుగమము

సీ॥ విషమాంబకాయని ♦ వినుతింత మందమా
యిది దర్పకుని నామ ♦ మింతులార
ఓ సదాగతిమమ్ము ♦ నోము మటందమా
యిది గంధవహు నామ ♦ మింతులార
ఏణధరాయని ♦ యెన్నుద మందమా
యిది నిశాకర నామ ♦ మింతులార
అబ్జాంబకాప్తా య ♦ టంచుఁ బ్రార్థింతమా
యిది మధుయుక్తాఖ్య ♦ యింతులార
గీ॥ కాన మన్మథ శోష నా ♦ గవర భూష
రాత్రి చరజైత్ర మధువైరి ♦ మిత్రయనుచు
శంకరుని వేడ విరహిణీ ♦ శత్రులైన
వారి దర్పము లడఁగు వే ♦ర్వేర నుండి॥ 123

టీక ఇంతులారా = ఓ మగువలారా, విషమ = సమముగాని, అంబక = నేత్రములు గలవాఁడా, అని - ఇట్లనుచు వినుతింతమందమా = స్తోత్రము సేయుద మందామంటే (బేసికంటియని యనుట) ఇది = ఇయ్యది దర్పకుని నామము = గర్విష్ఠుని నామమని నైచ్యము, మన్మ

ధుని నామమని స్వభావము, ఎట్లన, విషమ = సమముగాని, అంబక = బాణములు గలవాఁడా (పంచశరాయని యనుట)అని యర్థముండుట మన్మథ నామమగును. ని. అంబకౌ జనకే బాణ నేత్రమందేషు చాంబకం, అని విశ్వము ఓ సదాగతి = ఓయి పరమేశ్వరా, మమ్మున్ = మమ్ములను, ఓముమటం దమా = రక్షించుమని యందామంటే, ఇది = ఇయ్యది, గంధవహుం నామము = మదమెక్కినవాని నామమని నైచ్యము, వాయుదేవుని నామమని స్వభావము· ని స్వశనః స్పర్శనోవాయు ర్మాతరిశ్వా సదాగతిః, అని యమరము, పరమేశ్వరుఁడనుటకు శబ్దార్థచంద్రికలోఁ జూడనగును, ఏణధరా = జింకతాల్పరీ (శంకరాయని యనుట), అని = అటంచు, ఎన్నుదమందమా = స్తోత్రము సేయుదమంటే, ఇది = ఇయ్యది, నిశాకరనామము = రేవెల్గువాని నామమని నైచ్యము, చంద్రనామమని స్వభావము, చంద్రుఁడును జింకతాల్పరియే యైనందున ననుట, అబ్జాంబకాప్తా = కమలాక్షుఁడైన విష్ణునకు మిత్రమా, అటం చున్ = అని పల్కుచు, ప్రార్థింతమా = స్తోత్రము సేయుదమంటే, ఇది = ఇయ్యది, మధుయుక్తాఖ్య - కల్లుతో కూడుకొనఁబడినవాని పేరు (త్రాగుఁబోతు పేరనుట) అని నైచ్యము, వసంతునకుఁ దగిననామమని స్వభావము, ఎట్లన, అబ్జ = కమలంబులను అంబక = బాణములుగాఁ గల మన్మథునకు, ఆప్త = స్నేహితుడవైన వాఁడా యని యర్థముండుట-వసంతునకు తగిన నామమగును, కానన్ = కావున, మన్మథశోష = మదనుని క్షయింపఁజేసినవాఁడా, నాగవర భూష = అదిశేషుని భూషణముగాఁ గలవాఁడా, రాత్రిచరజైత్ర = రేద్రిమ్మరీడులఁ జయించిన వాఁడా (రాక్షసుల ననుట), మధువైరి = మధునకు శత్రువైన విష్ణువును, మిత్ర = స్నేహితుఁడుగాఁగలవాఁడా, అనుచున్ = అటంచు, శంకరుని వేడన్ = ఈశ్వరుని నుతించినట్లైతే, విరహిణీశత్రులైన వారిదర్పములడఁగు, వేర్వేరసుండి = విరహము నొందినవారలకు వైరులగు నాపై వివరింపఁబడిన వారల యొక్కొక్కరి గర్వము నశించును చూఁడుఁడి, అనగా

మన్మథుఁడును, వాయుదేవుఁడును, చంద్రుఁడును, వసంతుఁడును, విరహిణీజను లకు నెక్కువ బాధఁగలిగించు శత్రువులగుట వలన, మన్మథ శోషయనుటతో మన్మథుని దర్పమడఁగును, నాగవరభూషయనుటతో, తనను భక్షించు శేషుని భూషణముగా గల్గిన వాఁడని వాయుదేవుని దర్పమడఁగును, రాత్రిచరమిత్ర యనుటతో నేనును రాత్రి చరించు వాఁడనే యగుదునని చంద్రుని దర్పమడఁ గును, మధువైరి మిత్ర యనుటతో మధునామముగల వారికి శత్రువైన వానిని మిత్రుఁడుగాఁ గలవాఁడని తోచి నేనును మధుఁడనేయగుదునే యని వసంతుని దర్పమడఁగును, గావున శంకరుని యీ విధముగా నుతించవలయును గాని, విషమాంబకా, సదాగతి, ఏణధరా, అబ్జాంబకాప్తా, అని నుతించినచో వరుసగా మన్మథ వాయు చంద్ర వసంత నామములు తలంపు జేసినవార మగుదుము గావున విరహిణీశత్రువులైన మన్మథాదులు నామము లుచ్చరింపరాదని తాత్ప ర్యము

వ॥ అని యీపటంబును షోడశోపచార పూజలు నొనర్చుచు వేరేశ్వర స్తోత్రంబుఁ జేయందొడంగి రది యెట్లన్నను. 124

టీక సుగమము.

తలకట్టు

క॥ గజచర్మ వసన కనదం
గజమదహర యచలసదన • గరళగళ లస
ద్గజవదనజనక యస్మ
ద్భజనం బరయం గదయ్య • భయమడఁప దయన్॥ 125

టీక గజచర్మ వసన = ఏనుంగుతోలును వస్త్రముగాఁ గలవాఁడా, కనత్ = ప్రకాశమానమైన, అంగజ = మన్మథుని యొక్క, మద హర = గర్వమును హరించిన వాఁడా, అచల సదన = పర్వతము

నిలయముగాఁ గలవాఁడా, గరళగళ = విషమును కంఠమునందు గలవాఁడా, లసత్ = మనోజ్ఞమైన, గజవదన జనక = వినాయకునకుఁ దండ్రివైనవాఁడా, దయన్ = ప్రేమతోడ, భయమడఁపన్ = నా భీతి నడఁగించుటకు, అస్మత్ = నాయొక్క, భజనంబున్ = సేవను, అరయంగదయ్య = ఓ యప్పా చూడఁగదవే

అపంచవర్గీయము

ఆ॥వె॥ శర్వ శైలవాస ♦ సారసారి విలాస
హర యశోవిశాల ♦ సరసశీల
సార శేషహార ♦ సర్వేశ సురవీర
వృషవరాశ్వ యేల ♦ వేల లీల ॥ 126

అనఁగా నీపద్యమును, కచటతపాది పంచవర్గములు లేకుండు నట్లుగా, యరలవశషసహాది వర్ణములతో రచియింపఁబడినట్లు గ్రహించునది ముక్కులు మూసికొని చదివినను సంగిలేకుండునట్లుండును గావున దీనినే నిర్నాసిక యనఁదగును

టీక శర్వ = శర్వనామము గలవాఁడా, శైలవాస = పర్వతము నివాసముగా గలవాఁడా, సారసారి = చంద్రునివంటి, విలాస = చక్కఁదనము గలవాఁడా, హర = హరనామము గలవాఁడా, యశోవిశాల = కీర్తిచేత విస్తృతమైనవాఁడా, సరసశీల = రసయుక్తమైన యాచారము గలవాఁడా, సార = శ్రేష్ఠమైన, శేషహార = ఆదిశేషునిహారముగాఁ గలవాఁడా, సర్వేశ = సమస్తమునకు ప్రభువైనవాఁడా, సురవీర = దేవతలయందున పరాక్రమవంతుఁడవైనవాఁడా, వృషవర = బసవేశ్వరుని, అశ్వ = వాహనముగాఁ గలవాఁడా, లీలన్ = విలాసముగా, ఏలవేల = రక్షింపవేటికి

## నో ష్ఠ్య ము లు

ఆ॥వె॥ మామమామపాప ♦ భీమమౌ ముప్పాపి
పావమేపు మాపి ♦ బాము( బాపి
భూమి( బబ్బ మబ్బ( ♦ బేము మి మ్మోమమి
మేము బోము భామ ♦ మేమి భీమ ॥ 127

అన(గా నీ పద్యము పెదవులు తగులునట్టి, పబభమ, అను నాల్గక్షరములతో రచింప(బడినది ఇది నాలుక కదలకుండునట్లు చదువ వీలగును గావున దీనినే, అచలజిహ్విక యననగును

టీక మామమామపాప = మన్మథునియొక్క, భీమమౌ = భయంకరమైనట్టి, ముప్పు + ఆపి = బాధనాపి, పాపము = దుష్కృతముయొక్క, ఏపున్ = ఔద్ధత్యమును, మాపి = మాయ(జేసి, బామున్ = దుఃఖమును, పాపి = విడ(జేసి, భూమిన్ = పుడమియందున, పబ్బము + అబ్బన్ = ఉత్సవము లభించునట్లుగా, పేమున్ = ప్రేమతో(డ, మమ్ము + ఓమమి = మమ్ములను రక్షింపకుంటచే, మేము బోము = మే మేగెడివారము కాము, భీమ = ఓ శంకరా, భామమేమి = తమకు కోపమేటికి, బామశబ్దము కోపమన్నందుకు శబ్దార్థచంద్రికలో( జూ(డనగును

## పా ద భ్ర మ క ము

క॥ సార సురదీర సురసా
తారనగాతతసభా స ♦ తత గాన రతా
పీర సభా భాస రపీ
మారపరా యమరవార ♦ మయ రా పరమా ॥ 128

ఈ పద్యమునందే పాదమును కాపాదము క్రిందుమీదుగా చదివిన నొకే విముధగా నుండును

టీక సార = చేవఁగల, సుర = దేవతల యందున, ధీర = విద్వాంసుఁడవైన వాఁడా, లేక ధైర్యముగలవాఁడా, లేక స్వాతంత్ర్యము గల వాఁడా, సురసా = మంచి యనురాగము గలవాఁడా లేక మంచి యందము గలవాఁడా, లేక మంచి సంతోషము గలవాఁడా, తారనగ = వెండికొండయే, అతత = విశాలమయిన, సభా = కొల్వుకూటముగాఁ గలవాఁడా, సతత = నిరంతరము, గాన = సంగీతమునందున, రతా = ఆసక్తి గలవాఁడా, వీర = శూరుఁడా, సభా = ప్రభావయుక్తమైనవాఁడా, భాస = కాంతియందున, రవీ = సూర్యుఁడవైనవాఁడా, మార = మన్మథునకు, పరా = శత్రుఁడ వైనవాఁడా, అమర = దేవతలయొక్క, వార = సముదయముతో, మయ = నిండినవాఁడా, పరమా = ఉత్కృష్టుఁడవైనవాఁడా రా = రమ్ము ని. భాః ప్రభావే మయూ శేఽపి అని విశ్వము.

పద్యభ్రమకము

క॥ సారసజ నుతజయ తరల
శూరహరా సాదరవర • సుసురా పరమా
మార వరా సుసుర వరద
సారా హర శూలరత య • జతనుజ సరసా॥ 129

ఈ పద్యము కొననుండి వెనుకకుఁ జదివినను మొదటనుండి కొనకుఁ జదివినను నట్లేయుండు విధముగా రచియింపఁబడినది.

టీక సారసజ = పద్మసంభవుఁడైన బ్రహ్మదేవునిచేత, నుత = కొని యాడఁబడు, జయ = జయముగలవాఁడా, తరళ = చలించునట్టి (అనఁగా తన నెదిరి యనుట) లళయోరభేదః, అను సూత్రమననుసరించి, తరల అని భ్రమకావసరమును బట్టి ప్రయోగింపఁబడినదని గ్రహించునది శూరహరా =

రణసాహసులను హరించినవాఁడా, సాదర = ఆదరముతోఁగూడిన, వర = ప్రభువా, సు = శ్రేష్ఠుఁడవైన, సుర = వేల్పా, పరమా పరమాత్ముఁడా, మార = మన్మథునకు, పరా = శత్రుఁడవైనవాఁడా, సుసుర = మంచి వేల్పులయొక్క, వర = కోరికలను, ద = ఇచ్చువాఁడా, స + అరా = వేగయుక్తమైనవాఁడా, హర = హరనామము గలవాఁడా, శూలరత = త్రిశూలాయుధమునం దాసక్తిగలవాఁడా, అజతనుజ = బ్రహ్మపుత్రుండవైనవాఁడా, పురాణభేదములవలన శివుఁడు బ్రహ్మపుత్రుఁడనుట ప్రసిద్ధమని గ్రహించునది.

కంద గీత మత్తేభ గర్భిత సీసము

సీ॥ వితత శుంభద్యశ • విశ్వపాలన రతా
  దాక్షాయణీ వల్ల • భా క్షతారి
విజిత మీనధ్వజ • నీరభద్ర జనకా
  శ్రీమ ద్ధరిన్నాయ • కా మహాత్మ
విగత మృత్యూ శివ • విస్తృతాత్మ విభవా
  కైవల్యసంధాయ • కా కృపాబ్ధి
వినుత చారిత్ర కృ • పీటయోని నయనా
  నూత్నప్రభాభృత్త • నూ కపర్ది

గీ॥ గిరి సదన ప్రమథ గణవర • పరమపురుష
భుజగభూష పశుపతి శం • భూ దరకర
మహిత సహిత శంకర సుర • మాన్య వరద
శిఖిగళ శశిమౌళి నమ • స్కృతులు నీకు॥ 130

ఈ పద్యమునందు పెద్దచరణములు నాల్గింటిలో మొదట నొక యక్షరమును, చివరం మూఁడక్షరములును వదలి చదివినచో మత్తేభవిక్రీడిత వృత్త

మగుననియును గీతముతో చతుర్థపాదాంతము నమస్కృతులు సేసు అను వాక్యము వదలి చదివినచో కందపద్యముగునని యును గ్రహించునది.

టీక. వితత = విశాలమైన, శుంభత్ + యశ = ప్రకాశించెడు కీర్తి గలవాఁడా, విశ్వ = సమస్తమును, పాలన = పాలించుటయందు, రతా = ఆసక్తిగలవాఁడా, దాక్షాయణీవల్లభా = దక్షుని కూతురగు సతీదేవికి నాథుఁడవైన వాఁడా, క్షత = నరకఁబడిన, అరి = శత్రువులు గలవాఁడా, విజిత = జయింపఁబడిన, మీనధ్వజ= మన్మథుఁడుగలవాఁడా, వీరభద్రజనకా = వీరభద్రునకు తండ్రియైన వాఁడా, శ్రీమత్ = సంపత్కరమైన, హరిత్ = దిక్కునకు (ఈశాన్యమున కనుట) నాయకా =పతియైనవాఁడా, మహాత్మ =మహానుభావుఁడవైనవాఁడా, విగత = నశించిన, మృత్యూ = మృత్యుదేవత గలవాఁడా, శివ = శివనామము గలవాఁడా, విస్తృత = విరివియైన, ఆత్మవిభవా = చిత్తవైభవము గలవాఁడా, కైవల్య = మోక్షమును, సంధాయకా = ఇచ్చువాఁడా, కృప = దయయందున, అబ్ధి = సముద్రమువంటివాఁడా, వినుత = మిక్కిలి కొనియాఁడఁబడెడు, చారిత్ర = నడవడిగలవాఁడా, కృపీటయోని = అగ్నిహోత్రమును, నయనా = నేత్రముగా గలవాఁడా, నూత్న = క్రొత్తయైన, ప్రభా = కాంతులను, భృత్ = ధరించిన, తనూ = శరీరము గలవాఁడా, కపర్ది = జటాజూటము గలవాఁడా, గిరిసదన = పర్వతమునే గృహముగాఁ గలవాఁడా, ప్రమథగణవర = ప్రమథగణాధ్యక్షుఁడవైనవాఁడా, పరమపురుష = పురుషశ్రేష్ఠుఁడవైనవాఁడా, భుజగభూష = పామును సొమ్ముగాఁ గలవాఁడా, పశుపతి శంభూ = పశుపతి శంభునామములు గలవాఁడా, దరకర = భయంకరమైన, పహిత శూలాయుధముతో, సహిత = కూడుకొనఁబడిన

వాఁడా, శంకర = శుభకరుఁడవైన వాఁడా, సురమాన్య = దేవతలలో పూజ్యులకు, వరద = వరముల నిచ్చువాఁడా, శితిగళ = నల్లని కంఠము గలవాఁడా, శశిమౌళీ = చంద్రమకుటము గలవాఁడా, నీకు = తమకు, నమస్కృతులు = నమస్కారములు. మహిత శబ్దము శబ్దార్థచంద్రికలోఁ జూడఁ నగును.

## గర్భ మ త్తే భ ము

మ॥ తత శుంభద్యశ విశ్వపాలన రతా • దాక్షాయణీ వల్లభా
జిత మీనధ్వజ వీరభద్రజనకా • శ్రీమ ద్ధరిన్నాయకా
గత మృత్యూ శివ వి స్తృతాత్మవిభవా • కైవల్యసంధాయకా
నుత చారిత్ర కృపీటయోని నయనా • నూత్నప్రభా భృత్తనూ.

## గర్భ కం ద ము

క॥ గిరి సదన ప్రమథగణవర
పరమపురుష భుజగభూష • పశుపతి శంభూ
దరశర మహిత సహిత శం
కర సురమాన్య వరద శితి • గళ శశిమౌళీ॥ 132

ఇఁక గర్భగీతము సీసమునందు సహజముగా నుండునని గ్రహించునది.

## కందద్వయ గర్భిత చంపక నాగబంధము



ఇందలి చంపక వృత్తమును వలపలివడిగ మొదలుకొని డావలి పడిగవఱకు మెలికల వెంబడి క్రమము దప్పక చదివినచో నీ క్రింద వివరించిన పద్య మేర్పడును. ఈ పద్యమున రెండు కందములు గలవు

చ॥ పరశివదా యపార విభ, వా భవ వర్ధన ధీవరా విభా
సుర జనపాల మారమద • సూదన శర్మ యమీన దేవతా
పరిభవ దా విషారధర • భారవి నిర్మల భావ శంకరా
చిర వినయా నగారిసుత • చేతన విష్ణు విధీన మానితా ॥ 188

టీక॥ పర = ఉత్కృష్టమైన, శివ = మంగళములను, దా = ఇచ్చువాఁడా, లేక, పర = శత్రువులయొక్క, శివ = శుభములను, దా = ఛేదించువాఁడా, అపార = మేరలేని, విభవా = వైభవములు గలవాఁడా, భవ వర్ధన = సంసారమును భేదించువాఁడా, లేక వృద్ధిఁబొందించువాఁడా, లేక ప్రపంచమును వృద్ధిఁబొందించువాఁడా, లేక ఛేదించువాఁడా, లేక జన్మనాశకుఁడవైన వాఁడా, ధీవరా = శ్రేష్ఠమైన బుద్ధిగలవాఁడా, విభా = మిక్కిలి ప్రకాశించునట్టి, సురజనపాల = దేవతాజనులను పాలించువాఁడా, మార = మన్మథుని యొక్క, మద = గర్వమును, సూదన = నాశనముఁ జేసినవాఁడా, శమ = ఇంపైన, యమి + ఇన = మునీశ్వరుల యొక్కయు, దేవతా = దేవతలయొక్కయు, పరిభవ = అవమానమును, దా = ఛేదించెడువాఁడా, విషార = సర్పమును, ధర = తాల్చినవాఁడా, భా = కాంతియందు, రవి = సూర్యుఁడవైనవాఁడా, నిర్మల = కల్మషరహితమైన, భావ = హృదయము గలవాఁడా, శంకరా = శుభకరుఁడ వైనవాఁడా, చిర = పూర్వము నుండియు, వినయా = మిక్కిలి నీతిగలవాఁడా, నగ = పర్వతములకు, అరి = శత్రువైన యింద్రుని చేత, నుత = కొనియాడఁబడిన, చేతన = తెలివి గలవాఁడా, లేక ప్రాణిగలవాఁడా, విష్ణు = నారాయణుని చేతను, విధి = బ్రహ్మచేతను, ఇన = సూర్యుని చేతను, మానితా = గౌరవింపఁబడెడు వాఁడా.
ని. దః పుంసిదాతరిచ్ఛేదే, అని రత్నమాల, వర్ధనం ఛేదనే వృద్ధౌ అని విశ్వము

గ ర్భ స్థ ప్ర థ మ క ం ద ము

క॥ శివదా యపార విభవా
భవ వర్ధన ధీవరా వి • భాసుర జనపా
భవదా విషారధర భా
రవి నిర్మల భావ శంక • రా చిరవినయా ॥ 184

### గర్భస్థ ద్వితీయ కందము

క॥ జనపాల మార మద సూ
దన కమ్ర యమీన దేవ • తా పరిభవదా
విస్మయా నగారి నుత చే
తన విష్ణు విదీన మాని • తా పరశివదా॥ ౧౮౫

టీక. చంపకమునందువలెనే యని గ్రహించునది.

### శుద్ధ నిరోష్ఠ్యము

క॥ అలికాంచి తాశ్రయాశా
ఖలదైత్యానీకనాశ • కలితాంత్యాశా
లలితాంతరిక్ష కేశా
సలిలజనయనేశ యీశ • శశిసితాశా॥ ౧౮౬

ఈ పద్యము పెదవులు తగలకుండునట్లు చదువ వీలగురీతి రచింపఁబడినది.

టీక అలిక = నొసటియందున, అంచిత = ఒప్పుచుండిన, ఆశ్రయాశా = అగ్నిహోత్రుఁడు గలవాఁడా, ఖల = దుర్మార్గులగు, దైత్యానీక = రాక్షససైన్యముల, నాశ = హతముఁ జేసినవాఁడా, కలిత = ఒప్పుచున్న, లేక కూడుకొనఁబడిన, అంత్య = చివరదియగు, ఆశా = దిక్కుగలవాఁడా, (ఈశాన్యమూలయనుట) లలిత = మనోజ్ఞమైన, అంతరిక్ష = ఆకాశమునే, కేశ = వెండ్రుకలుగలవాఁడా, సలిలజ నయన = కమలాక్షుఁడగు విష్ణునకు, ఈశ = ప్రభుఁడవైనవాఁడా, ఈశ = ఈశనామము గలవాఁడా, శశి = చంద్రునివంటి, సీతాశ = కాంతిగలవాఁడా

వ॥ అని యిట్లనేకవిధంబుల స్తోత్రంబులంజేసి యప్పరమేశ్వరుని పూజాదికములు పరిసమాప్తంబు నొందించి రట్టియెడ నా దేవితో నొక చెలికత్తియ యిట్లనియె. 187

టీక. సుగమము

ద్విపాది

గీ॥ రాజిత నగాగ్రమున విహా ♦ రంబు సల్పు
నీలకంఠాతిశయము రా ♦ జిలుటకంటె
రాజిత నగాగ్రమున విహా ♦ రంబు సల్పు
నీలకంఠాతిశయము రా ♦ జిలుటకంటె॥ 188

టీక. రాజిత = ప్రకాశించునట్టి, నగాగ్రమునన్ = పర్వతశిఖరము నందున, విహారంబుసల్పు = వేడుకగాఁ దిరుగునట్టి, నీలకంఠ = ఈశ్వరుని యొక్క, అతిశయము = గొప్పతనము, రాజిలుటకంటె = ఒప్పారుటకన్న, రాజిత = ప్రకాశించునట్టి, నగాగ్రమునన్ = చెట్టు చివరయందున, విహారంబు సల్పు = సంచారము చేయునట్టి, నీలకంఠ = నెమిళ్ల యొక్క, అతిశయము = గొప్పతనము, రాజిలుట = ఒప్పారుట, కంటె = చూచితివా.

ఆ॥వె॥ కౌశికంబుపైని ♦ కౌశికం బెక్కెను
నెమ్మిపైని నొక్క ♦ నెమ్మియెక్కె
మల్లికోత్తమమున ♦ మల్లికోత్తమ మెక్కెఁ
గంటె తద్విలాస ♦ గరిమదేవి॥ 189

టీక కౌశికంబుపైని = గుగ్గిలపు చెట్టుమీద, కౌశికంబెక్కెను = గుడ్లగూబ యెక్కినదనియు, గడ్లగూబపైని గుడ్లగూబ యెక్కెననియును, నెమ్మిపైని = నెమ్మిచెట్టుమీద, ఒక్క నెమ్మియెక్కెన్

= ఒకానొక నెమిలియెక్కినదియును, నెమిలిమీద నెమిలియెక్కినదియును, మల్లికోత్తమమునన్ = శ్రేష్ఠమైన మల్లెతీగెయందున, మల్లికోత్తమమెక్కెన్ = శ్రేష్ఠమైన హంసయెక్కినదియును, హంసపై హంసయెక్కినదియును, అర్థ ద్వయము, దేవి = ఓ నాయికా, తద్విలాసగరిమన్ = ఆశృంగారాతిశయమును, కంటె = చూచితివా.

అనఁగా, నీపద్యములో నొకచెలిక త్తియ చెట్లపై పక్షులెక్కెనను రూఢ్యర్థముతో పక్షులపై పక్షులెక్కెనని ధ్వనిగల్గునట్లుగాఁ బల్కుటచే, నెమిలిపై నెమిలియెక్కెనని వచియించుట ధ్వనిమాత్ర మగునేకాని రూఢ్యర్థము కాదు గావున తప్పుగానేరదని గ్రహించునది. ఏలయన నెమిళ్ళకు సంభోగము లేదనియును మేఘములుపట్టినప్పుడు మగనెమిళ్ళు పింఛములు విప్పుకొని యాడుచు కంట నానంద బాష్పములు రాల్పుటవలన నానీటిని పెంటినెమిళ్ళు పానముచేయుటయే సంతానమునకు హేతువనుట లోకప్రసిద్ధము

గీ॥ అని పలుకు నర్మగర్భవా • క్యంబులకును
శుక పికాలాపములకుఁ బి • న్నకరువలికి
రమణి కవ్వేళ విరహాంకు • రంబు గల్గి
తరుణులఁగూడి తొలుతటి • యరుగుఁజేరె॥ 140

టీక. సుగమము.

ఆ శ్వా సాం త ము

మ॥ భవభూతీ భవభూతి విక్రమకలా • భద్రాత్మ భద్రాత్మ భూ
ధవ బంధూ ధవబంధు రానుమతనీ • తా శాంత తాశాంత పూ
రవిరాజార విరాజమాన చరితా • రాజన్య రాజన్య మా
నవ రాజీవ వరాజిసాధిత జయా • నందాబ్ధి నందాబ్ధి ధా 141

టీక. భవ = ఈశ్వరునివంటి, భూతీ = ఐశ్వర్యము గలవాఁడా, భవభూతి = కుమారస్వామివంటి, విక్రమకలా = పరాక్రమ పాండిత్యము గలవాఁడా, లేక భవభూతి యనే కవీశ్వరునివంటి మిక్కిలి క్రమమైన విద్యలు గలవాఁడా, భద్రాత్మ = మంగళకరమైన హృదయముగలవాఁడా, భద్రాత్మ = బంగారువంటి శరీరముగలవాఁడా, భూధవబంధూ = మేదినీశ్వరులను చుట్టములుగా గలవాఁడా, ధవ = మనుజులయొక్క (దేశజనులయొక్క యనుట) బంధుర = ఒప్పిదమైన, అనుమతి = సమ్మతియే, నీతా = నియమముగా గలవాఁడా, శాంతత = శాంతత్వముచేత, ఆశాంత = దిగంతముల యందు, పూర = నిండినవాఁడా, వి = పక్షులయొక్క, రాజ = ప్రభువైన గరుడునివంటి, అర = వేగముగలవాఁడా, విరాజమానచరితా = ప్రకాశమానమైన చారిత్రములు గలవాఁడా, రాజన్య = పట్టభద్రుఁడవైన, రాజన్య = క్షత్రియుఁడవైనవాఁడా, మానవరాజి = మనుష్యసముదాయమునందున, ఇన = ప్రభుఁడవైనవాఁడా (ప్రస్తుతము రెడ్లని వ్యవహరింపఁబడు వారలు క్షత్రియులని గ్రహించునది), వర = శ్రేష్ఠమైన, ఆజి = యుద్ధములచేత, సాధిత = సాధింపఁబడిన, జయ = జయము, ఆనంద = సంతోషము, అభినంద = పొగడ్తయు, అభిధా = పేరులుగలవాఁడా

క॥ యోషాజన మదనా ఘన
తోషా తారాభరదన • మద్గుణ మథనా
భాషా సహస్రవదనా
శోషాన్విత శత్రుకదన • శుభకరసదనా॥ 142

టీక యోషాజన = స్త్రీజనములకు, మదనా = మన్మథుఁడవైన వాఁడా, ఘనతోషా = అధిక సంతోషము గలవాఁడా, తార = ముత్తెపు

ములయొక్క, అభ = కాంతివంటి, రదన = పలువరుసగలవాఁడా దుర్గుణ = చెడుగుణంబులను, మథనా = మర్దించినవాఁడా, భాషా = వాక్చాతుర్యమునందున, సహస్రవదనా = ఆదిశేషునివంటివాఁడా, శేషాన్విత = కృశింపుతో గూడుకొన్న, శస్త్రకదన = శాస్త్రవయుద్ధములు గలవాఁడా, శుభకరసదనా = మంగళకరమైన గృహము గలవాఁడా

ఉత్సాహ. తారగిరి శతార కాశ ✦ తార గిరిశ తారకా
శారదాభ్ర నాగరాజ ✦ శారదాఽభ్రనాగ భా
గిరథీశవాజి రాజ ✦ గిరధీశవాజి నీ
హార శుభ్రకీర్తిజాత ✦ హార శుభ్రకీర్తి భా॥ 143

టీక తారగిరి = వెండికొండవంటియు, శతార = వజ్రాయుధమువంటియు, కాశ = తెల్లువంటియు, తార = ముత్యమువంటియు, గిరిశ = ఈశ్వరునివంటియు, తారకా = నక్షత్రములవంటియు, శారదాభ్ర = శరత్కాలమేఘమువంటియు, నాగరాజ = ఆదిశేషునివంటియు, శారదా = సరస్వతీదేవివంటియు, అభ్రనాగ = ఐరావతమువంటియు, భాగీరథి = గంగానదివంటియు, ఈశవాజి = శంకరాశ్వమువంటియు (ధవళవృషభమనుట), రాజ = చంద్రునివంటియు, గిరధీశవాజి = సరస్వతీవల్లభుని యొక్కయశ్వమువంటియు, లేక యతని పక్షి వంటియు (హంసయనుట), నీహార = మంచువంటియు, శుభ్ర = తెల్లనైన, కీర్తిజాత = పంకజములయొక్క, హార = సరములవంటియు (తెలిదమ్మిసరులనుట), శుభ్ర = అభ్రకమువంటియు, కీర్తిభా = యశఃప్రకాశముగలవాఁడా శుభ్రము, అభ్రకమనుటకు శబ్దార్థచంద్రికలోఁ జూఁడనగును

## గ ద్య ము

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధ చతుర్విధకవితా విచిత్ర
విశ్వకర్మకుల పవిత్ర భద్రదత్తగోత్ర పోకూరి వంశాబ్ధి
కైరవ మిత్ర రామలక్ష్మాంబా సుబ్బయా
ర్యార్య తృతీయ పుత్ర కవిసింహ
బిరుదపాత్ర బుధజనానుమ
తి కాశీపతి ప్రణీతంబై
న సారంగధరీయం
బను త్ర్యర్థికా
వ్యంబునందు
ద్వితీ యా
శ్వాస
ము
స ం పూ ర్ణ ము ।



# సారంగధరీయము

త్ర్యర్థి కావ్యము

## తృతీయాశ్వాసము-సవ్యాఖ్యానము

క॥ శ్రీరాజ్య ప్రాచుర్యా
భూరియశఃప్రద సుకార్య ♦ భూధర ధైర్యా
దూరీకృత క్రౌర్యా సీ
తారామనృపాలవర్య ♦ ధార్మిక చర్యా॥ 1

టీక. శ్రీ = సంపద్యుక్తమైన, రాజ్యప్రాచుర్యా = ఏలుబడికిలోఁబడిన దేశబాహుళ్యము గలవాఁడా, భూరి = అధికతరమైన, యశఃప్రద = కీర్తి నిచ్చునట్టి, సుకార్య = సత్కార్యములు గలవాఁడా, భూధరధైర్యా = పర్వతమువంటి ధైర్యము గలవాఁడా, దూరీకృత = దూరముగాఁ జేయఁబడిన, క్రౌర్యా = క్రూరస్వభావముగలవాఁడా, ధార్మికచర్యా = పుణ్యవంతమైన ప్రవర్తనముగలవాఁడా, సీతారామనృపాలవర్య = ఓ సీతారాము నామముగల నరనాయక శ్రేష్ఠుఁడా

గీ॥ అవధరింపుము నేఁదెల్పు ♦ నట్టి త్ర్యర్థి
కావ్యమందలి శైలజా ♦ కామినీశ

చంద్రసారంగధరుల స • చ్చరితలందు
నెసఁగు నావలికథల టీ • రెట్టులనిన 2

టీక సుగమము, ఈ యాశ్వాసముగూడా యొకానొక చోట నించుక భేదముతో మూడు కథలకును సమానార్థముగా నుండునట్లు రచియింపఁ బడినదని గ్రహింపునది.

ఆ॥వె॥ ఆటులఁ జెలులతోడ • నాదేవి లోలురటి
యరుగుఁజేరి యుస్సు • రస్సురనుచు
బడలి కూరుచున్న • యెడఁజెలికత్తియ
లడుగు లొత్తుచుండు • నట్టివేళ॥ 3

టీక. సుగమము

సీ॥ గంధవాహుని చ • క్కని యరదంబుగా
శుక వతంసమును ఘో • టకముగాఁగ
మకర రాజమును ని • ర్మల కేతనంబుగా
నల్లలితేక్షువు • విల్లుగాఁగఁ
జంచరీకముల స • మంచిత గుణముగాఁ
గమలాదులను సాయ • కములు గాఁగ
ననుఁబొందు కుసుమాక • రుని సహాయుకునిగాఁ
గలరవ ప్రభృతులన్ • బలముగాఁగఁ

గీ॥ బూని విరహిణులఁగలంచు • పూన్కితోడ
దర్పకుఁడు దర్పమెసఁగఁగా • దాడివెడలి
యాశుగముల్తైదుఁ దల్లడ • మందునటుల
నాశుగముల్తైదు నొకమాటె • యలిప కేసె॥ 4

టీక. సుగమము.

క॥ మారుతములు వీచె విచయ
మా రుతములుఁ జేసెఁ జైత్రుఁ డా వేళఁ బే
మారుతమకు సాయంబిడ
మారు తమకు లీలఁబలికె మధుపములంతన్ ॥ 5

టీక. మారుతములు వీచెన్ = వాయువులు తోలుచున్నవి, వి = పక్షుల యొక్క, చయమా = సముదాయమా, రుతములుజేసెఁ = ధ్వనులొనరించినవి, చైత్రుఁడు = వసంతుఁడు, ఆవేళఁ = ఆసమయమునందన, వేమారు తమకు సాయంబిడన్ = పలుమారు తమకు సహాయముచేయఁగా, మారు = పక్షులకుతోడుగా, తమకులీలన్ = భయపడునట్లు, మధుపములు = తుమ్మెదలు, పలికెన్ = ఝూంకరించెను, అంతన్ = అటుపిదట ముందరి పద్యముతో నన్వయము

ఆ॥ వె॥ చారు ధిషణ యబ్జ సౌందర్య నయన కు
వలయ మిత్ర మహిమ వంత యరిద
సద్గణేశ రాజ సారంగధర గురు
దేవరావె నీవ కావె గావ ॥ 6

టీక శివ॥ ఈ కథలో పార్వతీదేవి తన తండ్రియైన హిమవంతుని యందున నెపమిడి శంకరుని తలంపుజేసెనని గ్రహించునది. చారు = బృహస్పతివంటి, ధిషణ = బుద్ధిగలవాఁడా అని హిమవంతుని పరముగను, చారు= మనోజ్ఞమైన, ధిషణ = బుద్ధిగలవాఁడా, అని శంకరుని పరముగను, అబ్జ = పద్మమువంటి, సౌందర్య = చక్కదనమైన, నయన= నేత్రములుగలవాఁడా, అని హిమవంతుని పరముగను, అబ్జ = ఉదకజనితుఁడైన యగ్నిహోత్రునినే, సౌందర్యనయన=చక్కనైన నేత్రముగా గలవాఁడా అని శంకరునిపరముగను, కువలయమిత్రమ=భూవలయమునకు హితుఁడవై నవాఁడా, అని హిమవంతుని పరముగను, కువలయమిత్ర = అంత్య మకారలోపముతో భూవలయమునక

హితుఁడవైనవాఁడా, అనియే శంకరుని పరముగను, హిమవంత = ఓహిమ వంత నామముగలవాఁడా, అని హిమవంతుని పరముగను, మహిమవంత = గొప్పతనముగలవాఁడా, అని శంకరుని పరముగను, అరిద = శత్రువులను ఛేదించువాఁడా, అని యుభయత్రసమము, సద్గణేశ = సాధుజన సముదయము నందున శ్రేష్ఠుఁడవైనవాఁడా, అని హిమవంతుని పరముగను, సత్ = శ్రేష్ఠులైన, గణ = ప్రమథులకు, ఈశ = ప్రభుఁడవైనవాడా, అని శంకరుని పరముగను, రాజసారంగ = రాజకుంజరా అని హిమవంతుని పరముగను, (అనఁగా పర్వతరాజశ్రేష్ఠుఁడనుట), రాజ = ఓ ప్రభువా అని శంకరుని పరముగను (అనఁగా నీశాన్యదిశకు ప్రభువనుట), ధర = పర్వతములకు, గురు = గొప్పయైన, దేవ = ప్రభుఁడవైనవాఁడా, అని హిమవంతుని పరముగను సారంగధర = జింకతాల్పరివైన, గురు = గొప్పయగు, దేవ = స్వామీ అని శంకరుని పరముగను, అర్థద్వయము ని దేవస్సురే ఘనే రాజ్ఞి అని విశ్వము కావన్ = రక్షించుటకు, నీవకావె = నీవేకద, రావె = రాగదవె, అని యుభయత్ర సమము.

టీక చంద్ర॥ ఈ కథలో తార తన భర్తయైన బృహస్పతిపై నెపము నిడి చంద్రుని తలంపుజేసెనని గ్రహించునది, చారు, ధిషణ = ఈ రెండును బృహస్పతి నామములే యగుటవలన, చారు, ధిషణ నామములు గలవాఁడా, అని బృహస్పతికిని, చారు = మనోజ్ఞమైన, ధిషణ = బుద్ధిగలవాఁడా అని చంద్రునకును, అబ్జ సౌందర్యనయన = పద్మములవంటి చక్కని కన్నులు గలవాఁడా, అని బృహస్పతికిని, అబ్జ = అబ్జనామముగలవాఁడా, సౌందర్యనయన = చక్కని కన్నులుగలవాఁడా, అని చంద్రునకును, కువలయమిత్ర = భూవలయమునకు హితుఁడవైనవాఁడా, అని బృహస్పతికిని, కలువలకు హితుఁడవైనవాడా, అని చంద్రునకును, మహిమవంత = గొప్పతనము గలవాఁడా, ఉభయత్రసమము, అరిద = శత్రుచ్ఛేదకుఁడవైన వాఁడా, అని బృహస్పతికిని, చక్రవాకపక్షుల జంట నెడముగా చేయువాడా, అని

చంద్రునకును (జతనువిడఁజేయువాఁడనుట), సద్గణ = పండిత సముదయము నకు, ఈశరాజ = రాజరాజు వైనవాఁడా అని బృహస్పతికిని (పండిత సార్వభౌముఁడనుట), సద్గణ = నక్షత్ర సముదయమునకు ఈశ = ప్రభు, డవైనవాఁడా, రాజా = రాజ నామము గలవాఁడా, అని చంద్రునకును, సారంగధరగురు = చంద్రునకు నుపాధ్యాయుఁడవైన వాఁడా, దేవ = విభుఁడా, అని బృహస్పతికిని, సారంగధర = జింకతాల్పరి వైనవాఁడా, గురు = అతిశయమైన, దేవ = వేల్పా, అని చంద్రునకును, రావె నీవకావ గావన్ = రక్షించుటకు నీవే కాదా రాగదవే, అని యర్థద్వయము

టీక. సారంగ॥ ఈ కథలో చిత్రాంగి, తనభర్తయైన రాజనరేంద్రునిపై నెపము నిడి సారంగధరుని తలంపు జేసెను గ్రహించునది, చారుధిషణ = మనోజ్ఞమైన బుద్ధిగల వాఁడా, అని రాజనరేంద్రునకును, బృహస్పతి వంటి బుద్ధిగల వాఁడా, అని సారంగధరునకును, అబ్జ సౌందర్యనయన = పద్మ ములవంటి చక్కనైన నేత్రములు గలవాఁడా, అని రాజనరేంద్రునకును, అబ్జ = చంద్రుని వంటి, సౌందర్య = చక్కదనముగలవాఁడా, నయన = నేత్రములయందున, కువలయ = కలువల వంటివాఁడా, అని సారంగధరు నకును, కువలయ మిత్ర = భూవలయమునకు హితుఁడవైన వాఁడా, అని రాజనరేంద్రునకును, మిత్ర = ఓహితుఁడా, అని సారంగధరునకును, మహిమ వంత = మహిమమనేయైశ్వర్యము గలవాఁడా, అని రాజనరేంద్రునకును, మాహాత్మ్యముగలవాఁడా, అని సారంగధరునకును, అరిద = శత్రు చ్ఛేదకుఁడ వైనవాఁడా, అని యుభయత్ర సమము, సద్గణేశ = శ్రేష్ఠమైన సేనా విశేష మునకు ప్రభుఁడవైన వాఁడా, అని రాజనరేంద్రునకును, పండితసముదయము నందు శ్రేష్ఠుఁడవైనవాఁడా, అని సారంగధరునకును, రాజా = ఓ ప్రభుఁడా, అని యుభయత్రసమము, సారంగధర గురు = సారంగధరునకు తండ్రి యైన వాఁడా, అని రాజనరేంద్రునకును, సారంగధర = ఓ సారంగధరుఁడా, గురుదేవ — గొప్పయైన రాజా, అని సారంగధరునకును, దేవా రావె నీవకావె

గావన్ = ఓనాథా రక్షించుటకు నీవే కాదా రాగదవే, అని శ్లేషార్థముగా వచియించెను

గీ॥ అనుచు శ్లేషార్థముగఁ బల్కు • చు నొడలెల్ల
పులకరింపఁగ నిట్టూర్పుఁ • బుచ్చుచు వెస
విరహవేదనతో నల • వేదికపయి
ముదిత మూర్ఛాపరవశత్వ • మునను వ్రాలె

టీక. సుగమము

ఉ॥ వ్రాలినఁ గొమ్మలెల్లరు బి • రానఁ గురంగటకేగి భీతిమై
కేలును బట్టి నాడిఁ బరి • కింపుచుఁ బొక్కిలి నంది చూచుచున్
జాలుగ నూర్పులన్ గనుచు • జవ్వని యొటను భర్తఁగాంచమిన్
బాలిక కిట్లగల్గె మద • నజ్వరమంచుఁ దలంచి రెంతయున్ 8

టీక. సుగమము.

సీ॥ ఉగ్మలి వేడి ని • ట్టూర్పులు నిగుడించుఁ
గలికి మాటికి మాటి • కులికి పడును
మధురోష్ఠి సారెకు • నధరమున్ దడుపు నా
యింతి తాపమున న • ట్లిట్టుఁ బొరలు
నతివ వేమారు బ • యల్ కౌఁగిలించును
చెలి మనోహర యని • పలువరించుఁ
గొమ్మ రోమాళి గ • గుర్పాటు నొందించుఁ
బడతి మేనెల్లఁ గం • పమును బొందుఁ
గీ॥ జాన యుసురసురంచు వే • సట వహించుఁ
జేడె చేష్టలుడిగి కొంత • సేపు తెందు
నేమి జెప్పుదు నావేళ • లేమ గనిన
విరహ తాపానలం బార్ప • విధివశంబె॥ 9

ఆ॥వె॥ విరహ తాపమునను ♦ వేదనఁ బొందెడు
మోహనాంగి చిహ్న ♦ ములను గాంచి
చెలువు మీఱు నటుల ♦ శిశిరోపచారముల్
సేయ నెంచిరపుడు ♦ చెలియ లెల్ల 10

టీక॥ సుగమము

గీ॥ లలన యొక్కతె పన్నీట ♦ జలక మార్చె
గరిత యొక్కతె చలువలు ♦ గట్టఁ బెట్టె
నాతి యొక్కతె కప్పురా ♦ నామ మిడియెఁ
జెలియ యొక్కతె విరిసెజ్జఁ ♦ జేర్చెనంత 11

టీక. సుగమము.

చ॥ అలరులనేర్చి తెచ్చియును ♦ హారముగా సమకూర్చి యందుతో
వల నొక పొన్నపువ్వు నటు ♦ పై నిరువైపుల రెండు పూలబం
తులనిడి దానకుత్తినొక ♦ తొయ్యలి వేయ సరంబు తత్కరం
బులకును చెండ్లు గుబ్బలకుఁ బొన్నయుఁ బొక్కిలికానె జోడుగన్

అనఁగా కరములకు సరములను స్తనములకు పూలచెండ్లను పొక్కిలికి పొన్న పుష్పమును పోల్చుట కవి సమయసిద్ధము గావున నొకచెలికత్తియ శిశిరోపచారముగా నుపయోగించునట్లు మంచిపూలహారము నొండు గూర్చి యందు మధ్యభాగముననొక పొన్నపువ్వును దానికి నిరుప్రక్కల నాల్గైదంగుళము లెడముగా రెండు పూలగుత్తులను జేర్చి యాదేవి కంఠమున వేయఁగా కరములకు సరములను స్తనములకు పూగుత్తులును పొక్కిలికి పొన్న పుష్పమును, అనుకొని సమాన విలాసమును పొందెనని తాత్పర్యము.

సీ॥ చెమ్మ గిల్లునటంచు ♦ కొమ్మ వాతెఱ పైని

యలరు తేనియఁ దెచ్చి ♦ చిలికె నొకతె
మంట లడఁగునంచు ♦ మగువ హస్తములపై
కమలజంబులఁ దెచ్చి ♦ కప్పె నొకతె
వేడి తగ్గునటంచు ♦ వెలఁది దేహంబుపై
హరి చందనముఁ దెచ్చి ♦ యలఁదె నొకతె
పోట్లు తగ్గునటంచుఁ బొలఁతి పాదములపై
చిగురుటాకుఁల దెచ్చి ♦ చేర్చె నొకతె,
గీ॥ ఇంతి యవయవగుణములు ♦ నెఱఁగి యట్టి
వస్తు నికరంబు తోడన ♦ వారిత మగు
నంబుజాంబకు తాపాన ♦ లంబు నార్ప
సఖులు జేసిరి శిశిరోప ♦ చారము లహ 13

అనఁగా పెదవికి పూదేనియను హస్తమునకు కమలములను దేహపరిమళమునకు హరిచందనమును పాదములకు చిగురుటాకులను పోల్చుట కవిసమయసిద్ధము గావున చెలికత్తియ లాదేవి యవయవగుణంబుల గురైఱింగి యట్టి వస్తువులతోడనే మదన తాపమును బోఁగొట్టుటకు శిశిరోపచారములు జేసిరని తాత్పర్యము

టీక సుగమము

గీ॥ పొలఁతి కుచకలశముల పైఁ ♦ బూసి నట్టి
చందనము వేడిచే పొంగి ♦ జాఱు చున్న
నట్టి శరునకు పాలుబి ♦ య్యంబు లేని
పొంగలో పొంగలని యొక ♦ బోఁటి నగియె 14

వ॥ ఇట్లు నవ్విన మఱియొక్కతె యిట్లనియె 15

టీక సుగమము

సీ. గాలి సోకుటొ గాక ♦ గాలి సోకుటొ గాక
ప్రేయసి యిటు పల్వ ♦ రించఁ బోనె

మహి మన్మథుని తాప ♦ మహిమ న్మథుని తాప
మునఁ గాక చెలి బాధ ♦ లెనయఁ బోనె
కలకంఠముల కూఁత ♦ కలకంఠముల కూత
లొదవ కుండిన లేమ ♦ యులికిపడునె
యౌవనమునఁ జేర్వ ♦ యౌ వనమునఁ జేర్వ
కున్నఁ జేడె విరాళిఁ ♦ గుందఁ బోనె

ఆ॥వె॥ నిన్నుఁ బోలునట్టి ♦ నెలఁతుక నేనే ఱ
గానఁ గానఁ గానఁ ♦ గాన గాన
మంజులోక్తి చనుల ♦ మరు పొంగలలె మిడి
మేల మేల మేల ♦ మేల మేల 16

టీక. గాలి సోకుటో = పిశాచము సోకుటయొ, కాక = లేక పోతె, గాలిసోకుటోగాక = వాయువు సోకుటయో గాకపోతే, ప్రేయసి యిటు = ప్రియురా లీవిధముగా, పల్వరించఁబోనె = ప్రలాపింపఁ బోవునా, మహిణ = భూమియందున, మన్మథుని తాప మహిమన్ = మదనునితాప మహాత్వము చేతను, మధునితాపమునఁ గాక = వసంతుని తాపముచఁ గాకపోతే, చెలి = ఈ సఖియ, బాధలెనయఁబోనె = వేదనలుపొందఁబోవునా, కలకంఠము లకు = కోకిలలకు, ఊఁత = సహాయముగా, కలకంఠముల కూతలు = హంసలపలుకులు, ఒదవకుండినన్ = ఉపయోగింపకపోయినట్లైతే, లేమ యులికిపడునె = ఈకామిని యులికిపాటు నొందునా, యౌవనమునణ = మంచి ప్రాయమునందున, చేర్వయౌ = మిక్కిలి సమీపమైనట్టి, వనమునఁ జేర్వకున్నన్ = ఉద్యానవనమునందునఁ జేర్పకపోయినట్లైతే, చేడె విరాళిఁ గుందఁబోనె = ఈ చిన్నది వలపుతో దుఃఖింపఁబోవునా, నిన్ను బోలునట్టి నెలఁతుకన్ = నీవంటి చేడియను, నేను = ఏను, ఏజగానన్ = ఏలోక ములో, కానన్ = వనమునందున, కానన్ గాన = చూచియెఱుంగను కావున, గాన = సంగీతమువంటి, మంజులోక్తి = మనోజ్ఞమైన పలుకులు

గల యీ మెయొక్క, చనులన్ = స్తనములయందున, మురు పొంగలదె = మదనుని పొంగలియటవె, మిథిమేలమేల = మిథినిపొందుటకు, మేల మేల = పరిహాసమెందుకు, మేల = శుభమా, కలకంఠము హంసయనుటకు ని. కల కంఠః కలధ్వానేహంసే పారావతేపికే, అని విశ్వము

వ॥ అనిన వేతొక్కతె యిట్లనియె 17

టీక. సుగమము.

గీ॥ కాదుకాదమ్మ మనము చెం ♦ గటనెయుండ
రావె సారంగధరగురు ♦ రాజయనుచుఁ
బలవరించును బిడెము ర ♦ వంత లేక
ముసలమగనికినై యింత ♦ మోహమేల ॥ 18

అనఁగా నీపద్యములో సారంగధరగురు రాజ, అనుట చేత శివ కథలో జింకతాల్పరియైన గొప్ప ప్రభువా యనియును, చంద్రకథలో చంద్రునకు నుపాధ్యాయశ్రేష్ఠుఁడా యనియును, సారంగధర కథలో సారంగధరునకు తండ్రియైన రాజా యనియును, ముసలిమగనికినై యింత మోహమేల, అనుట చేత శివకథలో మాత్రము, ముసలమగడు కావలయునని, యింత మోహ మేటికి, అనెనని యధ్యాహారముగా తాత్పర్యము గ్రహించునది

గీ॥ అనిన వేతొక్క చెలియ యి ♦ ట్లనఁగఁ దగునె
ఏటికీమాట లజరుఁడౌ ♦ నెందు కిట్లు
ప్రేలెదవు ధాత్రినే జవ ♦ రాలికైన
నంద యీశునకన్న వే ♦ రొండుగలదె ॥ 19

అనఁగా నీపద్యమునందున, అజరుఁడౌననుటచే శివ చంద్రకథల్లలో శంకర బృహస్పతులు నిర్జరులే యగుటవలనను రాజనరేంద్రుఁడు

మాత్రము నిందా ముసలితనము రానివాఁడై నందునను, అజరశబ్దము ప్రయోగింపఁబడినదనియును, అందయిాశునకన్న ననుటచే చంద్ర సారంగధరకథలలో భర్తకన్న ప్రాపు మఱియొకడు లేదనియును, శివకథలో శంకరునకన్న ప్రాపుమఱియొకఁడు లేదనియును తాత్పర్యము గ్రహించునది.

వ॥ అనిన నీఁక నోర్తుక యిట్లనియెను 20

టీక. సుగమము

సీ॥ సతి నతనుఁడు నిజ • స్థితి జేయు నే మొకో
పెంపొందు మేను కృ • శింపుచుండె
నబలఁ దెమ్మెర దన • యటుఁ జేయునేమొకో
అంతకంతకు నూర్పు • లధికమయ్యె
చెలి సితాంశుఁడు దన • వలెఁజేయు నే మొకో
సముచితాంగమునఁ బాం • డిమముదోచె
నతివఁ జైత్రుఁడు దన • గతిచేయునేమొకో
హీనరమ్య మయి త • పించుచుండె

గీ॥ నబ్జముఖి శుకపిక శారి • కాది విహగ
కోటి దనురీతిఁజేయు నొ • క్కొ-వనంబు
నందు విహరించుకోరికఁ • జెందెననుచు
నింతియొక్కతె బల్కనో • ర్తిట్లనియె. 21

టీక సతిన్ = ఈ చేడియను, అతనుఁడు = శరీరరహితుఁడైన మన్మథుఁడు, నిజస్థితిఁ జేయునేమొకో = తనవిధముగాఁ జేయునేమొ (అంగరహితముగా ననుట), పెంపొందుమేను = వృద్ధినొందు శరీరము, కృశింపుచుండెన్ = తగ్గిపోవుచుండెను, అబలన్ = ఈతన్విని, తెమ్మెర = వాయుదేవుఁడు, తనయటుఁజేయునేమొకో=తనవలెఁ జేయునోయేమొ, అంతకంతకున్ = రానురాను, ఊర్పులధికమయ్యెన్=శ్వాసము లెక్కువాయెను (శ్వాసమనఁగా

వాయువే యనుట), చెలిన్ = ఈ చెలియను, సితాంశుఁడు = తెల్లనికిరణములు గల చంద్రుఁడు, తనవలెఁ జేయునేమొకో = తన మాదిరిగాఁ జేయునోయేమొ, సముచితాంగమునన్ = చక్కనైన శరీరమునందున, పాండిమము దోచెన్ = తెల్లదనముదట్టెను, అలివన్ = ఈ చిన్నదానిని, చైత్రుఁడు = వసంతుఁడు, తనగతిఁ జేయునేమొకో = తననడవడిఁగల దానినిగాఁ జేయునో యేమొ, హీనరమ్యమయి = ఒప్పిదములేనిదై, తపించుచుండెన్ = తాపము నొందుచుండెను, అనఁగా రమ్యశబ్దము రాత్రియందు వర్తించును గనుక వసంతర్తువునందున రాత్రితగ్గుట స్వాభావికమైనందున తాను హీనరమ్యుఁడును వేడిగలవాఁడు నగుటచే యీ బిడను హీనరమ్యను తాపముగల దానిని జేయునాయనిభావము, అబ్జముఖిన్ = ఈకమలాస్యను, శుకపిక శారికాదివిహగకోటి = చిలుకలు కోకిలలు గోరువంకలు మొదలైన పక్షిసముదయము, తమరీతిఁజేయునొక్కొ = తమతీరుగాఁ జేయ నోయేమొ, వనంబునందు విహరించు కోరికఁజెందెననుచున్ = ఉద్యానవనమునందున సంచరించునట్టి యభిలాష నొందెనటంచు, ఇంతియొక్కతె బల్కన్ = ఒకానొక కొమ్మవచియింపఁగా, ఓర్తు = మఱియొక్కతె, ఇట్టులనియెన్ = ఈక్రిందఁజెప్పబోవు విధముగాఁ బలికినదాయెను. అనఁగా మన్మథుఁడు వాయుదేవుఁడు చంద్రుఁడు వసంతుఁడు శుకపికాది పక్షులు విరహిణీ స్త్రీలకు వైరివర్గమగుటవలనఁ దమతోఁ గలుపుకోవలయునని యీ చేడియ నట్లు తంటాలుబెట్టుచున్నారో యేమోయని ఫలితార్థము.

సీ॥ స్మరుఁడమ్ములేయుట • మఱువఁదేమో స్మరా
రిని రమ్మటంచు స్మ • రింపరమ్మ
అనిలుండు వెచ్చగాఁ • గను వీచునేమో య
నిల భుగ్విభూష ధ్యా • నింపరమ్మ
మధుఁడు వేధించుట • మానఁడేమో మధు
జిత్కాండధరుని భ • జింపరమ్మ

శుకపికాదుల కేక • లిఁకఁ దగ్గకున్నే మొ
ధృతపినాకుని సంస్తు • తింపరమ్మ

గీ॥ ఇట్టులఁ దదీయనామము • లెత్తిపిలుతు
మేని మదనాదు లతిభీతిఁ • బూని యీమె
తెఱవురా రట్లుఁగా దేని • దేవి నేడు
విరహతాపముతోడఁ జీ • వింపఁగలదె॥ 23

టీక స్మరుఁడమ్ము లేయుట మఱువఁడేమో = మన్మథుఁడు బాణములు వేయడము మఱుపునొందఁడేమో గాని, స్మరారిని = మన్మథవిరోధియైన శంకరుని, రమ్మటంచు స్మరింపరమ్మ = రాఁగదవే యనితలంపుఁ జేయుఁ దమ్మా, అనిలుండు వెచ్చగాఁగను వీచునోమో = వాయుదేవుఁడు వేడిగా విసరునేమోఁగాని, అనిలభుక్ = వాయుభక్షణుఁడైన శేషుని, విభూషణ = సొమ్ములుగాఁగల శంకరుని, ధ్యానింపరమ్మ = ధ్యానముఁ జేయుఁడమ్మా, మధుఁడు వేధించుట = వసంతుఁడు బాధపెట్టడము, మానఁడేమో = విడువఁ డేమోకాని, మధుజిత్ = విష్ణుమూర్తినే, కాండధరునిన్ = బాణముగా ధరించిన శంకరుని, భజింపరమ్మ = కొనియాడుఁడమ్మా, అట్లు కాదేని, మధుజిత్ = విష్ణుని యొక్క, కాండధరునిన్ = ఉదకమును ధరించిన శంకరుని, విష్ణుపాదోద్భవేగంగా, అనుటచే గంగాధరుని భజింపరమ్మాయని మార్చుకొనవచ్చును, కాండశబ్దము బాణమునకును జలమునకును చెల్లుననుటకు, ని కాండం నాశే శరుస్కందే బాణేఒవసర నీరయోః, అని విశ్వము. శుక పికాదుల కేకలు = చిలుకలు కోకిలలు మొదలైన వానియొక్క, రవములు, ఇఁకదగ్గకున్నేమొ = ఇంకనైనను తగ్గిపోవేమోఁగాని, ధృత = ధరింపఁ బడిన, పినాకునిన్ = పినాకమనే పేరునొందిన ధనుస్సు గల శంకరుని, సంస్తుతింపరమ్మ = స్తోత్రముఁజేయుఁడమ్మా, ఇట్టులన్ = ఈవిధముగా, తదీయనామములు = ఆశంకరుని పేరులు, ఎత్తిపిలుతుమేని = నోట వెలువడునట్లుగా పిలచితిమేని, మదనాదుఌ = మన్మథుఁడు మొదలైన విరహిణీ

వైరివర్గము, అతిభీతింబూని = మిక్కిలి భయమును వహించి, రమె తెఱవు రారు = ఈవిడజోలికి రాకుండుదురు, అట్లుఁగాదేని = ఆవిధముగాక పోయినట్లయితె, దేవినేడు = మనయజమాను రాలిపుడు, విరహతాపముతోడన్ = వలపుయొక్క పరితాపముచేత, జీవింపఁగలదె = బ్రతుకఁగలదా (లేదనుట)

అనఁగా స్మరారియని ధ్యానించినచో మున్ను నను కంటిమంటతోఁ గాల్చిన నాకు వైరియగు శంకరుఁడు వచ్చునేమోయని మన్మథుడును, అనిల భుగ్విభూషాయని ధ్యానించినచో నన్ను భక్షించు శేషుని హారముగాఁగొని శంకరుఁడు వచ్చునేమోయని వాయుదేవుఁడును, మధుజిత్కాండ ధరాయని ధ్యానించినచో మధుని జయించిన విష్ణువును బాణముగాఁగల శంకరుఁడు వచ్చునేమో నేనును మధుఁడనే యగుదునే యని వసంతుఁడును, కానిచో, మధుని జయించిన విష్ణుని పాదోద్భవయగు గంగా ధర్తయైన శంకరుఁడు వచ్చునేమో యాతనికీతఁ డల్లుఁడేకదా యని వసంతుఁడును, ధృతపినాకాయని ధ్యానించి నచో పినాకమనే ధనుస్సును ధరించిన శంకరుఁడువచ్చి యెక్కుబెట్టి వేయు నేమో యని శుకపికాది పక్షులును, భయపడి, యీమె తెఱవురాకుందు రట్లుగా దేని దేవి విరహతాపముతోడ జీవింపఁజాలదని తాత్పర్యము.

గీ॥ అనిన నోర్తుక శంకరు • నన్ని పేర్లఁ<br>
దలఁప జ్ఞాపక మెవరికిఁ • గలుగునొక్క<br>
పేరు జాలదె విరహిణీ • వైరులెల్ల<br>
పాఱిపోవఁగ ననియిట్టుఁ • బలుకఁదొడఁగె॥ 28

టీక సుగమము

గీ॥ సతిమనువరావె (మధువైరి • శరధర) యని<br>
పిలుత మివ్వేళ నాతని • పేరుఁదలచు

మ్రతనే పక్షులు మధుండు ♦ మరుఁ డనిలుఁడు
సరగ నతిభీతి విముఖత ♦ జనుట నిజము॥ 24

టీక సతిన్ = ఓసాధ్విని, శివకథలోమాత్రము, ఈ పార్వతిని, అని గ్రహించునది, మధువైరి శరధర = ఓయీశ్వరా, మనుపరావె = రక్షింపరాగదవె, అని = ఇట్లనుచు, ఇవ్వేళన్ = ఈసమయమునందున, పిలుతము = ఆహ్వానింతాము, ఆతనిపేరుఁ దలఁచుమాత్రనే = ఆ శంకరుని నామమును గొనియాఁడిన మాత్రముచేతనే, పక్షులున్ = శుకపికాది విహగములును, మధుండున్ = వసంతుఁడును, మరుఁడున్ = మన్మథుఁడును. అనిలుఁడున్ = వాయుదేవుఁడును, సరగన్ = తీవ్రముగా, అతిభీతిన్ = మిక్కిలి భయముతోడ, విముఖతన్ = వెనుకకు మరలినవారలై, చనుట = పోవుట, నిజము = వాస్తవము.

అనఁగా పై పద్యములో నొక్క పేరుతాలదే యనుటచే (మధువైరిశరధర) అని పిలిచినచో సామాన్యముగా బాణములధరించిన శంకరుఁడు వచ్చి మమ్మెక్కు బెట్టివేయునేమో యని పక్షులును, మధునకు శత్రువైన విష్ణువును బాణముగా ధరించిన శంకరుఁడు వచ్చునేమో నేనును మధుఁడనే యగుదునే యని వసంతుఁడును, లేక, మధునకు శత్రువైన విష్ణువుయొక్క నీరమును ధరించిన (గంగాధరుఁడనుట) శంకరుఁడు వచ్చునేమో యాతని కీతఁడల్లుఁడే కదాయని వసంతుఁడును, మధువైరి శరధర యనిన నీశ్వరనామమే యగును గావున మున్ను నన్ను కంటిమంటచే గాల్చిన శంకరుఁడు వచ్చునేమో యని మన్మథుఁడును, ఆతని పేరుఁదఁలచుమాత్రనే యనుటచె, ఆశంకరుని పేరనఁగా హారమును తలంపు చేసికొన్న మాత్రముననే (ఆదిశేషుననుట) నన్ను భక్షించు శేషుని హారముగాఁగలిగిన శంకరుఁడు వచ్చిన నాకు హానిగల్గునని వాయుదేవుఁడును, మిక్కిలి భయముతో మరలిపోవుట నిజమని తాత్పర్యము

వ॥ అట్లుఁ బోవుట దుర్లభంబనియోర్తుక మదనుని దూషింప దొడంగె నది యెట్లన్నను 25

టీక. సుగమము

మ ద న దూ ష ణ

క॥ మారా విష్వ క్సే నకు
మారా నీకింత మోద ♦ మారా మేరా
మా రామామణి యతి సుకు
మారాంగియె దాగి యేచ ♦ మారామారా॥ 26

టీక. మారా = మన్మథా, విష్వక్సేనకుమారా = విష్ణుని పుత్రకా, నీకింతమోదమారా = నీకింతగా సంతోషమఁటరా, మేరా = మర్యాదయేనా, మారామామణి = మాయొక్క నారీరత్నము, అతి సుకుమారాంగియె = మిక్కిలి కోమలమైన శరీరముగలదియగును గదా, దాగి = మరుగుననుండి, ఏచన్ = బాధింపఁగా, మారాము + అరా = పెర్మమఁటరా.

క॥ నీతికరుఁడు గాల్ప మరల
రతి శివుఁ బతి భిక్షమడిగి ♦ బ్రతికించె నినున్
సతివలనన్ బ్రతికి మహో
ద్ధతి జూపుదె సతులయెడఁ గృ ♦ తఘ్నుఁడ వౌరా॥ 27

టీక. సుగమము.

క॥ హరుఁడు దన కంటిమంటన
హరియించియు మరలనేల ♦ యవనీస్థలిపైఁ
జరియింపఁగ బ్రతికించెను
తరుణుల వేధింపఁగల కృ ♦ తఘ్నుని నిన్నున్॥ 28

గీ॥ కుటిలమై యొప్పు ధర్మంబుఁ ♦ గుజనులందు
మెలఁగు బలమును విషమునఁ ♦ జెలఁగు డాలుఁ
బంకమునఁ బట్టు తీరుఁ గ ♦ లంక గుణముఁ
గలుగు నీ కెట్లు సతులపైఁ ♦ గరుణవొడము॥ 29

టీక కుటిలమై యొప్పు ధర్మంబు = మోసమై తనరునట్టి న్యాయమని నింద్యార్థము, వంకరయై తగునట్టి వింటిబద్దయని స్వభావార్థము, కుజనులందు మెలఁగుబలమును = కుత్సితస్వభావము గల జనులలో వర్తించునట్టి సత్తువ యని నింద్యార్థము, వృక్షములలో ప్రవర్తించునట్టి సైన్యమని స్వభావార్థము (మదనునకు శుకపికాది పక్షులే సైన్యమనుట), విషమునఁ జెలఁగుడాలు = విషముచేత ప్రకాశించు కాంతియని నింద్యార్థము, నీళ్ళయందు ప్రకాశించు డెక్కెమని స్వభావార్థము (మొసలి డెక్కెమనుట), పంకమునఁ బుట్టుతీరు= పాపమున జనించిన యందమని నింద్యార్థము, బురదయందు బుట్టిన బాణమని స్వభావార్థము (కమలాస్త్రమనుట), కలంక గుణము = కలంకమైన స్వభావ మని నింద్యార్థము, నల్లనియల్లెత్రాడని స్వభావార్థము (తుమ్మెదల యల్లెత్రా డనుట) కలుగు నీకెట్లు సతులపై కరుణవొడమున్ = కలిగినటువంటి నీకు స్త్రీలపై దయ యేవిధముగాఁ బుట్టును

అనఁగా మోసమైతగు న్యాయమును కుత్సిత పురుషులలో వర్తించు బలుపును విషముచేత ప్రకాశించు కాంతియును, పాపమున జనించిన యంద మును కలంక స్వభావమును గలిగినట్టి నీకేవిధముగా స్త్రీలపై కృపజనించునని తాత్పర్యము

సీ॥ నీ నారి కాంచనం ♦ బూనక మధువు నా
నుచు వాగుచుండు డెం ♦ దులకొ గనుము
నీ కుమారుఁడు విహ ♦ నా కారి దర్పకా
ఖ్యలు వహియించు తెం ♦ దులకొ గనుము

నీ తమ్ము లప్పుల • చేత నిత్యము భంగ
ముల నొందుటెల్ల నెం • దులకొ గనుమ
నీ మారు తమ్ములు • వేమారు సుడివడి
దూళిపాలౌట యెం • దులకొ గనుమ

గీ॥ నీదు బలఁగము ధార్మికా • నీకమునకుఁ
దొలఁగి కుజనుల మెలఁగు టెం • దులకొ గనుమ
విరహిణీ స్త్రీల నెప్పుడు • వెతలుబెట్టు
కతన నని నేరకున్నావు • గా సుమాత్ర॥ 80

టీక నీనారి = నీకాంత, కాంచనంబూనక = బంగారును వహింప నొల్లక, మధువునానుచున్=కల్లుత్రాగుచు, వాగుచుండు టెందులకొ గనుమ = వదరుచుండు టేటికో చూడుమా యని నింద్యార్థము, నీనారి = నీయల్లె త్రాడు (అనఁగాఁ దుమ్మెదలనుట) కాంచనంబూనక = సంపఁగిచెట్లను సహింప నొల్లక (సంపఁగులు తుమ్మెదలకు వైరమనుట), మధువు నానుచున్ = పూఁదేని యను పానముఁజేయుచు, వాగుచుండు టెందులకొ గనుమ = ఝూంకృతి సేయు టేటికో చూఁడుమా యని స్వభావార్థము, నీకుమారుఁడు = నీకొడుకు, విహీనాకారి = అందము లేనివాడనియు, దర్పక = గర్విష్ఠుఁడనియు, ఆఖ్యలు వహియించు టెందులకొ గనుమ = నామములను గాంచు టేటికో చూడుమా యని నింద్యార్థము, నీకు మారుఁడు = నీకు మారుఁడనియును, విహీనాకారి దర్పకాఖ్యలు = అనంగుఁడు దర్పకుఁడనే పేర్లు, వహియించు టెందులకొ గనుమ = పొందుటేటికో చూఁడుమా యని స్వభావార్థము, నీతమ్ములు = నీసోదరులు, అప్పులచేతన్=ఋణములతో, నిత్యము భంగముల, నొందుటెల్లన్ = నిరంతర మవమానమును పొందుటయెల్లను, ఎందులకొ గనుమ = ఏటికో చూడుమా యని నింద్యార్థము, నీ తమ్ములు = నీ పద్మములు (అనఁగా బాణములనుట) అప్పులచేతన్ = నీళ్ళతో, నిత్యము భంగముల నొందు టెల్లన్ = నిరంతరము తరఁగలను పొందుట యెల్లను, ఎందులకొ

గనుము = నీటికో చూఁడుమా యని స్వభావార్థము, నీమారు తమ్ములు = నీమారుదల్లి కొమాళ్లు, వేమారు సుడివడి = పెక్కుసారులు చీకాకుపడి, ధూళిపాలౌట యెందులకొ గనుము = దుమ్ముగొట్టుకొను టేటికో చూఁడుమా యని నింద్యార్థము, నీ = నీయొక్క, మారుతమ్ములు = వాయువులు (అనఁగా రథసహాయములుగా వచ్చిన దక్షిణానిలములనుట), వేమారున్ = పలుమారును, సుడివడి = చుట్టుకొనినవియై, ధూళిపాలౌట యెందులకొ గనుము = పరాగముపాలు కావడమేటికో చూఁడుమా యని స్వభావార్థము, నీదు బలఁగము = నీ యొక్క బంధుసమూహము, ధార్మికానీకమునకుఁ దొలఁగి = పుణ్యవంతుల సముదయమునకు నెడమైన వారలై, కుజనుల మెలఁగు టెందులకొ గనుము = కుత్సిత జనులలో వర్తించుటేటికో చూఁడుమా యని నింద్యార్థము, నీదు బలఁగము = నీయొక్క పరిజనులు (అనఁగా శుకపిక శారికాది పక్షులనుట), ధార్మికానీకమునకుఁ దొలఁగి = ధనుస్సు గల వారల సమూహమునకు నెడమైన వారలై, కుజనుల మెలఁగు టెందులకొ గనుము =వృక్షములలో వర్తించుటేటికో చూఁడుమా యని స్వభావార్థము, సుమాస్త్ర = ఓపుష్పబాణుఁడవైన మన్మథా, విరహిణీ స్త్రీలనెప్పుడు వెతలఁబెట్టు=మోహము జెందిన వనితల నుడుగక బాధించునట్టి, కతన నని నేరకున్నావుగా = కార ణముచేతనే యని యెఱుంగకుండినావు గదా

సీ॥ కీరవాహనము దూ ♦ కించుటేటికి మార
ఈ దేవి సాంకవా ♦ మోద సుమ్మి
బలఁగమున్ వడిఁబురి ♦ కొలుపు టేటికిమార
ఈ యింతి వరధను ♦ ర్భ్రూయుగ సుమి
అళి మౌర్వీఁదంకృతి ♦ సలుపు టేటికి మార
ఈ సతి చంపక ♦ నాస సుమ్మి
పుష్కరాస్త్రము లేయఁ ♦ బూను టేటికి మార
ఈ నారి పూర్ణ చం ♦ ద్రానన సుమి

గీ॥ ఈవు పైఁబడి మీఱి రా ♦ నేల మార
ఈమె శివభక్తి యుక్త యౌ ♦ లేమ సుమ్ము
తావకప్రయోజకత్వ మెం ♦ తటిదె కాని
సాగదీయమయెడ దురా ♦ చార మార॥ 31

టీక మార = మన్మథుఁడా, కీరవాహనము దూకించుటేటికి = నీచిలుక వాహనము నీమెపైకి దుమికించుటెందులకు, ఈదేవి = ఈనాయిక, సాంక వామోదసుమ్మి = పునుఁగువంటి పరిమళము గలది యగునుసుమి (అనఁగా పునుఁగుబిల్లి చిలుకలను చంపి తినునది యనుట), మార = మదనుఁడా, బలఁగమున్ = నీ యొక్క పికశారికాది పక్షి సైన్యమును, వడిన్ = వేగ ముగా, పురికొలుపుటేటికి = కవియఁజేయుటెందులకు, ఈయింతి = ఈ చేడియ, వర = శ్రేష్ఠములైన, ధనుర్భ్రూయుగసుమి = వింటి బద్దల వంటి కనుబొమజతగలది సుమి (అనఁగా వింటి బద్దలను గనిన పక్షులు బెదరి పోవుననుట) మార = ఓ దర్పకుఁడా, అళిమౌర్వీన్ = తుమ్మెదలతోఁ గూర్పఁబడిన నీయల్లె త్రాటిని, టంకృతి సలుపుటేటికి = టంకారముఁ జేయు టెందులకు, ఈసతి = ఈవెలఁది, చంపకనాససుమ్మి = సంపంగిపూవువంటి ముక్కుగలది సుమి (అనఁగా సంపఁగి పూవుల వాసనకు తుమ్మెదలు శోషించు ననుట) మార = ఓ కందర్పుఁడా, పుష్కరాస్త్రములు = నీపద్మ బాణము లను, ఏయఁబూనుటేటికి = ప్రయోగింప నుంకించు టెందులకు, ఈనారి = ఈకాంత, పూర్ణచంద్రానన సుమి = పున్నమనాటి చంద్రుని వంటి ముఖము గలది సుమి (అనఁగా చంద్రుని గాంచినతోడనే పద్మములు ముకుళించు ననుట) మార = ఓమరుఁడా, ఈవు పైఁబడి మీఱిరానేల = నీవీమెపై కదిశయించి వచ్చుటెందులకు, ఈమె = ఈయమ, శివభక్తియుక్తయౌ లేమసుమ్మి = ఈశ్వర భక్తితో కూడుకొనబడిన యింతి సుమి (అనఁగా నీశ్వరుఁడు నిన్ను గాల్చువాఁడనుట), దురాచారమార=దుశ్శీలుఁడవైన కాముఁడా, తావకప్రయో జకత్వ మెంతటిదెకాని = నీయొక్క యోగ్యత యెంత పాటిదైన

ప్పటికిని, శంయమయెడ = శంమె దగ్గర, సాగదు = నెఱవేఱునది కాదు.

వ॥ అని మఱియును బవనాదులను దూషింపందొడంగె నది యెట్లనినను 32

టీక సుగమము.

గీ॥ వసుధ నిన్నెల్లరును జగ • త్ప్రాణ మనుచుఁ
బలుకుటయె కాని నిజమేని • చెలుల ప్రాణ
ముల హరింపఁగఁ జూతువే • మూల నుండి
కనుపడని గంధవహుఁడవు • గా సమీర॥ 33

టీక సమీర = ఓవాయుదేవా, వసుధన్ = భూమి యందున నిన్నెల్లరును = నిన్నెల్లవారును, జగత్ప్రాణమనుచున్ = లోకమునకు నూపిరివటంచు, పలుకుటయె కాని = వచియించుటయే కాని, నిజమేని = జగత్ప్రాణనామము సిక్కంవమేయైనటులైతే, చెలులప్రాణములన్ = స్త్రీల యూపిరులను, హరింపఁగఁజూతువే = నశింపఁజేయ సుంకింతువా, మూల నుండి = వాయువ్యమనే దిశనుండి, కనుపడని గంధవహుఁడవుగా = స్పర్శన మాత్రమేగాని దృగ్గోచరము గాకటువంటి గంధవహ నామముగల వాఁడవు గదా యని యర్థము, మూలనఁ బడియుండి కానరాని గర్విష్ఠుఁడవు గదా యని భావము.

క॥ కలకంఠములారా మా
కలకంఠికి బాధగలుగఁ • గా వాగెదరా
ఇలనెటు మీ సంతానము
పలుగాకుల పాలుగాక • బాగగుఁ జుండీ॥ 34

టీక కలకంఠములారా = ఓకోకిలలారా, మా కలకంఠికిః = మాయొక్క మధురధ్వనియైనకంఠస్వరము గల చేడియకు, బాధగలుగఁ

గావాగెదరా = వేదనగల్గునట్లుగా వదరుదురా, ఇలన్ = భూమియందున, మీసంతానము = మీబిడ్డలు, పలుగాకుల పాలుగాక = దుష్టుల పాలై పోక, ఎటు = ఏవిధముగా, బాగగుఁజూండీ = మేలొందనొఁజూడుఁడి, అనియర్థము, మీసంతానము, అనేకములైన కాకుల పాలుగాక బాగగుటెట్లో చూడుఁడి, అని భావము (అనఁగా కోకిలలు గుడ్లుపెట్టి యాగుడ్లను పిల్లలఁజేయనేరక కాకుల గూళ్ళలో వైచుననియును కాకు లాగుడ్లను పిల్లలఁజేసి పెంచి కూతకు వచ్చిన తోడనే స్వరమును గుర్తించి కోకిలపిల్లలను కాకులు తఱిమి వేయుననియును లోక ప్రసిద్ధము)

క॥ విషధరముల భక్షింపుచు
 విషధరముల ఛాయలందు ♦ విహరించుదు రీ
 విషధర భక్తాగ్రేసర
 విషమించునె కేకులార ♦ వెతలిడ మీకున్ ॥ 35

టీక విషధరముల భక్షింపుచున్ = సర్పములను భక్షణఁజేయుచు, విషధరముల = మేఘములయొక్క, ఛాయలందు = నీడలయందున, విహరింపుదురు = వేడుకగా సంచరింతురు, ఈ = ఈయొక్క, విషధరభక్తాగ్రేసర = ఈశ్వరభక్తజనులలో శ్రేష్ఠురాలైన యీ చేడియ, కేకులారా = ఓ నెమ్మిలారా, వెతలిడ మీకున్ = మీకు బాధలు బెట్టగా, విషమించునె = విరోధించునా, అనఁగా నో మయూరములారా విషధరముల మెక్కుచూ విషధరముల విహారములు సేయు మీకు నీ విషధరభక్తాగ్రేసరయైన చేడియను బాధించుటకు మీకేమి విరోధము జేసెనని తాత్పర్యము

నెమిళ్ళు పాములఁ దినుటయు మేఘములు పట్టినప్పుడు కుంచెలు విప్పుకొని యాఁడుటయు ప్రసిద్ధమని గ్రహించునది

గీ॥ ఔరె యగ్గిని మెసఁగు చ ♦ కోరములరుఁ

గర్కౄశము సెల్లినను జెల్లుఁ • గాక నీరుఁ
బాలు వేరుగఁజేసి పా • ల్గొ్రీలునట్టి
హంసలారా తగునె మీకు • నబల నేచ, 36

టీక సుగమము.

గీ॥ పదఁతుకల బాధపెట్టగాఁ • బలికినట్టి
పాపమునఁ బంజరము పేరి • బంధకమును
వడసి యేప్రొద్దు శ్రమఁజెంద • వలదె మీరు
శుకములారా వికాస శా • రికములార ॥ 37

టీక సుగమము.

గీ॥ బంభరములార వెలఁదుల • బాధపెట్ట
ఝూంకరించిన ఘనమౌనె • సంపఁగి కడ
బయ్యి కూతలు లేక చొ • క్కుదురు గాదె
అప్పుఁడెట్టులఁబోయె మీ • యతిశయంబు॥ 38

టీక. సుగమము

గీ॥ సర్వ కుజనుల దయతోఁడ • సాకుచుండి
యను సుజాతి కదంబము • లను గలంతు
విట్టి నీవన్నులను బ్రోచు • టెట్లు మాన
యుగళి సంపద కిటుఁజేయఁ ( దగునె చైత్ర। 39

టీక. సర్వ కుజనులఁ = సమస్తమైన కుత్సితుల నని యర్థము, సమస్తమైన వృక్షములనని స్వభావము, దయతోడ సాగుచుండియును = కృపతో వృద్ధిఁబొందింపుచునుండి, సుజాతి కదంబములను కలంతువు = మంచి కులముగలవారల సముదయములను కలఁత నొందింతువని యర్థము,

శ్రేష్ఠమైన జాజిచెట్లను కదిమిచెట్లను శోభింపఁజేతువని స్వభావము (అనఁగా వసంతర్తువునందున జాజులును కదిమిచెట్లును, ఆకులురాలి యెండినవానివలె నుండుననుట), ఇట్టి నీవు = ఇటువంటి వాఁడవగు నీవు, చైత్ర = ఓ వసంతుఁడా, అన్నులను బ్రోచుచెట్లు = స్త్రీలనెటుల రక్షింతువు, ని. జాతిశ్ఛందసి సామాన్యేమాలత్యాం గోత్ర జన్మనోః, అనియును, కదంబమాహు స్సిద్ధార్థే నీపేఽపి నికురుంబకే, అనియును విశ్వము మానయుగళి సంపదకిటుఁ జేయఁ దగునె = రెండు నెలల భాగ్యమున కీవిధముగా నొనరింపఁజెల్లు నా (అనఁగా వసంతర్తువు రెండు మాసములే యుండుననుట)

గీ॥ అనుచుఁ బవనాదులను దూతి • యును జపించి
దేవికి మరందమోర్తుక • తీర్థమిచ్చెఁ
బుష్పొడి నొకర్తె మంత్రించి • బూదిఁ బెట్టెఁ
దాళ దళమున నొకతె యం • త్రంబుఁ గట్టె ॥ 40

టీక. సుగమము.

గీ॥ ఇటులఁ జేయు చికిత్సల • కించుకంత
తెలివిఁ జెందియు నప్పుడా • దేవి లేచి
కూరుచుండినఁ గాంచి య • య్యారె మనము
బ్రతికితి మటంచుఁ జెలులు సం • భ్రమముతోడ ॥ 41

టీక సుగమము

మ॥ నగరాజోత్కుచ నీవిటుల్ విరహమం • దన్బాడియే ధైర్యమూ
నఁగరాదా నిసులాతి నాతుకలు గ • న్నన్ హెచ్చుగాఁ, జిత్రమై
నగరా జవ్వనులైన కాంతలిలలో • నన్ లేర యిట్లాడురా
నగ రాదవ్వులనుండె శీఘ్రముగఁ గా • నన్ పీడి పోదామురా॥

టీక నగరాజ = పర్వతశ్రేష్ఠమువంటి, ఉత్కుచ = ఉన్నతమైన కుచములు గలదానా, నీవిటుల్ = ఈ విధముగా నీవు, విరహమందన్ బాడియే=వలపును వహింపఁగా న్యాయమా, ధైర్యమూనఁగరాదా = ధైర్యము నవలంబింపరాదా, నినులాతి నాతుకలు గన్నన్ = ఇతర స్త్రీలు నినుఁజూచి నట్లైతే, హెచ్చుగాఁ జిత్రమై నగరా — మిక్కిలి యాశ్చర్యమై నవ్వరా, జవ్వను లైన కాంతలిలలోనన్ లేర = యౌవనవతులైన చేడియలు భూమియందునలేరా, ఇట్లౌదురా = ఈరీతిఁ గ్రుశించినవార లగుదురా, నగరు + ఆ = పట్టణమూ, దవ్వులనుండెన్ = దూరముగా నుండినది, శీఘ్రముగఁ గానన్ వీడి పోదాముర = త్వరగా నుద్యానవనమును వదలి వెళ్ళుదాము రమ్మ.

వ॥ ఇట్లనుచున్న చెలులకు నమస్కరింపుచుఁ గంటఁదడివెట్టి నడువఁజాల నను దేవికి నోర్తుక యిట్లనియె॥ 42

టీక. సుగమము

ఏ త్వ ము లు

క॥ కే లేదే తే తేవే
వే లేవే మెట్లె దేజ ♦ వే యేల్చెడె
న్నే లేనే వేరే యె
గ్గే లేనే లేదె యేడ్చె ♦ దేలే మేలే ॥ 43

ఈ పద్యమంతయు నేత్వములతో రచియింపఁ బడినదని గ్రహించునది.

టీక. కేలు = హస్తము, ఏదే = ఎచ్చటనే, తే తేవే = తెమ్ము తెమ్ము, వే = శీఘ్రముగా, లేవేమెట్లె = లేవవేమి యెట్లనే, దేజవే = దీను రాలవా, ఏల్చెడెన్ = రక్షించువనితను, నేలేనే = నేనుండలేదా, వేరే =

వేరుగా, ఎగ్గెలేనేలేదె = కీడు, లేక, దోషము లేనేలేదు, ఏడ్పేటేలే — ఏడ్పేద వెందుకె, మేలే = శుభమా.

గు డు సు లు

కం॥ ప్రీతి న్విడితివి శ్రీ శి
శ్వోతికిఁ జిక్కితివి మీఱి • యీవింతీ యీ
రీతి న్గిడిగిడి నిడితివి
భీతిలితివి చింతిలితివి • పిరికివి యిస్సీ॥ 44

టీక. ప్రీతిన్ = సంతోషమును, విడితివి = వదలుకొంటివి, శ్రీ = లక్ష్మియొక్క, శిశు = పాపయైన మన్మథుని, ఊతికి = బాధకు, చిక్కితివి = లోనైతివి, మీఱి = మించి, ఈవు = నీవు, ఇంతీ = ఓవనితా, ఈరీతిన్ = ఈవిధముగా, గిడిగిడి = నమస్కారమున్, ఇడితివి = పెట్టితివి, భీతిలితివి = భయముఁ జెందితివి, చింతిలితివి = చింతనొందితివి, పిరికివి = పిరికిదానవు, ఇస్సీ = ఏవకరము.

వ॥ అనుచు లేవనెత్తి శేలూతయిడి మెల్లనఁ గొనిపోయి నిజభవనంబునం దాదేవిని విడియించిన తదనంతరంబున. 45

టీక సుగమము

గీ॥ పగలు దీరఁగఁ జెలిని ద • ర్పకుఁ డొకండు
తగ మహాబలయుక్తుఁడై • దాడి వెడలి
యేచ నస్త్రాద్రిదాటున • కేగె మిత్రుఁ
డనఁగఁ జనెఁ గందురా మిత్రుఁ • లంతె కాదె॥ 46

టీక పగలు దీరఁగన్ = దివసము పూర్తికావచ్చు తోడనే, అని యర్థము, విరోధములు తీరిపోవునట్లుగా, అని భావము, చెలిని = రం స్త్రీని, అని యర్థము, స్నేహితుని, అని భావము, దర్పకుఁ డొకండు = మన్మథుఁ డొక్కరుఁ డని యర్థము, పొగరుబోతువాఁ డొకఁ

దని భావము, తగమహాబలయుక్తుఁడై = ఒప్పునట్లుగా వాయువుతో కూడు కొనినఁవాడై యని యర్థము, ఒప్పునట్లుగా నతిశయమైన సైన్యముతో కూడు కొనినవాఁడై యని భావము, దాడివెడలి = దండెత్తుటకు బయలుదేరి, ఏచన్ = బాధింపఁగా, అస్తాద్రిచాటునకేగె మిత్రుఁడనఁగన్ = అస్తగిరి చాటుకు బోయెను సూర్యుఁడనునట్లుగా, అని అర్థము, అస్తపర్వతము చాటునకు చెలి కాడు పోయెననునట్లుగా, అని భావము, చనెన్ = అస్తమించెను, అని యర్థము, ఒప్పెను, అని భావము, మిత్రులంతె కాదె = స్నేహితు లంతియే కదా

అనఁగా నొకానొక స్నేహితునిన్ బగదీర్చుకొనుట కొక పొగరుబోతు వాఁడు సేనను గూర్చుకొని దండెత్తి పోయి బాధించుచుండఁగా సహాయముఁ జేయఁజాలకయు బాధలఁ జూడలేకయు నతని చెలికాఁ డేదోయొకదాని చాటు నకు పోవునట్లుగా, సూర్యుఁడు దివము పూర్తికావడముతోడనే-యీచేడియను మలయానిలయుక్తుఁడై మన్మథుఁడు దండెత్తివచ్చి బాధింపుచుండఁగా జూఁడ జాలక యస్తగిరి చాటునకు బోయెనా యేమి యనునట్లుగా నస్తమించెనని తాత్పర్యము

గీ॥ జార చోరాదులకు సంత • సములు హెచ్చె
సరవి దుఃఖములొదవె స • చ్చక్రములకుఁ
దిరుగుటకు వీలులేదయ్యె • ద్విజతతులకు
నినుఁడు లేని లోకమునందు • నింతియెకద॥ 47

టీక జారచోర హెచ్చెన్ = వ్యభిచారులు దొంగలు మొదలైన వారలకు సంతోషము లతిశయించినవి, సరవిన్ = వరుసగా, సచ్చక్రముం కున్ = శ్రేష్ఠమైన చక్రవాక పక్షులకు, దుఃఖము లొదవెన్ = చింతలొన గూడెను, (అనఁగా సూర్యుఁడు జక్కవలతోఁ దగుటవలన నాతఁడ స్తమించుటచే జక్కవలకు దుఃఖమనుట) ద్విజతతులకున్ = పక్షుల సముదయములకు,

తిరుగుటకు వీలులేదయ్యెన్ = విహరించుటకు వీలు లేకుండెను, ఇనుఁడు లేని లోకమునందు నింతియెకద = సూర్యుఁడులేని లోకమునందున నీలాగే కదా! అనియును నృపతిలేని జగమునందున నిట్లేకదా యని భావమున్నందున, జారచోరాదులకు సంతోషములు హెచ్చుటయు, సచ్చక్రములనఁగా, సాధుజన సమూహములకు దుఃఖము తొదవుటయు, ద్విజతతులనఁగా బ్రాహ్మణ సముదయములకు సంచరింప వీలులేకుండుటయు నృపుఁడులేని జగమునందు స్వాభావికముగా నుండునని తాత్పర్యము

గీ॥ చేడె నిష్కారణంబుగాఁ • జిగురు విల్లుఁ
డమ్ము లేయుచునుండె న • టంచుఁ గినుకఁ
జెంది దిక్సతి కనులెఱ్ఱ • జేసెననఁగ
సంజ కెంజాయ లపర ది • శన్ రహించె॥ 48

అనఁగా నీ చేడియను కారణము లేకుండా మన్మథుఁడు బాణములు వేయుచున్నాఁడనే కోపముతో దిశయనే కాంత కన్ను లెఱ్ఱ జేసెనా యేమి యనునట్లుగా పడమరదిక్కున సంధ్యారాగములు ప్రకాశించెనని తాత్పర్యము.

గీ॥ తవ్వ సారంగధరుఁడు సూ • పట్టకునికి
నెంచఁగా శ్యామకును దమి • హెచ్చుచుండె
తవ్వ సారంగధరుఁడు సూ • పట్టకునికి
నెంచఁగా శ్యామకును దమి • హెచ్చుటరుదె॥ 49

తవ్వ సారంగధరుఁడు, అనఁగా నాయోగ్యుఁడైన శివుడు, చంద్రుఁడు, సారంగధరుఁడును కనుపడకుండుటచే విచారింపఁగా, శ్యామకు, అనఁగా నా పార్వతి, తార, చిత్రాంగి, అనే చేడియకుఁ దమి, అనఁగా విరహము హెచ్చుచుండెననియును, మనోజ్ఞుఁడైన యా

కాశమునందలి చంద్రుఁడు, కనుపడకుండుటవలన విచారింపఁగా, శ్యామకు, అనఁగా రాత్రికి, తమి, అనఁగాఁ జీకటి హెచ్చుట యాశ్చర్యమేమి యగును స్వాభావికమే యౌనని తాత్పర్యము

గీ॥ శ్యామ యనునట్టి మంజుల • శ్యామ యిరుల
తుఱుమునం దక్కడక్కడ • తుఱుము మల్లె
నన గమియె యౌసుగాటోలు • ననఁగఁ బెక్కు
భయంబులేర్పడె నపుడు న • భంబునందు॥ 50

టీక. అపుడు = ఆ సమయమునందున, నభంబునందున్ = ఆకాశమున, శ్యామయనునట్టి = రాత్రి యనునటువంటి, మంజులశ్యామ = మనోజ్ఞమైన చేడియ, ఇరుల తుఱుమునందు = చీకటులను కొప్పునందున, అక్కడక్కడ = ఆఁడాద, తుఱుము = ముడిచినటువంటి, మల్లెననగమియె యౌనుగాటోలు ననఁగఁ = మల్లెపూల సముదాయమే కావచ్చుననంగా, పెక్కు = అనేకములైన, భంబులేర్పడెన్ = నక్షత్రము లేర్పడియెను.

చ॥ అమృతకళల్ గలాడు కమ • లాప్తునకున్ బతకాఁడు చక్రవా
కములకు సూడు కేశవుని • కామినికిన్ సయిదోడు యామినీ
సమయము నేలువాఁడు కడుఁ • జల్లని చుక్కలఱేఁడు దేవ పూ
గమునకు కూడు చందు తొలి • గట్టునఁ గల్గెను నాఁడు వేడుకన్॥

టీక సుగమము

గీ॥ పంకజాతులకును గల్గు • బింకముడిగె
నెల్ల పరచక్రములును భీ • తిల్లసాగెఁ
గువలయమునకు శుభములు • గూడుచుండె
నరయఁ జల్లనిరాజేల • నంతియెకద॥ 52

ఈ పద్యమునందునఁ జల్లనిరాజనుటచే శీతల దృష్టిగల నృపునకును, చంద్రునకును, అర్థద్వయము గలుగునట్లు రచింపఁబడినదని గ్రహించునది.

టీక. పంకజాతుల ముదిగెఁ = పాపజాతి వారలకు గల గర్వము నశించెనని నృపునిపరముగను, పద్మములకు గల బిగువు నశించెనని చంద్రుని పరముగను, అంతట నిట్లే గ్రహించునది ఎల్ల = సమస్తమైన, పర చక్రములును భీతిల్లసాగెన్ = శాత్రవసమూహములు భయమునొందసాగెనని యును, ఉత్కృష్టమైన చక్రవాకపక్షులు భయపడసాగెననియును, కువలయ . చుండెన్ = భూవలయమునకు మేలుతోనగూడఁ దొడఁగెననియును, కలు వకు మంగళములు చేకూఱుచుండెననియును, అరయన్ = విచారింపఁగా, చల్లనిరాజేల నంటియొకద = యోగ్యుఁడైన నృపుఁడు పరిపాలింపుచుండఁగా నాలాగె యుండును గదా యనియును, చలువలఱేఁడైన చంద్రుఁడేలుచుండగా నట్లేయుండును గదా యనియును, అర్థము.

మ॥ మహితాంభోజభవాండమన్ విమల వే • శ్మంబందునన్ వ్రేలు నా
తుహినాంశుండను దర్పణావృతపు వి • ద్యుచ్ఛక్తి దీపంబు వె
ల్గ హాయల్ మించెడు కాంతిపుంజమను లీ • లన్ జంద్రికల్ బర్వె నా
డహహా జక్కవ క్రందఁగన్ విరహిణీ • శ్యామల్ మదిన్ గుందఁగన్॥

టీక నాఁడు = అప్పుడు, అహహా = ఆశ్చర్యము, జక్కవ క్రందఁ గన్ = చక్రవాకము విలపింపఁగా, విరహిణీ శ్యామల్ = విరహిణీస్త్రీలు, మదిన్ గుందఁగన్ = హృదయమునందు దుఃఖింపఁగా, మహిత = గొప్పది యైన, అంభోజభవాండమన్ = బ్రహ్మాండమనే, విమల = స్వచ్ఛమైన, వేశ్మంబందునన్ వ్రేలు = గృహమునందున వ్రేలాఁడునట్టి, ఆ తుహినాంశుం డను = ఆ చంద్రుఁ డనునటువంటి, దర్పణ = అద్దముచేత, ఆవృతపు = చుట్టుకొనఁబడిన, విద్యుచ్ఛక్తి దీపంబు వెల్గన్ = మెఱుపుశక్తిగలదివ్వె వెలుగు చుండఁగా, హాయల్ మించెడు = శృంగారము అతిశయించునట్టి, కాంతిపుంజ

మను లీలన్ = ప్రకాశసముదయనుమనట్లుగా, చంద్రికల్ బర్వెన్ = వెన్నెలలు వ్యాపించెను

గీ॥ అటులఁ గౌముదిప్రసరింప ♦ నింతి కపుడు
నిలుపఁగాలేని విరహంబు ♦ గలిగి మిగులఁ
దల్లడిల్లుచుఁ దారకా ♦ ధవుని చాయఁ
జాఁ(అఁ)జూచియు నిటువలెఁ ♦ బలుకఁ దొడఁగె॥ 54

టీక. సుగమము.

క॥ పరమేశు సృష్టిలో నం
బరమున రేఱేఁడనంగ ♦ బరగి యదితికిన్
మరలఁబయోనిధికిన్ దదు
పరి నత్రికిఁ గల్గినట్టి ♦ ప్రాలేయకరా॥ 55

టీక. సుగమము

చంద్రదూషణము

గీ॥ వెలయఁ జల్లినట్టు వెచ్చఁగా ♦ పీచినట్లుఁ
జెలుల వేధింప వేడి వె ♦ న్నెలలుగాయఁ
జలువల దొరా యటంచు నిన్ ♦ బలుకు చెల్ల
నబ్బుఁడా నేరిబీరకా ♦ య ననినట్లె॥ 56

టీక సుగమము

క॥ చెలియ లనక యా కలుముల
చెలి యలరెడు కొంపను జెఱ ♦ చెదవో తొగ నె
చ్చెలి యలసటఁ గూర్చఁగఁ జెఱ
చెలియ లనఁగ లెక్కయగునె ♦ క్షితిపై నీకుఁజా॥ 57

ఈపద్యము త్రిప్రాసముగా రచియింపఁబడినదని గ్రహించునది

టీక. చెలియలు = చెల్లెలును, స్త్రీలును, తక్కిమ్మ విషయము సుగమము

క॥ విషమున కనుజన్ముఁడవై
విషనిధికిఁ సుతుఁడనంగ • వెలయఁ గలిగియుఁ
విషకంఠ శిఖామణి వగు
విషయము వెలఁదులకుఁ దెలుప • వేధింతువొకో॥ 58

టీక. సుగమము.

క॥ తమ్ములకున్ మఱి సచ్చ
క్రమ్ములకుఁ గీడొనర్చు • కర యుతు నిన్నుఁ
నమ్మంగ వచ్చునే య
మ్మమ్మ కువలయ హితుండ • వగు టెట్లు శశీ॥ 59

టీక తమ్ములకున్ = సహోదరులకని నింద్యార్థము, పద్మములకని స్వభావార్థము, మఱి = మఱియును, సచ్చక్రమ్ములకుఁ = సాధుజన సమూహములకని నింద్యార్థము, శ్రేష్ఠమైన చక్రవాక పక్షులకని స్వభావార్థము, కీడొనర్చు = అపకృతి నొనరించునట్టి, కరయుతు నిన్నున్ = చేతులతోఁ గూడుకొన్న నిన్నని నింద్యార్థము, కిరణములతోఁగూడుకొన్న నిన్నని స్వభావార్థము, నమ్మంగవచ్చునే = నమ్మవచ్చునా, అమ్మమ్మ = ఆశ్చర్యార్థము, కువలయహితుండవగుటెట్లుశశీ = భూవలయమునకు హితముఁజేయువాఁడగుట యేవిధము చంద్రాయని నింద్యార్థము, ఓచంద్రుఁడా కలువలకు హితుఁడవగుట యేలాగని స్వభావార్థము.

క॥ భూతపతి మౌళి వగుచున్
భూతల మందునఁ జతుర్థ • భూతము సాయం

బై తోఁడు రా నెలంతల
మాతుక మొనరింప కుందె • కైరవమిత్రా॥ 60

టీక కైరవమిత్రా = కుముదబాంధవా, భూతపతి = పిశాచములకు రాజైన శివునకు, మౌళివగుచున్ = కిరీటమవై, భూతల మందునన్ = మేదినీతలమునందున, చతుర్థభూతము సాయంబై తోడురాన్ = పంచభూతములలో నాల్గవ భూతమైన వాయువు సహాయమైతోడుగా వచ్చుచుండఁగా, నెలంతలన్= స్త్రీలను, మాతుక మొనరింపకుందె = హరణము జేయకుందువా (దేసెదవనుట పంచభూతములనఁగా, పృథి వ్యాప స్తేజో వాయు రాకాశములని గ్రహించునది)

సీ॥ ద్విజరాజ నామంబు • నిజమె యైనటు లైన
విప్రయోగులకును • వేధ లిడుదె
అమృత ధామాఖ్య ని • క్కమె యయ్యెనేని సు
రోత్కరపాన ము • ఖ్యంబ వగుదె
చంద్రాభిధానంబు • సార్థక మగునేని
వరవసుహారివై • ప్రబలుచుందె
తమిలేని రాజనఁ • దగుదువేనియు గురు
శ్యామానువర్తివై • యలరుచుందె

గీ॥ సన్నికర సంగతుఁడన నె • సంగి తేని
మార మిత్రత్వమున నెస • లారుచుందె
కానఁ బంచమహాపాత • కము లొనర్పు
మాతుక శిఖామణివి గదా • కంజవైరి॥ 61

టీక. ద్విజరాజనామంబు నిజమెయైనటు లైనన్ = ద్విజరాజశ్శశధరో, అని యమరమగుట వలన, ద్విజరాజనే పేరు వాస్తవమైనదే యైనచో, అని యర్థము, బ్రాహ్మణ శ్రేష్ఠుఁడనే పేరు వాస్తవమైనదే యైనచో, అని భావము, విప్రయోగులకును వేధలిడుదె = బ్రాహ్మణ తాపసులకు బాధలు

బెట్టెదవా యని నింద్యార్థము, మిక్కిలి విరహులకు బాధలు బెట్టెదవా యని స్వభావార్థము, అమృతధామాఖ్య నిక్కమెయయ్యేనేని = మృతముగాని శరీరము గలవాఁడను పేరు (అనఁగా జైవాత్రుక నామమనుట) వాస్తవమైనదె యైనచో, అని యర్థము, సుధాకర నామము వాస్తవమైనదే యైనచో, అని భావము, సురోత్కరపానముఖ్యుండవగుదె = కల్లు సముదయముఁ ద్రాగుట యందు (అనఁగా నీత తాటి కొబ్బెర కల్లులనుట) ముఖ్యుఁడ వగుదువా యని నింద్యార్థము, దేవతా సముదయమునకు పానముసేయఁగా ముఖ్యుఁడవగుదువా యని స్వభావార్థము, వేలుపుల బువ్వ చీకటి వేరు విత్తు, అని యాంధ్రనామ సంగ్రహము, చంద్రాభిధానంబు సార్థక మగునేని = చంద్రుఁడనే పేరు సార్థకమే యైనచో, అని యర్థము, బంగారు నామము నీకు సార్థక నామధేయమే యైనచో, అన భావము, చంద్ర శబ్దము బంగారనుటకు, ని. చంద్రస్సుధాంశు కర్పూర కంపిల్ల స్వర్ణహారిషు, అని విశ్వము, పరవసుహారివై ప్రబలుచుండె= ఇతరుల బంగారును హరించినవాఁడవై యతిశయిల్లుచుందువా యని నింద్యార్థము, ఇతరుల కాంతుల నపహరించినవాఁడవై యతిశయిల్లుచుందువా యని స్వభావార్థము, చంద్రుఁడు సూర్యుని కాంతుల నపహరించుననుట ప్రసిద్ధము, వసుశబ్దము బంగారునకును కాంతికిని చెల్లుననుటకు, ని. వసుర్మయూఖాగ్ని జనాధిపేషు యోక్త్రే బకే స్యాద్వసు హాటకేచ, అని విశ్వము, తమిలేని రాజ నఁదగుదువేనియు = చీకటి లేనటువంటి ప్రభుఁడవనఁగా నొప్పితివేనిఁయు నని యర్థము, వలపులేని చంద్రుడవనఁగా నొప్పితివేని యని భావము గురుశ్యామానువర్తివై యలరుచుండె = గురుని నారి ననువర్తించువాఁడవై యతిశయిల్లుదువా యని నింద్యార్థము, అతిశయమైనరాత్రిని వర్తించువాఁడవై ప్రకాశించెదవా యని స్వభావార్థము, సన్నికరసంగతుండననెసంగితేని=నక్షత్ర సముదయ్యముతో కూడుకొనఁబడిన వాఁదనఁగా నొప్పితివేని యని యర్థము, సాధుజన సముదయముతో కూడుకొనఁబడిన వాఁదనఁగాఁ దనరితివేని యని

భావము, మార మిత్రత్వమున నెసలారుచుందె = ఘాతుకులతో నాప్తత నొప్పు చుందువా యని నింద్యార్థము, మన్మథునితో నాప్తత నొప్పుచుందువా యని స్వభావార్థము, కాబట్టి, కంజవైరి = పద్మములకు విరోధివైన యో చంద్రుఁడా' పంచ మహాపాతకము లొనర్చు = మహాపాతకము లైదింటిని జేయునట్టి, ఘాతుక శిఖామణివి గదా = మారణకర్మ మొనర్చు వారలలో శ్రేష్ఠుఁడవు గదా, పంచమహాపాతకములనఁగా, బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురుదారాగమనము, దుస్సహవాసము లని గ్రహించునది

అనఁగా నో చంద్రుఁడా, బ్రాహ్మణ శ్రేష్ఠుఁడవైనచో బ్రహ్మ ఋషులను బాధలు బెట్టెదవా, అమృతము గలవాఁడవైనచో కల్లుఁద్రావుటయందు ముఖ్యుఁడ వగుదువా, నీవు బంగారు నామము చెల్లినవాఁడ వైనచో, పరుల బంగారు నపహరించుదువా, వలపులేని దొరవైనచో, గురునారి ననువర్తింతువా, సజ్జనులతో కూడుకొనిన వాఁడవైనచో, ఘాతుకులతో మైత్రిచేయుదువా, కాబట్టి పై జెప్పఁబడిన పంచమహాపాతకములు జేయువారలలో నగ్రగణ్యుఁడవని నింద్యార్థ తాత్పర్యము.

గీ॥ నిన్నుఁ దన్నియు నీభాగి • నేయుఁ గాల్చి
నట్టి శంకరు తెలివుబో • వైరి వేట
నేట నిన్నుమ్రింగు కేతువు • నేమి సేయ
వైరి వబలల నేచ సా • హసమె చంద్ర ॥ 62

టీక. సుగమము.

చ॥ కమలధిఁగల్గి యౌర్వశిఖి • కల్ గ్రహియించితొ వెంటనేగి యా
కమల హిమోష్ణధామములఁ • గాంచితొ మస్తకమందుఁ జేరి యా
కమల కరాక్షపావకశి • ఖల్ గయికొంటివొ లేక యున్న నీ
కమల హిమాంశువుల్ దనరఁ • గా నిటు వేడిమి గల్గునే శశీ ॥ 63

టీక శశీ = ఓచంద్రుఁడా, కమలధిఁగల్గి = సముద్రములో జనించి, ఔర్వ కలికల్ గ్రహియించితో = బడబాగ్ని యొక్క జ్వాలలను చేకొంటివో, వెంటనేగి = కూడాఁబోయిన వాఁడవై, ఆ కమలహితోష్ణధామములఁ గాంచితో = ఆ పద్మమిత్రుఁడైన సూర్యుని యొక్క తీక్ష్ణకిరణములను వహించితివో, మస్తకమందుఁ జేరి = శిరస్సుమీదఁ జేరినవాఁడవై, ఆ కమలకర = ఆ కురంగ పాణియైన శంకరుని యొక్క, అక్షి పావకశిఖల్ గయికొంటివో = నేత్రాగ్ని జ్వాలలఁ జేకొంటివో, లేకయున్న = అట్లుఁ గాకపోయినట్లైన, నీ కమల హిమాంశువుల్ దనరఁగా = నీకు స్వచ్ఛమైన చల్లని కాంతులు నొప్పుచుండఁగా, ఇటు వేదిమి గల్గునే = ఈవిధముగా తాక జనియించునా (జనించదనుట), కమలమనిన జింక యనుటకు, ని. మృగభేదేఽపి కమలః, అని విశ్వము

ఓ చంద్రా సముద్రమున జనించి యందులోనుండు బడబాగ్ని జ్వాలలను గైకొన్నావో లేక సూర్యునివెంట సంచరించి యాతని వేడివెలుగులను గైకొన్నావో లేక శిరంబునఁ జేరి యీశ్వరుని కంటి మంట కొడులను, గైకొన్నావో గాని యట్లులేనిచో చల్లని కాంతులుగల నీకింత వేడిమియుండునా యని తాత్పర్యము

క॥ జెట్టి గఱచిన విషాంకమొ
మట్టి గలదటంచ్రు దాని ♦ మచ్చయొ లేదా
యిట్టి గల చిహ్నమో యెదఁ
గట్టి తగుఁ గలంకహృదయుఁ ♦ గనఁగిదె శశీ ॥ 84

టీక. సుగమము

క॥ ఇక్క రణి నిందు దూఱుచు
మిక్కిలిగా నదలు చెలికి ♦ మిత్రుఁడు వచ్చున్

ఇక్క్రతమి నడఁచు ననుగతి
కొక్కొ్క్రరొగో యనుచుఁ గోడి • గూసె నయారే॥ 65

టీక ఇక్క్రరణిన్ = ఈ విధముగా, ఇందు దూఱుచున్=చంద్రుని నిందింపుచు, మిక్కిలిగా నడలు చెలికిన్ = అతిశయముగా భయపడునట్టి చేడియకు, మిత్రుఁడు వచ్చున్ = సూర్యుఁడు రాగలఁడు, అని యర్థము, నీ స్నేహితుఁడు రాగలఁడు, అని భావము, చక్క = ఒప్పగునట్లుగా, తమి నడఁచున్ = చీకటి నణఁగునట్లుఁ జేయును, అని యర్థము, నీ విరహము నణఁగునట్లుజేయును, అని భావము, అనుగతి = అనేవిధముగా, అయారే = ఆశ్చర్యము, కొక్కొ్క్రరొగో యనుచున్ = కొక్కు్రరొగో యటంచు, కోడి గూసెన్ = కుక్కుటము కూసినదాయెను

గీ॥ వసుసహిత గర్వమునఁ దమో • వర్తినగుచు
విప్రయోగులకే మైన • వెతలు గూర్చి
నానొకో యని రాజు స్నా • నమ్ముఁజేయ
నద్ది దిగెననఁ గ్రుంకె రా • జంతియె కద॥ 66

ఈ పద్యమునందున రాజంతియె కద యనుటచే నృపునకును చంద్రునకును, అర్థద్వయము గల్గునట్లుగా రచియింపఁ బడినదని గ్రహించునది

టీక. వసుసహిత గర్వమునన్ = ధనముతోకూడుకొనఁ బడిన పొగరు చేతనని రాజు పరమగును, కిరణములతో కూడుకొనఁబడిన పొగరుచేతనని చంద్రుని పరముగను, అంతట నిట్లే గ్రహించునది తమోవర్తినగుచున్ = తామసగుణమునందు ప్రవర్తించువాఁడనై యనియును, చీకటియందు ప్రవర్తించెడు వాఁడనై యనియును, విప్రయోగులకు = బ్రహ్మణులకు ననియును, మిక్కిలి విరహులకు ననియును, ఏమైన వెతలుగూర్చి నానొకోయని = ఏమి

యేని బాధల నొదగూర్చినా నేమోయటంచు, రాజా = నృపుడు, అనియును, చంద్రుఁడు, అనియును స్నానమ్మున్ = అభ్యంగన మాచరించుటకై, అబ్ధి దిగెననఁ గ్రుంకెన్ = సముద్రమునందున ప్రవేశించెననునట్లుగా మునిగినవాఁ డాయెను, రాజంతియు కద = నృపుఁ డాలాగే కదా యనియును, చంద్రుఁ డట్లేకదా యనియును, ని తమోఽంధకారే స్వర్భానౌ తమశ్శోకే గుణాంతరే, అని విశ్వము, పాపపరిహారార్థము సముద్రస్నానము జేయుట ప్రసిద్ధము.

ఆ॥వె॥ కువలయంబు నేలు • గొప్పరాజదఁగ లో
కంబు దెల్లవాఱు • కరణి నాఁడు
కువలయంబు నేలు • గొప్పరాజదఁగ లో
కంబు దెల్లవాఱెఁ • గా తలంప॥ 67

టీక తలంపన్ = ఊహింపఁగా, కువలయంబు నేలు = భూవలయమును పాలించునట్టి, గొప్పరాజదఁగన్=అధికుఁడైన ప్రభువు నశింపఁగా, లోకంబు దెల్లవాఱుకరణిన్ = జనులు తెల్లబాఱు విధముగా, నాఁడు=అప్పుడు, కువలయంబు నేలు = కలువను పోషించునట్టి, గొప్పరాజదఁగన్ = అధికుఁడైన చంద్రుఁడు గ్రుంకగా, లోకంబు = భువనము, తెల్లవాఱెఁగా = సూర్యోదయ సమయమాయెను గదా

ఆ॥వె॥ శ్యామఁ గనఁబయో ధ • రాధ్వమునందుండి
శ్యామ సనఁగ దార • కాళి డిందె
శ్యామఁ గనఁ బయోధ • రాధ్వము నందుండి
శ్యామ సనఁగఁ దార • కాళి యున్నె॥ 68

టీక. శ్యామన్ = రాత్రిని, కనన్ = చూడఁగా, పయోధ రాధ్వము నందుండి = మేఘమార్గమునం దుండినదియై (ఆకాశము నందనుట), శ్యామసనఁగన్ = రాత్రి గడించఁగా, తారకాళి = నక్ష

్రముల సముదయము, డిందెన్ = నశించినది యాయెను, శ్యామన్ = స్త్రీని కనన్ = చూడఁగా, వక్షోధరాధ్వమునందుండి = స్తనమార్గమునం దుండి నవియై (వక్షస్థలమునం దనుట), శ్యామసనఁగన్ = ఆ స్త్రీ నశింపఁగా, తారకాళియున్నె = మౌక్తికమాల యుండునా

ఆ॥వె॥ రాజువోవఁ జక్ర • రక్షణ మొనరింప
భువనజనులు సలరఁ • బూర్వనగర
మాక్రమణము సలుప • నాయె నయ్యెడ నినుం
డంతెకాదె యెచ్చ • టైన నినులు॥ 69

టీక రాజువోవన్ = చంద్రుఁ డస్తమించఁగా, చక్రరక్షణమొనరింపన్ = చక్రవాకపక్షుల జంటను రక్షణము సేయుటకై, భువనజనులు = ఉదకజనితములైన పద్మములు, అలరన్ = పుష్పింపఁగా, అయ్యెడన్ = ఆ సమయమునందున, ఇనుండు = సూర్యుఁడు, పూర్వనగ - తూర్పుకొండ యొక్క (అనఁగా నుదయాద్రి యనుట), రమా = సంపదను, ఆక్రమణము = సలుపనాయెన్ = ఆక్రమించనాయెను, ఇనులు = నృపులు, ఎచ్చటైనన్ = ఎందైనను, అంతెకాదె = అట్లేకదా, అనఁగా నినశబ్దము సూర్యునియందునను నృపునియందును వర్తించును గావున నినశబ్దవాచ్యులైన నృపులంతియే కదా యని భావము, నృపులంతియే ననుట యెట్లనఁగా, రాజువోవన్ = అదివరకు నేలునట్టి నృపుఁడు నశింపఁగా, చక్రరక్షణ మొనరింపన్ = భూచక్రమును పాలించుటకై, భువనజనులు సలరఁగా = లోకప్రజలు సంతోషించునట్లుగా, పూర్వనగరమున్ = మొదటి రాజేలిన పట్టణమును, ఆక్రమణము సలుప నౌను = ఆక్రమించుకొన నౌననుట, ని. రాజా ప్రభౌ నృపే చంద్రే, అనియును, చక్రో గణే చక్రవాకే చక్రం సైన్యే రథాంగయోః గ్రామజాలే కులాలస్య భాండే రాష్ట్రాస్త్రయోరపి, అనియును, భువనం విష్టపే మహ్యాం సలిలేఽపి వియత్యపి, అనియును ఇన స్సూర్యే నృపే పత్యౌ, అనియును విశ్వము

ఆ॥వె॥ అట్టియెడ సరోరు • హాప్తోదయమునకు
మున్నె లేచి భువన • మోహనాంగి
యనన్ దనర్చునట్టి • యాదేవి నిత్యకృ
త్యములు దీర్చుకొనియుఁ • దమి దలిర్ప ॥ 70

టీక సుగమము

క॥ సారంగధరుని కూటం
బేరీతి లభించు నన్న • దీప్సిత మెటులన్
దీరు ముదమెన్నటికి చే
కూరంగల దనుచు మిగులఁ గుందఁగ సాగెన్॥ 71

టీక సుగమము

గీ॥ అంత నాదేవి కల్యాణ • మందుకొఱకు
నాత్మ జనకేష్టమును బూని • యలరు కాన
నమున నొకచోటఁ జేరి సం • యమిని పోల్కి
నిట్లు సారంగధరుఁ గూర్చి • యెన్నఁ దొడఁగె ॥ 72

టీక. శివ॥ అంతన్ = అటుమీదట, ఆదేవి = ఆ పార్వతీదేవి, కల్యాణ మందుకొఱకు = వివాహమాడుటకోసమై, ఆత్మజనక = తన తండ్రి యైన హిమవంతునియొక్క, ఇష్టమునుబూని = సమ్మతిని బడసినదియై, అలరు = ప్రకాశించునట్టి, కాననమున నొకచోటఁజేరి = అడవియందున నొకానొక ప్రదేశమునందున ప్రవేశించి, సంయమినిపోల్కిన్ = తపస్విని వేషముతో, సారంగధరుఁగూర్చి = జింకతాల్పరియైన శంకరునిఁగూర్చి, ఇట్లు = ఈ క్రింది రీతిగా, ఎన్నఁదొడఁగెన్=స్తోత్రముసేయ నుద్యమించెను.

టీక. చంద్ర॥ అంత నాదేవి = అటుపిమ్మట నా తారాదేవి, కల్యాణ మందుకొఱకు = శుభము నెనయుటకోసమై, ఆత్మజనక = తన హృదయము

నందు జనించినట్టి, ఇష్టమును బూని = అభిలాష ననుసరించినదియై, అలరు = ప్రకాశించునట్టి, కాననమునఁ = గృహమునందున, ఒకచోటఁజేరి = ఒకానొక ప్రదేశమునందుఁ జేరినదియై, సంయమినిపోల్కి = తపస్విని విధంబుగా, సారంగధరుఁగూర్చి = జింకతాల్పరియైన చంద్రుని గుఱించి, ఇట్లు = ఈ క్రిందఁ జెప్పఁబోవు తీరుగా, ఎన్నఁదొడఁగెన్ = స్తోత్రము సేయఁ బయత్నించెను ని కాననం విపినే గేహే, అని విశ్వము

టీక. సారంగ॥ చంద్రకథకు సమానము

గీ॥ నీవె నాప్రాణసఖుఁడవు • నీవె పతివి
నీవె నాతోడునీడవు • నీవె గతివి
నీవె నాయిలవేల్పువు • నిన్నుఁదక్క
జగతి నితరులఁగోరనే • సద్గణేశ॥ 73

టీక శివ, చంద్ర, సారంగధర కథలలో వరుసగా, సద్గణేశ = ఓ ప్రమథాధీశ్వరుఁడవైన శంకరా, ఓ నక్షత్రసముదయాధిపతివైన చంద్రా, ఓ పండితశ్రేష్ఠుఁడవైన సారంగధరా, అని గ్రహించునది, తక్కినవిషయము సుగమము.

క॥ ఎన్నఁడు నాకొంటరిగఁ బ్ర
సన్నం బయ్యెదవొ నీదు • సాంగత్యము నా
కెన్నఁడు లభియించునో యని
సన్నుతిఁ జేసెదనురావె • సారంగధరా॥ 74

టీక. సుగమము

మ॥ భువిపై వృష్టినిఁగోరు సస్యములం • భోద ధ్వనిన్ గోరు కే
కిపలెన్ ద్యాగినిఁగోరు యాచకుని మా • ద్కిన్ భాస్కరున్ గోరు ఆ

క్కవలీలన్ విరిఁగోరు తేటిగతి జో • కన్ వెన్నుఁ థిన్ గోరు పే
ద వలెన్ గోరితి బాలిఁదీర్పఁగఁదవే • దాక్షాయణీ నాయకా॥

టీక శివ, చంద్ర, సారంగధర కథలలో వరుసగా, దాక్షాయణీ నాయకా = దక్షుని పుత్రికకు నాథుఁడవైన యోశంకరా, అశ్విన్యాది నక్షత్రాధీశ్వరుఁడవైన చంద్రా, భూమిపతివైన యో సారంగధరా, అని గ్రహించునది తతిమ్మావిషయము సుగమము, దాక్షాయణీ శబ్దము శబ్దార్థ చంద్రికలోఁ జూడనగును

క॥ నీ రతి గల్గని నిద్రా
హారములేలా పవిత్ర • హారములేలా
సౌరేల జన్మమేలా
సారంగధరా స్వరూప • సారంగధరా॥ 76

టీక స్వరూప = నిజవర్ణమునందున, సారంగధరా = జింకతాల్పరియైన చంద్రుఁడవగు నో శంకరా, అని శివకథకును, నిజవర్ణము నందున జింకతాల్పరియైన శంకరుఁడవగు నో చంద్రా, అని చంద్రకథకును, సౌందర్యమునందున జింకతాల్పరియైన చంద్రుఁడవగునో సారంగధరా, అని సారంగధర కథకును, అర్థము గ్రహించునది తతిమ్మా విషయము సుగమము.

ఆ॥వె॥ చిన్ననాఁటనుండి • జీవితేశ్వరునిగా
నెంచి నీదుపొందుఁ • గాంచ నుంటిఁ
గాన నేఁటికైనఁ • గల్యాణ మొనయఁగా
రావె యిటకు తరుణ • రాజమౌళి॥ 77

టీక శివ॥ కల్యాణ మొనయఁగా రావెయిటకు = ఇచ్చటికి వివాహమాడుటకు రాఁగదవె, తరుణ రాజమౌళి = బాలచంద్రుని కిరీటముగా గల యోశంకరా, తతిమ్మా విషయము సుగమము.

టీక చంద్ర॥ తరుణ రాజమౌళీ = ఓ బాలచంద్రశేఖరుఁడా, ఇటకు = ఇచ్చటికి, కల్యాణమెసయఁగారావె = శుభమును పొందఁగా రాఁగదవె, తక్కిన్మావిషయము సుగమము

టీక, సారంగ॥ తరుణ రాజమౌళీ = శ్రేష్ఠుఁడైన యువరాజా, తక్కిన్మావిషయము చంద్రకథకు సమానము॥

ఆ॥వె॥ సంతతంబు నీవు ♦ సహచరాన్వితముగా
మెలఁగుచెఱిఁగి యందు ♦ వలస నాదు
కోర్కె విన్నవించు ♦ కొనలేక పోతి కాం
టిగను రమ్ము చెంగ ♦ టిక సదీశ॥ 78

టీక సుగమము

క॥ నిను బలుమరు వేడుచు నుం
డిన నా మొఱవినక నాదు ♦ డెందంబునఁ గ
ల్గిన కోరికఁదీర్చియు నను
మనుపక విడనాఁడ న్యాయ ♦ మా మహితకరా 79

టీక, శివ, చంద్ర, సారంగధర కథలలో వరుసగా, మహిత = శూలమును, కరా = హస్తమందునఁ గలవాఁడవగు నో శంకరా, అనియును, అతిశయమైన కిరణములు గల యో చంద్రా, అనియును, ఘనతరమైన యో సారంగధరా, అనియును గ్రహించునది తక్కిన్మావిషయము సుగమము

క॥ మును జన్మంబున నీ బా
ర్యను గావున నిన్నుఁదక్క ♦ నన్యులపై నా
మనము ప్రసరింపదిఁక నన్
గనుఁగొని కోరికలు దీర్పఁ ♦ గదె సర్వజ్ఞా॥ 80

టీక శివ॥ సర్వజ్ఞా = ఓ సర్వజ్ఞ నామము గల శంకరా, మును . గావునన్ = తొలుతటి జన్మలో నీభార్యనైన సతీదేవినిగా బట్టి, తక్కినది విషయము సుగమము.

టీక చంద్ర సారంగధర కథలలో, మును . గావునన్ = ముందటి భవములో నీ భార్యనే కాబట్టి, అనియును, సర్వజ్ఞా = సర్వమును దెలిసినవాఁడా, అనియును, గ్రహించునది తక్కిన విషయము సుగమము.

ఆ॥వె॥ చంద్రగోత్ర ధర్మ • సంపన్నుఁడవు సత్ప
దప్రవర్తనుఁడవు • దళితకాముఁ
డవు ప్రశమిత దోషుఁ • డవు పంకజాతార్తి
కరుఁడ వగుట నన్నుఁ • గైకొన వొకొ ॥ 81

టీక శివ॥ చంద్రగోత్ర = బంగారుకొండను (అనఁగా మేరుగిరి ననుట), ధర్మసంపన్నుఁడవు = ధనుస్సంపదగా గలవాఁడవును, సత్పదప్రవర్తనుఁడవు = మంచిమార్గమునందు వర్తించువాఁడవును, దళిత = భేదింపఁబడిన, కాముఁడవు = మన్మథుఁడు గలవాఁడవును, ప్రశమిత = అణఁగఁజేయబడిన, దోషుఁడవు = పాపములు గలవాఁడవును, పంకజాత = పాపజాతులకు, ఆర్తికరుఁడవు = నొగులు గలుగఁజేయువాఁడవును, అగుటన్ = అవుటవలన, నన్నుఁగైగొన్నవొకొ = ననుఁ జేకొనకున్నావు గాబోలు.

టీక. చంద్ర॥ చంద్ర = ఓచంద్రుఁడా, గోత్రధర్మ = కులధర్మమునే, సంపన్నుఁడవు = సంపదగాఁగల వాఁడవును, సత్పద = నక్షత్రమార్గమునందున, ప్రవర్తనుఁడవు = సంచరించువాఁడవును, దళితకాముఁడవు = ఖండింపఁబడిన కామగుణముగల వాఁడవును, ప్రశమిత = శమింపఁ జేయఁబడిన, దోషుడవు = రాత్రులుగల వాఁడవును, పంకజాత = పద్మములకు, ఆర్తికరుఁడవు = నొగులు గలుగఁ జేయు

వాఁడవును, అగుటన్ = ఐనందు వలన, నన్నుఁగైకొనవొకో = నను౯ జేకొనకున్నా వేమోకా.

టీక. సారంగ॥ చంద్రగోత్ర ధర్మ = చంద్రవంశధర్మమునే, సంపన్నుఁడవు = సంపదగాఁ గలవాఁడవును, దళితకాముఁడవు = ఖండింపఁ బడిన కామగుణము గలవాఁడవును, లతిమ్మావిషయము శివకథకు సమానము

గీ॥ అహహ చింతామణీ సహజ ♦ హారి వగుచు
నలరి వాగనుశాసనీ ♦ యు లగు సిసుల
యంమ సుకలాన్వితాత్ముఁడ ♦ వనంగ నింత
వృద్ధినొందిన యట్టి ని ♦ న్నెన్నఁదరమె॥   82

టీక. శివ॥ అహహ = ఆశ్చర్యము, చింతామణీ సహజ = చింతామణి తోడఁబుట్టువగు విషమును, హారివగుచు నలరి = హరించినవాఁడవై ప్రకాశించి, వాగనుశాసనీయులగు సిసులయందున్ = బ్రహ్మసంబంధులగు శిశువుల యందున (అనఁగా నీశ్వరుఁడు బ్రహ్మ పుత్రుఁడని పురాణ ప్రసిద్ధము), సు = శ్రేష్ఠమైన, కలా = కాంతులచేత, అన్విత = కూడుకొనఁబడిన, ఆత్ముఁడవనఁగన్ = శరీరముగలవాఁడ వనంగా, ఇంతవృద్ధినొందిన యట్టి = ఇంతగాఁ బెంపు వహించినటువంటి, నిన్నెన్నఁ దరమె = నిను వర్ణింప శక్యమా (కాదనుట).

టీక. చంద్ర॥ అహహ = ఆశ్చర్యము, చింతామణీ సహజ = చింతామణితోఁడ బుట్టినవారి యందున, హారివగుచునలరి = మనోజ్ఞమైనవాఁడవై ప్రకాశించి వాగనుశాసనీయులగు సిసులయందున్ = బ్రహ్మసంబంధులగు బాలకులయందున, (అనగా చంద్రుడు బ్రహ్మదేవు నంశమువలన జనించినవాఁడనుట), సుకలాన్వితాత్ముఁడ వనఁగన్ = మంచి కళలతోఁ గూడుకొన్న దేహము గలవాఁడ వనంగా, ఇంత వృద్ధి నొందినయట్టి = ఇంతగా నభివృద్ధిఁ

గాంచి నటువంటి, నిన్నెన్నఁదరమె = నిన్నెంచ శక్యమా, అనఁగా చింతా మణియును చంద్రుఁడును సముద్రమున జనించినది సుప్రసిద్ధము.

టీక సారంగ॥ అహహా = ఆశ్చర్యము, చింతామణి సహజ = ఆంధ్ర శబ్ద చింతామణియను వ్యాకరణ శాస్త్ర స్వభావముచేత, హారివగుచు నలరి = మనోజ్ఞమైన వాఁడవై ప్రకాశించి వాగనుశాసనీయులగు సిసుంయందున్ = నన్నయభట్టు సంబంధులగు శిష్యులయందున, సు = శ్రేష్ఠమైన, కలా = విద్యలచేత అన్విత = కూడుకొనినట్టి, ఆత్మఁదవనఁగన్ = హృదయముగల వాఁడ వనంగా, ఇంత వృద్ధి నొందినయట్టి = ఇంతగా నభివృద్ధిగాంచి నటు వంటి, నిన్నెన్నఁదరమె = నిన్ను వర్ణింప శక్యమగునా (కాదనుట), ని, సహ జస్తునిసర్గేస్యా త్స-శోర్థే పునరన్యవత్, అని విశ్వము, ఆత్మాయత్న ధృతిస్వా స్తస్వభావ పరమాత్మసు, జీవ బుద్ధి శరీరేషు, అని రత్నమాల.

క॥ సారంగధర సమాఖ్యా
సారంగధ రోపమాంగ ♦ సారంగధరో
దార విజయా యనంతా-
ధారాయని నిన్నునేఁస ♦ దా భణియింతున్ 88

టీక శివ, చంద్ర, సారంగధర కథలలో వరుసగా, సార ..... . మాఖ్యా = జింకలాల్వరి పేరి యో శంకరా, జింకలాల్వరి పేరి యో చంద్రా, సారంగధర నామము గలవాఁడా, శివ, సారంగధర కథలలో, సారం గధరోపమాంగ = చంద్రునకు సమానమైన దేహము గలవాఁడా, చంద్ర కథలో, శివునకు సమానమైన తెల్లని శరీరముగలవాఁడా, శివ సారంగధర కథలలో, సారంగధర = చంద్రునివంటి, ఉదార = దాతృత్వము గలవాఁడా, విజయా= మిక్కిలి జయముగలవాఁడా, చంద్రకథలో, సారంగధర = ఈశ్వరునివంటి,

ఉదార=అధికతరమైన, విజయా=విజయము గలవాఁడా, శివకథలో, అనంత=ఆదిశేషునకు, అధారా = ఆధరువైన వాఁడా, చంద్రకథలో, అనంత = ఆకాశమే, అధారా = ఆదరువుగాఁగలవాఁడా, సారంగధర కథలో, అనంతా = భూమికి, ఆధారా = ఆదరువైనవాఁడా, అని నిన్ను నేసదా భజియింతున్ = ఇట్లనుచు నిన్ను నేనెల్లప్పుడు. ధ్యానము సేయుదును. ని ఉదారో దాత్రి మహతోః, అనియును, అనంత శ్శేష విష్ణ్వోస్స్యా దనంతం సురవర్త్మని, అనంతా హైమవత్యాంచ గుడూచ్యాం చావనావపి, అనియును విశ్వము

వ॥ అని యిట్లుగ్గడింపుచుఁ దనకనులకుఁ బొడసూపి చనినట్లుండి యా దేవి సారంగధరుని వర్ణింపం దొడఁగె నది యెట్లన్నను                    84

టీక. సుగమము

క॥ శోకన్ గన్నులు వీనులఁ
దాకున్ హస్తములు సాచఁ • దగ మోకాళ్లన్
బ్రాకున్ శిఖ విడ మడిమల
సోకున్ నిలుచున్న నతని • సొగసే మందుఁగా ॥                    85

టీక సుగమము

చ. మలిచిన యట్టులున్నది సు • మా పిఱు దాతని కండ్లుఁదీర్చిన
ట్టుల నలరెన్ బలే యెద ప • టుత్వముఁ గాంచినఁ బోత బోసి న
ట్టుల నెసలార నౌర కస • టున్ విడ బొమ్మలుఁ జెంచు ముద్దు మీ
సలు మురి దిద్దినట్టుల నె సఁగె నరే హాయ లేమి సెప్పుదున్ ॥

టీక సుగమము

క॥ చేరెఁడు వెడలుపు కన్నులు
మూరెఁడు వెడలుపు నురంబు • మూపి ఎంద్రుపె ఎగా

బారెడు పొడవై కడు చ
న్నారెడు మహిళకును నలని ♦ నలవియె పొగడన్॥ 87

టీక సుగమము

క॥ విండ్లా భ్రూకుటిలములా
పండ్లా కుందములు తేనె ♦ పండ్లా నోడుగుల్
తూండ్లా హస్తంబులు వా
ల్గండ్లా కంజములు పిఱుఁదు ♦ గాండ్లాతనికిన్ ॥ 88

టీక శివకథలో, శివుఁడు సూర్య చంద్రాగ్ని లోచనుఁడైనందున కంజశబ్దము చంద్రాగ్నులయందున వర్తించుట చేతను, చంద్ర సారంగధరుల నేత్రములు పద్మములవలె నుండుటచేతను, వాల్గండ్లా కంజములని ప్రయోగింపఁబడినది.

గీ॥ నిజ శిఖాఽధః కృతైంద్రి గో ♦ పిత మధుఁడు
కరహసిత పద్మకాండుఁడు ♦ క్రమపాద
శమిత నలకూబరుం డౌట ♦ జగములందు
నిట్టి యతి సుందరాకారుఁ ♦ డెందుఁగలఁడు ॥ 89

టీక శివ, నిజశిఖా = తనసిగచేత, అధఃకృత, = క్రిందు పరుపఁబడిన, ఐంద్రి = ఇంద్రనందనుడైన జయంతుఁడు గలవాఁడని శాకువు, తన జడముడిచేత క్రిందుపఱుపఁబడిన మేఘము గలవాఁడని స్వభావార్థము, అనఁగా శంకరుండు పల్లజడలు గలవాఁ డగుట వలన మేఘము నుపమించుట విరోధార్థమౌ గాన వ్యోమ కేశుఁడనుటచే మేఘమండలమును క్రిందుపరచి దాటిపోయి గగనకేశుఁడైనాఁడని గ్రహించునది ఐంద్రి శబ్దము జయంతునకును మేఘమునకు చెల్లునమటకు, ని ఐంద్రిరంభో ధరే త్రిష్వో, అని విశ్వము, గోపిత = మాటలచేత జయింపఁబడిన, మధుఁడు = వసంతుఁడు గలవాఁడని

కాకువు, మాటలచేత జయింపఁబడిన తేనియగలవాఁడని స్వభావార్థము, కర = హస్తములచేత, హసిత = తిరస్కరింపఁబడిన, పద్మకాండుఁడు = కమలాస్త్రుఁడైన మన్మథుఁడు గలవాఁడని కాకువు, హస్తములచేత తిరస్కరింపఁబడిన తామరతూండ్లు గలవాఁడని స్వభావార్థము,. ని. కాండంనాళే శరస్కంధే బాణేఽవసర నీరయోః, అని విశ్వము, క్రమ = ఇంపైన, పాద = చరణములచేత, శమిత = తగ్గింపఁజేయఁబడిన, నలకూబసుందరు = కుబేరనందనుండైన నలకూబరుఁడు గలవాఁడని కాకువు, ఇంపైన పాదములచేత తగ్గింపఁజేయఁబడిన, నల = పద్మములయొక్క, కూబసుందు = సుందరము గలవాఁడని స్వభావార్థము. ని కమలేతు నళంమతమ్. అనియును, కూబరః కుబ్జే చారౌ, అనియును విశ్వము, ఔటన్ = అగుటవలన, ఇట్టి = ఇటువంటి యతిసుందరకారుఁడు = యతీశ్వరులవంటి మనోజ్ఞస్వరూపుఁడు, జగములందున్ = లోకములందున, ఎందుఁగలఁడు = ఎచ్చటనున్నాడు (శంకరుని వంటివాఁ డెందును లేడనుట).

అనఁగా జయంత వసంత మన్మథ నలకూబరులను సౌందర్యవంతులుగా వర్ణించుట కవిసమయ సిద్ధము గావున నీశంకరుఁడు తన సిగచేత జయంతుని, వాక్కులచేత వసంతుని, హస్తములచేత మన్మథుని, పాదములచేత నలకూబరుని, వంచించినవాఁ డగుటవలన నీతని యొక్కొక్క యవయవ సౌందర్యమే పైఁజెప్పఁబడిన జయంత వసంతాదులను మించియుండఁగా నింక నిటువంటి, అతి సుందరాంగుఁ డేలోకమునం దుండునని కాకువు తాత్పర్యము

టీక. చంద్ర॥ నిజశిఖా = చంద్రుఁడు తన సిగచేత, అధఃకృత = క్రిందు చేయఁబడిన, ఐంద్రి = జయంతుఁడు గలవాఁడని కాకువు. నిజశిఖా = తన కిరణములచేత, అధఃకృత=క్రిందు చేయఁబడిన, ఐంద్రి=మేఘము గలవాఁడని స్వభావార్థము (అనఁగా చంద్రుడు మేఘమండలమున కంటె పైభాగమున కిరణ ప్రసారము గలవాఁడనుట), గోవిజిత మధుఁడు = వాక్కు లి

చేత జయింపఁబడిన వసంతుఁడు గలవాఁడని కాదు, కిరణములచేత జయింప
బడిన క్షీరములుగల వాఁడని స్వభావార్థము (పాలవంటి తెల్లని కిరణములు గల
వాఁడనుట కరహసిత పద్మకాండుఁడు = హస్తములచేతఁ దిరస్కరింపఁబడిన
మన్మథుఁడు గలవాఁడని కాదు, కిరణములచేతఁ దిరస్కరింపఁబడిన తామర
తూండ్లు గలవాఁడని స్వభావార్థము (అనఁగా చంద్రోదయము కాఁగానే
తామరతూండ్లు వాడుట ప్రసిద్ధము), క్రమపాదశమిత నలకూబరుఁడు =
ఇంపైన చరణములచేత తగ్గింపఁజేయఁబడిన నలకూబరుఁడు గలవాఁడని కాదు,
ఇంపైన కిరణములచేత తగ్గింపఁజేయఁబడిన పద్మసుందరము గలవాఁడని స్వభా
వార్థము, ఔటన్ = అగుటవలన, ఇట్టి = ఇటువంటి, అతి సుందరాకారుఁడు =
మిక్కిలి మనోహరమైన రూపముగలవాఁడు, జగములందున్ = లోకముల
యందున, ఎందుఁగలఁడు = ఎచ్చోటనున్నాడు (అనఁగా లేడనుట), శిఖా
శబ్దము, సిగకును కిరణములకును చెల్లుననుటకు, ని శిఖా శాఖాయాం మయూఖా
యాం జ్వాలాయా మగ్రమాత్రకే, అనియును, గో శబ్దము, వాక్కునకును కిరణ
మునకును చెల్లుననుటకు, ని. గౌః స్వర్గే వృషభే రశ్మౌ భూవాగ్వారిషు
గౌర్మతా, అనియును, కరశబ్దము, హస్తమునకును కిరణమునకును చెల్లుననుటకు
ని కరో వర్షోపలే పాణౌ శుండా ప్రత్యాయ రశ్మిషు, అనియును, పాదశబ్దము,
చరణమునకును కిరణమునకును చెల్లుననుటకు, ని చరణేచ మయూఖేచ, అని
యును విశ్వము

టీక సారంగ॥ శివకథకు సమానము.

అనఁగా మేఘమును క్రిందుజేయు నల్లని సిగగలవాఁడును, తే
నెను జయించు తియ్యని మాటలుగలవాఁడును, తామరతూండ్లను తిరస్క
రించు కోమలమైన హస్తములు గలవాఁడును, పద్మమనోజ్ఞమును శమింప,
జేయు మృదుచరణములు గలవాఁడును, అగుటవలన లోక

ములలో నెందును నీతని బోలు నతిసుందరాంగుఁడు లేడని స్వభావార్థ తాత్పర్యము.

ఏ క పా ది

ఉత్సాహ॥ రాజరాజ భూతి మీఱు • రమ్య ధామసంపదన్
రాజరాజ భూతి మీఱు • రమ్య ధామసంపదన్
రాజరాజ భూతి మీఱు • రమ్య ధామసంపదన్
రాజరాజ భూతి మీఱు • రమ్య ధామసంపదన్॥ 91

టీక. శివ॥ రమ్య = ఒప్పిదమైన, ధామ = గృహముయొక్క, సంప దన్ = సంపత్తుచేత, రాజరాజ = కుబేరుని, భూతిన్ = ఐశ్వర్యమును, మీఱున్ = మించును, రమ్య = సుందరమైన, ధామసంపదన్ = శరీర సంపత్తుచేత (అనఁగా సౌందర్యముచేత ననుట). రాజరాజ = కుబేరునియొక్క, భూతిన్ = ఆత్మజుఁడైన నలకూబరుని, మీఱున్ = మించును, రమ్య ధామ సంపదన్ = మనోజ్ఞమైన కాంతి సంపత్తుచేత, రాజరాజ = చంద్రునియొక్క, భూతిన్ = ఐశ్వర్యమును (అనఁగా శుభ్రకిరణముల ననుట), మీఱున్ = మించును, రాజరాజ = ప్రభువులకు ప్రభువైన, భూతి = పుట్టువుగల శంక రుఁడు, రమ్య = మనోహరమైన, ధామసంపదన్ = ప్రభావసంపత్తుచేత, మీఱున్ = అతిశయించున్

టీక. చంద్ర॥ రాజరాజ = రాజరాజనునట్టి, భూతి = పుట్టువుగల చంద్రుఁడు, రమ్య = మనోజ్ఞమైన, ధామసంపదన్ = కాంతి సంపత్తుచేత, మీఱున్ = అతిశయించును, రమ్యధామ సంపదన్ = మనోహరమైన ప్రభావ సంపత్తుచేత, రాజరాజభూతిన్ మీరున్ = సార్వభౌమ నందనుని మించును. తక్కినవిషయము శివకథకు సమానము.

టీక. సారంగ॥ రాజరాజభూతి = రాజనరేంద్రుని కుమారుఁడైన

సారంగధరుఁడు, రమ్యధామ సంపదన్ = మనోహరమైన ప్రభావ సంపత్తు చేత, మీఱున్ = అతిశయించును, రమ్యధామసంపదన్ = మనోజ్ఞమైన జన్మ సంపత్తుచేత, రాజరాజభూతిన్ మీఱున్ = చక్రవర్తి కుమారుని మించును, తతిమ్మా విషయము శివకథకు సమానము, రాజరాజ శబ్దము కుబేర చంద్ర సార్వభౌములకు చెల్లుననుటకు. —ని రాజరాజః కుబేరేఽపి సార్వభౌమే సుధాకరే, అనియును భూతి శబ్దము పుట్టువునకుకు సంపదకును చెల్లుననుటకు, ని. భూతిర్మాతంగ శృంగారే జాతౌ భస్మనిసంపది, అనియును, ధామ శబ్దము, గృహ శరీర కాంతి ప్రభావ జన్మలకు చెల్లుననుటకు, ని. ధామ దేహే గృహే రశ్మౌ స్థానే జన్మ ప్రభావయోః, అనియును, విశ్వము.

గీ॥ మును పటాటోపమున కన్న • మూర్తి మించి
దినదినం బభివృద్ధిగాఁ • దనరుచుండె
నహహ సారంగధరునిఁ గ • ల్యాణమొందు
కలిమిచే కూడు టెన్నఁడో • గా యటంచు॥ ౪౹

టీక శివ॥ మునుపటి = ముందు తపస్సు జేయవచ్చి నప్పటి, ఆటోప మునకన్నన్ = సంభ్రమమునకంటె, మూర్తిమించి = శరీరమతిశయించి, దిన చుండెన్ = రోజునకొకదాయగా వృద్ధిగాంచి ప్రకాశింపుచుండెను, అహహ = ఆశ్చర్యము, సారంగధరునిఁ గల్యాణమున్ = శంకరుని వివాహమును, ఒందుకలిమి = వహించు భాగ్యము, చేకూడుట = హస్తగతమగుట, ఎన్నఁడోఁగా యటంచున్ = ఎప్పటికోగా యనుచును.

టీక చంద్ర॥ మునుపటి = ముందు సముద్రమునఁ బుట్టినప్పటి, పటా నహహ = ఉత్సాహమునకంటె దేహము మించిన దియై ప్రతిదినమభివృద్ధిగా చొప్పుచుండె నాశ్చర్యము, కళ్యాణమొందు కలిమిచే = శుభము నొసయు భాగ్యముచేత, సారంగధరునిన్ =

చంద్రుని, కూడుదెన్నండోగా యటందున్ = పొందుదెప్పటికో కదా యనుచును.

టీక. సారంగ॥ మును = ముందు, పటాటోపమున కన్నన్ = పటమునందలి యుత్సాహమున కంటె, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము, ముందరి పద్యముతో నన్వయము

గీ॥ నెఱుల జడ చుట్టఁ జుట్టియు • నిటలమందు
నసిత తిలకంబుఁ దాల్చి చె • న్నార చీరెఁ
గట్టి పావన సరములఁ • గైకొని వర
వర్ణిని తదేకదీక్ష భా • వమునఁ బూనె 92

టీక నెఱులజడ చుట్టఁ జుట్టియుఁ = జడయి గట్టిన చెంద్రుకలనుచుట్టఁ జుట్టినదియై, అని పార్వతికిని, కురులను జడ చుట్ట జుట్టినదియై అని తారాచిత్రాంగులకును అంతటనిట్లే గ్రహించునది, నిటలమందునన్ = నుదుటియందున, సిత తిలకంబుఁ దాల్చి = తెల్లనిబొట్టుబెట్టి (భస్మమననుట) అనియును, నిటలమందున్ = ఫాలమందున, అసితతిలకంబుఁ దాల్చి = నల్లని బొట్టుఁబెట్టి (కస్తురిననుట) అనియును, చన్ను + నార చీరెఁగట్టి = అందమైన నారచీరెఁ గట్టినదియై, అనియును, చెన్నార చీరెఁగట్టి = ఒప్పారునట్లుగా చీరెను గట్టినదియై, అనియును, చన్ను + నార, శబ్దము, మున్ను + నీరు, మున్నీరు, కన్ను + నీరు, కన్నీరు, మిన్ను + నాగు, మిన్నాగు, మొదలైన శబ్దముల వలె ప్రయోగింపఁబడినట్లు గ్రహించునది, పావన = రుద్రాక్షలయొక్క, సరములఁ = మాలికలను, గైకొని = కేలనందినదియై, అనియును, పావన = పవిత్రమైన, సరములన్ = హారములను, గైకొని = వహించి, అనియును, పావన శబ్దము రుద్రాక్షమనుటకు, శబ్దార్థచంద్రికలోఁ జూడనగును, వర =

శ్రేష్ఠమైన, వర్ణిని = యోగినియైన పార్వతి, అనియును, వరవర్ణిని = శ్రేష్ఠ మైన వర్ణముగలగి, అనియును, తదేకదీక్షణ = అసారంగధరుని విషయ మైన దీక్షను, భావమునఁ బూనెణ = హృదయమునందున వహించినదాయెను, పార్వతి తపస్వినియై యుండెఁ గావునఁ దచ్చిహ్నముల నొందెననిగ్రహించునది.

ఉ॥ సాకుడుఁ జిల్కలన్ బిలచి ♦ చక్కని మాటలు నేర్పుచుంటయు
నేకులఁ జేరి నాట్యములు ♦ నేర్పుచు నుంటయు రాజ హంసల
న్గైకొని మంజుయానములు ♦ నేర్పుచు నుంటయు నేమిటే సెనో
ఏకమతిన్ వహించి చెలి ♦ యేణధరున్ భజియించు నిచ్చలున్ ॥

టీక సుగమము.

ఉ॥ అంగన కీరికిక్కుమని ♦ యన్నఁ గురంగ ధరోక్తియంచు ను
ప్పొంగుచు నాలకించు నెటఁ ♦ బూరి పుటుక్కనినన్ బ్రియుండు వ
చ్చెంగదయంచు లేచఁ దన ♦ చెంత నెవేని తటుక్కు మన్న సా
రంగధరాంగ కాంతియని ♦ రంజిలి చూచు విరాళి యెట్టిదో ॥ 94

టీక సుగమము

ఆ॥వె॥ దేవి నీదుకోర్కెఁ ♦ దీర్చువా రెవరింత
హరమదేలనని వ ♦ యస్యలడుగ
ముదితలార సార ♦ ముఖవర్ణుఁడైన స
ద్వేషిభర్త తానె ♦ తీర్చుననును ॥ 95

అనఁగా నోదేవీ యింత హరయోగమును బూనియుండు టేటికి యిట నీకోర్కె దీర్చువార లెవరుగలరని పార్వతిని చెలికత్తియలడుగఁగా నో చెలులార, సారముఖవర్ణుఁడైన సద్వేషిభర్త, అనఁగా, = సార, అనునట్టి ముఖాక్షరములు గలవాఁడైన సద్వేషి భర్త, సార అను మొదటి యక్షరములవెంట సద్వేషి, భర్త, అను, వాక్యముఁ జేరఁగా, సారసద్వేషిభర్త, అని, యాయెను,

అనఁగా కమలవైరియైన చంద్రుని ధరించిన శంకరుఁడని యర్థము, అట్టి శంక రుఁడు తానే నాకోర్కెఁ దీర్చునని పార్వతి తన చెలికత్తియలకుఁ దెలిపెనని యును, తారా చిత్రాంగులు తాము వలచినవారల నట్లు వర్ణించుటకు వలనుగాక' సార ముఖవర్ణుఁడైన = రసమైన ముఖవర్చస్సుగల వాఁడగు, సద్వేషి = మంచివేషము గల్గిన, భర్త = పెనిమిటి,తానే నాకోర్కెఁ దీర్చునని బృహస్పతి రాజనరేంద్రులపై నర్థమును నిరూపించుచు, తాము వలచిన చంద్ర సారంగ ధరులు కోర్కెఁ దీర్చఁగలరను నర్థమిముడునట్లు భావగర్భితముగా వచించిరని యును, సార, అను మొదటియక్షరముల నెంట, సద్వేషిచేర్చఁగా, సారసద్వేషి యాయెను, అనఁగా పద్మవైరియైన చంద్రుఁడనుట,- భర్తతానె = నావల్లభుఁ డాతడే, నాకోర్కెఁ దీర్చునని తారయును, సార, అను మొదటియక్షరములు నామమునందునఁ గలవాఁడై నట్టి, సద్వేషి = మంచి వేషముగలవాఁడు (అనఁగా సారంగధరుఁ డనుట), ఈ నామములో ముఖాక్షరములు, సార, అనునవి గల వని గ్రహించునది. భర్తతానే = అతఁడే నాపెనిమిటి యగును, నాకోర్కెఁ దీర్చునని చిత్రాంగి పచియించెననియును తాత్పర్యము

సీ॥ కువలయానంద రు • గ్యుతభగద్గగిత చం
 ద్రకిరీట కలిత శి • రః ప్రదేశ
 నోపమానాగ్ని శి • ఖోపేత తిలక వి
 భాసిత నిర్మల • ఫాలభాగు
 నిర్మాల్య మణి సమ • న్విత సువర్ణాహీన
 హార విభూషిత • చారు వక్షు
 నుజ్జ్వలానంత మ • యూఖ వారణ కృత్తి
 ధాపళ్య వసనావృ • తావలగ్ను
గీ॥ నఖిల సద్గణనుత పాదు • నమృత ధాము
 మదనహిత పరచక్ర భీ • మస్వరూపు

రాజరా జాత్మహితుని సా • రంగధరుని
రాఁకకై వేచియుండె నా • రమణి నిష్ఠ॥ ౬౮

టీక. శివ॥ కువలయానంద = కలువలకు సంతోషమైన, రుక్ = కాంతులతో, యుత = కూడుకొనినట్టి, ధగద్ధగిత = ధగధగ వెలుఁగఁబడెడు, చంద్రకిరీట = చంద్రమకుటముచేత, కలిత = ఒప్పుచున్న, శిరః ప్రదేశున్ శిరస్థలముగలవాని యొక్కయు, న + ఉపమాన, నోపమాన = సమాన రహితమైన, అగ్నిశిఖా = అగ్నిజ్వాలలతో, ఉపేత = కూడుకొనిన, తిలక = బొట్టుచేత, విభాసిత = ప్రకాశింపఁబడిన, నిర్మల = కల్మషరహితమైన, ఫాల భాగున్ =నిటల ప్రదేశముగలవాని యొక్కయు, నిర్మూల్య = వెలలేని, మణి సమన్విత = రత్నములతో కూడుకొనిన, సువర్ణ = మంచి కాంతిగల, అహీన = ఆదిశేషుఁడనే, హార = సరముచేత, విభూషిత = అలంకరింపఁ బడిన, చారు వక్షు = మనోజ్ఞమైన రొమ్ముగలవాని యొక్కయు, శేషునకు పడగలయందున మణులుండుట ప్రసిద్ధము, ఉజ్వల = ప్రకాశమానమైన, అనంత = విష్ణునిచంటి, మయూఖ = కాంతిగల, వారణకృత్తి = గజచర్మ మనెడు, అధావశ్యవసన = నల్లనివస్త్రముచేత, ఆవృత = చుట్టుకొనఁబడిన, అవలగ్నున్ = నడుముగలవాని యొక్కయు, అఖిల = సమస్తమైన, సద్గణ = శ్రేష్ఠులైన ప్రమథులచేత, నుత = కొనియాడఁబడిన, పాదున్ = పాదములుగల వాని యొక్కయు, అమృతధామున్ = మృతముగాని శరీరముగలవాని యొక్కయు, మదసహిత = గర్వముతోకూడుకొనిన, పరచక్ర = శత్రు సమూహమునకు, భీమస్వరూపున్ = భయంకరమైన స్వరూపము గలవాని యొక్కయు, రాజరాజ = కుబేరునకు, ఆత్మహితుని = ప్రాణస్నేహితుని యొక్కయు, సారంగధరుని = జింకతాల్పరియైన శంకరుని యొక్కయు, రాఁకకై = వచ్చుటకొఱకు, ఆ రమణి నిష్ఠన్ = ఆవెలఁది దీక్షతోడ, వేచి యుండెన్ = కాచుకొనియుండినదాయెను

టీక చంద్ర॥ కువలయానంద = భూవలయమునకు సంతోషమైన, రుగ్యుత = కాంతులతో కూడుకొనిన, ధగద్ధగిత = ధగధగయని వెలుఁగుచున్న, చంద్రకకిరీట = బంగారుకిరీటముచేత, కలిత = ఒప్పుచున్న, శిరఃప్రదేశ = శిరస్థలముగలవాని యొక్కయు, నోపమాన = సమానరహితమైన, అగ్నిశిఖ= కుంకుమముతో, ఉపేత = కూడుకొనిన, తిలక = బొట్టుచేత, విభాసిత = మిక్కిలి ప్రకాశింపఁబడిన, నిర్మలఫాలభాగు = స్వచ్ఛమైన నిటలప్రదేశము గలవాని యొక్కయు, నిర్మూల్య = వెలలేని, మణిసమన్విత = రత్నములతో కూడుకొనిన, సువర్ణ=బంగారుయొక్క అహీన=హెచ్చైనట్టి, హార విభూషిత= సరులచేత నలంకరింపఁబడిన, చారు వక్ష = మనోజ్ఞమైన రొమ్ముగలవాని యొక్కయు, ఉజ్వలప్రకాశమైన, అనంతమయూఖ = ఆదిశేషునియొక్క కాంతులను, వారణ = నివారించుటయే, కృత్య = ప్రయోజనముగాఁగల, ధావళ్యవసన = తెల్లనివస్త్రముచేత, ఆవృత = చుట్టుకొనఁబడిన, అవలగ్న = మధ్యముగలవాని యొక్కయు, అఖిల = సమస్తమైన, సద్గణ = నక్షత్ర సముదాయముచేత, నుత = కొనియాడఁబడిన, పాదు = కిరణములుగలవాని యొక్కయు, అమృతధాము = అమృతమే శరీరముగా గలవాని యొక్కయు, లేక, అమృతమునకు నునికిపట్టయిన వాని యొక్కయు, మదసహిత = సంతోష ముతో కూడుకొనినట్టి, పర = ఉత్కృష్టమైన, చక్రి = జక్కవలకు, భీమ స్వరూపు = భయంకర స్వరూపముగలవాని యొక్కయు, రాజరాజాత్మహితుని = రాజరాజనే పన మిత్రునియొక్కయు, సారంగధరుని = జింకకాల్పరియైన చంద్రునియొక్కయు, రాఁకకై = ఆగమనముకొఱకు ఆ రమణినిష్ఠన్ = ఆ చేడియ దీక్షతోడ, వేచియుండెడి = కాచుకొనియుండిన దాయెను రాజరాజ శబ్దము చంద్రునియందు వర్తించునని గ్రహించునది

టీక, సారంగ ॥ అఖిల = సమస్తమైన, సద్గణ = సాధుజన స ముదయముచేత, నుత = కొనియాడఁబడిన, పాదు = పాదములు గలవాని

యొక్కయు, అమృతధాము = నశింపని ప్రభావముగలవానియొక్కయు, మదసహిత = గర్వముతో కూడుకొనిన, పరచక్ర = శత్రుసమూహమునకు, భీమస్వరూపు = ఈశ్వరస్వరూపము గలవాని యొక్కయు, రాజరాజాత్మ హితుని = రాజరాజుయొక్క మనస్సునకు హితమైనవాని యొక్కయు, సారంగధరుని రాకకై వేచియుండె నా రమణి నిష్ఠన్ = సారంగధరుడనే నామముగలవాని యొక్కయు రాకకొఱకై యాకొమ్మ దీక్షతోడ కనిపెట్టుకొని యుండినదాయెను, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము

ఆ॥వె॥ జయ భుజంగరాజ ♦ సారంగధృతి ప్రోవు
మనును దేవి చెలులు ♦ వినగ నిచట
నుదకజాత నయన ♦ మదనారి నను శంకి
వీడి ప్రోవుమనును ♦ విభుడు నచట॥ 97

అనగా నిచట పార్వతీదేవి యిహపరసౌఖ్యముల నొందగోరి యీశ్వరుని ధ్యానించుట స్వాభావికము గావున తన చెలికత్తియలు వినునట్లుగా, భుజంగ = సర్పమును, రాజ = చంద్రుని, సారంగ = జింకను, ధృతి = ధరించిన వాడవగు నో శంకరా, జయ = నేను పార్వతిని, ప్రోవుమనును = రక్షింపుమని వచియించుననియును, విభు శబ్దము శంకరునియందు వర్తించును గావున, అచట కైలాసమునందున నీశ్వరుడు, తాను సర్వజ్ఞుడై యుండి విరహముతో పార్వతిని ధ్యానముసేయుట పరిహాసభాజనంబని యెంచి తన చెలికాండ్రు వినునట్లుగా, ఉదకజాత నయన = ఓ కమలాక్షుడా, మదనారి ననుశంకవీడి = నేను నీ కుమారుడైన మన్మథునకు విరోధిననే సంశయమును మానుకొని, ప్రోవుమని విష్ణుపర్యాయముగా నర్థము ధ్వనించునట్లు తలంపుచు, ఉదకజాత నయన = ఓ కమలాక్షీ, మదనారి = మదయుక్తమైన యో నారీ నను శంకవీడి ప్రోవుమని పార్వతిని ధ్యానించుననియును, ఇంక తారయో, ఇచట తన చెలికత్తియలు

వినునట్లుగా పై విధముగనే యీశ్వరుని ధ్యానించున ట్లర్థము స్ఫురింపఁగాఁ దలంపుచు, జయ = జయమైన, భుజంగరాజ = విటనాయకా, సారంగ ధృతి = జింకతాల్పరియైన యో చంద్రుఁడా, నను బ్రోవుమని వచియించు ననియును, అచట నింద్రుని యజ్ఞమునందున విభుఁడనఁగా, తారకు భర్తయైన బృహస్పతి తన చెలికాం డ్రు వినునట్లుగా, ఉదకజాత = నీటిపాపయైన యగ్ని హోత్రుని, నయన = నేత్రముగాగలిగిన వాఁడా, మదనారి = మన్మథవిరోధి యైన యో శంకరా, నను సంశయము వీడి బ్రోవుమనిన ట్లర్థము స్ఫురింపఁగా తలంపుచు, నో కమలాక్షి యో మదయుక్తమైన కాంతా, నను సంశయమువీడి బ్రోవుమని తారను ధ్యానించుననియును, ఇఁక చిత్రాంగియో యిచట చెలికత్తె యలు, వినునట్లు పై విధముగనే యీశ్వరుని ధ్యానించురీతి నర్థము ధ్వనింపఁగా తలంపుచు, జయమైన యో విటనాయకా యో సారంగధరా నన్ను బ్రోవుమని వచియించుననియును, అచట వేటకేగిన రాజనరేంద్రుఁడు, అరణ్యమున తన చెలికాం డ్రు వినునట్లుగా పై విధముగనే యీశ్వరుని ధ్యానించున ట్లర్థము స్ఫురింపఁగా తలంపుచు నో కమలాక్షి యో మదయుక్తమైన కాంతా నను సంశ యము వీడి బ్రోవుమని చిత్రాంగిని ధ్యానించుననియును తాత్పర్యము. భుజంగ శబ్దము విటునకును సర్పమునకును చెల్లుననుటకు, ని. భుజంగ ష్షిడ్గ సర్పయోః అని విశ్వము.

గీ॥ అంత సారంగధరుఁడు మ • హానటుండు
గాన ముదమున కాటాడఁ • గాఁ దలంచి
పరగఁ బారిషదార్భక • వరు సుబుద్ధిఁ
గాంచి యిటువలె వచియింపఁ • గాఁ దొడంగె॥ 93

టీక. 'శివకథలో, పారిషదార్భకవరున్ = ప్రమథ బాలకులలో శ్రేష్ఠుని, చంద్ర సారంగధరకథలలో, రాజసభయందలి తగవరి కొడుకులలో నుత్తముని, శివచంద్ర కథలలో, సుబుద్ధిన్ = మంచి బుద్ధిగలవానిని, సారంగధరకథలో,

సుబుద్ధియను, పేరుగలవానిని, తతిమ్మా విషయము సుగమము

క॥ మీనాయన మతిమంతుం
డౌ నీవు సుబుద్ధివగుదు • చందున నీతో
నే నాటలాడః గోరిక
మానసమునఁ గలిగి మిత్ర • మా రమ్మంటిన్॥ 99

అనఁగా సారంగధర కథలలో మాత్రము సుబుద్ధియనువాఁడు మతిమంతుఁడనే మంత్రి కుమారుఁడని గ్రహించునది. తతిమ్మా విషయము మూఁడింట సమానము సుగమము

గీ॥ పూన్కి వినుమయ్య బాలక • ప్రోతపాళి
రసికుఁడవు గాన నటనకు • రంగమిదియె
యరసితే యాటలాడుదా • మనఁగ నాతఁ
డట్లె తోడ్పడ వానితో • నాడఁ దొడఁగె॥ 100

టీక శివ॥ బాలక = ఓ బాలుఁడా, ప్రోతపాళిన్ = ఈ బాలుర వరుస యందున, రసికుఁడవు గానన్ = రసికతగల వాఁడవు గాబట్టి, పూన్కిన్ = పట్టుదలతో, వినుమయ్య = ఓ యయ్యా యాకర్ణింపుము, నటన = నాట్యమాడు నట్టి, కురంగ మిదియె = జింకయియ్యదియె, అరసితే = చూచితివా, ఆటలాడుదా మనఁగన్ = ఈ జింకతో నాటాడుదా మటంచుఁ బలుకఁగా, అతఁడు = ఆపారిషదార్భకుఁడు, అట్లె తోడ్పడన్ = ఆ విధముగనే తోడ్పడఁగా, వానితోన్ = అతనితోడ, ఆడఁదొడఁగెన్ = శివుఁ డాటాడఁ దొడంగిన వాఁడా యెను. అనఁగా శివుఁడు జింకగాల్పరి గావున నా జింకను బట్టుకొని ప్రమథ బాలకునితో నాటలాడసాగెనని తాత్పర్యము.

టీక చంద్ర॥ శివపరకు సమానము.

టీక సారంగ॥ రసికుఁడవు గానన్ = రసికత గలవాఁడవు గావున, పూన్కిన్ = పట్టుదలతో, వినుమయ్య = ఓయయ్యా యాలకింపుము, బాల = పిన్నయగు, కపోతపాళిన్ = పావురములవరుసను, అరసి = కాంచిన వాఁడవై, తే = తీసుకొనిరమ్ము, నటనకు = ఆడుకొనుటకు, రంగమిదియె = నాట్యస్థాన మియ్యదియె, ఆటలాడుదా మనఁగన్ = ఆటాడు కొందామని వచియింపఁగా, అతఁడు = ఆ సుబుద్ధియనువాఁడు, అట్లె తోడ్తెచ్చెదన్ = పావురములను తీసుకొనివచ్చి యావిధముగనె తోడ్కొనుకొనఁగా, వానితోన్ = ఆ పావురములతోడ, ఆడఁదొడఁగెన్ = సారంగధరుఁ డాడుకొనసాగెను.

క॥ దిట్ట తనంబున నెగిరియుఁ
బట్టుకొనున్ బాఱఁదోలుఁ • బరుగెత్తినఁ దా
నట్టిటు మలుపుచు లగువులు
గొట్టించుఁ గపోతవితతిఁ • గొనిరాజింకన్॥ 101

టీక శివ చంద్రకథలలో, పోతవితతిఁ గొని = బాలుర సమూహమును వెంటఁగొనినవాఁడై, రాజింకన్ = కురంగరాజమును, లగువులు గొట్టించుఁగ = గంతులు వేయించునుగద, తతిమ్మా విషయము సుగమము

టీక. సారంగ॥ కపోతవితతిఁ గొని = పావురముల సమూహమును గైకొనినవాఁడై, లగువులు గొట్టించున్ = గంతులు గొట్టించును, రాజు = సారంగధరుఁడు, ఇంకన్ = మఱియును, ముందరి పద్యముతో నన్వయము, తతిమ్మ విషయము సుగమము

చ॥ కనికరమూని నిప్పు వడి • గాఁ బరుగెల్లఁగఁజేయు వెండి చ
క్కని కరమూని పట్టుకొను • గాసిలఁ జేసెదు చిక్కరాదు సి
కని కరమూని మింటికెగ • యన్ జెయిజాతె సటంచుఁదా వివే
క నికరమూని పైకెగసి • భ్రమ్మరఁ బట్టుఁ గపోతసంతతిన్॥

టీక శివ॥ వెండిచక్కని కరమూని = వెండివంటి సుందరమైన హస్తమును బూనుకొని చంద్ర వెండివంటి చక్కనైన కిరణమునూని సారంగ, మఱియుఁ జక్కనైన హస్తమును బూనుకొని, శివచంద్రకథలలో, పోతసంతతిన్ = బాలుర సముదయమునందున, క్రమ్మరఁబట్టుఁగ = మరలఁ బట్టుకొనునుగదా, సారంగధరకథలో, కపోతసంతతిన్ = పావురముల సముదయమును, క్రొమ్మెరఁబట్టున్ = మరలఁ బట్టుకొనును తక్కిన్న విషయము సుగమము ఈ పద్యమును పంచప్రాసముగా రచియింపఁ బడినట్లు గ్రహించునది

గీ॥ చటుల సారంగధరుఁడు స • న్నటన వితతి
హారి గురుహితసతి టెంకి • కరుగు దెంచఁ
దలఁచి సహచరులను క్రీడ • నిలుపుఁ డనుచుఁ
గూర్మిఁ గలకంఠిమన్ననఁ • గొనఁజనునెడ॥ 108

టీక శివ॥ చటుల = చలించునట్టి, లేక, అందమైనట్టి, సారంగధరుఁడు = జింకచాల్పరియైన శంకరుఁడు, సన్నటన వితతిహారి = మంచి యాటల సముదయమునందు మనోజ్ఞమైనవాఁడు, గురుహిత = మిక్కిలి ప్రేమగలదియైన, సతి = పార్వతీదేవియొక్క, టెంకి కరుగుదెంచఁ దలఁచి = ఉనికిపట్టున కేగనెంచినవాఁడై, సహచరులను = వెంట మెలఁగువారలను, క్రీడనిలుపుఁడనుచున్ = ఆటనాపుఁడటంచు, కూర్మిన్ = ప్రేమచేత, కలకంఠిన్ = అ యవ్యక్తమధురధ్వనియైన కంఠముగల పార్వతీదేవిని, మన్ననన్ = గౌరవముతో, కొనన్ = పరిగ్రహించుటకు, చనునెడన్ = పోవునప్పుడు, ఇఁక ముందరి పద్యముతో నన్వయము.

టీక చంద్ర॥ గురుహితసతి టెంకికరుగుదెంచఁ దలఁచి = బృహస్పతియొక్క హితురాలైన కాంతయొక్క యునికిపట్టున కేగనెంచినవాఁడై (అనఁగా తారయొక్క నివాసస్థలమున కనుట), కలకంఠి మన్ననఁగొనన్ = అ తారయొక్క సన్మానమును గైకొనుటకు, చనునెడన్ = పోవునప్పుడు.

టీ॥ సారంగ॥ సన్నుటనవితతిహారి = శ్రేష్ఠమైన క్రీడాపక్షి సముదయ మందలి మనోజ్ఞమైనట్టిది, (అనఁగా పావురములలో మేటియనుట) గురుహిత సతి = తండ్రియొక్క హితకాంతయైన చిత్రాంగి యొక్క, పెంకికరుగు దెంచన్ = నివాసస్థానమున కేగఁగా, చటుల సారంగధరుఁడు = అందమైన సారంగధరుఁడను వాఁడు, తలఁచి = యోచించి, సహచరులను క్రీడనిలుపుఁ డనుచు = వెంటమెలఁగు స్నేహితులనాటఁ జాలింపుఁడటంచు, కూర్మిన్ = ప్రేమతో, కలకంఠిన్=పినతల్లి యింటికేగిన యాడుపావురమును, మన్ననన్ = సన్మానముగా, కొనఁజనునెడన్ = గైకొనుటకుఁ బోవునప్పుడు

గీ॥ కాంచి తద్భావమెల్ల గ్ర • హించి దేవి
పూన్కి నెఱిఁగినయట్టి సు • బుద్ధి యొకఁడు
సరస కరుదెంచి సారంగ •ధరుని తోడ
నెసక మెసఁగెడు పలుకుల • నిట్టులనియె॥ 104

టీక శివ॥ కాంచి = చూచినవాఁడై, తద్భావమెల్ల గ్రహించి = అ శంకరుని యభిప్రాయమెల్లను తెలుసుకొని, దేవి పూన్కి నెఱిఁగిన యట్టి = పార్వతీదేవి పట్టుదల నెఱింగినటువంటి, సుబుద్ధియొకఁడు = మంచిబుద్ధి గల యొకానొకఁడు, సరసకరుదెంచి = చెంగటికి వచ్చినవాఁడై, ఎసక మెసఁగెడు పలుకులన్=అతిశయమై తనరునట్టి వాక్యములచేత, సారంగధరుని తోడన్= శంకరునితో, ఇట్టులనియెన్ = రక్షక్రిందఁ జెప్పఁబోవువిధముగా వచియించిన వాఁడాయెను

టీక చంద్ర॥ దేవి = తారాదేవియొక్క, తతిమ్మావిషయము శివ కథకు సమానము,

టీక సారంగ॥ దేవి = చిత్రాంగియొక్క, అనియును, సుబుద్ధి యొకఁడు = సుబుద్ధియను పేరుగలవాఁ డొక్కఁడు మాత్రము, అనియును, గ్రహించునది, తతిమ్మావిషయము పైవిధముననే

ఆ॥వె॥ కొమరు మించునట్లు • గురుసతి నీపైని
కోర్కెఁ బెంచుచుండెఁ • గువలయేశ
ఎపుడు నీదురాక • కెదురుచూచుఁ గృపాబ్ధి
నీదు గురుఁడు చెంత • నెఁసగకుండె 105

టీక శివ॥ కొమరు మించునట్లున్ = మనోజ్ఞమతిశయించినటులుగా, గురుసతి = ఘనురాలైన పార్వతీదేవి, నీపైనికోర్కెఁ బెంచుచుండెఁ = నీమీద వాంఛను వృద్ధిజేయుచుండిన దాయెను, కువలయేశ = ఓ భూవలయాదీశ్వరుఁడవైన శంకరా, ఎపుడు చూచున్ = నిరంతరము నీయాగమనమునకు నిరీక్షింపుచుండును, కృపాబ్ధిన్ = దయాసముద్రము నందున, ఈఁడు గురుఁడు = ఈఁతగొట్టు తండ్రియైన హిమవంతుఁడు, చెంతనెసఁగకుండెన్ = చెంగటఁ దనర్చకుండిన వాఁడాయెను (అనఁగా సమీపమున లేకుండెననుట)

టీక చంద్ర॥ కొమరుమించునట్లున్ =కుమారునికంటె హెచ్చగు విధముగా, గురుసతి = బృహస్పతి యిల్లాలైన తార, కువలయేశా = ఓకలువలరేఁడా, నీపైకోర్కెఁ బెంచుచుండెన్=నీమీద వాంఛతో సాకుచుండిన దాయెను, ఎపుఁడు చూచున్=నిరంతరము నీయాగమనమునకు నిరీక్షింపును, కృపాబ్ధి నీదుగురుఁడు = దయాసముద్రుఁడైన నీయుపాధ్యాయుఁడు (అనఁగా బృహస్పతి యనుట), చెంతనెసఁగకుండెన్ = సమీపమున లేకుండినవాఁడాయెను.

టీక సారంగ॥ గురుసతి =తండ్రి నీ యిల్లాలైన చిత్రాంగి, కృపాబ్ధి నీదుగురుఁడు = దయాసముద్రుఁడైన నీతండ్రి (అనగా రాజనరేంద్రుఁడనుట) తతిమ్మా విషయము శివకథకు సమానము

ఆ॥వె॥ ఇంట గురుఁడులేక ♦ యుంట నెఱింగి నీ
వరుగకున్న నామె ♦ యలుగునయ్య
వెగటుగలుగు పోవ ♦ నగునయ్య తడయక
యరుగుదెంచుమయ్య ♦ యనఁగ వినియు॥ 106

టీక శివ॥ ఇంటన్ = ఆ పార్వతి తపమొనర్చు నాశ్రమమునందున, గురుఁడు లేకయుంట నెఱింగియుఁ = తండ్రియైన హిమవంతుఁడు లేకుం డుట తెలిసినవాఁడవై యుండి (అనఁగా సర్వజ్ఞుఁడైనందుననునుట), నీవరుగ కున్నఁ = నీవేగకపోయినచో, ఆమె యలుగునయ్య = ఓ యయ్యా ఆయమ యలుకవహించును, వెగటుగలుగుఁ = వైరస్యము సంభవించును పోవఁ = నీవేగినట్లైతే, నగునయ్య = ఓ యయ్యా నవ్వును, తడయక = జాగుసేయక, అరుగుదెంచుమయ్య = ఓ యయ్యా యా పార్వతి కడ కేగుదెంచుము, అనఁగ వినియుఁ = ఇట్లు వచియింపఁగా సాంబమూర్తి విన్నవాఁడై, ముందరిపద్యముతో నన్వయము

టీక చంద్ర॥ గురుఁడు = బృహస్పతి, తతిమ్మావిషయము శివ కథకు సమానము

టీక సారంగ॥ గురుఁడు = నీ తండ్రియైన రాజనరేంద్రుఁడు, ఇంటఁ = గృహమునందున, లేకయుంట నెఱింగి = లేకుండుట తె లిసినవాఁడవై యుండి, అయ్య = ఓ యప్పా, నీవరుగకున్న నామె యలు గున = నీవు పోకపోయినంతనే యాయమ యలుకవహించునా, అయ్య = ఓ యప్పా, వెగటుగలుగుఁ = విరసమువచ్చును, పోవనగున = ఏగనొప్పునా, అయ్య = ఓ యప్పా, తడయక = ఆలస్యముచేయక, అరుగుదెంచుము = రమ్ము, అనఁగ వినియుఁ = ఇట్లని వచియింపఁగా విన్నవాఁడై

క॥ శోకఁ గలకంఠి మన్ననఁ
గైకొందుఁ సంతసింతుఁ ♦ గల్యాణంబున్

జేకొందు నేగుదెంతున్
నీకేటికి నిల్వుమింకఁ ♦ నేనేగవలెన్॥ 107

టీక శివ చంద్ర కథలలో, కలకంఠి మన్ననఁగై కొంధున్ = ఆ చేడియయొక్క సన్మానమును పరిగ్రహింతును, సారంగధరకథలో, కలకంఠిన్ = ఆడుపావురమును, మన్ననన్ = గౌరవముతో, కై కొందున్ = తీసుకొందును, శివ, కల్యాణంబున్ = పెండ్లిని, చంద్ర సారంగధర కథలలో, శుభమును, మిగతా సుగమము

గీ॥ నను సదీశ్వరుఁడనుట యా ♦ నాతి జగము
తల్లి యనుట ప్రసిద్ధమే ♦ యెల్లరి కని
గురుసతిని జేర సారంగ ♦ ధరుఁడు మారు
వేషియై యతిశృంగార ♦ వృత్తిఁజనియె॥ 108

టీక. శివ॥ నను సదీశ్వరుఁడనుట = నన్ను మహేశ్వరుఁ డను టయును, ఆ నాతిన్ = ఆ పార్వతియను చేడియను, జగము తల్లియనుట = లోకమాత యనుటయును, ఎల్లరికిన్ = సమస్తమైనవారలకును, ప్రసిద్ధమే = తెలిసిన విషయమే, అని = అటంచు, మారువేషియై = బదులు వేషమునుగలవాఁడై, యతి శృంగారవృత్తిన్ = యోగీంద్రునివంటి విలాస మైన నడవడిచేత, సారంగధరుఁడు = శంకరుఁడు, గురుసతిని జేరన్ = ఘనురాలైన పార్వతిని జేరఁగా, చనియెన్ = పోయినవాఁ డాయెను

టీక. చంద్ర॥ ననుసదీశ్వరుఁ డనుట = నన్ను నక్షత్రనాయకుఁడను టయును, అనియును, గురుసతిని జేరన్ = బృహస్పతి భార్య యైన తారను జేరఁగా ననియును, మారువేషియై = మన్మథునివంటి వేషముగలవాఁడై, అతి శృంగార వృత్తిన్ = మిక్కిలి విలాసమైన

నడవడిచేత ననియును మాత్రము భేదము, తతిమ్మా విషయము పై కథకు సమానము

టీక. సారంగ॥ నను సధీశ్వరుఁడనుట = నన్ను సాధుజన శ్రేష్ఠుఁడనుటయును, అనాతిఁ = ఆచేడియను, జగము = లోకము, తల్లియనుట = మాతయనుటయును, గురుసతిని జేరఁ = తండ్రియొక్క కాంతయైన చిత్రాంగిని జేరఁగా, అని మాత్రము భేదము, తతిమ్మా విషయము చంద్ర కథకు సమానము.

క॥ చని జేజేయన గురు సతి
గని దవ్వేదు రేగి తెచ్చి ♦ కడువడి జే జే
యనుచున్ గాంచన పీఠ
మ్మునఁ గూర్చుండఁగ నొనర్చి ♦ ముదముసఁ బలికెన్ ॥ 109

టీక జేజే = జయము జయమును దీవనకును, నమస్కారమునకును, చెల్లును, గురుసతి = శివ చంద్ర సారంగధర కథలలో వరుసగా, ఘను రాలైన పార్వతి యనియును, బృహస్పతి భార్యయైన తార యనియును, తండ్రి యైన రాజనరేంద్రుని భార్య యనియును, గ్రహించునది, తతిమ్మా విషయము మూడిఁట సమము, సుగమము

గీ॥ యుష్మదా గమనమున నా ♦ యునికిపట్టు
పరమ పావనమాయె నే ♦ భాగ్యరాశి
నైతి దివసమొ సుపవిత్ర ♦ మైనదాయె
నిఁకను మదభీష్టములు దీర ♦ వే సువర్ణి ॥ 110

టీక. శివ చంద్ర సారంగధర కథలలో వరుసగా, సువర్ణి = ఓ ఋషి శ్రేష్ఠుఁడా, ఓ మంచి బ్రహ్మచారి, ఓ మంచివర్ణముగలవాఁడా, తతిమ్మా విషయము మూడిఁట సమము సుగమము.

క॥ అని యెంతయు కొనియాడుచుఁ
దన చెలికత్తియలఁ జేరి ♦ తద్ఘనునకుఁ బూ
జన భోజన భాజనములు
సనువుగనిడి తనుపుఁడనుచు ♦ నానతిఁ జేయన్ ॥ 111

టీక సుగమము

శా॥ పన్నీటన్ జలకంబులార్చి విలసిం ♦ పన్ గావి వస్త్రంబులన్
జెన్నారంగను గట్టఁబెట్టి నుదుటన్ ♦ సిందూరముఁ బెట్టి మే
నన్నిండారఁగఁ జందనంబలఁది సూ ♦ నంబుల్ సిగన్ జేర్చి బల్
పొన్నుం బళ్లెమునన్ ఫలంబులిడఁగా ♦ భోంచేసి యున్నంతలోన్ ॥

టీక సుగమము

ఉ కమ్మని తమ్మలంబిడి సు ♦ ఖంబొదవన్ బొదలింట పుష్ప త
ల్పమ్మున నా సదీశ్వరు వి ♦ లాసముగా వసియింపఁజేసి పా
దమ్ముల నొత్తుచున్ సురటిఁ ♦ దద్దయు వీచుచు నున్న వేళ మో
దమ్మును జెంది దేవికి కృ ♦ తజ్ఞత సాధువరేణ్యుఁ డిట్లనున్ ॥ 113

టీక సుగమము.

ఉ॥ అంబిక యెద్దియో మదిని ♦ వ్యాకులతన్ గనినట్లు నీవు గా
నంబడు దేమికారణ మ ♦ నఁగ సరసన్ జెలులుంట దేవి తి
య్యంబుగ నోర్తుఁ దెల్పుటకు ♦ నై కనుసన్న యొనర్చె నంత వే
గంబున సాదు చంద్రమునిఁ ♦ గాంచి వయస్య తదాజ్ఞ నిట్లనున్ ॥

టీక శివకథలో, సాదుచంద్రమునిఁ గాంచి = సాధుశ్రేష్ఠునిగా వేషమూని వచ్చిన వానిని జూచి, చంద్రకథలో, సాధువైన చంద్రుని గాంచి, సారంగధరకథలో, సాధుజనులలో శ్రేష్ఠుఁడైన వానిని గాంచి, సరసన్ జెలులుంటన్, అనుటచే శివకథలో, చెంతనఁ జెలి

క్తియలుండుట వలన ననియును, చంద్ర సారంగధరుల కథలలో, చెలులు చెంతనుండుటవలన నిశాభిప్రాయమును దెలుపుటకు వీలుగాక యని గ్రహించు నది, తక్కిమ్మా విషయము సుగమము

గీ॥ వినవె యతిసుందరాంగ మా ♦ వెలఁది యీశుఁ
గాంచి కల్యాణమందఁగా ♦ నెంచి విభుని
దర్శనము లేక వ్యాకుల ♦ తఁగ వహించె
ననిన విని యుటి దేవి కి ♦ ట్లనియె నతఁడు॥   115

టీక. శివకథలో, యతి సుందరాంగ = ఋషివంటి మనోహరమైన శరీరముగలవాఁడా, ఈశుఁగాంచి కల్యాణమందఁగా నెంచి = శంకరుని బడిసి పెండ్లియాడఁగాఁ దలంచినదియై, విభునిదర్శనము లేక = శంకరుని గనుగొనలేక యనియును, చంద్ర సారంగధర కథలలో, అతిసుందరాంగ = మిక్కిలి మనోజ్ఞమైన శరీరముగలవాఁడా, భర్తను గనుఁగొని శుభముల నొందఁగాఁ దలంచినదియై నాథుని బొలుకువ కానరాఁక, అనియు నర్థము తక్కిమ్మా విషయము సుగమము

ఆ॥వె॥ ఈశుఁడేలరాఁడు ♦ యింతియే నాచింత
వచ్చులే తమిఁగొన ♦ వలదటంచు
దేవితోడ నాతఁ ♦ దేవియో యిటుకొన్ని
దెలుప వినియునామె ♦ చెలులఁగాంచి॥   116

టీక శివ చంద్ర సారంగధర కథలలో వరుసగా, ఈశుఁడేలరాడు = శంకరుఁ డెంటలకురాడు, నీభర్తయేలరాడు, ప్రభువేటికిరాడు (అనఁగా వచ్చు ననుట), శివకథలో, ఇంతియేనా చింత = ఇదియేనా నీవ్యాకులత్వము, చంద్ర సారంగధర కథలలో, ఇదియే నా వ్యాకులత్వముకూడా, వచ్చులే తమిఁగొన వలదు = శివకథలో రాగలఁడులే వచ్చినంతనె వానిని వలపుచే పరిగ్రహింప రాదు, చంద్ర సారంగధర కథలలో, రాగలఁడులే త్వరపడవలదు, అనియు

నర్థము, తక్కినవి విషయము సుగమము తమి, అనిన వలపునకు త్వరకుఁ జెల్లును

గీ॥ నే నితనితోఁ బ్రసంగింతుఁ • గాన మీర
లరుగుదెంచుఁ డటన్న వా • రట్లుసేయ
మదిని లజ్జనువిడి సుకు • మారుఁడైన
సాధుచంద్రున కిట్లు వా • స్తవముఁ బలికె॥ 117

టీక శివకథలో, అరుగుదెంచుఁడు = మీర లిటురండు, చంద్ర సారంగధర కథలలో, మీరలు వెళ్ళిపొండు, శివకథలో, సుకుమారుఁడైన సాధుచంద్రునకుఁ = కోమలాంగుఁడైనట్టి సాధువర్యునకు, చంద్రకథలో, కోమలాంగుఁడైన చక్కని చంద్రునకు, సారంగధరకథలో, మంచికొడుకైనట్టి సాధుజన శ్రేష్ఠునకు, అని యర్థము, తక్కినవి విషయము సుగమము, అరుగు దెంచుఁడను శబ్దము రమ్మనుటకును పొమ్మనుటకును చెల్లునని గ్రహించునది.

క॥ సారంగధరుని రతి నీఁక
వారకఁ గాంతుమని నాదు • పంచేంద్రియముల్
గోరుచు సారెకు సారెకుఁ
బ్రేరేపించు నిదె నా య • భిప్రేతమనన్॥ 118

టీక సుగమము, రతి శబ్దము శివకథలో ననురాగమునకును, చంద్ర సారంగధర కథలలో, సురతమునకును ప్రయోజనమగునని గ్రహించునది

ఉ॥ ఎంతటి నీచకార్యమున • కెందితి వేమె పరేతరాజుఁ గా
లాంతక నాముఁ డూష్ణరుధి • రాఖుఁడు పన్నగధారి భీమ వి
క్రాంత విరూపుఁ డుగ్రుఁడన • గా వినవే పసరంపు తేజి రా
తెంతయు నిన్నుఁగైకొని స • హించునె యేచునెకాని యంబికా॥

టీక శివ॥ అంబికా = ఓ పార్వతీ, ఎంత . వేమె = ఎటువంటి అధమమైనపనికిఁ దలంచితివేమిటే, పరేతరాజున్ = పిశాచ నాయకుఁడైన శంకరుని, కాలాంతక నాముఁడు = ప్రళయకాలము నందు హరించువాఁడనే పేరు గలవాఁ డనియును, ఉష్ణరుధిరాక్షుఁడు = వేడియైన యెఱ్ఱని కన్నులు గలవాఁడనియును (అనఁగా సూర్యాగ్నులు శివుని కన్నులే గాన నతని కన్ను లుష్ణముగా నెఱుపుగ నుండుననుట) పన్నగధారి = సర్పమును ధరించిన వాఁడనియును, భీమ విక్రాంత విరూపుఁడు = భయంకరమును విక్రమమునైన విరుద్ధరూపముగలవాఁడనియును, ఉగ్రుడు = ఉగ్రుఁడనేపేరు గలవాఁడనియును లేక దుస్సహుఁడైన వాఁడనియును, అనఁగా వినవే = ఇటువంటి వాఁడని పల్కు లోకుల వాక్యములు వినియుండలేదా, పసరంపుతేజిరౌతు = ఈ పసరము నశ్వముగా నెక్కితిరుగువాఁడు, నిన్నుఁగైకొనినన్ = నిను పెండ్లాడినచో, ఎంతయు = మిక్కిలి, ఏచునెకాని = బాధపెట్టునే కాని, సహించునె = ఓర్చియుండునా (ఉండఁడనుట)

టీక చంద్ర॥ అంబికా = ఓయమ్మా, ఎంతటి. ... .వేమె = ఎట్టిహీన కృత్యమునకుఁదలపడితివేమిటే. పరేతరాజున్ = యమధర్మరాజును, కాలాంతక నాముఁడు = కాల, అంతక నామములు గలవాఁడనియును, ఉష్ణరుధిరాక్షుఁడు = వేడియైన యెఱుపు కన్నులు గలవాఁడనియును, పన్నగధారి = నాగపాశములను ధరించినవాఁడనియును, భీమ విక్రాంత విరూపుఁడు = భయంకరమును విక్రమమునైన విరుద్ధరూపము గలవాఁడనియును, ఉగ్రుఁడు= ఉత్కటుఁడైన వాఁడనియును, అనఁగా వినవే = లోకులనుచుండఁగా వినలేదా, పసరంపుతేజిరౌతు = పసరమును గుఱ్ఱముగానెక్కి తిరుగు నీయముఁడు' నిన్నుగైకొనినన్ = నినుచేతఁజిక్కించుకొనినట్లైతే, ఎంతయున్ = మిక్కిలి' ఏచునెకాని = బాధపెట్టునే కాని, సహించునె = ఇట్టి చెడుతలంపుల నిన్ను సైచియుండునా (ఉండఁడనుట)

టీక సారంగ॥ చంద్రకథకు సమానము, పసరమనఁగా గోమహిషాదులకుఁ జెల్లునని గ్రహించునది. ఉగ్ర శబ్దము శివునకును, ఉత్కటుఁడైన వానికినిఁ జెల్లుననుటకు, ని ఉగ్రశ్శ్మ్వాదా సుతేక్ష్ర్తాచ్ఛ్రికంరే చోత్కటేఽన్యవత్, అని విశ్వము

మ॥ అన నాలించియు దేవి యిట్లనియె నా ♦ ర్యా నన్ బరేతేశుఁడే
చునె సారంగధరుండె పో వరదుఁడం ♦ చున్ ధీమణుల్ బల్కుటె
ల్లను వ్యర్థములె యెంతొ భీతిలఁగఁబ ♦ ల్కన్ బాడియే భూరిపా
వనమౌనీ శివసంగమంబె మది కై ♦ వల్యంబుగా నెంచితిన్॥ 120

టీక శివ॥ అన నాలించియున్ = అని పల్కఁగా వినినదియై, దేవి యిట్లనియెన్ = పార్వతి యీ క్రిందఁజెప్పఁబోవు విధముగాఁ బల్కినదాయెను, ఆర్యా = ఓ పూజ్యుఁడా, నన్‌బరేతేశుఁడేచునె = నన్ను భూతేశుఁడైన శంకరుఁడు బాధపెట్టునా, సారంగధరుండె పోవరదుఁడంచున్ = వరము లొసంగువాఁడు శంకరుఁడేపో యటంచు, ధీమణుల్ బల్కుటెల్లను వ్యర్థంబులె = బుద్ధిశాలులు బల్కుటంతయును నిరర్థకములగునా, ఎంతో భీతిలఁగఁబల్కన్ బాడియే=మిక్కిలి భయముఁజెందునట్లుగా వచియింప న్యాయమా, భూరిపావనమౌనీ = అధిక పవిత్రుఁడవైన యో మౌనీ, మదిన్ = నాహృదయమునందున, శివసంగమంబె = శంకరుని కూటమియె, కైవల్యంబుగా నెంచితిన్ = మోక్షముగాఁ దలచినదాననైతిని.

టీక చంద్ర॥ నన్ బరేతేశుఁడేచునె = నన్ను యముఁడు దాధపెట్టునా, భూరిపావనమౌ = మిక్కిలి పవిత్రముగునట్టి, నీ = నియొక్క, శివసంగమంబె మంగళకరమైన కూటమియే, తతిమ్మా విషయము శివకథకు సమానము

టీక సారంగ॥ చంద్రకథకు సమానము.

చ॥ అనవిని యాతఁడిట్లనియె • నంబిక నీదు ప్రసిద్ధకీర్తి కీ
పనితగ దాపరేతపతి • పాలఁబడన్ బగవారికైన వ
ద్దనునెడ నింక నేమనునొ • యంచుఁదదుక్తులు మాన్పదేవి యొ
య్యన దరికేగ నాతఁడు ని • జాత్మను గన్పరచెన్ యథాస్థితిన్॥

టీక. శివ॥ అనవిని = అని పార్వతీదేవి పల్కఁగా నాలకించి, ఆతఁడిట్లనియెన్ = ఆ బైరాగి యీవిధముగా వచించినవాఁడాయెను, అంబిక = ఓ పార్వతి, నీదు ప్రసిద్ధకీర్తి కీ పనితగదు = నీ యొక్క గణుతికెక్కిన యట్టి యశమున కీకార్యము తగినదికాదు, ఆపరేతపతి పాలఁబడన్ = ఆశంకరుని పాలిటఁబడఁగా పగవారికైన వద్దనునెడన్ = శాత్రువులకైన వలదను సమయమునందున, ఇంక నేమనునొయంచున్ = ఇట్లు నిరుత్సాహముగు రీతిగా నీశ్వరుని నిందించియేమి వచించునో యటంచు, తదుక్తులు మాన్పన్ = ఆ పల్కుల నాపునట్లు సేయుటకు, దేవి = పార్వతి, ఒయ్యనన్ = తిన్నగా, దరికేగన్ = సమీపమునకు నరుగఁగా, ఆతఁడు = ఆ బైరాగివేషమును బూని వచ్చిన శంకరుఁడు, యథాస్థితిన్ = ఎప్పటియట్లుగా, నిజ = స్వకీయమైన, ఆత్మన్ = శరీరమును, కన్పరచెన్ = కనుఁగొనఁ జేసినవాఁడాయెను (అనఁగా నిజరూపమును జూపినవాఁడాయెననుట)

టీక. చంద్ర॥ అంబిక = ఓ యమ్మా, ఆ పరేతపతి పాలఁబడన్ = ఆయముని పాలిటఁబడఁగా అనియును, ఆతఁడు = ఆ చంద్రుఁడు, నిజాత్మను = తన మనస్సును, యథాస్థితిన్ = ఎప్పటియట్లుగా, కన్పరచెన్ = కనుఁగొనఁ జేసినవాఁడాయెను, అనియును భేదము, తక్కిమ్మావిషయము శివకథకు సమానగము

టీక సారంగ॥ చంద్రకథకు సమానము

గీ॥ అంత సారంగధరు విమ • లాత్మ నరసి
దేవి వెఱఁగంది వెనుకకుఁ • బోవ లేక

ముందునకు నేగఁజాలక ♦ సందియమున
సిగ్గు దళుకొత్తఁగా వాని ♦ చెంతనిలచె॥ 122

టీక సుగమము

ఆ॥వె॥ రాజమించు మించు ♦ బోణి యాతని మేనఁ
బరగు ఛాయ చాయఁ ♦ బారఁ జూచి
హరి కుమారు మారు ♦ నిరసించునని మోహ
మందె నంత నంత ♦ రాత్మయందు॥ 123

టీక ఛాయఛాయన్ = కాంతిమైపునకు, హరికుమారున్ = ఇంద్ర తనూజుఁడైన జయంతుని, తతిమ్మావిషయము సుగమము (అనఁగా మన్మ థుఁడు నల్లనివాడని ప్రసిద్ధము గావున నీ సారంగధరుల వంటి దేహకాంతిలేని వాఁడని తిరస్కరించిరని గ్రహించునది

మ॥ చిగురుంబోఁడికి నష్టమై పులకరిం ♦ చెన్ రోమ సందోహముల్
గగురించెన్ భ్రమ కుద్భవించఁగుచయు ♦ గ్మంబుబ్బి పయ్యంటజా
ఱఁగనై కంచుక బంధమున్ బిగిసె ఘ ♦ ర్మంబుల్ లలాటంబునన్
దిగజాఱంగఁ దొడంగె నౌరె మదనా ♦ ర్తిన్ దాటఁగా శక్యమే॥

టీక సుగమము

అనఁగా నాదేవి లోకోత్తరుఁడైన సారంగధరుని సమీపమున కరిగి యాపాదమస్తాంత పర్యంతము దర్శించుటచే మొదట విస్మయమును పిమ్మట నిశ్చేష్టతయును తదుపరి లజ్జయును నటుపై మోహమును జెందినదిగా పైరెండు పద్యములతోఁ జెప్పబడి యీ పద్యమున లోకోత్తరుడైన సారంగధరుని స్పర్శనమున (అనఁగా గాలిబాఱిన మాత్ర ననుట) శరీరము పులకరించుట రోమ సముదయము గగురించుట భ్రమము జనించుట చనుంగవ యుబ్బొంగుట పయ్యె

దజాఱిపోవుట రవికముడి బిగువగుట నొసటఁ జెమ్మటజాఱుట మొదలైన విరహ వికారము లొదవిన దైనట్లు వివరింపఁబడినది. లోకోత్తరవస్తుదర్శనమువలన విస్మయంబును స్పర్శనాదులవలన రోమాంచమును సహజములే యనుట, ఇందు లకు. శ్లో లోకోత్తర పదార్థానామ పూర్వాలోకనాదిభిః। విస్తారశ్చేతసో యస్తు విస్మయ స్సనిగద్యతే। క్రియా స్తత్రాక్షి విస్తార సాధూక్తి పులకాదయః అని విస్మయలక్షణ తత్కార్య కారణములును, శ్లో॥ రోమాఞ్చో విస్మయోత్సాహ హర్షాద్యై స్తత్రవిక్రియాః। రోమోద్గమో ముఖోల్లాస గాత్ర సంస్పర్శనాదయః। అని రోమాంచ లక్షణ తత్కార్య కారణములు గావున నిచట కొన్ని కవి సమయసిద్ధములుగను మఱికొన్ని లోకానుభవ సిద్ధములుగను ప్రయోగింపఁ బడినవి యని గ్రహించునది

వ॥ అంత నాదేవి మూర్ఛవచ్చుటలు మాత్ర మాపుకొని తెప్పఱిలి మఱియును, 125

టీక సుగమము

చ॥ నగములయందు మంచుమల • నాఁగ మృగంబుల సింధురారి నా
నగములయందుఁ గల్పతరు • వట్టులఁ బుల్గులఁ దార్క్ష్యమట్లఁ బ
న్నగములయందు నెన్నఁగ న • నంతుఁడు నాన్ సొగసైన వేల్పుకూ
నగములయందు నింద్రజుఁడ • నం దగు నా సుమనోఽగ్రగణిన్ గనెన్॥

టీక నగములు = కొండలు, మంచుమల = హిమవత్పర్వతము, సింధురారి = సింహము, అగములు = వృక్షములు, పుల్గులు = పక్షులు, తార్క్ష్యము = గరుడపక్షి, అనంతుఁడు = ఆదిశేషుఁడు, వేల్పుకూన = దేవ బాలురయొక్క, గములు = గుంపులు, ఇంద్రజుఁడు = జయంతుఁడు, తక్కిన్న విషయము సుగమము

చ॥ కని చిఱునవ్వుమోములరఁ • గా నొకయించుక దాపుఁజేరి ప్ర
క్కను నిలుచుండి చక్కఁగను • గాజగమిట్ పులుపల్లనంగఁ బ

వన సరముల్ కుచద్వయము ♦ పైఁసను తాండవమాడఁ బైట రీ
వి సటిటు జాఱఁగా సురటి ♦ వీచుచుఁ డస్సఁగ వాని కిట్లనున్॥

టీక శివ॥ పావనసరముల్ = రుద్రాక్షమాలికలు, చంద్ర సారంగ
ధర కథలలో, పవిత్రమైన హారములు, తతిమ్మా విషయము సుగమము

గీ॥ ప్రియసఖా యిఁక మాటలు ♦ పెక్కులేల
కనికరంబూని నాయొక్క ♦ మనవి వినుము
నిన్నె నాప్రాణ విభునిఁగా ♦ నెన్నుకొంటి
నాలుఁగా ననుఁ గైకొని ♦ యేలఁగదవె॥ 128

టీక సుగమము

గీ॥ అనవుఁ డాలించి యాతఁడి ♦ ట్లనుచుఁ బలికె
దేవిరో యిటకే నరు ♦ దెంచినట్టి
కార్య మెయ్యదియో యెఱుం ♦ గ వదియేం
ఉడుగు మీ చింత నీ కుమా ♦ రుఁడను గాన॥ 129

అనఁగా శివకథలో శంకరుఁడో పార్వతీదేవీ నే నిచ్చటికి వచ్చినపని
యేదియో తెలుసుకొనవైతి వేటికి నిన్ను పెండ్లాడనే కదా యీ చింతమానుము,
నీకు మారుఁడనుగాన = నీకు మన్మథుఁడను గాకపోదునా, అనియును,
చంద్రకథలో చంద్రుఁడోతారాదేవి నేను వచ్చినపని యేదియైననది తెలుసు
కొనఁ జాలవైతివేల చదువుకొన వచ్చిన శిష్యుఁడను నీకొడుకునుగానా నాపైని
నీకోర్కె మానుకొను మనియును, సారంగధర కథలో, సారంగధరుఁడో
చిత్రాంగిదేవీ నేను వచ్చినపని యెఱుఁగవేల పావురమునకు వచ్చితిని నీకుమా
రుఁడ నౌదును గదా నాపైని కోర్కెమానుకొను మనియును పల్కెనని
తాత్పర్యము

క॥ అను సారంగధరున్ గ
న్గొని యాయెలనాగ యిటుల • నుడువఁగ సొగెన
మన మలరఁ బలికితివి నా
కును మారుఁడ వగుదు వనియె • కోరితి రాజా॥ 130

టీక. సుగమము

గీ॥ అటులఁ గాకున్న నినువీడ • నగునె యెందు
మనసు కుదిరిన వరుసలే • మానుకొందు
రజుఁడు సుతయగు వాణిఁ బెం • డ్లాడుచుండె
నీపటంబును గనుము స • దీశ యనిన 131

టీక. సుగమము

ఆ॥వె॥ వారి వరుసలెఱుఁగ • మా రమ్మ కలకంఠి
వేడ్క నొసఁగి నన్ను • వెనుక టట్ల
కరుణఁ జూడు మిపుడు • కల్యాణ మందుము
కలఁచి యాడనేల • నిలువఁ జాల॥ 132

టీక, శివ॥ కలకంఠి = ఓ యవ్యక్త మధురమైన కంఠస్వరము గల పార్వతీ, వారివరుస లెఱుఁగమా = ఆ సరస్వతీ బ్రహ్మల వరుసల నెఱుంగ కున్నామా, వేడ్కనొసఁగి = సంతోషమునిచ్చి, నన్ను వెనుకటట్ల కరుణఁ జూడుము = పూర్వము దాక్షాయణీ రూపమునందెట్లో యట్లే నన్ను దయతో వీక్షింపుము, ఇపుడు = ఈసమయమునందున, కల్యాణమందుము = పెండ్లిఁ జేసుకొనుము, కలఁచి యాడనేల = నన్ను సంక్షోభింపఁ జేయనేటికి, నిలవఁ జాలన్ = తాళఁజాలను, రమ్మ = రాగదవె.

టీక చంద్ర॥ మారమ్మ = తల్లికి బదులుగా నెంచదగిన యోతల్లీ, కలకంఠీ = అవ్యక్త మధురమైన కంఠస్వరముగల యో తారాదేవి, వారివరుస

తెలుఁగన్ = ఆ సరస్వతీ బ్రహ్మల వరుసల నేనెఱుంగను, వేడ్కనొసఁగి = సంతోషమునిచ్చి, నన్ను వెనుకటట్ల కరుణఁజూడుము = నన్ను పూర్వము వలెనే పుత్రవాత్సల్యమున దయతో వీక్షింపుము, ఇపుడు కల్యాణమందుము = నేడు శుభముఁగైకొనుము, కలఁచి యాడనేల = నన్ను క్షోభింపఁజేయ నేటికి, నిలవఁజాలన్ = ఈ కర్ణకఠోరమైన వాక్యములకు నేనుండఁజాలను

టీక సారంగ॥ మారమ్మ = ఓ మారుదల్లీ, వారివరున తెలుఁగన్ = ఆ సరస్వతీ బ్రహ్మల వావి నేనెఱుంగను, కలకంఠిన్ = ఆడు పావురమును, వేడ్కనొసఁగి = సంతోషముతో నిచ్చి, నన్ను వెనుకటట్ల కరుణఁజూడుము= నన్నిదివరకువలెనే పుత్రవాత్సల్యమున దయతోఁ గనుము, ఇపుడు కల్యాణ మందుము = నేడు శుభము గైకొనుము, కలఁచి యాడనేల = నన్ను సంక్షోభింపఁజేయ నేటికి, నిలువఁ జాలన్ = ఈ కర్ణకఠోరమైన వాక్యమును విని భరియించి యుండఁజాలను

వ॥ అనిన సారంగధరునకుఁ దత్కామిని యిట్లనియె 133

టీక సుగమము

ఆ॥వె॥ గురుఁడు లేని వేళ ♦ నరుగుఁ దెంచితి విది
మంచి యదనుకాదు ♦ మఱియొక తఱి
మమత నన్నుఁగొనఁగ ♦ మరలరా కల్యాణ
మొందఁ గలవు నీవు ♦ పొందఁ గలవు॥ 134

టీక శివ॥ గురుఁడు లేని వేళన్ = నా తండ్రియగు హిమవంతుఁడు లేనట్టి కాలమునందున, అరుగుదెంచితివి = వచ్చినవాఁడవైతివి, ఇది మంచి యదను కాదు = ఇయ్యది యుక్తమైన సమయము కాదు, మఱియొకతఱి = ఇంకొక సమయమునందున, మమతన్ =

మోహముచేత, నన్నుఁగొనఁగన్ = నను గైకొనుటకు, మరలరా = మళ్ళి రమ్ము, కల్యాణమొందఁగలవు = పెండ్లియాడఁగలుగుదువు, నీవు పొందఁగలవు = నీవు నన్ను కూడఁగలుగుదువు.

టీక. చంద్ర॥ గురుఁడు లేనివేళన్ = బృహస్పతి లేనికాలమందున, అరుగుదెంచితివి = వచ్చినవాఁడవైతివి, ఇది మంచి యదను = ఇయ్యది మంచిసమయమగును కాదు మఱియొకతఱి మమత నన్నుఁగొనఁగన్ = మోహముతో నన్నుఁగైగొనుటకు నింకొకప్పుడు మంచి సమయము కానేరదు, మరలరా = మళ్ళుమురా, కల్యాణ మొందఁగలవు = శుభము నొందఁగల్గుదువు, నీవు పొందఁగలవు = నీవునన్ను భోగింపఁగల్గుదువు

టీక సారం॥ గురుఁడు లేనివేళన్ = నీ తండ్రియైన రాజనరేంద్రుఁడు లేని సమయమునందున, తక్కిమ్మ విషయము చంద్రకథకు సమానము

ఆ॥వె॥ నేను వెగటునొదుఁ • గానీ గురు నధీన
మందు నెపుడు మెలఁగు • చుందుఁగాన
నతని కెఱుక పడని • యట్లు నినీగైకొనఁ
జాలనిపుడు దప్ప • చనుట యొప్ప॥ 185

టీక శివ॥ నేను వెగటునొదున్ = ఏను విరసమైన దాననొదును, కానీ = కానిమ్ము, గురు నధీనమందు నెపుడు మెలఁగుచుందుఁగానన్ = నా తండ్రియైన హిమవంతుని స్వాధీనమునందు నెపుడు వర్తించుదానను గావున, ఇపుడు = ఈ సమయమునందున, అతని కెఱుకపడని యట్లున్ = ఆ నాతండ్రికి తెలియనివిధముగా, నిన్గైకొనఁజాలన్ = నిన్ను చేకొనఁజాలను, తప్పచనుట = నీవు మీయింటికిఁబోవుట తప్పగునా, యొప్ప = లేక యొప్పగునా

టీక చంద్ర॥ నేను వెగటునొదుఁగా = నేను అసహ్యమైన దాన నొదునుగా, నీగురు నధీనమందు నెపుడు మెలఁగఁచుందుఁగానన్ = నీ యుపాధ్యాయుఁడైన బృహస్పతి స్వాధీనమునందెల్లప్పుడు వర్తించుదానను గాఁబట్టి, ఇప్పుడు దప్ప = ఈ సమయమునఁ దప్పమఱియొకప్పుడు, అతని కెఱుకపడని యట్లు = ఆయనకు తెలియకుండునట్లుగా, నిన్ గైకొనఁజాలన్ = నిన్ను చేకొనఁజాలను, చనుటయొప్పన్ = నీవు వెళ్ళుటయొప్పుకొనను, లేక, చనుట యొప్ప = పోవుట తగునా

టీక సారంగ॥ నీగురు నధీనమందున్ = నీ తండ్రియైన రాజనరేంద్రుని స్వాధీనము నందున, తఱిమ్మా విషయము చంద్రకథకు సమానము.

గీ॥ అనిన నెంతట నుడివిన • నాయెనంచుఁ
తరుణి కిట్లని సారంగ • ధరుఁడు పలికె
హరిసుతుని బాధలొంద నా • కగునె తగునె
ఏల యీలాటి నుడులు సాల్ • చాలునమ్మ॥ 136

టీక శివ॥ అనినన్ = ఈ ప్రకారముగా పార్వతి వచియింపఁగా, ఎంతటి నుడివిన నాయెనంచున్ = ఎట్టి మాటనాలింప నాయెనటంచు, సారంగధరుఁడు = జింకతాల్పరియైన శంకరుడు, తరుణికి = పార్వతియను చిన్నదానికి, ఇట్లని = ఈ విధముగా, పలికెన్ = వచియించినవాఁడాయెను, హరిసుతుని బాధలొందన్ = విష్ణుని కుమారుఁడైన మన్మథుని బాధలనొందఁగా, నాకగునె = నాకు శక్యమా, తగునె = ఒప్పునా, ఏల యీలాటి నుడులు = ఎందుల కిట్టి మాటలు, చాల్ చాలు నమ్మన్ = వలదువలదు నేనమ్మువాఁడను కాను

టీక చంద్ర॥ తరుణి పలికెన్ = తారయను చిన్నదానికి జింకతాల్పరియైన చంద్రుఁడీ విధముగా వచియించినవాఁడాయెను, హరిసుతుని

= సూర్యుని కొడుకైన యమునియొక్క, బాధనొందనాకగునె = వేదన లొందుటకు నేనర్హుఁడనా, తగునె = ఒప్పునా, అమ్మ = ఓ తల్లీ, ఏలయీలాటి నుడులు చాల్ చాలు = చాలుఁజాలు నెందుల కీలాటిమాటలు, తతిమ్మా విష యము పై కథకు సమానము

టీక. సారంగ॥ తరుణికి = చిత్రాంగి యను చిన్నదానికి, తతిమ్మా విషయము చంద్రికథకు సమానము

గీ॥ ఇచట నాకేమి పని నీవె ♦ యిటులఁ బలుక
నే నిదే పోవుచున్నాఁడ ♦ నెలఁత యని వి
రాన నొక యడుగిడిన సా ♦ రంగధరు ని
జాంతరమును గ్రహించి తా ♦ ననియె నిట్లు॥   187

టీక. శివ॥ సారంగధరు నిజాంతరమును గ్రహించి = జింకతాల్పరి యైన శంకరునియొక్క యంతరాత్మను దెలిసికొనినదియై, తతిమ్మా విష యము సుగమము.

టీక చంద్ర॥ శివకథకు సమానము.

టీక. సారంగ॥ సారంగధరు నిజాంతరమును గ్రహించి = సారంగ ధరు స్వకీయమైన కప్పుకొనువస్త్రమును తీసుకొని, తతిమ్మా విషయము సుగ మము ని అంతరంతు పరిధానే భేదే రంధ్రావకాశయోః, అని విశ్వము.

గీ॥ అలిగినాఁడ వొకో నిల్వు ♦ మరుగ వలదు
పెక్కు నుడులేల యిటకు నిం ♦ కొక్కసారి
రమ్ము నను బ్రేమతోడఁగై ♦ కొమ్ము సుమ్ము
మహిత కరయుత్తమాంగకు ♦ మార్గ రాజ॥   188

టీక శివ మహిత = శూలమును, కర = హస్తమందుఁగలవాఁడా! ఉత్తమాంగ = శిరమునందున, కుమారరాజ = బాలచంద్రునిఁగల యో శంకరా, అలిగినాడవొకో = కోపము వచ్చెనా యేమి, నిల్వుమరుగవలదు = పోవల దాగుము, పెక్కనుడులేల = ఎక్కువమాట లేటికి, ఇటకు నింకొక్కసారి రమ్ము = ఇచ్చోటికి మఱియు నింకొకమాటు దయసేయుము, ననుఁ బ్రేమతోడఁ గైకొమ్ము = నన్ను కృపతో చేకొనుము, సుమ్ము = చూడుము

టీక చంద్ర॥ మహితకర = గొప్పకిరణములు గలవాఁడా, ఉత్తమాంగ = శ్రేష్ఠమైనశరీరముగలవాఁడా, కుమారరాజ = బాలచంద్రుఁడా, ఇటకున్ = ఇచ్చోటికి, ఇంకొక్కసారి రమ్ము = ఇఁక నీయొక్కతూరి మాత్రము దయసేయుము, తతిమ్మావిషయము శివకథకు సమానము.

టీక సారంగ॥ మహితకర = మహత్తరమైన వాఁడా, ఉత్తమాంగ = శ్రేష్ఠమైన శరీరముగలవాఁడా, కుమారరాజ = ఓ యువరాజా, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము.

గీ॥ అట్లు రాకున్న నాకుఁ • బ్రాణాంతమగు న
టంచుఁ దలఁపుము నిన్ను గు • ఱించి కల్ల
లేని బల్ నుడుల్ మాయజ • మానునకును
దెలుపఁగా గల నినుఁ గడ • తేర్పఁ గలను॥ ౧౩౦

టీక శివ॥ అట్లు రాకున్న = ఆ విధముగా నీవు పోయితిరిగి రాక పోయినచో, నాకుఁ బ్రాణాంతమగు నటంచుఁ దలఁపుము = నేను చచ్చి పోవుదాన నని తెలుసుకొనుము నిన్ను గుఱించి = నీ విషయమై, కల్లలేని బల్ నుడుల్ = అబద్ధముగానట్టి మంచిమాటలు, మా యజమానునకును దెలు

పఁగా గలన్ = మాతండ్రికి నెఱింగింపఁగాఁ గలను, నిన్నుఁ గడతేర్పఁ గలను = నిన్ను మదనవేదననుండి రక్షింపఁ జాలుదును

టీక చంద్ర॥ అట్లు రాకున్నన్ = ఆ విధముగా మరలిరాక పోయి నటులైతే, నాకు బ్రాణాంతమగు నటంచుఁ దలఁపుము = నేను ప్రాణహాని నొందఁగలవాఁడనని యెంచుకొనుము, నిన్ను గుఱించి = నీ విషయమై, కల్లలేని = అబద్ధములైనప్పటికిని, బల్నుడుల్ = హెచ్చుమాటలు (అనగాఁ బాఢీలు, అనుట) మాయజమానునకును = నా భర్తయైన బృహస్పతికి, తెలుపఁగాఁ గలన్ = ఎఱిఁగింపఁగాఁ గలను, నినుఁగడతేర్పఁగలను = నిన్నంత మొందింపఁగాఁ గల్గుదును.

టీక. సారంగ॥ చంద్రకథకు సమానము.

గీ॥ అనినఁ దద్వాసమును వీడి • చని గురుసతి
నొడుగులకుఁ గడుంగడు సరి • పడక గేము
నందుఁ జిత్తజవేదనన్ • బొందుచుండె
నహహ సారంగధరుని • న్యాయ మదియేమొ॥ 140

టీక. శివ॥ అనినన్ = పార్వతీదేవి యిట్లు వచియింపగా, తద్వాసమును వీడిచని = అ పార్వతీదేవి నివాసస్థానమును విడిచిపోయినవాఁడై, గురు = అధికురాలైన, సతి = పార్వతీదేవి, నొడుగులకున్ = మాటలకు, కడుంగడున్ = అత్యధికముగా, సరిపడక = ఒప్పుగా నేరక, గేమునందు = తన కైలాసనిలయమునందున, చిత్తజవేదనన్ = మదనవేదనను, పొందుచుండెన్ = వహింపుచుండెను, అహహ = ఆశ్చర్యము, సారంగధరుని = జింకతాల్పరియైన శంకరుని యొక్క, న్యాయమదియేమొ = ధర్మమదియేమో కాని (అనఁగా బలాత్కరించియైనను పార్వతిని పరిగ్రహించు శక్తిగల శంకరుఁడు పార్వతి మఱియొకసారి రమ్మనినంతనే కైలాసమున కేగెను గావున నెంతటి న్యాయమూర్తియో కదాయని గ్రహించునది.)

టీక చంద్ర॥ అనినన్ = తార యిట్లు బల్కఁగా, తద్వ్యాసమును వీడిచని ॥ ఆ యింటిని విడిచిపోయి, నొడుగులకున్ = మాటలకు, కడున్ = మిక్కిలిగా, గడుసరి = ఆ చంద్రుఁడనే యసాధ్యుఁడు, పడకగీమునందున్ = పడకటింటియిందున, చిత్తజవేదనన్ = మదనవేదనతోడ, గురుసతిన్ = బృహస్పతి భార్యయైన తారను, పొందుచుండెన్ = భోగింపుచునుండినవాఁడాయెను, అహహా = ఆశ్చర్యము, సారంగధరుని = జింకతాల్పరియైన చంద్రునియొక్క, న్యాయమదియేమొ = అయ్యదియేమి ధర్మమోకా (అనఁగా గురుని భార్యను పొందుట యే ధర్మమున లేదనియనుట)

టీక సారంగ॥ అనినన్ = చిత్రాంగి యిట్లు బల్కఁగా, తద్వ్యాసమును వీడిచని = ఆ వస్త్రమును విడచిపెట్టిపోయి, గురుసతి నొడుగులకున్ = తండ్రి యిల్లాలైన చిత్రాంగి పల్కిన మాటలకు, కడుంగడు = అత్యధికముగా, సరిపడక = సరిపడినదిగాక, గీమునందున్ = తన యింటియందున, చిత్తజ = హృదయమందున జనించిన, వేదనన్ బొందుచుండెన్ = బాధను వహింపుచుండినవాఁడాయెను, సారంగధరుని = సారంగధరునియొక్క న్యాయమదియేమో = ధర్మమదియేమో కాని, అహహా = ఆశ్చర్యము, వాసము వస్త్రమనుటకు, ని. వాసో వస్త్రె నపుంసకమ్, అని రత్నమాల.

గీ॥ ఇటుల సారంగధరుఁ డుండె • నేమనందు
నల జగద్గురుఁడా సవ • నాచ లాగ్ర
సీమనుండియు మోహంబు • చేసురూప
తారఁ జిత్రాంగి సతి నిట్టుఁ • దలఁపఁదొడఁగె॥ 141

టీక శివ॥ ఇటుల . దుండెన్ = ఈ విధము శంకరుఁ డుండినవాఁ డాయెను, ఏమనందున్ = ఏమి జెప్పుదును, అల = ఆ యొక్క, జగద్గురుఁడు = లోకజనకుఁడైన శంకరుఁడు, ఆ సవనాచ

లాగ్రసీమనుండియున్ = ఆ వనయుక్తమైన పర్వతాగ్రప్రదేశమునను ండినవాఁడయ్యును (అనఁగా కైలాసమునందనుట), మోహంబుచే = వలపుతోడ, సురూప = మంచి రూపమునందున, తారన్ = తారయను నప్సరసవంటి దానిని, చిత్రాంగిన్ = అరుదైన శరీరము గలదానిని, సతిన్ = పార్వతీ దేవిని, ఇట్లుఁదలఁపఁ దొడఁగెన్ = ఈక్రిందఁజెప్పఁబోవు విధముగా స్మరింపఁ దొడంగినవాఁడాయెను.

టీక చంద్ర॥ అల = అయొక్క, జగద్గురుఁడు = లోకమునకన్నిటికి గురువైనవాఁడు (అనఁగా బృహస్పతియనుట), సవనాచలా = యజ్ఞభూమి యొక్క, అగ్రసీమనుండియున్ = అగ్రస్థానమునందునుండినవాఁడయ్యును' మోహంబుచే = వలపుచేత, సురూపతారన్ = మంచిరూపముగల తారాదేవిని, చిత్రాంగిన్ = చిత్రావయవములుగల దానిని, సతిన్ = తనయిల్లాలిని, ఇటుఁ దలఁపఁదొడఁగెన్ ఈ విధముగా స్తోత్రముసేయ యత్నించినవాఁడా యెను. పైచరణము సుగమము.

టీక సారంగ॥ అల = అ యొక్క, జగద్గురుఁడు = లోకమునకు పెద్దయైనవాఁడు (అనఁగా రాజనరేంద్రుఁడను రాజనుట), సవనాచలాగ్ర సీమనుండియున్ = వనయుక్తయైన పర్వతాగ్రభాగమునం దుండియును (వింధ్యపర్వతముననుట), మోహంబుచే = వలపుతోడ, సురూపతారన్ = మంచి రూపమునందున తార యను నప్సరసవంటి దానిని, చిత్రాంగిన్ = చిత్రాంగియను దానిని, సతిన్ = భార్యను, ఇట్లుఁ దలఁపఁదొడఁగెన్ = ఈ విధముగాఁ దలంచుకొనసాగినవాఁ డాయెను

సీ॥ ఏమందు నావింత • భామ పదాగ్రము
తొక్కు భూభృత్తును • టెక్కుమాన్పు
నేమందు నావింత • కోమలి గమన మిం
కొక్కు భూభృత్తును • టెక్కుమాన్పు

నేమందు నావింత ♦ యెలనాగ చనులు వే
　　యొక్క భూభృత్తును ♦ డెక్కమాన్ప
నేమందు నావింత ♦ యింతి వేనలి మఱి
　　యొక్క భూభృత్తును ♦ డెక్కమాన్ప

గీ॥ నహహ యేమందు నావింత ♦ యవయవమ్ము
లొక్కొకటె యిట్లు సేయుచు ♦ నున్న నొక్క
కడకు భూభృత్తునైనను ♦ గాని నన్ను
లేమ గెల్చుట యన నొక ♦లెక్క యగునె॥ 142

అనఁగా భూభృత్తు శబ్దము, ఆదికూర్మమునకును, దిగ్గజమునకును, పర్వతమునకును, ఆదిశేషునకును, రాజునకును, చెల్లును గావున వరుసగా' మీగాళ్ళ తొలికాలేటి యొక్కయు, నడక దిగ్గజము యొక్కయు, చనులు పర్వతము యొక్కయు, జడ ఆదిశేషునియొక్కయు, గర్వచేష్టనుమానునట్లుఁ జేయును, ఈ వైచిత్ర్యము నేమనందు నాశ్చర్యము ఈపె యొక్కొక్క యవయవము, ఈ లాగునఁ జేయుచుండఁగా, ఒక్క కడకు భూభృత్తునైనను గాని = ఒక్క దిక్కునకు భూభృత్తునైనప్పటికిని, అని శివరాజనరేంద్రులును (అనఁగా శివుఁడు, ఈశాన్యదిక్కునకును, రాజనరేంద్రుఁడు, రాజమహేంద్ర వరము దిక్కునకును భూభర్తలనుట), ఇఁక బృహస్పతియో, ఒక్క కడకు భూభృత్తునైనను గాని నన్ను, ఒక్క దిక్కునకైనను భూభర్తను గానటువంటి నన్ను, ఆ చేడియ జయించుటయనఁగా నొక లెక్కగానేరదని తాత్పర్యము.

సీ॥ మగువ నేత్రములను ♦ మత్స్యమైనను గాని
　　కొమిరె మీగాళ్లను ♦ కూర్మమైన
నారీలలామ వే ♦ నలిని భూభృతి యైన
　　నతి మధ్యమును పురు ♦ ష హరియైనఁ

తొయ్యలి నును పిఱుం • దు నల కాశ్యపియైన
నతివ చన్గవను వ • రారి యైనఁ
బొలఁతుక ముద్దుమో • మును రామరాజై నఁ
బ్రేయసి శక్తి భూ • రి బలుఁడైన

గీ॥ బోటి సుగుణము నెంతటి • బుద్ధుఁడైన
గరిత వాక్చాతురిని యెట్టి • కల్కియైనఁ
గేశవున కేని యించుక • కేర నగునె
అహహ భామావతార మే • మనఁగ వచ్చు॥ 148

టీక మగువ నేత్రములను = ఆచేడియకన్నులను, మత్స్యమైనను గాని = చేపయేనియు గాని, అని యర్థము, మత్స్యావతార మైనప్పటికిని, అని భావము, కొమిరె మీగాళ్ళను = ఆ చేడియ పదాగ్రములను, కూర్మమైనన్ = తాబేలైనను, అని యర్థము, కూర్మావతార మైనప్పటికిని యని భావము, నాతీలలామ వేనలిని = ఆ చేడియయొక్క జడను, భూభృతియైనన్ = అదిశేషుఁడైనను, అని యర్థము, వరాహావతార మైనప్పటికిని యని భావము, సతి మధ్యమును = ఆ చేడియ నడుమును, పురుషహరియైనన్ = మగసింహమైనను, అని యర్థము, నరసింహావతార మైనప్పటికిని యని భావము, తొయ్యలి నునుపిఱుందును = ఆ చేడియ మృదువైన పిఱుఁదును, అలకాశ్యపియైనన్ = ఆ భూమియైన నని యర్థము, కశ్యపుని కుమారుడైన యా వామనావతార మైనప్పటికిని యని భావము, అతివచన్గవను = ఆ చేడియ కుచద్వయమును, వర = శ్రేష్ఠమైన, అరియైనన్ = చక్రవాక పక్షియైనను, అని యర్థము, వర = రాజులకు, అరి = శత్రువైన పరశురామావతార మైనప్పటికిని యని భావము (అనఁగా పరశురాముఁ డిరువదియొక్క పర్యాయము రాజుల తలలు నరికి యాతలలచే స్వర్గమునకు సొపానములు గట్టినట్లు పురాణముల వలనఁ దెలియుచున్నది), పొలఁతుక ముద్దుమోమును = ఆ చేడి య

నగు మొగంబును, రామరాజై నన్ = మనోజ్ఞమైన చందమామయైనను, అని యర్థము, శ్రీరామరాజావతార మైనప్పటికిని యని భావము, ప్రేయసి శక్తి = ఆ చేడియ సామర్థ్యము, భూరిబలుడై నన్ = అధికబలముగలవాడైనను, అని యర్థము, బలరామావతార మైనప్పటికిని యని భావము, బోటి సుగుణము = చేడియ మంచిగుణమును, ఎంతటి బుద్ధుడై నను = ఎట్టి విద్వాంసుడైనను, అని యర్థము, ఎంత బుద్ధావతార మైనప్పటికిని యని భావము, గరిత వాక్చాతురిని = ఆ చేడియ వాచాలత్వమును, ఎట్టి కల్కి యైనన్ = ఎటువంటి వనిత యైనను, అని యర్థము, ఎంతటి కల్క్యవతార మైనప్పటికిని యని భావము, కేశవునకేని యించుక కేరనగునె=విష్ణువునకేనియును కొంచమైనఁ దిరస్కరింప నగునా (కాదనుట) అహహ = ఆశ్చర్యము, భామావతార మేమనఁగ వచ్చున్ = ఆ చేడియ యవతారము నెయ్యదియని వచియింప వచ్చును.

అనఁగా నీ చేడియ యొక్క నేత్రాద్యవయవములను మత్స్యాదులు తిరస్కరింపఁజాలవనియును. శ్లో, మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కల్కిరేవచ అనుటచే విష్ణుమూర్తి మత్స్యావతారాదిగా దశావతారము నెత్తినప్పటికిని యా చేడియ నేత్రాద్యవయవంబులను దిరస్కరింపఁజాలడనే తాత్పర్యము

క॥ హరి యగు నా కల్కి ముఖము
హరి యగు నా కల్కి నడుము • హరి యగు జడయున్
హరి యగు నా కల్కి నడుము
హరి వేరే కల్కిరూప • నగుచేల యిలన్॥ 144

అనఁగా హరి శబ్దము వరుసగా, చంద్రునకును చిలుకకును సర్పము నకును సింహమునకును విష్ణువునకునుఁ జెల్లును గావున నాకల్కి ముఖము చంద్రుఁడగు ననియును పల్కులు చిలుకయగుననియును జడ సర్పమగునని యును నడుము సింహమగుననియును స్వభావార్థమగుట వలన నాకల్కి ముఖాద్యవయవములు హరి వాచ్యము లగుచుండియును హరికి తనివిదీరక వేరుగా మోహినియను కల్కిరూపమిలపైఁ దాల్చుటేటికి, లేక కల్క్యవతారము దాల్చుటేటికి, లేక కల్క్యవతారము దాల్చుటేటికి, అని తాత్పర్యము

సింహావలోకనము

గీ॥ చను లురి నెలతొంకన మహా ♦ శంఖ లీల
కన మహాశంఖ లీలఁ బోల్ ♦ కంధరంబు
కంధరముఁ బోలుఁ జికుర శృం ♦ గార గరిమ
చికుర శృంగార గరిమఁ బోల్ ♦ చేడె చనులు॥ 145

టీక మహాశంఖలీల = ఆ చేడియయొక్క నొసటి విలాసము, లురి నెలతొంకు = పూవ చందురువంక, అనన్ = అనఁగా, చనున్ = ఒప్పును, కంధరంబు = ఆపెకంఠము, కనన్ = చూడఁగా, మహాశంఖలీలఁ బోల్ = అధికతరమైన శంఖ విలాసమును బోలును, చికురశృంగార గరిమ = ఆపె వెండ్రుకల శృంగారాతిశయము, కంధరముఁ బోలు = మేఘమును బోలును, చేడెచనులు = ఆ చేడియ స్తనములు, చికుర శృంగార గరిమఁబోల్ = కొండల శృంగారాతిశయమును బోలును, మహాశంఖము నొసలనుటకును, చికురము కొండ యనుటకును శబ్దార్థచంద్రికలోఁ జూడనగును

క॥ జవరాలిన్ గనఁ గ్రొన్నెల
స్తవములు నెన్నొసలి నెన్నొ ♦ సలిపి చరించున్
నవతెందుఁగాక కుందము
ధ్రువముగఁ బలువరుసఁ బలువ ♦ రుసలు నుతించుఁగా॥ 146

టీక జవరాలిన్‌గనన్ = ఆ కాంతనుజూడఁగా, క్రొన్నెల = బాల చంద్రుఁడు, నెన్నొసలిన్ = నెన్నుదుటిని, స్తవములు = స్తోత్రములు, ఎన్నొసలిపి చరించున్ = ఎన్నియో చేసి వర్తించును, కుందము = మొల్ల మొగ్గ, సవతెందుఁగాక = సమానమెంగుననన్ గానేరక, పలువరుసన్ = దంత పంక్తిని, ధ్రువముగన్ = వాస్తవముగను, పలువరుసలు = పెక్కుసారులు, నుతించున్ = స్తోత్రముజేయును

సీ॥ గోట మింటికి నెగ ♦ మీటెను తారను
    తొడఁ జఱచియు దూఁకి ♦ తునిమె రంభఁ
జమనే కదలకు మం ♦ చును నిల్పె నద్రికన్
    జెలఁగి గీటున నుంచెఁ ♦ జిత్రరేఖ
నొడల నెల్లెడల రా ♦ పిడిఁ జేసె హేమను
    చీరి మాటన పల్చ ♦ జేసె సుధను
హసియించి వెలిబుచ్చె ♦ నభినవ కౌముది
    నొగి నాసఁబట్టెఁ ది ♦ లోత్తమఁగని
గీ॥ కనుల బెదరించి వనముల ♦ కనిపె హరిణి
మొగముఁ జూపియు లేమి స ♦ ల్పె శశిరేఖ
సొరున నెదుర్చ నప్సర ♦ సలనె యిటుల
సలుపఁ బెఱలాపె సమమనఁ ♦ జాలు బెట్లు॥ 147

టీక సొరున నెదుర్చన్ = చక్కదనమునందు నెదురింపఁగా, తారను = తారయను నప్సరస్త్రీని, గోట మింటికి నెగమీటెను = గగనమున కెరిగిపోవునట్లుగా గోటఁ జిమ్మెనని యర్థము, నక్షత్రము గోటి మాత్రము సేయమికి గగనంబునఁ బడునట్లుగా నెగజిమ్మెనని భావము, నక్షత్రములు మింటనుండుట స్వభావమని గ్రహించునది, రంభన్ = రంభయను నప్సరసను, తొడఁజఱచియు దూఁకితునియెన్ = ఊరువున్ జఱచుకొని పైఁబడి భ్రుంచివైచెనని యర్థము,అనఁగా కుస్త్రీపట్టు వారలు తొడలుజఱచుకొనుట స్వభావ

మవి గ్రహించునది అరఁటిని నాతొడమాత్రముఁ జేయఁజాలవను సంజ్ఞనెఱిఁ
గింపఁగా తొడనుచేతఁ దట్టుచు సమీపించి త్రుంచివై చెననిభావము, అరఁటి నొక
గెలివేయుటతో నరికివేయుట స్వభావమని గ్రహించునది, అద్రికన్ = అద్రిక
యను, నచ్చరను, చను నే కదలకుమంచును నిల్పెన్ = తగునా కదలాడకు
మంచునిలఁబెట్టెనని యర్థము, పర్వతమును స్తనముచేతనే కదలకుండు మటంచు
నిలఁబెట్టెనని భావము, పర్వతములు కదలకుండ నుండుట స్వభావమని
గ్రహించునది, అద్రి యను శబ్దమునకు, అద్రికయని కప్రత్యయముఁ జేర్చుట
శాస్త్రసమ్మతమని తెలుసుకొనేది. చిత్రరేఖన్ = చిత్రరేఖయను నచ్చరను, చెలఁగి
గీటుననుంచెన్ = ఉత్సహించి గీతలో నిలబెట్టెనని యర్థము. చిత్రమైన
గీతను గీటునందుంచెనని భావము, రేఖ గీటుననుండుట స్వభావమని గ్రహించు
నది, హేమను = హేమయను నచ్చరను, ఒడలనెల్లెడల రాపిడిఁజేసెఁ =
దేహముచేత నంతటరాపాడెనని యర్థము, బంగారును నాశరీరముమాత్రము
జేయఁజాలవని యంతటను యొరపిడిఁజేసెనని భావము, బంగారు నొరుపు
బట్టుట స్వభావమని గ్రహించునది, సుధను = సుధయను నచ్చరను, చీరి
మాటన పల్చఁజేసెన్ = పిలిచి యొక్కమాటలోనే యవమానముఁజేసెనని
యర్థము, అమృతమును పిలిచి నామాటమాత్రము చేయఁజాలవని పలచబాఱు
నట్లుగాఁ జేసెనని భావము, అమృతము పలచగా నుండుట స్వభావమని
గ్రహించునది, అభినవకౌముదిన్ = అభినవకౌముది యను నచ్చరను, హాని
యించి వెలిబుచ్చెన్ = తిరస్కరించి వెలపలి కంపివేసెనని యర్థము క్రొత్త
వెన్నెలను నవ్వి నానవ్వుమాత్రము చేయఁజాలవని తెల్ల బాఱునట్లు చేసెనని
భావము. వెన్నెల వెల్లనైయుండుట స్వభావమని గ్రహించునది, తిలోత్త
మఁగని = తిలోత్తమ యను నచ్చరను జూచి, ఒగిన్ = క్రమముగా, నాసఁ
బట్టెన్ = ముక్కుఁబట్టెనని యర్థము, ఉత్తమమైన నువ్వుబువ్వునుజూచి నా
ముక్కు మాత్రము చేయజాలవను సంజ్ఞనెఱిఁగింప తనముక్కును తానే పట్టు
కొనియెనని భావము, ఒగిన్ = క్రమముగా అసన్ = అపేక్షను, పట్టెన్ =

పూనిన దాయెనని యర్థముండినందున, శ్రేష్ఠమైన నువ్వుబువ్వును జూచి ఫలించి యనుభవమునకు వచ్చునని యాసన్ బూనుట స్వభావమని గ్రహించునది, హరిణి = హరిణియను నచ్చరను, కనులబెదరించి, వనముల కనిపెన్ = కండ్ల బెదరించినదై యడవులపాలు జేసెనని యర్థము ఆఁడుజింకను నా కన్నుల మాత్రము నీ కన్నులు చేయఁజాలవని బెదరఁజేసి వనములకుఁ బాఱఁదోలెనని భావము, జింక లడవులయందు నుండుట స్వభావమని గ్రహించునది, శశిరేఖన్ = శశిరేఖయను నచ్చరను, మొగముజూపియు లేమిసల్పున్ = మోముఁజూపించి లేమిడిజేయునని యర్థము, చంద్రుని సౌందర్యమును ముఖమును జూపినదియై నా ముఖముమాత్రము చేయఁజాలవని లేమిడిఁజేయునని భావము, చంద్రసౌందర్య మమావాస్యనాడు లేమిడియగుట స్వభావమని గ్రహించునది, అప్సరసలనె యిటుల సలుపన్ = అచ్చరలను దేవాంగనలనే యీలాగునఁ జేయఁగా, పెఱలాపె సమమునఁజాలుటెట్ల = ఇతరు లావిడి సమానమని వచియించుట కెట్లు జాలుదును, రేఖయనిన సౌందర్యమనుటకు శబ్దార్థచంద్రికఁ జూడనగును.

గీ॥ పూపరాజా తరుణి ఫాల • మున్ జయింపఁ
గడఁగి యాపయి శృంగ భం • గమయి తలను
వంచిమును దీర్ఘముగనె ని • ల్వ మొగముఁగని
జడిసి వెనుకయ్యు వేణిలోఁ • బడియె నహహ॥ 148

టీక పూపరాజు = బాలచంద్రుఁడు, అతరుణి ఫాలమున్ జయింపఁ గడఁగి = ఆ చేడియ నుదుటిని గెల్చుటకు యత్నించి, ఆ పయిన్ = అటు మీదట, శృంగభంగమయి = అవమానమును పొందినవాఁడై, తలనువంచి = శిరమును వంచుకొని, మునుదీర్ఘముగనె నిల్వన్ = నిడుపుగానే ముందు నిల్చుటకు, మొగముగని జడిసి = ఆ చేడియ ముఖమును జూచి భయపడి,

పూర్వదిశన నుదయించినవాఁడు వెనుకభాగమైన పడమరదిశకు తిరిగినవాఁడై, అహహ=ఆశ్చర్యము, వేణిఁబడియెన్=అనేకనదుల కూడికయైన సముద్రము లోనఁబడినవాఁడాయెను, అనియును, శృంగభంగమయి,అనుటచే కొమ్ములవలె నుండు రేఖలు భంగమైనవాఁడై (అనఁగా పూర్ణిమ చంద్రుడై యనుట), తలను వంచి యనుటచే యుదయాద్రినుండి యెగు మొగముతో వచ్చువాఁడు నడిరాత్రి నుండి తలను వాల్చినవాఁడై, మొగముఁగని జడిసి = ఆ చేడియ ముఖమును జూచి పూర్ణిమచంద్రుఁడనై గూడ యీపె ముఖముతో సమానముగాక పోతినని భయపడి, వెనుకయ్యెన్ = ఆపె ముఖవర్చస్సునకు వెనుకబడినవాఁడై వేణిలోఁబడియెన్ = సముద్రములోఁ బడినవాఁ డాయెననియును, పూపరాజు, అనుశబ్దములో నాద్యక్షరమున నొక కొమ్మును, అంత్యాక్షరమున నొక కొమ్మను గలిగియుండెను, గాన, అపయి శృంగ భంగమయి, అనుటచే, అ మీదటి యక్షరమున కుండిన కొమ్ముమాత్రము నశించినవాఁడై, తలనువంచి యనుటచే ( ˇ ) ఈ విధముగా పై కెత్తుకొనియుండిన తలకట్టును (—) ఈ విధముగా వాల్చినవాఁడై, మునుదీర్ఘముఁగనెన్ = ముందుండిన (ా) ఈలాటి దీర్ఘము పొందెను (అనఁగా (పూ) అను నక్షరమునకు శృంగభంగము కావడముతోడనే కొమ్మునకుండిన దీర్ఘముకూడా నశించెనుగాన మరల ముందుం డిన దీర్ఘమును వహించెననుట) ఇట్లు వహించుటతోడ, పూపరాజు, అను శబ్దము, పాపరాజు, అని యాయెను, పాపరాజు, అనఁగా పాములకు రాజైన యాదిశేషుఁడని యర్థము, నిల్వ మొగముఁగని జడిసి = అతఁ డాపె ముఖ మునుగాంచి నిల్చుటకు భయపడి, వెనుకయ్యెన్ = వెనుకకు తిరిగినవాఁడై, అహహ = ఆశ్చర్యము, వేణిలోఁబడియెన్ = జడచేత లోఁబడినవాఁ డాయె ననియును, పూపరాజు శృంగభంగమైనందున పాపరాజగుటచే, తలను వంచి = ఫణమును వాల్చినవాఁడై, మును = ఆ స్త్రీకి ముందుభాగ మున (అనఁగా కడుపుపై నూగారునకు సమానమగుట కనుట)

దీర్ఘముగనె = నిడుపుగానె, నిల్వన్ = నిలుచుటకు, మొగముఁగని జడినీ= ముఖాక్షరముఁజూచి భయపడి, అనఁగా పూపరాజునకు శృంగభంగమాయెనే నా కేమగనో యని యనుట వెనుకయ్యెన్ =నూగారునకు వెనుదీసినవాఁడై, వేణిన్ – ఆపె జడచేత, లోఁబడియెనహహ = ఆశ్చర్యము లోకువయైనవాఁడాయెను, అనియును భావము, వేణియను శబ్దము, అనేక నదుల కూడికయైన స్థలమనుటకు, ని వేణీ కచస్య బంధస్యా న్నదీనాం మేళకేపిచ, అని విశ్వము.

గీ॥ భ్రమరకము లాశ్రయుంచియు ♦ శ్రమము లిడుట
జలజ మీయింతి ముఖమయ్యె ♦ నైపలేక
ఇచట భ్రమరకములె యాశ్ర ♦ యించియుండె
సరసమగు చోట నాశ్రితుల్ ♦ బరగు టరుదె॥ 142

టీక. భ్రమరకము లాశ్రయించియున్ = తుమ్మెదలు నిరంతరము నాశ్రయించుకొని యుండి, శ్రమము లిడుటన్ = నాళములలోఁ జొచ్చి మధుపానము చేయుట మొదలైన బాధలఁ బెట్టుచుండుట చేత, నైపలేక = ఓర్చుకొని యుండఁజాలక, జలజము = పద్మము, ఈ యింతిముఖమయ్యెన్ = ఇచ్చటనైన నీ బాధ తొలఁగునేమో యని యీ చేడియయొక్క ముఖముగానైన దాయెను, ఇచట భ్రమరకములె యాశ్రయించి యుండెన్ = ఆ చేడియ ముఖమైనప్పటికి నిచ్చోటనుకూడా భ్రమరకములె యాశ్రయించి యుండినవాయెను (భ్రమరకములనఁగా ముంగురు లనుట), ముఖమును ముంగురు లాశ్రయించుకొని యుండుట స్వభావమని గ్రహించునది, సరసమగుచోటన్ = మనోహరమైన స్థలమందున, ఆశ్రితుల్ బరగుటరుదె = ఆశ్రయించుకొని బ్రతుకువార లొప్పుచుండుట యాశ్చర్యమా (కాదనుట), రసమనఁగా మధురసమును శృంగారరసమును గావున సరసమగుచోట ననుటచే, పద్మము మధురస యుక్తమైన స్థలమును, స్త్రీ ముఖము శృంగారరస యుక్తమైన స్థలమును, అగుటవలన తుమ్మెదల యర్థము

ను గల్గిన భ్రమరకములు పద్మములను, ముంగురుల యర్థముగల్గిన భ్రమరకములు స్త్రీల ముఖములను, ఆశ్రయించుకొని వృద్ధిఁబొందుట యాశ్చర్యము కానేరదని తాత్పర్యము. ని భ్రమరకో జలేభృంగేగిరికే చూర్ణకుంతలే, అని విశ్వము

మ॥ సొగసౌ కన్నుల నెంచ శంఖ సహవా • సుల్ గాన పద్మంబులౌ
జగతిన్ గంధవహంబుఁ బూని కనుటన్ • సారంగ నేత్రంబులౌ
తగులీలన్ శ్రుతులంది భాసిలుట మ • త్స్యస్వాములౌఁ గాన నీ
చిగురుంబోఁడిని సార్థకంబుగను రా • జీవాక్షి నాన్ బాగగున్॥

టీక సొగసౌ కన్నుల నెంచన్ = ఆ చేదియయొక్క శృంగారమైన నేత్రములను వర్ణింపఁగా, శంఖ సహవాసుల్ గాన = నొసటి యెముకతో కూడనుండునవి గావున, పద్మంబులౌన్ = కమలములగును, కమలములును కొలనులలో శంఖములతో కూడ నుండునవియగుటవలన శంఖసహవాసిత్వము కన్నులకును పద్మములకును గల్గుటచే యీపె కన్నులు పద్మములే యగునని గ్రహించునది, జగతిన్ = లోకమును, గంధవహంబుఁ బూని కనుటన్ = ఆ బిడ నేత్రములు ముక్కును వహించి చూచుటవలన, సారంగనేత్రంబులౌన్ = జింక కన్నులగును, జింకకన్నులును, గంధవహంబుఁ బూని యనఁగా వాయువును పైనిడుకొని చూచుచుండుటవలన గంధవహంబుఁ బూని కనుటలు, ఈపె కన్నులకును జింకకన్నులకును గల్గుటచే యీపె కన్నులు జింక కన్నులే యగునని గ్రహించునది, వదిగల జింకత త్తడినెక్కు నెఱరౌతు, అని యాంధ్రనామ సంగ్రహమగుటవలన జింక, వాయుదేవునకు వాహనమనుట సుప్రసిద్ధము, తగులీలన్ = ఒప్పైన విధముగా, శ్రుతులంది భాసిలుటన్ = ఈపె కన్నులు చెవులనంటి ప్రకాశించుటవలన, మత్స్యస్వాములౌన్ = మీన రాజులగును, మత్స్యస్వామియును, శ్రుతులనఁగా వేదముల నందుకొని ప్రకాశించుట వలన, శ్రుతులంది భాసిలుట యీపె కన్నులకును మత్స్యస్వామికిని

గల్గుటచే యీవిధ కన్నులు మత్స్యావతారములే యగునని గ్రహించునది, వేదములను దొంగిలించుకొనిపోయి సముద్రములో దాగిన సోమకాసురుని మత్స్యావతారమున విష్ణువు సంహరించి వేదములందుకొని వచ్చి బ్రహ్మకిచ్చుట పురాణ ప్రసిద్ధము, కాని = కావున, ఈ చిగురుంబోడిని = ఈ కోమలాంగినిని, సార్థకంబుగను = అర్థయుక్తమగునట్లుగా, రాజీవాక్షినాన్ బాగగన్ = రాజీవాక్షియన్నచో బాగుగానుండును

అనఁగా నీ చేడియకన్నులు పద్మములుగా నుండుటవలన పద్మాక్షి యనియును, జింకకన్నులుగా నుండుటవలన హరిణాక్షి యనియును, చేపలుగా నుండుటవలన మీనాక్షి యనియును పిలుచుటకంటె రాజీవశబ్దము పద్మముల యందును, జింకల యందును, చేపల యందును వర్తించును గావున రాజీవాక్షి యనినచో యీ మూడర్థములు గల్గి సార్థకమై బాగుగానుండునని తాత్పర్యము. ని రాజీవాఖ్యా మృగే మత్స్యే పద్మే రాజోపజీవిని, అని విశ్వము.

ఆ॥వె॥ సుదతి వేణిఁ గెల్వ • నెదిరించి నీలంబు
పూరిఁ గఱచె పాము • పుట్టనెక్కె
భ్రమరకము ప్రదక్షి • ణముఁ జేసె మేఘంబు
వెల్లబాఱి పాఱె • వెరచి కాదె॥ 151

అనఁగా నిర్వురు వీరులు గెల్పునకై యొండొరు లెదుర్కొని పోరుచు నందొకరు ప్రాణభీతిగల్గి బ్రతికిపోవుట కపేక్షించి పూరిగఱచినను పుట్టనెక్కినను ప్రదక్షిణము జేసినను పాఱిపోయినను వానిజోలికి పోక వదలివేయ వలయునని యుద్ధవీరుల ధర్మమగుటవలన నీ చేడియయొక్క జడను జయించుటకు తార్కొని భయపడి గదా నీలము పూరిఁగఱచెననియును పాము పుట్టనెక్కెననియును తుమ్మెద ప్రదక్షిణము జేసెననియును మేఘము తెల్లబాఱి పాఱిపోయెననియును తాత్పర్యము

ఇంద్రనీలము తృణగ్రాహిగాన గడ్డిపోచను జూపినచో పట్టుకొనుటయు పాము పుట్టనెక్కుటయు తుమ్మెద ప్రదక్షిణముగాఁ దిరుగుటయు మేఘము వెల్లఁబాఱి పాఱిపోవుటయు స్వభావములని గ్రహించునది

ఆ॥వె॥ హస్త మూలములగు • హస్తిశిరోగ్రము
లమృత నిలయములగు • నల ఘటములుఁ
జనుల కేమి మేము • జతయను జగడంబు
గుదియ నీపెఁ గుంభ • కుచ యనఁదగు॥ 152

అనఁగా నాచేడియ కుచములు హస్తమూలము లగుటవలన (హస్తములకు మొదటనుండునవి యగుటవలన ననుట), ఏనుంగుల నెత్తిపైభాగములు మేమును హస్తమూలముల మగుదుము (తొండములకు మొదటనుండు నట్టిదుల మగుదుమనుట) గావున నామె చనులకు సమానము మేమేయనియును, ఆ కొమ్మ స్తనములు, అమృతనిలయము లగుటవలన (పాలకు నివాసస్థానము లగుటవలన ననుట) కడవలు మేమును, అమృతనిలయముల మగుదుము (నీళ్ళకు నివాస స్థానముల మగుదు మనుట) గావున నామె చనులకు సమానము మేమేయనియును, జగడంబు గుదియననుటచే, పెట్టుకొన్న కలహము తగ్గిపోవునటుల, లేక యధిక గర్వము తగ్గిపోవునట్లుగా కుంభశబ్దము గజకుంభస్థలములకును కడవలకును చెల్లును గాన నీవిదను కుంభకుచయనుట యొప్పునని తాత్పర్యము. ని. కుంభస్స్యా త్కుంభకర్ణస్య సుతే వేశ్యాపతౌ ఘటే, రాశిభేదే ద్విపాంగేచ. అని విశ్వము

చ॥ కడిమిని ద్రొక్కు నద్దమగుఁ • గంధరమంచును భీతిగట్టి లీ
పడఁతి కుచంబులై పెరుఁగఁ • బయ్యెద డాగియు నిక్కి చూడఁగా
నుడుగక కంధరంబటనె • యుండె నటుండక యెంత లౌనొకో
గడుసుల దంబు వల్కు బడి • గల్గిన వారల క్రందసాగునే॥ 153

టీక కంధరము = మేఘము, కడిమిని = ప్రయత్నముతో, త్రొక్కన్ = పైఁబడి యణఁగఁ ద్రొక్కను, అడ్డమగున్ = పైకి పెరుఁగఁ బోవఁగా నడ్డమువచ్చును, అంచున్ = అటంచు, భీతిన్ = భయముతో, గట్టులు = పర్వతములు, ఈ పడఁతి కుచంబులై = ఈ చేడియ స్తనములై, పయ్యెద డాగియున్ = పైఁట కొంగుక్రింద డాగికొని, పెరుఁగన్ = పెరుగుటకు, నిక్కిచూడఁగా = తొంగిచూడఁగా, ఉడుగక = ఎల్లప్పుడును, కంధరంబటనె యుండెన్ = అచ్చటనే కంధరంబుండిన దాయెను (కంధరమనగా కంఠరమనుట), అటుండక యెంతలౌనొకో = అట్లుండక పోయినచో నింకన్ స్తనములెంతవియగునోకా, గడుసులడంబు = కఠినులయొక్క డంబము, పల్కుబడి గల్గిన వారల క్రిందసాగునే = మాట చెల్లుబడిగలవారల క్రిందసాగునా (సాగనేరదనుట)

అనఁగా కంధరము (మేఘమనుట) పైఁబడి త్రొక్కను, అది తప్పించుకొని పైకి పెరుఁగఁబోవఁగా పైన నడ్డమువచ్చును, అనే భయముతో పర్వతము లీయింతి కుచములై పెరుగుటకు పైటక్రింద దాగి నిక్కిచూడఁగా అచ్చటను కంధరమే యుండెను (కంఠర మనుట). అట్లు కంధరభయమే లేక పోయినచో నింతటి చనులిఁక నెంతటివి యగునోకా, అనియును, గడుసులు, అనుటచే పర్వతములు కఠినములే, స్త్రీ స్తనములు కఠినములే యగుననియును, పల్కుబడిగల్గిన వారలనుటచే, మేఘము పల్కుబడి గలదియే యగుననియును, కంఠరము పల్కుబడి గలదియే యగుననియును, క్రిందననుటచే, మేఘము క్రింది పర్వతము యొక్కయు, కంఠరము క్రింది స్తనములయొక్కయు డంబము సాగనేరదని తాత్పర్యము.

మ॥ చెలి నూగారున కుద్దిరాఁ దలఁచి దా • శ్లిష్యత్ భుజంగంబు తోఁ
గలహంబూని కలన్ ఫణిన్ గెల్వఁ గి • న్కన్ జీమలన్ దోలి పు

ట్టలఁ బామాక్రమణంబుఁ జేసుకొనెఁదో • దక గుంపులై వచ్చి చీ
మ్మ లహిఁ జావఁగఁబట్టి చీల్చుఁ జనదీ • మాత్సర్య మేనాటికిన్॥

టీక. దాట్టిమల్ = దాలైన చీమలు (అనఁగా చీమలబారనుట, భుజంగంబులోన్ = సర్పముతో, చెలి నూగారున కుద్దిరాఁదలఁచి = ఆ చేడియ రోమరాజికి సమానము వచ్చుటకు నెంచినవియై, కలహంబూని = జగడము బెట్టుకొని, కలన్ = నలుపునందున, ఫణిన్ గెలువన్ = సర్పమును గెల్చుటవలన, కిన్కన్ = కోపముతో, చీమలన్ దోలి = పిపీలికములను బారఁదోలి, పుట్టలన్ = అవి నివసించు పుట్టలను, పాము = సర్పము, ఆక్రమణంబుఁ జేసుకొనెన్ = ఆక్రమించుకొని యుండెను, చీమలు పెట్టిన పుట్టలు • బాముల కిరవైనయట్లు, అని సుమతిశతకము, తోడన్ గుంపులై వచ్చి = వెంటనే గుంపులుగా వచ్చినవియై, చీమలు =పిపీలికములు, అహిన్ జావఁగఁబట్టి చీల్చున్ = సర్పమును చచ్చునట్లుగాఁ బట్టుకొని చీల్చి వేయుచుండును, బలవంతమైన సర్పము • చలిచీమల చేతఁజిక్కి చావదె సుమతీ, అని ప్రయోగము, ఏనాటికిన్ = ఎప్పటికిని, ఈమాత్సర్యము = ఈపగ, చనదు = తగదు, లేక, పోనేరదు

మ॥ ఘన భారంబిట మాటిమాటి కొదవం • గా శూన్య మైనానటం
చు నభం బియెలనాగ కౌ నయిన ని • చ్చోనింకొకం దెచ్చి టీ
లని మాడ్కిన్ సహజస్థితిన్ జఘన భా • రంబౌచు శోషిల్లె నెం
దునుజన్నన్ ఘనభార వాహులనె పూ • నున్ భారముల్ దొల్తసూ॥

టీక నభంబు = ఆకాశము, ఘనభారంబిట మాటిమాటికొదవంగాన్ = ఇచ్చట మేఘభారము సారెసారెకుఁ గల్గుచుండుటచేతనని యర్థము, గొప్ప భారమిచ్చోట తేపతేపకు గల్గుచుండుటచేతనని భావము, శూన్యమై నాచు =

శూన్యనామము గలదాననైనానని యర్థము, లేమిడి నొందినదాననైతి నని భావము, అటంచున్ = ఇట్లనుకొని, ఈ యెలనాగ కౌనయినన్ = ఈ చేడియ నడుముకాఁగా, ఇచ్చో నింకొకండెచ్చి = ఇచ్చట నింకొకటి హెచ్చినదియై, తీఱనిమాడ్కిన్ = ఎడబాటు లేని విధముగా, అనఁగా మేఘభారమొకానొకప్పడు గల్గునుగాని యీ భారము నిరంతర ముండునది యనుట, సహజస్థితిన్ = తోడనే పుట్టినయునికిచేత నని యర్థము, సహ = కూడుకొన్న, జస్థితిన్ = జ, అను నక్షరముయొక్క యునికిచేత నని భావము, అనఁగా మేఘము గగనమునకంటె వెనుక సృజింపఁబడినది కాని యిది తోడనే పుట్టెనని తెలుసుకొనేది, జఘనభారంబౌచున్ = పిఱుఁదుయొక్క భారము వొదముచు, శోషిల్లెన్ = కృశించినదాయెను, అనఁగా నాకసముగా నుండినప్పుడు, ఘనభారము గల్గుచుండఁగా నీచేడియ నడుమైనచో ఘనభారము తప్పునేమో యనుకొన్న నిచ్చట నింకొక యక్షరము హెచ్చైన జఘనభారము గల్గి కృశించెనని గ్రహించునది, ఎందును జన్నుఁ ఎచ్చటికి పోయినప్పటికిని, భారములు = బరువులు, ఘనభారవాహులనె పూనున్=గొప్పబరువు మోయువారలనే పొందుచుండును, తొల్తసూ = మొదటనే సుమా యని యర్థము, జఘనభారమనే శబ్దము మొదట, జ, అను నక్షరము నెక్కువగా నుండుటఁ జూడుమని భావము, గగనమును మేఘము వ్రేలాడి యిగ్గుచుండుటచేతను స్త్రీ మధ్యమును పిఱుఁదు వ్రేలాడి యిగ్గుచుండుటచేతను, భారములని గ్రహించునది.

చ॥ అలరఁగఁ గృష్ణవేణికడ • నప్పులు గైకొనియున్ హరించి యీ
చెలి కటిరూపమున్ గొనియుఁ • జీలము చాటున దాత్రిడాగినన్
దొలఁగక కృష్ణవేణి తన • తోడనెవచ్చియుఁ వాక సాగె నెం
దుళ్లఁ జని దాగియుండినను • తొల్గఁగ నౌనె ఋణానుబంధముల్ ।-

టీక ధాత్రి = భూమి, అలరఁగన్ = ఒప్పునట్లుగా, కృష్ణవేణి కడన్ = కృష్ణానది చాపున, అప్పులు గైకొనియుఁ = ఉదకములు దీసుకొని యని యర్థము, బాకీలుదీసుకొని యని భావము, హరించి = దిగ మ్రింగినదియై, ఈ చెలికటిరూపముఁ గొనియున్ = ఈ చేడియ పిఱుఁదు రూపమును వహించినదియై, చేలము చాటునన్ = వస్త్రము చాటునందున దాగినన్ = దాగికొని యుండినప్పటికిని, అనఁగా భూమియప్పులను మరల నీయక దిగమ్రింగి మారువేషమును బూని ముసుగువేసుకొని మొకము జెల్లక దాగి యుండెనని గ్రహించునది, తొలఁగక = అపసరిల్లక, కృష్ణవేణి = కృష్ణవేణి యనునట్టిది (నల్లని జడయనుట), తనతోడనె వచ్చియుఁ దాకసాగెన్ = తన వెను వెంటనే వచ్చి తాకసాగిన దాయెను (నాపేరిటివారి యప్పులు నాకుఁ దెమ్మని తాకసాగెననుట), ఎందులఁ జనిదాగియుండినను = ఎచ్చటికేగి దాగికొని యుండినప్పటికిని, ఋణానుబంధముల్ = బాకీ చిక్కులు, తొల్గఁగనౌనె తప్పిపోవనగునా (కాదనుట), వేసవికాలమున నదులలోని నీళ్లను సూర్యరశ్మిచే భూమియే హరించునని గ్రహించునది.

గీ॥ కలికి మైతావి సంపఁగి • కాంతిఁ బసిడి
యగుటఁ జంపకగంధి హే • మాంగి యౌను
గద తదర్థద్వయముఁ గూర్చి • కాంత నింత
కన్నఁ గనకాంగి యనుట యు • క్తంబు గాదె॥ 157

అనఁగా నాచేడియ శరీరపరిమళమునందున సంపంగియును ప్రకాశమునందున బంగారును నగుటవలన నాపె స్వచంపకగంధియును హేమాంగియు నౌనుగద యీ రెండర్థములను గూర్చి యాబిడను కనకాంగి యనుట యింతకంటె యుక్తమే యగునని తాత్పర్యము, కనక శబ్దము సంపఁగి యందును బంగారు నందును వర్తించునని గ్రహించునది.

సీ॥ లంబుగదే కనుంగవ న • లంబుగదే వదనంబు మేదు రై
లంబుగదే కుచస్థితి వి • లంబుగదే నతనాభి యింద్ర నీ
లంబుగదే సువేణి విపు • లంబుగదే కటిసీమ కుంద జా
లంబుగదే రదాళి కిస • లంబుగదే యధరంబు నాతికిన్ 158

టీక లంబు = విశాలము, నలంబు = పద్మము, విపులంబు = విరివియైనది, తక్కిన్నావిషయము సుగమము, ని. కమలేతు నలం మతమ్, అని విశ్వము

క॥ దానికి నడకలు సంకు మ
దానికి పరిమళము వారి • దానికి సిగ చిం
దానికి కంఠము కోక న
దానికి పదయుగళి మించు • దానికిఁ జూడన్॥ 159

టీక దానికిఁజూడఁగా = ఆ చేడియకుఁ జూడఁగా, దానికి నడకలున్ = ఏనుంగునకు నడకలును, సంకుమదానికి = జవాదికి, పరిమళమున్ = సౌరభమును, వారిదానికి = మేఘమునకు, సిగ = శిఖయును, చిందానికి = శంఖమునకు, కంఠమున్ = కుత్తుకయును, కోకనదానికి = చెంగలువకు, పదయుగళి = పాదయుగ్మమును, మించుఁగా = అతిశయించును.

సంకుమదమునకు, సంకుమదానికి యనియును, వారిదమునకు, వారిదానికి యనియును, చిందమునకు, చిందానికి యనియును, కోకనదమునకు, కోకన దానికి యనియును ప్రయోగింపఁ బడెనని గ్రహించునది.

గీ॥ అన్నెలంత చనుల్ పైడి • గిన్నెలంత
అసురమణి విటీర్ణత , లో సుర్వమణి

అసుమాళి పురామోద • మేసుమాళి
అసురమ్య కచోత్కరం • బే సురమ్య॥ 160

టీక అన్నెలంత చనుల్ = ఆ నెలఁతయొక్క కుచములు, పైఁడి గిన్నెలంత = బంగరు గిన్నెలంతవి, ఆ సుర్ణమణి ఆ శ్రేష్ఠురాలైనస్త్రీ, వితీర్ణ తలో = దాతృత్వములో, సురమణి = దేవతారత్నమగు చింతామణి, అసుమాళి = అయత్యుత్సాహముగలదాని యొక్క, పురామోదమే = శరీరపరిమళమే, సుమాళి = పుష్పసముదాయము, అ సురమ్య = అ మంచి మనోజ్ఞముగలదాని యొక్క, కచోత్కరంబే = వెండ్రుకల సముదయమే, సురమ్య = మంచిరేయి, రమ్యాశబ్దము రాత్రి యనుటకు శబ్దార్థ చంద్రికలో చూడనగును.

గీ॥ కర్ణయుగళంబు నా భ్రూయు • గంబు గలిసి
నవ సహస్రైక శతదశ • నవము లగును
కౌను సున్నయె యగునది • కలిసె నేని
తొంబదొకవేల కెచ్చు నా • తెం బగుసతి॥ 161

అనఁగా స్త్రీల చెవులను తొమ్మిదవ సంఖ్యకును కనుబొమలను పదనొకండవ సంఖ్యకును నడుమును సున్నకును బోల్చుట కవి సమయసిద్ధము గావున నా చేడియ కుడిచెవి యొక తొమ్మిదియును కనుబొమలు పదనొకండును మఱియు నెడమచెవి యింకొక తొమ్మిదియును వరుసగా నివి కలిసెలిని ౯౧౧౯ యగును, ఇఁక నడుము సున్నయగునది గలిసెనేని యీ నాతెమైన సతి తొంబది యొక్క వేల సంఖ్యను మించినది యగునని తాత్పర్యము.

భ॥ మొదలె వికారమౌ విపుల • ముద్దియ శ్రోణికి సాటివచ్చునే
తుదకు తగన్ సమంబె జడ • తో నయినన్ జెడుగొప్పృథాకు త
న్మదవతి రూపుతోఁగమల • మాదిరి సేయఁగ మధ్యమత్వమై
పొద్దలఁగ వచ్చునేమొ యిఁక • భూస్థలిపైఁ బెఱలుద్ది యెట్లగున్॥

టీక మొదలె వికారమౌ విపుల = అసలికే వికారస్వరూపముగల భూమి (గుట్టలు పుట్టలుగల భూమి యనుట), ముద్దియశ్రోణికి సాటివచ్చునే = ఆ చేడియ పిఱుఁదునకు సమానము రాఁగలదా యని యర్థము, విపుల యను శబ్దములో, మొదలెవికారమౌ ననుటచే మొట్టమొదటనె, వి, అను నక్షరము గలదియైన భూమి యాచేడియ పిఱుఁదునకు సాటిరాఁజాలదని భావము, చెడుగౌ పృథాకు = క్రూరమైన సర్పము, తుదకు = అకరకు, జడతోనయినన్ = ఆచేడియ వేణితో నైనప్పటికిని, తగన్ సమంబె = ఒప్పునట్లుగా సమానమగునా (కాదనుట) అని యర్థము, చెడుగౌ పృథాకు, అనుశబ్దములో, తుద = చివరయందున, కు = కు, అను నక్షరము, తగఁగా = ఒప్పుచుండుటవలన, జడతో నైనను సమానము రాఁజాలదని భావము, తన్మదవతి రూపుతోన్ = ఆ చేడియయొక్క రూపముతోడ, కమలజ = లక్ష్మీదేవిని, మాదిరిసేయఁగన్ = పోలికచేసినట్లయితే, మధ్యమత్వమై = ఉత్తమము నధమముమ గాని యానడుమనుండు స్థితియై, పొదలఁగ వచ్చునేమొ = వర్థిల్లఁగా వచ్చునేమో యని యర్థము, కమల, అను శబ్దములో మధ్యన్ = నడుమ, మత్వమై = మ, అను నక్షరముగలదియై వర్థిల్లఁగా నా చేడియతో లక్ష్మిని సాటిసేయఁగా రూపమునందించుక జోడువచ్చునో యేమో యని భావము, ఇఁక భూస్థలిపైఁ బెఱలుద్ది యెట్లగున్= ఇంక భూతలముమీద నితరములు సమాన మేవిధముగా నగును.

ఆ॥వె॥ కేలు పద్మకాండ • లీల శరీరంబు
గంధవహము మోము • కమలజారి
మోవి మధువుగాన • నావెలందిఁ దలంప
విరహ మధికమగుట • యరిది యగునె॥ 168

టీక కేలు పద్మకాండలీల = ఆపెహస్తము తామరతూఁడుల యొక్క విలాసమని యర్థము, ఆ పె హెస్తము పద్మబాణుఁడై న

మన్మథుని విలాసమని భావము, శరీరంబు గంధవహము = దేహము పరిమళమును వహించినది యని యర్థము, దేహము వాయుదేవుఁడని భావము, మోము కమలజారి = ముఖము చంద్రుఁడని యర్థమును భావమును నౌనని గ్రహించునది, మోవిమధువు = పెదవి తేనె యని యర్థము, పెదవి వసంతుఁడని భావము, కాన=కాబట్టి, అవెలందిఁ దలంపన్ = ఆ చేడియను తలంపు చేయఁగా, విరహమధికమగుట = వలపు హెచ్చుగానగుట, అరిది యగునె = ఆశ్చర్యమగునా (కాదనుట,

అనఁగా నాచేడియ కేలు మన్మఁథుడును శరీరము వాయుదేవుఁడును ముఖము చంద్రుఁడును, పెదవి వసంతుఁడును, అగుటవలన వీరలు నల్వురును విరహుల కెక్కువ వలపుఁగూర్పు వారలే కావున నట్టివారల నవయవములుగాఁ గల యాచేడియను తలంపుచేయుటచే విరహము హెచ్చగుట యాశ్చర్యము కానేరదని తాత్పర్యము

సీ॥ రొమ్ము రొమ్మునఁజేర్చి • కుమ్మి బిగ్గగఁ గౌఁగి
లించి యాసతి నల • రించు టెపుడొ
మేను మేనునఁజేర్చి • పానుపుపైఁ జేరి
వలపింప గిలిగింతఁ • గొలుపు టెపుడొ
మోము మోమునఁజేర్చి • మునిబంటి నొక్కుల
నొందఁ జెక్కుల ముద్దు • లందు టెపుడొ
నోరు నోరుఁనజేర్చి • సార మంకిలిఁ బోర్ల
మోవిపానకమును • ద్రావు టెపుడొ
గీ॥ దీక్షఁ దీరఁగ నాదు న • ఖక్షతములు
గలుగఁ జాలిండ్లు మర్దన • సలుపు టెపుడొ
ఇర్వురకు ఘర్మబిందువుల్ • పర్వు లిడఁగ
మారసంగరమున దానిఁ • బోరు టెపుడొ॥ ౧౬౪

టీక. సుగమము

సీ॥ ఆ విలాసిని రూప • మాద్యంత మింపార
నరయ లేనట్టి నా • యక్షులేల
ఆ మృదులాంగి గా • ఢాలింగనము సేయ
నట్టి నామేని యు • య్యారమేల
ఆ మధురోష్ఠి ము • ద్దాడఁగా నేరని
యట్టి నా వక్త్రవి ఖ • వ్యత్వమేల
ఆ సుస్తని కుచద్వ • యము నంటఁగా లేని
యట్టి నా కరముల • యందమేల
గీ॥ ఆ పికీవాణి నుడువుల • నాలకింప
నట్టి నా శ్రవణముల కా • గ్యంబదేల
ఆ కుసుమగంధి మైతావి • నందలేని
యట్టి మామక వరనాసి • కా ప్తియేల॥ 165

టీక సుగమము

ఉ॥ ఆ మగువన్ గనుంగొనుట • కైచనసట్టి పదంబులేల యా
భామిని మోవి పానకముఁ • బానము సేయని జిహ్వయేల యా
లేమ హసింపఁగా నలుప • లేని ప్రసంగము లేల యింత యే
లా మదిరాక్షిఁ గూడని వి • లాసము జన్మమదేల ధారణిన్॥

టీక సుగమము

వ॥ అని వితర్కింపుచు 167

టీక సుగమము

చ॥ వనిత విలాసమున్ బటము • వ్రాసెదఁ జూచెద నంచు వాలిఖిం
చిన ముఖమబ్జమై బొమలు • సింగిణులై నిడు చూపు తూపులై

కనులు ఝషంబులై తనరఁ • గాఁ గని మారుని సాధనంబులం
చను బెగడుం గదా విరహి • చోద్యము లేమనవచ్చు నజ్జరే॥

టీక సుగమము

ఉ॥ భామిని నాత్మలో నెపుడు • వర్ణనసేయనె పట్టె నోట నా
లేను గుణంబులన్ నిలుపు • లేక నుతింపనె పట్టె కేల నా
రామ విలాసమున్ బటము • వ్రాయనె పట్టె నహో విరాళి నిం
కేమనవచ్చుఁ దాను నిజ • కృత్యములన్ నెరవేర్చుటెన్నఁడో?

టీక సుగమము.

గీ॥ అటుల నాతడు విరహమునంది యుండి
మన్యువునఁ దన పనులు స • మాప్తిఁ జేసి
నాటి రాతిరియందు న • చ్చోటఁ బవ్వ
ళించి కుసుమ శరాదుల • నెంచె నిట్లు॥ 170

టీక శివ సారంగధర కథలలో, మన్యువునన్ = దైన్యముతో, అని యున్నది, చంద్రకథలో, యజ్ఞమునందున అనియును భేదమని గ్రహించునది. తక్కిన్యా విషయము సుగమము. మూడిఁట సమానము, ని. మన్యుః క్రోధే క్రతౌ దైన్యే, అని విశ్వము.

సీ॥ నిను సుమనోధనుం • డని మంచి గాంతునే
కందర్ప నీకింత • కష్ట యేల
నినుఁ గువలయహితుం • డని తలదాల్తునే
వనజారి నీకింత • కినుక యేల
నిను సదాగతియె యౌ • నని నమ్మియుంటినే
పవన నీకింత కో • పంబదేల
నిను మాధవుండెయౌ • నని గణియింతునే
చైత్ర నీకింత వై • షమ్య మేల

గీ॥ నినుఁ బరమ హంసయని యెంచు ♦ కొనిన వాఁడ
నోమరాళమ నీకింత ♦ భామమేల
కనికరము లేదె యిసుమంత ♦ గాని మీకు
నన్ను వేధింపఁగా నేడు ♦ న్యాయమగునె॥ 171

టీక కందర్ప = ఓ మన్మథుఁడా, నిను సుమనోధనుండని = నిన్ను శ్రేష్ఠమైన మనస్సే ధనముగాఁ గలవాఁడవని, మంచిగాంతునే = శివకథలో మాత్రము మనిచి చూచుచుంటిని గదా యని యర్థాంతరము (అనఁగా శివుఁడు మన్మథుని కంటిమంటనఁ గాల్చి రతీదేవి పతిభిక్షఁ గోరఁగా మరల నతనునిగాఁ జేసి బ్రతికించినాఁ డనుట పురాణ ప్రసిద్ధము), నిన్ను పుష్పకోదండుఁడ వని మంచిగాఁ జూచుచున్నాను గదా యని స్వభావార్థము, నీకింత కక్షయేల = నీకింతటి పగయేటికి, వనజారి = ఓ చంద్రుఁడా, నిను కువలయ హితుండని తలఁదాల్తునే = నిన్ను భూవలయమునకు హితుఁడవని శిరసావహింపుచున్నాను గదా, అని యర్థాంతరము, శివకథలో మాత్రము చంద్రునిఁ శివుఁడు తలఁ దాల్చుట ప్రసిద్ధమని గ్రహించునది, నిన్ను కలువలకుఁ జెలికాడవని శిరసావహింపుచున్నాను కదా యని స్వభావార్థము, నీకింత కినుక యేల = నీకు నింతటి కోపమెందులకు, పవన = ఓ వాయుదేవుఁడా, నిను సదాగతియె యౌనని నమ్మియుంటినే = నిన్ను నిరంతరము నాకు గతివియగుదువని నమ్మికొనియున్నాను గదా యని యర్థాంతరము, నిన్ను సదాగతి నామము గలఁవాడవని నమ్మికొనియున్నాను గదా యని స్వభావార్థము, నీకింత కోపంబదేల = నీకింతటి తామసమదేటికి, చైత్ర = ఓ వసంతుఁడా, నిను మాధవుండె యౌనని గణియింతునే = నిన్ను విష్ణుఁడవే యగుదువనియును లేక మాప్రభుఁడవే యగుదువనియు నెంచుకొనియున్నాను గదా యని యర్థాంతరము, నిన్ను మాధవనామము గలవాఁడవని యెంచుకొన్నాను గదా యని స్వభావార్థము, నీకింత వైషమ్యమేల = నీకు నింతటి విషమత్వమేటికి, ఓ మరాళమ = ఓ రాజహంసమా, నినుఁ బరమ

హంసయని యెంచుకొనినవాఁడన్ = నిన్ను నుత్తమపదమునొందిన తపసివని యెంచుకొన్నాను గదా యని స్వభావార్థము, నీకింత ఖామమేల = నీకు నింతటి కోపమెందులకు, కనికరము లేదె యిసుమంతగాని మీకు = కొంచమైనను మీకు దయలేదా, నన్ను వేధింపఁగా నేడు న్యాయమగునె = ఇపుడు నన్ను బాధపెట్టఁగా ధర్మమగునా (కాదనుట), చంద్రకళలో నింద్రభవనమునందున పెంపుడు హంసలుండునని గ్రహించునది.

వ॥ అని తనలో మఱియు నిట్లనుకొనియె॥ 172

టీక. సుగమము.

సీ॥ ఫణిరోమవల్లిఁ జే • పట్టక మలయాద్రి
మారుతమ్ముల వేడి • మాన్పఁ గలనె
ఇందుముఖిని ముద్దు • లందక ననుఁదాకు
మారు తమ్ముల వాఁడి • మాన్పఁ గలనె
చంపకగంధి భో • గింపక భ్రమర రా
మా రుతమ్ముల రూఢి • మాన్పఁ గలనె
పర ధనుర్భ్రూ యుగ • దొరయక శాకుల
మారు తమ్ముల దాడి • మాన్పఁ గలనె
గీ॥ అనుచు నతఁడు తదీయ వే • దనల కలికి
ఇంచుకంతయు ధైర్యముఁ గాంచి కలికి
తనముగా నటనుండి స • త్వరము కలికి
వరికిఁ జనవెంచె నాసించె • మరుని కలికి॥ 173

టీక. ఫణిరోమవల్లి = సర్పమువంటి నూఁగారుగల యా చేడియను, చేపట్టక = చేఁబట్టుకొనక యుండినచో, మలయాద్రి = మలయపర్వతము యొక్క, మారుతమ్ములవేడిఁ = వాయువుల కాకను, మాన్పఁగలనె =

నివారింపఁగలనా, (అనఁగా వాయువును సర్పము భక్షించునది యగును గావున నా సర్పరోమవల్లిని చేపట్టిననే గాని మలయపర్వతమునుండి వీచెడు గాలియొక్క తీక్ష్ణమును నివారింపఁజాలనని యనుట), ఇందుముఖిని = చంద్రునివంటి ముఖముగల యాచేడియను, ముద్దులందక = చుంబనము లందకుండినచో, ననుఁదాకు = నన్నుఁ దాకుచుండినయట్టి, మారు = మన్మథునియొక్క, తమ్ములవాఁడిన్ = పద్మముల పదునును, మాన్పఁగలనె = నివారింపఁగలనా, (అనఁగా చంద్రునిగాంచినతోడనే పద్మములు ముకుళించును గావున నా చంద్రముఖిని ముద్దులందిననే గాని నన్నుఁ దాకెడి మన్మథుని పద్మబాణముల వాఁడిని నివారింపఁ జాలనని యనుట), చంపకగంధిన్ = సంపఁగివంటి పరిమళముగల యాచేడియను, భోగింపక = పొందకుండినచో, భ్రమర రామా = తుమ్మెద స్త్రీలయొక్క, రుతమ్ములరూఢిన్ = ధ్వనుల ప్రసిద్ధిని, మాన్పఁగలనె = నివారింపఁగలనా (అనఁగా చంపక పరిమళంబునకు తుమ్మెదలు సొమ్మసిల్లును గావున నా చంపకగంధిని భోగించిననే గాని తుమ్మెద స్త్రీల ధ్వనుల ప్రసిద్ధిని నివారింపఁ జాలనని యనుట),వరధనుర్భ్రూయుగన్ = శ్రేష్ఠమైన వింటిబద్దలవంటి కనుబొమ జంటనుగల యా చేడియను, దొరయక = కలుసుకొని యుండకపోయినచో, కాకుల = వాయసములయొక్క, మారుతమ్ముల దాడిన్ = తమ్ములకు మారుగా నెంచఁదగిన కోకిల సైన్యమును, మాన్పఁగలనె = నివారింపఁగలనా (అనఁగా కోకిలాది పక్షులు ధనుస్సునుఁ జూచినంతనే చెదరిపోవును గావున నా ధనుర్భ్రూయుగను కలిసియుండిననే గాని కోకిల ప్రముఖ పక్షులయొక్క దాడిని నివారింపఁ జాలనని యనుట), కోకిలలు గ్రుడ్లుపెట్టుటయే గాని పొదిగి పిల్లలఁ జేయనేరవందున నా గ్రుడ్లను కాకుల గూళ్లలో వైచుననియును, కాకు లాగ్రుడ్లను పొదిగి పిల్లలను జేసి తమపిల్లలతోపాటు కొంతకాలము సాకుననియును ప్రసిద్ధిగలదు గావున నేకమాతృకవలన సాకబడిన కాకులు కోకిలలు నొండొండ్లును మారు తమ్ములు గాఁదగునని గ్రహించునది, అనుచున్ = ఈ విధ

ముగా ననుకొనుచును, అతఁడు = ఆ శివుఁడును, బృహస్పతియును, రాజ
నరేంద్రుఁడును ననుట, తదీయ వేదనలకున్ = ఆపైని వివరింపఁబడినవాని
యొక్క బాధలకు (అనఁగా మలయమారుతములు, పద్మ బాణంబులును,
తుమ్మెదలును, కోయిలలును, విరహుల బాధపెట్టునవి యని గ్రహించునది),
అలికి = భయపడి, ఇంచుకంతయు ధైర్యమున్ గాంచి = కొంచము ధైర్యము
నవలంబించి, కలికితనముగాన్ = మనోజ్ఞత్వముగా, అటనుండి = ఆ కైలాస
మున నుండియును, ఆ యింద్రభవనము నుండియును, ఆ వింధ్యపర్వతము
నుండియు ననుట, సత్వరమున్ = వేగముగా, కలికిదరికిఁ జననెంచెన్ = ఆ
పార్వతియొక్కయు, తారయొక్కయు, చిత్రాంగియొక్కయు, సమీపమునకు
నేగఁదలంచెననుట, మరుని = మన్మథునియొక్క, కలికి = యుద్ధమునకు
ఆసించెన్ = అపేక్షించినవాఁడాయెను.

## ఆశ్వాసాంతము

చ॥ భవభవశూర శూరరుచి • బంధుర బంధురతా జితాజి ప్రా
భవభవ ధీరధీర ఘన • భాజన భాజన ధర్మధర్మ వై
భవభవ వాసవా సరస • భావ సభావస రోత్తరోత్తరా
భవభవ లోపలోప జన • పావన పావన సత్వ సత్వరా॥ 174

టీక భవభవ = శివతనూజుఁడైన కుమారస్వామివంటి, శూర = పరాక్రమము గలవాఁడా, శూర = సూర్యునివంటి, రుచిబంధుర = కాంతిచేత నొప్పినవాఁడా, బంధు = చుట్టములయందును, రతా = ఆసక్తిగలవాఁడా, జిత = జయింపఁబడిన, ఆజి = యుద్ధములుగలవాఁడా, ప్రాభవ = ప్రభుత్వమునందున, భవ = ఈశ్వరునివంటివాఁడా, ధీర = పర్వతము వంటి, ధీర = ధైర్యముగలవాఁడా, ఘనభాజన = మిక్కిలి యోగ్యమైన, భాజన = స్థానముగలవాఁడా, ధర్మ = యమునివంటి, ధర్మ =

న్యాయముగలవాఁడా, వైభవభవ=విభవ ప్రభావములయందున, వాసవా = ఇంద్రుఁడవైనవాఁడా, సరసభావ=రసయుక్తమైన భావముగలవాఁడా, సభా= జనసముదాయమునకు, అవసర = అక్కరగల్గినట్టి, ఉత్తర = శ్రేష్ఠమైన, ఉత్తర=ప్రత్యుత్తరములు గలవాఁడా, భవ =వ్రాత్యులయొక్క (అనఁగా నుపనయనాది సంస్కారములేని బ్రాహ్మణులయొక్క యనుట), భవలోప = సంసారలోపములను (అనఁగా నాలుబిడ్డలతోఁడియునికి లేమిని), లోప = లేని వాఁడా, జన=మానవులయిందున, పావన=పవిత్రమైనవాఁడా, పావన= పవ, సంబంధమైన, సత్వ = బలముగలవంటి, సత్వరా = వేగముగలవాఁడాన లేక జలబలమువంటి వేగమువాఁడా, పవన సంబంధమైన బలమును, జల బలమును, వేగములేయని గ్రహించునది. ని. భవ స్సంసార సంప్రాప్తి శ్రేయ శ్శంకర జన్మసు, అనియును, ధీరో విదుషిశైలేఽపి సముద్రే ధైర్యవత్యపి, అనియును, పావనంతు జలే కృచ్ఛ్రే, అనియును, విశ్వము. మఱియు శంక గల్గిన శబ్దములను శబ్దార్థచంద్రికలోఁ జూడనగును.

క॥ అతి సౌందర్య మనోజా
హిత గురు బుధ కవి సమాజ • యిన సమతేజా
శ్రితజన కల్పక భూజా
వితతశ్రీ యక్షరాజ • విభవబిడౌజా॥ 175

టీక అతి సౌందర్య=మిక్కిలి చక్కదనమునందున, మనోజా = మన్మథుఁడవైనవాఁడా, హిత=మిత్రములయొక్కయు, గురు = గురువుల యొక్కయు, బుధ=పండితులయొక్కయు, కవి=కవులయొక్కయు, సమాజ = సముదయము గలవాఁడా, ఇనసమతేజా= సూర్యునకు సమానమైన తేజస్సు గలవాఁడా, శ్రితజన=ఆశ్రయించిన యాచకజనములకు, కల్పకభూజా = కల్పవృక్షమువంటివాఁడా, వితత=మిక్కిలి విరివియైన, శ్రీ=సంపత్తునందున,

యక్షరాల = కుబేరునివంటివాఁడా, విభవ = వైభవమునందున, బిడౌజా = ఇంద్రుఁడవైనవాఁడా

ఉత్సాహ॥ దార దామృ తేభ శార • దా ర దామృ తేభ భి
న్నారదాబ్జ తారకోర్జ • నారదాబ్జ తార మం
దార చంద్ర శార శంబ • దార చంద్రశార నీ
హార ధవళ కీర్తి జాస్థి • హారధవళ కీర్తిజా॥ 176

టీక దారద = పాదరసము, అమృతేభ = వేల్పుటేనుఁగు, శారదా = సరస్వతీదేవి, అమృత = సుధ, ఇభభిత్ = సింహము, నారద = నారదుఁడు, అబ్జ = చంద్రుఁడు, తారక = నక్షత్రము, ఊర్జ = కార్తికమాస మందలి, నారద = మేఘము (అనఁగా కార్తికము శరదృతువునందలి మాసమే యగుటవలన శరత్కాల మేఘమనుట), అబ్జ = లవణము, తార = ముత్యము, లేక వెండి, మందార = కల్పవృక్షము, చంద్ర = కర్పూరము, శార = శరసమూహము (జెల్లుప్రోవనుట), శంబ = వజ్రాయుధము, దార = దరసమూహము (శంఖసముదయ మనుట), చంద్రశార = వెన్నెల, చంద్రశాల శబ్దమును యమకాలంకారమునకై, రలయోరభేదః, అను సూత్రముచే చంద్రశార, అని ప్రయోగింపఁ బడినట్లు గ్రహించునది, నీహార = మంచు, ధవళ = తెల్లనైన, కీర్తిజ = పంకజము (పద్మమనుట) అస్థిహార = ఎముకలను హారముగాఁగల శంకరుఁడు, ఇటువంటి, ధవళ = తెల్లనైన, కీర్తిజా = యశఃప్రకాశము గలవాఁడా,

గద్యము.

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధ చతుర్విధకవితా విచిత్ర
విశ్వకర్మకుల పవిత్ర భద్రదత్త గోత్ర పోకూరి వంశాబ్ధి
కైరవ మిత్ర రామలక్ష్మాంబా సుబ్బయా
ర్య తృతీయ పుత్ర కవిసింహ
బిరుద పాత్ర బుధజనానుమ
తి కాశీపతి ప్రణీతంబై
న సారంగధరీయం
బను త్ర్యర్థి కా
వ్యంబునందుఁ
దృతీయా
శ్వాస
ము
సం పూ ర్ణ ము.



# సారంగధరీయము

## త్ర్యర్థి కావ్యము

## చతుర్థాశ్వాసము-సవ్యాఖ్యానము

క॥ శ్రీరతిపతి సౌందర్యా
వారణ రిపు శౌర్య భూరి • వాక్చాతుర్యా
దారుణ దోర్వీర్యా సీ
తారామ నృపాలవర్య • ధార్మిక చర్యా॥ 1

టీక శ్రీ = సంపద్యుక్తమైన, రతిపతిసౌందర్యా = మన్మథునివంటి చక్కదనము గలవాఁడా, వారణరిపు = సింహమువంటి, శౌర్య = శూరత్వము గలవాఁడా, భూరి = అతిశయమైన, వాక్చాతుర్యా = భాషాచాతుర్యము గలవాఁడా, దారుణ = భయంకరమైన, దోర్వీర్యా = భుజపరాక్రమము గలవాఁడా, ధార్మికచర్యా = పుణ్యవంతమైన ప్రవర్తనము గలవాఁడా, సీతారామ నృపాలవర్య = ఓ సీతారామ జనపాలక శ్రేష్ఠుఁడా

గీ॥ అవధరింపుము నేఁడెల్లు • నట్టి త్ర్యర్థి
కావ్యమందలి శైలజా • కామి నీక

చంద్ర సారంగధరుల స ♦ చ్చరిత లందు
నెసఁగు నావలికథల లీ ♦ రెట్టులనిన॥ 2

టీక సుగమము.

గీ॥ అట నహోరాత్రములను భ ♦ వ్యస్వరూప
తార చిత్రాంగి సారంగ ♦ ధరుని పైని
చింతఁ బొందుచు నొకచోటఁ ♦ జేరి యతని
పెంపుఁగనుటకు నాత్మ నూ ♦ హింపుచుండె॥ 3

టీక శివ॥ అటన్ = తన యాశ్రమమునందున, అహోరాత్రములను = రేయింబవళ్ళను, భవ్య = పార్వతీదేవి. స్వరూపతార = తనరూపము నందున తారయను నప్సరసవంటిది, చిత్రాంగి = అరుదైన యవయవములు గలది, సారంగధరునిపైని చింతఁబొందుచున్ = జింకతాల్పరియైన శంకరుని మీది వగపునొందినదియై, ఒకచోటఁజేరి = ఒకప్రదేశమునందునఁ జేరుకొని, (శివుడును తాననుట), అతని పెంపుఁకనుటకున్ = ఆ శివుని పొలసము బడ యుటకై, ఆత్మనూహింపుచుండెన్ = హృదయమునందున నాలోచనఁ జేయు చుండిన దాయెను, ని భవ్యాకరికథో మయోః, అని విశ్వము

టీక చంద్ర॥ అటన్ = తనవాసమునందున, అహోరాత్రములను = రేవగళ్ళయందును, భవ్యస్వరూప = యోగ్యమైన స్వరూపముగలది, తార = తారయనుచేడియ, చిత్రాంగి = అరుదైన శరీరముగలది, సారంగ ధరునిపైని చింతన్ = జింకతాల్పరియైన చంద్రునిమీది తలంపుతో, పొందు చున్ = కూడుచుండినదియై, ఒకచోటఁ జేరి = ఒక్క ప్రదేశమునందునఁ జేరుకొని (చంద్రుఁడును తాననుట),అతని పెంపుఁగనుటకున్ = ఆచంద్రుని పొలసమువడయుటకు, ఆత్మనూహింపుచుండెన్ = మదిలో నాలోచింపుచుండిన దాయెను.

టీక సారంగ॥ ఆటన్ = తన నివాసమునందున, అహోరాత్రము లను = రేబగళ్ళ యందును, శవ్యస్వరూపతార = శుభ్రమైన తన రూపము నందునఁ దారయను నప్సరస వంటిది, చిత్రాంగి = చిత్రాంగి యనునది, సారంగధరునిపైని చింతబొందుచున్ = సారంగధరుడనే వానిమీద వగపు నొందినదియై, ఒకచోటఁ జేరి = ఒకానొక ప్రదేశమునందునఁ జేరుకొని, అతని పెంపుఁగనుటకున్ ఆ సారంగధరుని నాశనముఁ జూచుటకు, ఆత్మ నూహింపుచుండెన్ = తనమదిలో యోచింపుచుండిన దాయెను, పెంపు శబ్దము పాలనమునకును నాశనమునకునుఁ జెల్లు ననుటకు శబ్దార్థ చంద్రికలోఁ జూడ నగును.

ఆ॥వె॥ అంతఁ బ్రౌఢిమహిమ • వంతుఁడు వరుఁడాత్మ
వశను జేరునట్టి • వాంఛ గలిగి
సంతసమున నటకు • జనుదెంచెఁ గన్నెలం
దెవరికైనఁ బ్రేమ • హెచ్చుగాదె॥ 4

టీక. శివ॥ అంతన్ = అటుమీదట, ప్రౌఢిమన్ = నేర్పుతో, హిమ వంతుడు = హిమవంతుడను పర్వతరాజు, వరుఁడు = శ్రేష్ఠుఁడు, ఆత్మ = తనయొక్క, వశను = పుత్రికను (పార్వతి ననుట), చేరునట్టి వాంఛ గలిగి =చేరుకొనునటువంటి కోర్కె జనియించి, సంతసమునన్ = సంతోషముతో, అటకున్ = ఆ పార్వతి యుండునట్టి యాశ్రమమునకు, చనుదెంచెన్ = పోయినవాఁ డాయెను, కన్నెలందున్ = బిడ్డలయందున, ఎవరికైనన్ = ఎవ్వరికేనియును, ప్రేమ హెచ్చుగాదె = కూరిమి యెక్కువయే కదా, చను దెంచు శబ్దము వచ్చుటకుం బోవుటకుఁ జెల్లునని గ్రహించునది

టీక. చంద్ర॥ అంతన్ = ఆ సమయమునందున, ప్రౌఢిన్ =నేర్పుతో మహిమవంతుఁడు = గొప్పతనము గలవాఁడు, వరుఁడు = భర్తయైన బృహస్పతి, ఆత్మ = తనయొక్క వశను = భార్యయైన తారను, చేరునట్టి వాంఛ

గలిగి = యజ్ఞమునుండి చేరుకొనుటకు కోర్కిగలిగినవాడై, సంతసమునన్ = సంతోషముతో, అటకున్ = భార్యయున్న నివాసమునకు, చనుదెంచెన్ = వచ్చినవాఁడాయెను, కన్నెలందున్ = స్త్రీలయందున, ఎవరికైనఁ బ్రేమ హెచ్చు గాదె = ఎవ్వారలకేనియును పేర్మియెక్కువయే కదా, వళ యనినఁ బుత్రిక కును భార్యకును చెల్లుననుటకును, కన్నె యనిన బిడ్డకును స్త్రీకిని చెల్లునను టకును శబ్దార్థచంద్రికలోఁ జూడనగును.

టీక సారంగ॥ చంద్రకథకు సమానము, మహిమవంతుఁడు వరుఁ డనఁగా రాజనరేంద్రుడని గ్రహించునది.

క॥ అంతకు మున్నా యన తన
చెంతకు నరుదెంచు టెరిగి ♦ జీర్ణాంబరయై
చింతోపేతాననయై
కాంతామణి నేల పడకఁ ♦ గాంచియు నుండెన్॥

టీక శివకథలో, అంతకుమున్ = అంతకు పూర్వము, నాయన = తన తండ్రియైన హిమవంతుడు, అనియును. చంద్ర సారంగధర కథలలో అంతకుమున్న = అంతకు పూర్వము, ఆయన = ఆయజమానుఁడు, అని యును భేదము, తక్కిన విషయము మూడిఁట సమానము సుగమము.

గీ॥ ఇటుల నున్నపు డాగురుఁ ♦ డేగుదెంచి
యుంట జోటిక పటమునఁ ♦ గంటి నీరుఁ
దుడుచు కొనుచును తల ముసు ♦ కిడియు లేచి
మరలి కూర్చుండు వళను త ♦ ద్వరుఁడు గాంచి॥ 6

టీక. ఇటుల నున్నపుడు = ఈ ప్రకారముగా నుండిన సమ యము నందున, ఆగురుఁ డేగుదెంచి యుంటన్ = ఆ తండ్రియైన

హిమవంతుఁడు వచ్చియుండుటవలన, జోటిక = ఆచేడియ (పార్వతియనుట), పటమున = వస్త్రముచేత, కంటినీరుఁదుడుచుకొనుచును = కన్నీరునుతుడిచి వేసుకొనుచు, తలముసుకిడియున్ = నెత్తినముసుకు వేసుకొని, లేచిమరలి కూర్చుండు = లేచినదియై యటుమరలి కూరుచుండు నటువంటి (విముఖత గ్గానుట), వశను = పుత్రికను, తద్వరుఁడు గాంచి = అశ్రేష్ఠుఁడుచూచిన వాఁడై (అపర్వతరాజనుట), ఇఁక ముందరిపద్యముతో నన్వయము.

టీక. చంద్ర. ఇటులనున్నపుడు = ఈ విధముగా నుండినప్పుడు, అగురుఁడేగుదెంచియుంటన్ = అబృహస్పతి వచ్చియుండుటవలన, జోటి = అచేడియ, కపటమునన్ = కాపట్యముచేత, కంటినీరుఁదుడుచుకొనుచును = కన్నీటిని తుడిచికొనుచు, తలముసుకిడియున్ = తలపైముసుకు వేసుకొని, లేచి మరలికూర్చుండు = విముఖతగాలేచి కూర్చుండునట్టి, వశను = భార్యను, తద్వరుఁడుగాంచి = అవిదత్తర్తచూచినవాఁడై, జోటి జోటిక, శబ్దములు రెండును స్త్రీ సామాన్య నామములని గ్రహింపనది

టీక. సారంగ॥ అగురుఁ డేగుదెంచియుంటన్ = ఆ రాజువచ్చుటచేత, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము.

గీ॥ ఏమి యీవింత నేనెపు • డేనియేగు
దెంచినను వశ యెదురరు • దెంచి కౌఁగి
లించి ముద్దులనిడి కూర్మి • నించునిపుడు
వంది తలయెత్తకుండె న • టంచు వంత॥

టీక. సుగమము.

సీ॥ నీలంబుఁగనినచో • నీలంబదేమను
కచములెల్లను జడల్ • గట్టనేల

దోషేశుఁ గనినచో • దోషేశుఁడను భవ
దాస్యంబు వైవర్ణ్య • మందనేల
కుముదంబుఁగనినచో • కుముదంబునొందించు
కనులనుండియు నీరుఁ • గార్పనేల
చంచలన్ గనినచో • చంచలంబను నీదు
మేన జీర్ణాంబరం • బూననేల
గీ॥ పంకజాతిని గనినచో • పంకజాతి
యనెడు పదమును నేల రా • యంగనేల
ఏమిటఁ గొఱంత గల్గెని • న్నెవ్వరేమి
యనిరి నాతోడఁ దెలుపవే • యమల చరిత॥ 8

టీక నీలంబుఁగనిచో = ఇంద్రనీలమును జూచినటులైన, నీలంబ దేమను = నీయొక్క గొప్పతనమదేమిటి యనునట్టి, కచములెల్లను = వెండ్రుకలన్నియును, జడల్ గట్టనేల = చిక్కులు గట్టుచేటికి, శివకథలో మాత్రము పార్వతి తపస్వియై యుండినందున జడలుగట్టుట స్వాభావికమని గ్రహించునది, దోషేశుఁగనినచో = రేరాజును జూచినటులైన, దోషేశుఁడను = పాపయుక్తమైన దొరయనునట్టి, భవత్ = నీయొక్క, అస్యంబు = ముఖము, వైవర్ణ్యమందనేల =వివర్ణతఁ జెందనేటికి, కుముదంబుఁగనినచో= తెల్లగలువను జూచినటులైన, కుముదంబు నొందించు = చెడుముదము గల దానిఁగాఁజేయునట్టి (దుఃఖిగా ననుట), కనులనుండియున్ = కన్నులలో నుంచి, నీరుఁగార్పనేల = నీటినిఁగార్చుచేటికి, చంచలన్ గనినచో = మెఱపును, లేక లక్ష్మినిఁజూచినటులైన, చంచలంబను = నిలుకడలేనిదని యను నట్టి, నీదుమేనన్ = నీశరీరమునందున, జీర్ణాంబరం బూననేల = చినిగిన వస్త్రమును దాల్పనేటికి, పంకజాతినిఁగనినచో = పద్మమును జూచినటులైన, పంకజాతియనెడు = పాపజాతియనునట్టి, పదమును = చరణమును, నేల రాయంగనేల = నేల రాచుచుండుటేటికి, ఏమిటఁ గొఱంతగల్గెన్ =

ఎందునసీకు తక్కువయైనది, నిన్నెవ్వమియనిరి = ఎవరు నిన్నేమని, యన్నారు, అమలచరిత = ఓ కల్మషరహితమైన చారిత్ర్యములు గలదానా, నాతోడఁ దెల్పవే = నాకు నెఱింగింపగదవె

చ॥ అలరఁగ మాడఁగాద పల ♦ దా వలదాయెన కోపమిట్లు నా
కలసటఁ గూర్ప నీకు తగ ♦ వా తగవా యొకముద్దునీయ నీ
పలుకను మాని చూడ నగు ♦ మా నగుమా నెనరూని నేడు న
న్నలుకును జెందనేల యను ♦ మా యనుమానముఁ దీర మానినీ।

టీక మానినీ = ఓ మానవతీ, అలరఁగన్ = సంతసించునట్లుగా, మాటలాడవలదా = భాషింపవద్దా, కోపము = తామసము, వలదు = అధిక్యము, ఆయెన = ఐనదిగా, ఇట్లు = ఈ విధముగా, నా కలసటఁగూర్ప నీకు తగవా = నా కాయాసమును గూర్పఁగా నీకు న్యాయమా, ఒక ముద్దు నీయన్ = ఒక్క ముద్దునుబెట్టఁగా, తగవా = తగుదానవుగావా, నీవలుకను మాని = నీవు కోపమును మానుకొని, చూడ నగుమా = నా వైపునకు గాంచఁగా నగుము, నెనరూని = దయను బూనిన దానవై, నగుమా= నవ్వుము, నేడు = ఇప్పుడు, అనుమానముఁ దీరన్ = నా సంశయము దీరునట్లుగా, నన్నలుకును జెందనేల యనుమా = భయమును జెందనేటికని నన్నుము

క॥ ధుర్గపముగ నను విడినది సుత
తెపు తెనసినరీతి నీవు ♦ దిగులొందితి బా
చవులాదవఁ బ్రసంగించిన
నవలల పల్కుల్ వి నవుగ ♦ నవుఁగా నవుగా॥ 10

టీక సుగమము

సీ॥ తొడపైనిఁ జేరి ము ♦ ద్దు లొసంగవేటికే
కన్నె చెక్కిలి యేమి ♦ కప్పురంబు

ముంగురుల్ మోముపై ♦ ముసరె దిద్దఁగ నీయ
వెందుకే నీ ఘనం ♦ బేమి తఱుఁగు
పల్లెత్తి పలుకరిం ♦ పవదేలె యింత మా
త్రనె నోటి ముత్తెముల్ ♦ రాలఁ గలవ
నెమ్మేనిపై నేల ♦ దుమ్మంటెఁ దుడుతు రా
వేలె నీ బంగార ♦ మేమి పోవు

గీ॥ నా యెదకుఁ బరితోషము ♦ లీయ నగుమ
నగుమ కరుణాన్విత విలోచ ♦ న పయి కనుమ
కనుమ నామన్ననల మెప్పు ♦ గలిగె ననుమ
నను మనుపఁ బ్రేమయున్న నా ♦ మనవి వినుమ॥ 11

అనఁగా స్త్రీల చెక్కిళ్ళకు కప్పురమును, ముంగురులకు మేఘమును, పలువరుసకు ముత్యములను, శరీరమునకు బంగారమును, పోల్చుట కవి సమయ సిద్ధమగుట వలనను, నిష్ఠురముగాఁ బలుకునపుడు, అది యంత కప్పురమా, ఇది యంత ఘనమా, మాటాడి నంతనే నీనోటిముత్తెములు రాలునా, 'నీబంగార మేమిపోవును, అనుట స్వాభావిక మగుటవలనను, తానే యవయవమును గూర్చి మాటాడెనో యా యవయవమునకు సరియైన సామెతతో మాటాడఁదలంచి ముద్దులీయవేమి నీ చెక్కిలి యంత కప్పురమా, ముంగురులను సరిఁజేయ నీయవేమి యంతఘనమా, పల్లెత్తి పలుకరింపవేమి యింత మాత్రముననే నీ నోటిముత్తెములు రాలునా, నేలపై శయనించి లేచితివి గావున శరీరము దుమ్ముగప్పుకొని యుండెను తుడువనీయ వేమి యింతనే నీబంగారమంత పోవునా, నామదికి సంతస మిచ్చుదానవు గమ్ము, ఒక్క నవ్వునవ్వుము, కటాక్షముతో నావంకఁ జూడుము, నే నిడుచున్నన్నలఁ గైకొనుము, మెప్పుగలిగెనని యనుము, నీకు దయ యున్నచో నన్ను బ్రతికింప నామనవిని వినుమని యనెనని తాత్పర్యము'

క॥ అని వశ నిటువలె వేడినఁ
గనుఱెత్తియు నైనఁజూడ ♦ క కురంగట నుం
డిన చెలిఁగని తద్గురునకు
ననువుగఁ దెలుపు మన నతని ♦ కది యిట్లనియెన్॥ 12

టీక శివ॥ అని వశనిటువలెన్ = అనుచు కూతురిని యీ విధముగా, తద్గురునకున్ = ఆ తండ్రికి (హిమవంతున కనుట) తరిమ్మావిషయము సుగమము.

టీక చంద్ర॥ వశనిటువలెన్ = భార్య నీవిధముగా, తద్గురునకున్ = ఆ బృహస్పతికిని, అనువుగఁ దెలుపుమనన్ = యుక్తియుక్తముగాఁ దెల్పుమనఁగా.

టీక. సారంగ॥ వశనిటువలెన్ = భార్య నీ విధముగా, తద్గురునకున్ = ఆ రాజునకు

శా॥ ఓ సుస్వాంత ధరేశ ధీర వినుమా ♦ యొప్పారు నిచ్చోటి కౌ
రే సారంగధరుండు భాసురముగా ♦ నేతెంచి యుంటన్ మహో
ల్లాసా ప్తిన్ సతి గొప్పజేయుటది యా ♦ లాయుండ నీయాత్మజుం
డీ సీమంతిని బాధపెట్టెనఁట నా ♦ కే లజ్జయోఁ దెల్పఁగన్ ॥ 13

టీక శివ॥ ఓ సుస్వాంత = ఓ మంచిమనస్సుగలిగినట్టి, ధరేశ = పర్వతనాయకా, ధీర = ఓధైర్యవంతుఁడా, వినుమా = ఆలకింపుము, ఔరే = ఆశ్చర్యము, ఒప్పారు నిచ్చోటికిన్ = చెన్నారునట్టి యిచ్చటికి, భాసురముగాన్ = ప్రకాశమానముగా, సారంగధరుండు = ఈశ్వరుఁడు, ఏతెంచి యుంటన్ = వచ్చియుండుటయును సతి = పార్వతీదేవి, మహోల్లాసాప్తిన్ అధిక సంతోషము యొక్క కలిమిచే, గొప్పఁజేయుట = గౌరవించుటయును, అదియాలాయుండనీ = అయ్యది యట్లుండనిమ్ము, తెల్పఁగన్ = తమకు నెఱిఁగించుటకు, నాకేలజ్జయౌన్ = నాకే సిగ్గగుచున్నయది, ఆత్మజుండు =

మన్మథుఁడు, ఈ సీమంతినిన్ = ఈ చేడియను, బాధపెట్టెనఁట = వేదన నొందించినాఁడట (అనఁగా శంకరుని పెండ్లాడవలయుననే యుద్దేశ్యముతో నాతనిం గూర్చి తపస్సు సేయుటవలన నాశంకరుడు ప్రసన్నమగుటయును వానిని పూజించి వలపునొందియుండు నంతలో సతనుఁడు బాణపరంపరలను పార్వతిపై నిగుడించి బాధపెట్టినాఁడట యని హిమవంతునితో చెలికత్తియ తెల్పెనని ఫలితార్థము)

టీక చంద్ర॥ ఓసుస్వాంత = ఓ మంచి మనస్సుగలవాఁడా, ధరేశధీర = పర్వతాధీశునివంటి ధైర్యముగల యో బృహస్పతి, వినుమా = ఆల కించుము, ఔరే = ఆశ్చర్యము, ఒప్పారు నిచ్చోటికి = తనరారునట్టి యిచ్చ టికి, భాసురముగాన్ = ప్రకాశమానముగా, ఏతెంచియుంటన్ = మీ యింటి యందున వచ్చియుండుటయును, సతి = నీ భార్యయగు తారాదేవి, మహోల్లాసాప్తిన్ = అధికసంతోషము యొక్క కలిమిచే, గొప్పఁజేయుట = పెంచి పెద్దఁజేయుటయును, అది యాలాయుండనీ = అయ్యది యట్లుండ నిమ్ము, తెల్పఁగన్=తమకు నెఱిఁగించుటకు, నాకే లజ్జయౌన్ = నాకేసిగ్గగు చున్నయది, ఆత్మజుండు = మన్మథుడు, ఈ సీమంతిని' బాధపెట్టెనఁట = ఈ చేడియను వేదననొందించి నాడఁట (అనఁగా నీయనుజ్ఞప్రకారము చంద్రుని పోషింపుచున్నయది గాని నీవిన్ని దివసములు రాకుండుటవలన నీపైని వలపు గలుగుటచే మన్మథుఁడు బాధపెట్టుచున్నాఁడని పల్కెనని ఫలితార్థము.)

టీక. సారంగ॥ ఓ సుస్వాంతధరేశ = ఓ మంచిహృదయముగల భూమీశ్వరా, ధీర = ఓ ధైర్యవంతుఁడా, వినుమా = ఆలకించుము; ఔరే = ఆశ్చర్యము. సారంగధరుండు = సారంగధరుఁడను నీ కుమారుఁడు, ఒప్పారు నిచ్చోటికి = ఎసలారు నిచ్చటికి, భాసురముగాన్ = ప్రకాశ మానముగా, ఏతెంచియుంటన్ = వచ్చియుంటయును, సతి =

నీభార్యయగు చిత్రాంగి, మహోల్లాసాప్తిన్ = అధికసంతోషము యొక్క-
కలిమిచే, గొప్పఁజేయుట = గౌరవించుటయును, అదియాలాయుండన్ =
అయ్యది యట్లుండఁగా, నీయాత్మజుండు = నీకుమారుఁడైన సారంగధరుండు,
ఈసీమంతిని బాధపెట్టెనఁట = ఈచేడియను వేదననొందించెనఁట, తెల్పఁగన్ =
మీకు తెల్పుటకు, నాకేలజ్జయౌన్ = నాకే సిగ్గగుచున్నయది.

సీ॥ కాననమున నొంటి • గా నుండె జవ్వని
యిదియె కదామంచి • యదనటంచు
నీయాత్మజుండు స్వ • కీయాప్త యుక్తుఁడై
కలరవంబులతోడ • గంతు లిడుచుఁ
గడఁకమె న్నిచటికి • ఖచరమున్ బంపి యా
వంకన నాతఁడు • వచ్చి మిగులఁ
దమిఁగొల్పునట్టి గో • తతిని గుప్పుచుఁబైనిఁ
బడునంతలో నాపె • భయముఁజెంది

గీ॥ వాని పసనముఁబట్టి య • వ్వారి గాఁగఁ
గేకలిడ మేమువచ్చినఁ • గెరలి యతనుఁ
దగుటఁ గనరాక చనెదాని • నందె యునిచి
నిన్ననే కద యిట్లాట • నిర్మలాత్మ 14

టీక. శివ॥ జవ్వని = యౌవనవతియైన పార్వతీదేవి, కాననమునవొంటిగా నుండెన్ = అరణ్యమునందునఁ దలిదండ్రులను విడచియొంటి పాటున నుండిన యది, ఇదియె కదా మంచియదనటంచున్ = మంచి సమయమిదియేకదా యను కొని, ఈ యాత్మజుండు = ఈ మన్మథుఁడు, స్వకీయాప్తయుక్తుఁడై = తన హితుఁడైన వసంతునితో కూడుకొనినవాఁడై, కలరవంబులతోడన్ = తనసైన్య మైన కోయిలలతో, గంతు లిడచున్ = దూఁకులు బెట్టుచు, కడఁకన్ = యత్న ముచే, మున్ను = ముందుగా, ఇచటికి = ఇచ్చోటికి, ఖచరమున్ బంపి =

బాయువును పంపించినవాఁడై, అపంకసన్ = ఆపైపుననే, అతఁడువచ్చి = ఆమన్మథుఁ డేగుదెంచి, మిగులన్ = హెచ్చుగా, తమిఁగొల్పునట్టి = వలపుఁ గూర్చు నటువంటి, గోతతిని గుప్పుచున్ = బాణపరంపరలను ప్రయోగింపుచు, పైనిఁబడునంతలో = మీదఁబడిన యంతనే, ఆమె = అయమ, భయముఁజెంది = భీతినొందినదై, వనిపసనముఁబట్టి = ఆ మన్మథుని యనికిసిఱట్టి, అవ్వారి గాఁగన్ = విస్తారముగా, కేకలిడన్ = ఎల గెత్తియఱువఁగా, మేమువచ్చినన్ = ఒలికత్తియేమగు మేము రాఁగా, కెరలి = విజృంభించి, అతనుఁడగుటన్ = ఆ మన్మథుఁడు శరీరములేని వాఁడగుటవలన, దానినందెయునిచి = ఆ చేడియ నచ్చటనేయుంచి, కనరాకచనెన్ = అగుపడక తిగినవాడాఁయెను, నిర్మలాత్మ = కల్మషరహితమైన హృదయముగల యోహిమవంతుఁడా, ఇట్లొట = ఇట్లు జరిగినది, నిన్ననేకద = నిన్నటి దివసమేకదా.

టీక. చంద్ర, కాననమున = గృహమునందున, తతిమ్మావిషయము శివకథకు సమానము.

టీక సారంగ॥ జవ్వని = యౌవనవతియైన చిత్రాంగి, కాననమున నొంటిగానుండెన్ = గృహమునందున పతునిఁబాసి యొంటరిగానుంగిన దాయెను, ఇదియె కదా మంచియదనటంచున్ = మంచిసమయ మిదియే కదా యనుకొని, నీయాత్మజుండు = నీకుమారుఁడైన సారంగధరుండు, స్వకీయాప్తయుక్తుడై = తన మిత్రులైన సుబుద్ధి మొదలగు వారలతోఁ గూడుకొన్నవాఁడై, కలరవంబులతోడన్ = పావురములతోడ, గంతులిడుచున్ = దుముకులుబెట్టుచు, కడఁకన్ = యత్నముచే, మున్ను = ముందుగా, ఇచటికి = ఇచ్చోటికి, ఖచరవన్ఒకపి = పక్షి నొకదానిని బంపించినవాఁడై, అపంకసన్ = ఆసాకుతోడ, అతఁడుపచ్చి = ఆసారంగధరుఁడు బుత్తెంచి, మిగులఁ దమిఁ గొల్పునట్టి = మిక్కిలి వలపుఁగూర్చునటువంటి,

గోతతిని గుప్పుచున్ = వాక్యసముదయమును ప్రయోగింపుచు, పైనిఁ బడునంతలోన్ = మీదఁ బడునంతలోపల, ఆమె భయమందెంది, ఆ చిత్రాంగి భీతినొందినదియై, వాని వసనమున్ బట్టి = ఆసారంగధరుని వస్త్రమును బట్టుకొని, అవ్వారి గాఁగన్ = విస్తారమగునట్లుగా, కేకలిడన్ = బిగ్గరగా నఱవఁగా, మేమువచ్చినన్ = బలికత్తియలమగు మేము వచ్చినంతనే, దాని నందెయునిచి = ఆవస్త్రమునందే యుంచినవాఁడై, కెరలి = విజృంభించి, అతనుఁదగఁటన్ = అధికుఁడైనందువలన, కినరాకఁ జనెన్ = కినపడకుండ నట్లుగా నేగినవాఁడాయెను, నిర్మలాత్మ = కల్మషరహితమైన హృదయముగల యో రాజనరేంద్రా, ఇట్టొట = ఈ విధముగా జరగడము, నిన్ననేకద = నిన్నటి దివసమేకదా, సంశయార్థములుగా నుండిన శబ్దములను శబ్దార్థ చంద్రికలోఁ జూడదగును.

క॥ నిన్నటి నుండియు నీ సతి
యన్నము నిద్దురను గాన • దాయెను గద నీ
విన్నాళ్లదాక పళ యెటు
లున్న విచారము నెఱుఁగ • కుండుట తగునా ॥ 15

టీక శివకథలో, ఈసతి = ఈపార్వతీదేవి, చంద్ర సారంగధర కథలలో, నీసతి = నీ యిల్లాలు, అనియును, శివకథలో, పళయెటులున్న విచారమున్ = భూతునెటుండిన నిశ్చయమును, చంద్ర సారంగధర కథలలో, నీభార్య యెట్లుండిన నిశ్చయమును, అనియును మార్చుకొనునది, తతిమ్మా విషయము మూడిఁట సమానము, సుగమము

క॥ ఎపుడు గురుఁ డిటకుఁ వచ్చునొ
ఎపు డీగతి చెలులవలన • నెఱిఁగింతునొ నే
నెపు డీతని గొంతునొ నా
కెపుడో కల్యాణ మగట • యుఁక నని తలఁచున్ ॥ 16

టీక శివ॥ గురుఁడు = తండ్రి, ఈశుని = శంకరుని, కల్యాణము = పెండ్లి, తతిమ్మా విషయము సుగమము

టీక చంద్ర ॥ గురుఁడు = బృహస్పతి, ఈశుని = భర్తను, కల్యాణము = శుభము, తతిమ్మా విషయము సుగమము.

టీక సారంగ॥ గురుఁడు = రాజు, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము

క॥ అని యిటుల విన్నవించిన
విని హా యిట్లాయె నఁటవె ♦ విధియుండినఁ ద
ప్పునె యెరిఁకేని చెలియని
తన వశతో నిట్టులనుచుఁ ♦ దనర వచించన్॥

టీక॥ సుగమము

గీ॥ బాలికామణి తావక ♦ వాంఛ యేమొ
నేడు నేనేమి సేయ య ♦ త్నింప వలెనొ
తెలుపు మేలాటి పనినైన ♦ సలుపనేర్తు
ననిన నాయన కామె యి ♦ ట్లనుచుఁ బలికె॥ 18

టీక. శివకథలో, నాయనకు = తండ్రియైన హిమవంతునకు, చంద్ర సారంగధర కథలలో, అయనకు, అనిమాత్రము భేదము, తతిమ్మా విషయము సుగమము. మూఁడిట సమము.

సీ॥ అరవింద మకరంద ♦ మిరవొందఁగను పొంద
క మిళింద మిల్లింద ♦ గమికిఁ జనునె
క్షణదా రమణుసార ♦ ఘృణిఁ గోరక చకోర
ము దుషారమును జేర ♦ మొనసి చనునె

ఘనచూతమున లేత • నన మేతఁగొను పూత
      పికజాత మల యాత • లకును జనునె
పొగరెక్కు కరియక్కు • పొలనెక్కుడుగ మెక్కు
      చును జొక్కు హరి కొక్కుఁ • దినఁగఁ జనునె

గీ॥ బుధజనస్తోత్ర పాత్ర వి • స్ఫూర్తి కీర్తి
కృత సిత త్రిభువనుఁ డౌచు • సతత మెసక
మెసఁగు పరమేశు కల్యాణ • మెనయఁ గోరు
కామినీమణి యితర కాం • క్షలకుఁ జనునె ॥ 19

టీక. అరవింద మకరందమున్ = తమ్మిపూఁ దేనియను, ఇర వొందఁగను పొందక = ఒప్పగునట్లుగా వహింపక, మిళిందము = తుమ్మెద, ఇల్లింద గమికిఁ జనునె = ఇంద్రవల్లి వృక్షముల సముదయమునకుఁ బోవునా? క్షణదారమణు = నిశాపతియైన చంద్రునియొక్క, సార = శ్రేష్ఠమైన, ఘృణిఁగోరక = కిరణమును గోరక, చకోరము = వెన్నెలపులుఁగు, తుషారమును జేరన్ = మంచును జేరుటకు, మొనసి చనునె = యత్నించి పోవునా, ఘనచూతమునన్ = అతిశయమైన మామిడిచెట్టుమీద, లేతననన్ = మెత్తని చిగురుటాకును, మేతఁగొను = ఆహారముగాఁ గైకొనునట్టి, పూత = పవిత్రమైన, పికజాతము = కోయిలల గుంపు, అల = ఆయొక్క, ఈతలకును జనునె = ఈతచెట్లకుఁ బోవునా, పొగరెక్కు కరి = మదమెక్కినట్టి యేనుంగుయొక్క, అక్కుపొలను = రొమ్ముమాంసమును, ఎక్కుడుగ మెక్కుచును జొక్కు = మిక్కిలిగా భక్షింపుచు పారవశ్యమును జెందెడు, హరి=సింహము, కొక్కుఁ దినఁ గఁ జనునె = పందికొక్కును భక్షింపఁ గాఁ బోవునా, బుధజనస్తోత్ర పాత్ర = దేవతాజనములకు స్తోత్రార్హమగు, మఱియు, పండితజనములకు నుతింపనర్హమగు, విస్ఫూర్తి = ప్రకాశమానమైన, కీర్తి = యశముచేత, కృత = చేయఁబడిన, సితత్రిభువనుఁడౌచున్ = తెల్లనగు ముల్లోకములు గలవాఁడగుచు, సతతమున్ = నిరంతరమును, ఎసకమెసఁగు = ఉద్రేక మతి

శయించునట్టి, పరమేశ = ఉత్కృష్టమైన శంకరునియొక్క, మఱియు, ఉత్కృష్టమైన భర్తయొక్క, కల్యాణ మెన గంగోరు = వివాహమును పొందఁ గోరునట్టి, మఱియు, శుభమును బడయఁగోరునట్టి, కామినీమణి = నారీ రత్నము, ఇతరకాంక్షలకుఁజనునె = లాఠి కోర్కెలకుఁబోవునా (పోనేరదనుట)

అనఁగా నీ సీసగీతి వ్యాఖ్యానముతో, మఱియు, అనియర్థాంతరముఁ జూపి నందున, శివ చంద్ర సారంగధర కథాభేదములకు నుపయోగించు కొనవలయు నని గ్రహించునది.

క॥ నేఁడేని మదీప్సితపుం
జాడ నెఱుఁగ వేను నీ వ • శన్ గానిఁక మా
టాడవలదు నీ ముద్దుల
కోడల సద్భ్రాంతిఁ దాక • కుండు మెడవుగన్ ॥ 20

టీక. శివ॥ నేడేని = ఇప్పుడైనను, మదీప్సితపుం జాడ నెఱుఁగవు = నేను కోరఁబడిన విషయమును గుర్తెఱుంగ కున్నావు, ఇఁక మాటాడవలదు = ఇంక పలుకవద్దు, నీ వశన్ గాను = నీ కూతురను గాను, నీ ముద్దులకు = నీ యాదరములకు, ఓశన్ = లోగియుండుదానను గాను, ఎడవుగన్ = దూరముగా, లసద్భ్రాంతిన్ = మనోజ్ఞమైన భ్రమణముతో, తాకకుండుము = అంటుకొనకుండుము.

టీక. చంద్ర॥ నీవశన్‌గాను = నీ భార్యనుగాను, తతిమ్మావిషయము శివకథకు సమానము

టీక సారంగ॥ నేడేని = ఇప్పుడైనను, మదీప్సితపుం జాడ నెఱుఁగవు = నేఁగోరఁబడిన కోర్కెన్ గుర్తెఱుంగ కున్నావు, ఏను నీవశన్ గాను = నే నీభార్యనుగాను, ఇఁక మాటాడవలదు = ఇంక మీద పలుకవద్దు, నీ ముద్దులకోడలన్ = నీమనోజ్ఞమైన కోడలను, ఎడవుగన్ = దూరముగా, సద్భ్రాంతిఁ దాకకుండుము = లెస్సయగు భ్రమణముతో నంటుకొనక యుండుము.

క॥ అని మూర్ఛా పరవశయై
తనువున్ ధర వ్రాల్చినట్టి • తన్విన్ ధీతిన్
గని లేవఁదీసి తొడపై
ననువు పరచి యూతఁ దిట్టు • లని విలపించెన్॥ 21

టీక. సుగమము.

ఉ॥ ఏటికి యిన్నినాళ్ళు సతి • నిచ్చట నొంటిగ నుండఁజేసి యీ
నాటికి నేనటన్ బిగి త • నంబున నుండితి మొన్న నేని యి
చ్చోటికి వచ్చియున్న నిటు • జొప్పడకుండునొ యేమొ యింక నే
నేటికిఁ బోయి దొర్లుదున • యింగల మందునఁ బొర్లువాఁడనా॥

టీక. సుగమము.

గీ॥ అక్కటా నాదు వశయాత్మ • జార్తి గాంచి
ఈగతి వహించె ననుచు నే • నెవరితోడఁ
జెప్పికొందును నేనేమి • సేతు నెందు
దూఱుదును విధినేమని • దూఱుదు నిఁక॥ 23

టీక. శివకథలో, నాదువశయాత్మ జార్తిఁ గాంచి = నాపుత్రిక మద
నార్తిని పొందినదియై, అనియును, చంద్రకథలో, నాభార్య మదనార్తిని వహించి
నదియై, అనియును, సారంగధరకథలో, నాభార్య నాకొడుకుచేత దుఃఖమును
పొందినదియై, అనిమాత్రము భేదము తక్కిన్మా విషయము మూఁడిఁట సమము
సుగమము

క॥ నిద్రాహారము లెఱుఁగక
భద్రాంగి కృశించి మూర్ఛఁ • బడసియు వ్రాలెన్

రుద్రుఁడెటుఁ జేయునో యీ
సద్రమణికి నాన్పుఁజూడ • స్తంభించు సహో॥ 24

టీక సుగమము.

క॥ అని విలపించెడు తఱి మే
కొనిమూర్ఛన్ దెలిసిలేచి • గురువరుఁ గని యి
ట్లనుచున్ వశ భాషించెను
వనితల చిత్తములు దెలియ • వశమె ధరిత్రిన్॥ 26

టీక. శివకథలో, వశ =పుత్రికయైన పార్వతీదేవి, గురున్ = తండ్రిని, వరున్ = శ్రేష్ఠుని, కని = చూచినదియై, అనియును, చంద్రకథలో, వశ = భార్యయైన తారాదేవి, గురున్ = బృహస్పతిని, వరున్ = భర్తను, కని = చూచినదియై, అనియును, సారంగధరకథలో, వశ = భార్యయైన చిత్రాంగిదేవి గురున్ = రాజును, వరున్ = భర్తను, లేక, గురువరున్ = అతిశయుఁడైన రాజును, లేక, అతిశయుఁడైన భర్తను, లేక, రాజరాజును, అనిమాత్రము భేదము, తతిమ్మా విషయము మూఁడిట సుగమము.

ఆ॥వె॥ ఓ మహానుభావ • నామీద దయలేక
ఒంటిదానిఁ జేసి • యుంటఁ దగునె
ఇట్టివాఁడ వగుట • నే కద సారంగ
ధరుఁడు వశము గాని • సరణి నుంట॥ 26

టీక. శివ॥ ఒంటిదానిఁజేసి యుంటదగునె = నాకు పెండ్లిఁజేయక జత లేని దానినిఁగాఁ జేసియుండుట యొప్పునా, ఇట్టివాఁడ .. సరణినుంట = నీ విటువంటివాఁడవు గావుననే శంకరుఁడు నాకు లభించని విధము నుండుట, తతిమ్మా విషయము సుగమము

టీక. చం॥ ఒంటి దగునె = నన్నొక్కదానినిఁగాఁజేసి పోయి
పేవా యజ్ఞమునం దిన్నినాళ్ళుండుట యొప్పునా, ఇట్టి సరణి
నుంట = నీవెప్పుడు నిల్లువిడచి యుండువాఁడవగుటచేకదా చంద్రుఁడు నాకు
వశముగానితెఱఁగున నుండుట (అనఁగా మాటవినని యట్లనుట) తతిమ్మా
విషయము సుగమము.

టీక సారంగ॥ ఇట్టి , సరణినుంట = నీవిటువంటి వాఁడవు
గావునవే సారంగధరుఁడు శక్యముగాని విధముగా నుండుట, తతిమ్మావిషయము
సుగమము

క॥ ఆ సారంగధరుని నిజ
వాసంబును నీ వెఱుంగ • వా యదె కనుమా
భాసిల్లెఁ బయోధరమును
డాసియఁ జీరి నను గాంచ • డాయె నయదయన్॥ 27

టీక శివ॥ ఆ సారంగధరుని = ఆ జింకతాల్పరియైన శంకరునియొక్క,
నిజవాసంబును నీవెఱుంగవా = స్వకీయమగు నివాసస్థానము (అనఁగాఁ
కైలాసము ననుట) నీ వెఱుఁగకున్నావా, అదె కనుమా = ఆ కనుపడు
నదియే చూడుమా, పయోధరమును డాసియున్ = మేఘమును సమీపించినదియై
భాసిల్లెన్ = ప్రకాశించెను, దయన్ = కృపచేత, ఎనయన్ = నన్నున్
బరిగ్రహించుటకు చీరినను = ఆహ్వానించినచో, కాంచడా = కనుఁగొనక
యుండునా (కనుఁగునునే యనుట) అనఁగా శంకరుని నివాసమైన కైలాసము
హిమవన్నగ ప్రాంతమున నెత్తుగా నుండుటవలన నచటికిఁ గనుపడుచునే
యున్నదని గ్రహించునది

టీక చంద్ర ॥ ఆ సారంగధరుని = ఆ జింకతాల్పరియైన చంద్రుని
యొక్క, నిజవాసంబును నీ వెఱుంగవా = స్వస్థానమును నీవెఱుఁగకున్నావా;
అదె కనుమా = అల్లదిగో చూడుమా, పయోధరమును డాసియున్ = మేఘమును

సమీపించి, భాసిల్లెన్ = ప్రకాశించెను, నయదయన్ = నీతియుక్తమైన కరుణతో, చీరినను = పిల్చినప్పటికిని, కాంచడాయెన్ = చూడనే చూడడాయెను

అనఁగా చంద్రుఁడెప్పుడును గగనమునఁ జేరుకొని పిల్చినను రాఁక నచ్చటనే యుండునని తార బృహస్పతితో వచించినటుల గ్రహింగునది

టీక సారంగ ॥ ఆ సారంగధరుని = నీకుమామఁడైన సారంగధరుని యొక్క, నిజ = స్వకీయమైన, వాసంబును, వస్త్రమును, నీవెఱుంగవా = నీ వెఱుఁగకున్నావా, అదె కనుమా, అల్లదిగో చూడుమా, భాసిల్లెన్ = ప్రకాశించెను, పయోధరముకు దాసియున్ = నాస్తనమును సమీపించి, చీరి = చీల్చినవాఁడై, నయదయన్ = నీతియుక్తమైన కరుణతో, నన్నుఁగాంచడాయెన్ = నన్నుఁజూడడాయెను.

అనఁగా సారంగధరుని వస్త్రమును నీవెఱుంగకున్నావా, యల్లదిగో ప్రకాశింపుచుండెఁ గాంచుము నన్నాతఁడు నీతియుక్తమైన దయతోఁ జూడక నాస్తనముఁబట్టి చీల్చెనని రాజనరేంద్రునితోఁ జిత్రాంగి వచియించిన దాయెనని తాత్పర్యము.

గీ॥ వేగ సారంగధరుని రా • వించి యతని
పెంపు విషయము నాత్మ నూ • హింపుచు నిఁక
ముందు నీ శివ సంయోగ • ము సెడనట్లు
నాకుఁ గల్యాణమును జేయ • వే కృపాబ్ధి ॥ ౨౮

టీక శివ-॥ వేగన్ = శీఘ్రముగా, సారంగధరుని రావించి = శంకరుని బిలిపించిన వాఁడవై, అతని పెంపు విషయమున్ = ఆ శంకరుని యొక్క యభివృద్ధి విషయమై, ఆత్మ నూహింపుచున్ = మదిలో యోచనఁ జేయుచు, ఇఁకముందు - ఇంకమీఁదట, కృపాబ్ధి - దయాసము

ద్రుఁడవగు నోతండ్రీ, ఈ శివసంయోగము సెడనట్లుగా = ఈ శంకయని కూటమి చెడిపోని విధముగా, నాకుఁ గల్యాణమును జేయవే = నాకుఁ బెండ్లి జేయ గదవే (అనఁగా నన్ను శంకరునకిచ్చి వివాహముఁ జేయమనె ననుట)

టీక చంద్ర॥ కృపాబ్ధి = దయాసముద్రుఁడవగు నోనాథా, వేగగా = శీఘ్రముగా, సారంగధరుని రావించి = చంద్రునిఁ బిలిపించి, అతని పెంపు విషయము నాత్మనూహింపుచుగా = వాని యభివృద్ధివిషయమై మదిని యోచింపుచు, ఇఁకముందుగా = ఇంకమీఁదట, నీ శివసంయోగము సెడనట్లుగా = నీ యొక్క శుభమైన కూటమి చెడని విధముగా, నాకుఁ గల్యాణమును జేయవే = నాకుఁ మంగళమును గూర్పఁగదవే, (అనఁగా నిఁకమీఁదట నీవు నన్ను విడువక యుండవలెనని గ్రహించునది )

టీక. సారంగ॥ కృపాబ్ధి = దయాసాగరుండవైన యోనాథా, వేగగా = శీఘ్రముగా, సారంగధరుని రావించి = సుకుమారుఁడగు సారంగధరుని రప్పించినవాఁడవై, అతని పెంపువిషయము నాత్మనూహింపుచుగా = వానిని నాశముఁజేయు విషయమై మనసులో నాలోచింపుచు, ఇఁకముందుగా = ఇంకమీఁదట, నీ శివసంయోగము సెడనట్లుగా = నీమంగళకరమైన కూటమి చెడిపోని విధముగా, నాకుఁగల్యాణమును జేయవే = నాకు శుభమును గూర్పఁగదవే.

ఆ॥వె॥ కరుణ లేక యట్లుఁ • గాదందువేని నే
నొంటిదాన నగుచు • నుంట కన్న
ముక్కు మూసుకొనియు • మొనసి యూపిరి నుగ్గ
పట్టి యిటనె చనుట • బాగుగాదె॥ 29

టీక. శివ॥ కరుణలేక = దయలేనివాఁడవై, అట్లుఁ గాదందు వేని = నన్నా విధముగా శివునకిచ్చి వివాహము సేయకనినచో, ఒంటిదాననగుచు నుంట

కన్నన్ = జోడులేని దాననై (అనఁగా భర్తలేని దాననైయనుట) ఉండుట కంటె, ముక్కుమూసుకొనియున్ = నాసికమును మూసుకొని, మొనసి = పూని కతో, ఊపిరినుగ్గపట్టి = ప్రాణాయామ యోగముచేత , ఇటనె = ఇచ్చోటనే, చనుట = తగియుండుట, కాఁగాదే = శ్రేయస్కరము గదా

టీక చంద్ర॥ ఒంటిదాననగుచు నుంటకన్నన్ = నిన్ను విడిచి యొంట రిగా నుండుటకంటె, ముక్కు మూసుకొనియున్ = నాసికమును బిగఁబట్టి, మొనసి = పూన్కితో, ఊపిరి నుగ్గపట్టి = ప్రాణమును బంధించి, ఇటనె = ఇచ్చోటనె, చనుట = చచ్చిపోవుట, కాఁగాదె = మేలుగదా, తక్కినవిష యము సుగమము, చనుట యనుశబ్దము, తగుటకును చచ్చుటకును చెల్లునని గ్రహించునది.

టీక. సారంగ॥ చంద్రకథను సమానము

అచ్చ తలకట్ల సర్వలఘుగీతము

గీ॥ నగసదన ఘనతరయశ • నగరదమన
నవధవళకరధర తత • భవభయహర
ప్రమథవర యనవరత స • దమర వరద
హర గరళగళ భవ కన • దపమ నయన॥ 30

ఈ పద్యము నచ్చుతలకట్లుగల లఘువులయక్షరములతో శివస్తోత్రముగా రచియింపఁబడినట్లు గ్రహించునది.

టీక నగసదన = పర్వతమే గృహముగాఁ గలవాఁడా, ఘనతర యశ = అధికతరమైన కీర్తిగలవాఁడా, నగరదమన = త్రిపురములఁ నడంచిన వాఁడా, నవ = నూతనమైన, ధవళకర = చందమామను, ధర = దాల్చిన వాఁడా, తత = విస్తృతమైన, భవభయహర సంసారభీతి నడగించువాఁడా, ప్రమథవర = ప్రమథుల కధీశుఁడవైన వాఁడా, అనవరత = నిరంతరము,

సత్ = శ్రేష్ఠమైన, అమరవరద = దేవతలకుఁ గోర్కెలనిచ్చువాఁడా, హగ = హరనామము గలవాఁడా, గరళగళ = విషమును కంఠమందుఁ గల వాఁడా, భవ = భవనామముగలవాఁడా, కనత్ = ప్రకాశమానమైన, అసమ = బేసిసంఖ్యయగు, నయన = నేత్రములుగల యో శంకరా

క॥ ఇదె నీలో నైక్యము నొం
దెదఁ గనుమని శంకరుని ను • తింపుచుఁ గడు బె
ట్టిదముగను నాసఁగైకొని
కదలక కూర్చుండెఁ జెలులె • కద సాహసికుల్॥ 31

టీక సుగమము మూఁడిట సమము.

క॥ అపు డాయమను గురుఁడు నే
రుపుతో నాస విడఁజేసి • రుషయేలె సతీ
ఇపుడె భవదిచ్ఛ దీర్చు నె
చపలమొకో యింత దుడుకు • సలుపఁగఁ దగునా॥ 32

టీక॥ శివకథలో, అయమను = ఆ పార్వతీదేవిని, గురుఁడు = తండ్రియైన హిమవంతుఁడు, చంద్ర సారంగధర కథలలో, ఆయమను = ఆ విదను, గురుఁడు = బృహస్పతియును, రాజును, అని మాత్రము భేదము తతిమ్మావిషయము సుగమము మూడిఁట సమము.

క॥ అని తనపురమునకును దో
డ్కొని చని సతికెంతొ ప్రీతిఁ • గూర్చుచు నుండన్
గని యొక చెలి సారంగధ
రునిఁ జేరియు నచటి తెఱఁగు • రూఢిగఁ దెలిపెన్॥ 33

టీక శివ॥ తనపురమునకును = తనయొక్క యోషధీప్రస్థపురమునకు,

అనియును, చంద్ర సారంగధరకథలలో, తనమేడకు, శివ, సతికిన్ = పార్వతికి, చంద్ర సారంగధరకథలలో, భార్యకు, శివ, ఒక చెలి = ఒకానొక చెలికత్తియు, చంద్ర సారంగధర కథలలో, ఒకానొక స్నేహితుఁడు, తతిమ్మా విషయము సుగమము మూఁడిఁట సమము.

గీ॥ ఇటులఁ దెల్పిన నాసతి ♦ యెంత జాణ
ఔర గురునకు నాపైని ♦ వేరే సంశ
యము గలుగనట్లు బోధించి ♦ యాత్మలోన
నేఁదలంచిన రీతిగా ♦ నే యొనర్చె॥ ౮౪

టీక శివ॥ ఇటులఁ దెల్పినన్ = ఈ విధముగాఁ బార్వతీ హిమవంతుల విషయమంఁటయును చెలికత్తియ యొక్కతె శంకరునకు నెఱిఁగింపఁగా, ఆసతి యెంతజాణ = ఆ పార్వతీదేవి యెంతనేర్పరి, ఔర = ఆశ్చర్యము, గురున కున్ = తండ్రియైన హిమవంతునకు, నాపైని వేరె సంశయము గలుగనట్లు బోధించి = నామీద వేఱుగా సందేహము జనించనట్లుగా బోధఁజేసి, ఆత్మలోనన్ = హృదయమునందున, నేఁదలంచినరీతిగానే = నే నెంచుకొన్న విధముగానే, ఒనర్చెన్ = చేసినదాయెను (అనఁగా నేపెండ్లాడఁ దలంచినట్లుగానే యనుట)

టీక. చంద్ర॥ నేఁదలంచిన రీతిగానే యొనర్చెన్ = నేనెంచుకొన్నట్లు గానే చేసినదాయెను (అనఁగా వేరే నెపమును గల్పించి తనకును నాకును సంబం ధము లేనట్లుగా నెంచుకొనఁ జేయఁగలదని యనుకొన్నట్లుగానే చేసెనని చంద్రుఁడు దలంచినట్లు గ్రహించునది, తతిమ్మావిషయము శివకథకు సమానము

టీక. సారంగ॥ ఔర = ఆశ్చర్యము, గురునకు = నాతండ్రి యైన రాజనరేంద్రునకు, నాపైని వేరె సంశయము గలుగన్ = నా మీద యన్యథా సంకోచము జనించుటీరుగా, అట్లుబోధించి = ఆవిధ

ముగా బోధఁజేసిన ట్లయ్యె, నేఁడులంచినరీతిగానే, యొనర్చెన్ = నాకేమో యపాయము తేగలదని యనుకొన్నట్లుగానే చేసెను, తక్కిమ్మా విషయము సుగమము.

క॥ అని యోజింపుచు నేర్పుల
లను హితులను బరమహర్షు ♦ లను జెంగటికిన్
గొనకొని పిలిపించియు ని
ట్లని పల్కఁదొడంగె నాతఁ ♦ డతను భయాప్తిన్ ॥ 35

టీక. శివ॥ ఆతఁడు = అళంకరుఁడు, అతను భయాప్తిన్ = మన్మథ భయముయొక్క కలిమిచేత, పర = ఉత్కృష్టమైన, మహర్షులను = మహాఋషులను (అనఁగాఁ గశ్యపాది సప్తర్షుల ననుట) తక్కిమ్మావిషయము సుగమము.

టీక చంద్ర॥ హితులను = ఒలికాంద్రను, పరమ = ఉత్కృష్టమైన, హర్షులను = సంతోషముగల వారలను, తక్కిమ్మావిషయము శివకథకు సమానము

టీక సారంగ॥ ఆటఁడు = ఆ సారంగధరుఁడు, అతను = అధికమైన, భయాప్తిన్ = భీతియొక్క కలిమిచేత, తక్కిమ్మా విషయము చంద్రకథకు సమానము

సీ॥ హితులార క్రౌంచి మ♦ హిమవంతుఁడనఁదగు
నాగుధుండు ప్రియక ♦ న్య దరిశేగు
డెంచి నాడఁట నన్ గు ♦ ఱించి యారమణి క
ల్యాణము నొంద నా ♦ యనకు నేమొ
చప్పి తద్ధృదయము ♦ నొప్పించనఁట కాన
మీకు నాపైని జే ♦ ర్మి గలదేని

అమహాత్ముని కడ • కరుగుదెంచియు నాదు
సద్వర్తనంబు నె • సంగఁ దెలిపి

గీ॥ నాకుఁ గల్యాణ మగుట కీ • నాడె నిశ్చ
యంబుఁ జేసియు రారె య• టంచు బలుక
సరవి వారటు గోధర • గురునిఁ జేరి
ఎఱగి యిటువలె ననిరది • యెట్టు లనిన॥ ౪౬

టీక. శివ॥ హితులార = ఓమిత్రములారా, ప్రౌఢిమన్ = నేర్పుతో, హిమవంతుఁడనఁదగు నాగరుండు = హిమవంతుఁడనఁ జెల్లు నాధన్యుఁడు, ప్రియకన్యదరికి = తన ప్రియమైన పుత్రిక చెంతకు, ఏగుదెంచినాడఁట = పోయినాడంట, ఆరమణి = ఆచేడియ, కల్యాణము నొందన్ = పెండ్లియాడుట కొఱకు, నన్గుఱించి = నన్నుఁగూర్చి, నాయనకు నేమొచెప్పి = తండ్రి కేమియో చెప్పినదియై, తత్ = ఆతనియొక్క, హృదయమున్ = డెందమును, ఒప్పించెనఁట = ఒప్పుకొనఁజేసినదంట, కానన్ = కాబట్టి, మీకు నాపైనిఁ బేర్మిగలదేని = నామీద మీకు ప్రేమయున్నచో, అమహాత్ముని కడ కరుగుదెంచియున్ = ఆ విశాలహృదయుని చెంతకు పోయినవారలై, నాదుసద్వర్తనంబు నెసంగఁదెలిపి = నా యొక్క మంచినడవడి నతిశయముగా నెఱిఁగించి, నాకుఁ గల్యాణమగుటకు = నాకువివాహమగుటకై, ఈనాడె = ఈదివసముననే, నిశ్చయంబుఁజేసియురారె = వివాహనిష్కర్ష నొనరించిరాండు, అటంచుఁబలుకన్ = అని వచియింపఁగా, సరవిన్ = క్రమముగా, వారటున్ = అస ప్తర్షులా విధముగానే, గోధరగురునిజేరి = ఆ భూధరశ్రేష్ఠునిఁ జేరినవారలై (అనఁగా హిమవంతునను‌ట) ఎఱగి = నమస్కరించి, ఇటువలెననిరి = ఈక్రింద జెప్పఁబోవు విధముగా వచియించిన వారలైరి, అదియెట్టులనినన్ = అయ్యది యేలాగంటే.

టీక చంద్ర, హితులార = ఓచెలికాండ్రారా, ప్రౌఢిన్ = నేర్పుతో, వహిమవంతుఁ డనఁ దగు = గొప్పతనముగలవాఁ డనఁ

గాఁ జెల్లునట్టి, ఆగురుండు = ఆ బృహస్పతి, ప్రియకన్యదరికిన్ = ప్రియమైన కాంతవద్దకు, (అనఁగా తారవద్దకనుట) ఏగుదెంచినాఁడట = వచ్చియున్నాఁడంట, ఆరమణి = ఆచేడియ, కల్యాణమునొందన్ = తాను శుభమును బడయుటకు, నన్‌గుఱించి = నన్నుగూర్చి, ఆయనకు నేమొ చెప్పి = తన పెనిమిటికేమియో వచియించినదియై, తత్ = ఆయనయొక్క, హృదయమున్ = చిత్తమును, నొప్పించెనఁట = నొవ్వఁజేసెనఁట, కానన్ = కావున, మీకు నాపైని పేర్మిగలదేని = నామీద మీకు ప్రేమయుండినచో, అమహాత్ముని కడ కరుగఁదెంచియున్ = ఆ విశాలహృదయుని చెంతకు నేగినవారలై, నాదు సద్వర్తనంబు నెసంగఁదెలిపి = నాయొక్క నక్షత్రసంచారము నొప్పునట్లుగా నెఱిఁగించి, లేక, నా మంచినడవడి నతిశయించునట్లుఁదెలిపి, నాకుఁగల్యాణమగుటకున్ = నాకుమేలగుటకై, ఈనాఁడె = ఈదివసముననే, నిశ్చయంబుఁజేసియురారె = గట్టినమ్మకము నొనర్చిరాఁడు, అటంచుఁబలుకన్ = అని వచియింపఁగా, సరవి వారటన్ = క్రమముగా నా చెలికాండ్రావిధముగానే, గోధరగురునిఁజేరి = వజ్రధరుఁడైన యింద్రునిగురుని వద్దకుఁబోయి (అనఁగా బృహస్పతికడకనుట) ఎఱిగి = నమస్కరించి, ఇటువలెననిరి = ఈక్రిందఁ జెప్పఁబోవు విధముగాఁ బల్కినవారలైరి, అది యెట్లు లనినన్ = అయ్యది యే లాగంటె.

టీక. సారంగ, నాగురుండు = నాతండ్రియైన రాజనరేంద్రుఁడు, ప్రియకన్యదరికిన్ = ప్రియకాంతచెంతకు (అనఁగాఁ జిత్రాంగివద్దకనుట) గోధరగురునిఁజేరి = భూధరశ్రేష్ఠుని దరిఁజేరి (అనఁగా రాజనరేంద్రుని దరికనుట)

తతిమ్మా విషయము చంద్రకథకు సమానము.

(కన్యాశబ్దము పత్రికకును స్త్రీసామాన్యమునకుఁ జెల్లునని గ్రహించునది)

క॥ సారంగధరుం డజుని కృ
పారసమునఁ గలిగి నట్టి • పావనుఁ డమలా
కారుఁడు దురిత విదూరుఁడు
వీరుఁడు ధీరుఁడగు నట్టి • సుగుణుఁడు గలఁడే॥ 37

అనఁగా నజశబ్దము బ్రహ్మయందును శివునియందును వర్తించునుగావున పురాణభేదములవలన శివుఁడు బ్రహ్మపుత్రుఁడగుటచేతను చంద్రుఁడు బ్రహ్మాంశమునందున జనించుటచేతను సారంగధరుఁడు శివునివరప్రసాదమున జనించుటచేతను, సారంగధరుం డజుని కృపారసమునఁ గలిగినట్టి పావనుఁడని ప్రయోగింపఁబడినట్లు గ్రహించునది, తక్కిన విషయము మూఁడిటసమము సుగమము

క॥ హితవచనము సుమి యిది సుత
మతిఁ గుదిరించుకొని తాము • మహితకరుండౌ
నతనికి ధృతినొసఁగియు నే
కతమాడక కూర్పఁగదవె • కల్యాణంబున్॥ 38

టీక శివ, ఇది = ఇయ్యది, హితవచనము సుమి = మంచివాక్యము సుమీ, తాము = తమరు, మతిఁగుదిరించుకొని = హృదయమును కుదురునట్లు జేసుకొని, మహితకరుండౌనతనికిన్ = శూలహస్తుఁడైనయాతనికి, (అనఁగా శంకరునకనుట) సుతన్ = నీకూతురగు పార్వతిని, ధృతిన్ = సంతోషముతో ఒసఁగియున్ = ఇచ్చినవాఁడవై, ఏకతమాడక = ఆలోచింపక, కల్యాణంబున్ = వివాహమును, కూర్పఁగదవె = ఒనగూర్పఁగదవే.

టీక చంద్ర, హితవచనముసుమి = మేమువచించునది మంచి వాక్యము సుమీ, తాము = తమరు, ఇదిసుత = ఇదిమొదలుకొని, మతిఁగుదిరించుకొని= మనస్సు కుదురుబాటుఁ జేసుకొని, మహితకరుండౌ నతనికిన్ = గొప్పకిరణములు గలవాఁడైన యాతనికి (చంద్రునకనుట) ధృతినొసఁగియున్ = సంతో

షము నిడినవాఁడవై, ఏకతమాడక = ఆలోచనసేయక, కల్యాణంబున్ = శుభమును, కూర్పఁగదవె = ఒనగూర్పఁగదవే

టీక సారంగ॥ మహితకరుఁడౌ నతనికిన్ = ఘనతరుఁడైన యాతనికి (అనఁగా సారంగధరున కనుట) తతిమ్మా విషయము చంద్ర కథకు సమానము.

గీ॥ అతఁడు సరియైన వాఁడు గా • దనుచు నీదు
ప్రియవధూమణి యనిన సం • దియము నొంద
వలదు తద్భాను నందు నెం • దులను లోప
మించుకేనియు లేదు గ • దే మహాత్మ॥ 39

టీక. సుగమము.

వ॥ అనిన విని యా గోధరగురుండు ఁపవద్దనుండిన కులాంగనవంకఁ బాఱఁజూచిన నామె యేమి యనకుండుటఁ గాంచి తనలోన నంగీకారంబున నూరకుండెనని భావించుకొని యందులకు సమ్మతించి యా ముహూర్తంబునకు సారంగధరుం దోడ్కొనిరండని విప్రవరులన్ మఱి కొందరన్ బనిచి వీరలకు సెలవొసంగిన వార లరుదెంచి సారంగధరునకుం దద్వృత్తాంతంబంతయు నెఱింగించి తోడ్కొని వచ్చునంతలో. 40

టీక. శివ॥ ఆ గోధరగురుండు = ఆ యొక్క భూధరాధికుఁడు (అనఁగా పర్వతశ్రేష్ఠుఁడైన హిమవంతుఁడనుట) కులాంగనవంకన్ = తనభార్యయైన మేనక వైపును, తనలోనన్ = తన హృదయమునందున, అంగీకారంబునన్ = సమ్మతితో, అందులకు సమ్మతించి = ఆ సప్తర్షులు ప్రపచించిన విషయమునకు నొప్పుకొని, ఈ ముహూర్తంబునకు = ఈనియమిత లగ్నమునకు, విప్రవరలన్ = బ్రాహ్మణ శ్రేష్ఠులను, సారంగధరునకున్ = లింగశాస్త్రి

యైన శంకరునకు, తతిమ్మా విషయము సుగమము

టీక. చంద్ర॥ ఆ గోధరగురుండు = ఆ వజ్రధరుండౌ యింద్రునకు గురువైన బృహస్పతి, లేక, కిరణధరుఁడౌ చంద్రునిగురువైన బృహస్పతి, లేక వాగ్ధరుఁడైన బృహస్పతి, తతిమ్మావిషయము శివకథకు సమానము.

టీక. సారంగ॥ ఆ గోధరగురుండు = ఆ యవనీధరాగ్రణి (అనఁగా రాజనరేంద్రుఁడనుట) తనలోన్ + అనంగీకారంబునన్ = తనహృదయములో సమ్మతి లేమిచే, అందులకు సమ్మతించి = కార్యయభిప్రాయమునకు నొప్పుకొని, విప్రవరులన్ = మిక్కిలి శ్రేష్ఠులను

తతిమ్మావిషయము సుగమము.

గీ॥ హిత పురోహిత బాంధవ • తతులఁ బాల
కులను రావించి యిందును • గూర్చి ముందు
జరుపవలసిన పనికి గో • ధరగురుండు
నరయుచున్నంత సారంగ • ధరుఁడు వచ్చె॥ 41

టీక. శివ॥ గోధరగురుండు = హిమవంతుఁడు, హితపురోహితబాంధవతతులన్ = స్నేహితులను పౌరోహితులను చుట్టముల సముదయమును పాలకులను = దిక్పాలురను, రావించి = పిలిపించినవాఁడై, ఇందునుగూర్చి = ఈ వివాహమును గురించి, ముందుజరుపవలసినపనికి = ఇఁకమీఁదట జరిగింపవలసిన కార్యమునకై, అరయుచున్నంతన్ = ఆలోచింపుచున్నంతలో, సారంగధరుఁడు వచ్చెన్ = శంకరుఁడు వచ్చినవాఁడాయెను

టీక చంద్ర॥ గోధరగురుండు = బృహస్పతి, హిత = స్నేహితుల యొక్కయు, పురోహిత = పౌరోహిత్యము జేయువారియొక్కయు, బాంధవ తతుల = చుట్టముల సమూహము యొక్కయు, బాలకునను రావించి = పిల్ల వాండ్రను రప్పించినవాడై (అనగా బడిపిల్లవాండ్ర నను బ) ఇందునుగూర్చి = చంద్రునిగుఱించి, ముందు జరుపవలసిన- పనికిన్ = ఇకమీదట జరిపించ వలసిన కార్యమునకై, అరయుచున్నంతన్ = విచారింపుచుండి నంతలో, సారంగధరుడువచ్చెన్ = జింకతాల్పరియైన చంద్రుడు వచ్చినవాడాయెను.

టీక సారంగ॥ పాలకులను = సామంతులను, అరయుచున్నంతన్ = విచారింపుచుండి నంతలో, తతిమ్మావిషయము శివకథకు సమానము.

సీ॥ వచ్చియున్నంతనే ♦ వాని నా గోత్రేశుఁ
డేకతమ్మున దివ్య ♦ దృష్టిఁజూచి
ఇంతకు మున్నితం ♦ డెంతయు నా సతిన్
జేపట్టుకొన్నట్టి ♦ పాపహారి
నావిధివశమున ♦ నాకు సంప్రాప్తించె
నని మదియందున ♦ హర్ష మొంది
ఈవరు నిప్పుడే ♦ భృత్యులారా విశా
రదులైన వారు బా ♦ రా గృహమున

గీ॥ విడచి రండని యానతి ♦ నిడినఁగాంచి
తత్క్షణంబున సారంగ ♦ ధరుని వెంబ
డించుకొని పోయి వారలై ♦ డింది వచ్చి
రహహ కానున్నపనిగాక ♦ యాగఁబోనె॥ 42

టీక శివ॥ వచ్చియున్నంతనే = శంకరుడట్లు నేతెంచియుండినంతలో, వానిని గోత్రేశుఁడు = శంకరు నాహిమవంతుఁడు, ఏకతమ్మునన్ = ఆలోచ

నతో, దివ్యదృష్టిఁజూచి = ఒప్పైన చూడ్కితో వీక్షించినవాఁడై, ఇంతకు మున్న = ఇంతకుపూర్వము, ఇతండు = ఈ శంకరుఁడు, ఎంతయున్ = మిక్కిలిగా, ఆసతిన్ = ఆ దక్షునికూతురైన సతీదేవిని, చేపట్టుకొన్నట్టి = భార్యగా గైకొనిన వాఁడగు, పాపహారి = దుష్కృదనాశుఁడు (అనఁగా శరుఁ డనుట) నావిధివశమునన్ = నా భాగ్యవశమున, నాకు సంప్రాప్తించెన్ = నాకు లభియించినాడు, అని మదియందున హర్ష మొంది = ఇట్లనుచు హృదయములో సంతోషించినవాఁడై, ఈవరున్ = ఈ పెండ్లికొడుకును, ఇప్పుడే = వెంటనే, భృత్యులారా = ఓ సేవకులారా, విశారదులైనవారు కారా = మీరలు నేర్పరులు కారా, ఆగృహమునవిడచి రండని = ఆ కనపడు గృహమునందున వదలిపెట్టి రాండటంచు, (అనఁగా విడిచియుంట ననుట) ఆనతినిడినఁ గాంచి = హిమవంతుఁ డాజ్ఞాపింపగాఁ జూచినవారలై, తత్క్షణంబునన్ = ఆక్షణములోనే, వారు = ఆభృత్యులు, సారంగధరుని వెంబడించుకొని పోయి = శంకరుని తోడ్కొనిపోయి, అట్లె డించివచ్చిరి = ఆవిధముగనే విడిది యింట దింపివచ్చిన వారలైరి, అహహ = ఆశ్చర్యము, కానున్నపని = అగుటకు సిద్ధముగానుండిన కార్యము, కాకయాగఁబోనె = అగునేకాని నిల్వఁబోవునా.

టీక చంద్ర॥ వచ్చియున్నంతనే = చంద్రుఁడిగుదెంచి కొన్ని దినములుండిన మీదఁట, వానిన్ = ఆచంద్రుని, ఆగోత్రేశుఁడు = ఆకులశ్రేష్ఠుడు, (అనఁగా బ్రాహ్మణుఁడైన బృహస్పతి యనుట) ఏక తమ్మనన్ = ఆలోచనతో, దివ్యదృష్టిఁజూచి = యోగదృష్టినిఁజూచినవాఁడై, ఇంతకుమున్న = నేను యజ్ఞమునుండి రాకపూర్వము, ఇతండు = ఈచంద్రుఁడు, ఎంతయున్ = మిక్కిలిగా, నాసతిన్ = నాభార్యయైన తారను, చేపట్టుకొన్నట్టి = హస్తగతము జేసుకొన్నట్టి (అనఁగా పొందినటువంటి యనుట) పాపహారి = దుష్కృతముతో నొప్పువాఁడు, నావిధి వశమునన్ = వీడు నాదురదృష్ట వశమున,

నాకు సంప్రాప్తించెన్ = నాకు దాపురమైనాడు, అని మదియందున్ = ఇట్లనుచు హృదయములో, అహర్షమొంది = చింతించినవాఁడై, భృత్యులారా = ఓ సేవకులారా, విశారదులైనవారు కారా = మీరలు నేర్పరులైనవారలు కారా, ఈవరున్ = ఈ వ్యభిచారిని, ఇప్పుడే = ఈసమయముననే, గృహమునన్ = తన యింటియందున (అనఁగా నన సూయాత్రులవద్ద ననుట) విడచిరండని - వదలిపెట్టి రాండటంచు, అనతినిడినఁ గాంచి = బృహస్పతి యాజ్ఞాపించుటఁ జూచినవారలై, తత్క్షణంబునన్ = ఆక్షణము నోనే, సారంగధరుని వెంటపించుకొని పోయి = చంద్రునిఁ దోడ్కొని పోయి, వారలట్లొడించివచ్చిరి = సేవకులావిధముగనే యత్రియింట దిగవిడిచి వచ్చినవారైరి, అహహ = ఆశ్చర్యము, కానున్నపని కాక = కాఁగలకార్యము జరుగుక, ఆగఁబోనె = నిలచియుండునా

టీక. సారంగ॥ వచ్చియున్నంతనే = సారంగధరుఁ డట్లేతించి యుండినంతనే, వానిన్ = ఆ సారంగధరుని, అగోత్రేశుఁడు = ఆభూమీశ్వరుఁడు (అనఁగా రాజనరేంద్రుఁ డనుట) ఏకతమ్మునన్ = ఆకోచనతో, దివ్యదృష్టిఁ జూచి = ఒప్పైన చూపునఁ జూచినవాఁడై, ఇతండు = ఈ సారంగధరుఁడు, ఇంతకుమున్ను = ఇదివరకులోపల, నాసతిన్ = నాభార్యయైన చిత్రాంగిని, ఎంతయున్ = మిక్కిలిగా, చేపట్టుకొన్నట్టి = హస్తముతో పట్టుకొనినటువంటి, పాపహారి = ఇతఁడు దుష్కృతమే మనోజ్ఞముగా గలవాడు, నావిధివశమునన్ = నాదురదృష్టవశమువలన, నాకు సంప్రాప్తించెన్ = నాకు దాపురమైనాడు, అని మదియందున్ = ఇట్లనుచు హృదయములో, అహర్షమొంది = చింతించిన వాఁడై, భృత్యులారా = ఓ సేవకులారా, విశారదులైనవారు = మీలో నేర్పరులైనవారలు, ఇప్పుడే = వెంటనే, ఈ వరున్ = ఈవ్యభిచారిని, కారాగృహమున విడచిరండన = చెఱసాలలో విడచిపెట్టి రాండటంచు, అనతినిడిన

గాంచి = ఆజ్ఞాపింపఁగాఁ జూచినవారలై, తత్క్షణంబునన్ = అక్షణమునందె, సారంగధరుని వెంబడించుకొనిపోయి = యువరాజును తోడుకొనిపోయి, వారలై డించి వచ్చిరి = ఆసేవకులావిధముగనే వెఱపోలయందు దిగవిడచివచ్చిన వారలైరి, అహహ = ఆశ్చర్యము, కానున్నపనిగాక = కాఁగల కార్యముకాక, ఆగఁబోనె = నిల్వఁబోవునా, హరి = హరించువాఁడు, ఒప్పెనది యనుటకును విధి = భాగ్యము, దురదృష్టము, అనుటకును, వరుఁడు = పెండ్లికొడుకు వ్యభిచారి యనుటకును శబ్దార్థచంద్రికలోఁ జూడనగును.

గీ॥ అంత నిట్లౌటఁ దెలిసి ర • త్నాంగి సునఖ
తార శుభరూపమేనక • తనదు విభుని
మనసు మరలింపలేక న • ర్మ సఖిఁ జీరి
ఆత్మజార్తి వహించి యి • ట్లనుచుఁ బలికె॥ 48

టీక శివ॥ అంతన్ = ఆటుమీఁదట, ఇట్లౌటఁ దెలిసి = శంకరుని విడివి యింట దించుట తెలిసినదియై, రత్నాంగి = మణివంటి శరీరముగలది, సునఖ తార = మంచిగోళ్ళయందు నక్షత్రములవంటిది, శుభరూప = మంగళమైన రూపముగలది, మేనక = మేనకాదేవియనునది, తనదువిభుని = తనమగఁడైన హిమవంతుని యొక్క, మనసు మరలింపలేక = మానసముఁ ద్రిప్పఁజాలక, నర్మసఖిఁ జీరి = తనయిష్టురాలైన చెలికత్తియను బిలచి, ఆత్మజార్తి వహించి = హృదయమునందు జనించిన దుఃఖమును బూని, లేక, తనకూతురి విషయమైన దుఃఖమును బూనినదియై, ఇట్లనుచుఁ బలికెన్ = ఈవిధముగా వచియించినదాయెను.

టీక చంద్ర॥ అంతన్ = తరువాత, ఇట్లౌటఁ దెలిసి = చంద్రుని

తనయింటి యందు వదలి పెట్టి వచ్చుట నెఱింగి, రత్నాంగి = రత్న ప్రాయమైన శరీరముగలది, సునఖ = మంచిగోళ్ళుగలది, తార = తారయను నది, శుభరూపమేనక = మంగళమైన రూపమునందు మేనకయనునప్సరస వంటిది, తనదువిభుని = తనభర్తయైన బృహస్పతి యొక్క, మనసుమర లింపలేక = బుద్ధిని మరల్పఁజాలక, నర్మసఖిఁజీరి = తన ప్రియురాలైన చెలికత్తియను బిలచి, ఆత్మజార్తివహించి = మన్మథుని చేత దుఃఖమునుబూని, ఇట్లనుచుఁబలికెన్ = ఈ విధముగా వచించినదాయెను.

టీక. సారంగ, అంతన్ = అటుపిమ్మట, ఇట్లొటఁదెలిసి, తన కుమారునిఁ జెఱసాలలోఁ బెట్టివచ్చినసంగతిఁ దెలుసుకొన్నదియై, రత్నాంగి = రత్నాంగియనునది, సునఖతార = మంచిగోళ్ళయందున నక్షత్రములవంటిది, శుభరూపమేనక = మంగళమైన రూపమునందున మేనకయను నప్సరసవంటిది, తనదు విభుని = తనభర్తయైన రాజనరేంద్రునియొక్క, మనసుమరలింపలేక = బుద్ధినిఁద్రిప్పఁజాలక, నర్మసఖిఁజీరి = తనయిష్టురాలైన చెలికత్తియనుబిలచి, ఆత్మజార్తివహించి = తనకొడుకైన సారంగధరుని విషయమగు దుఃఖమును బూనినదియై. ఇట్లనుచుఁబలికెన్ = ఈవిధముగా వచియించినదాయెను.

గీ॥ అకట సారంగధరుఁడు చి • త్రాంగి నార్య
నన్నుఁ జేరఁగ నేల వ • ద్దన్నఁ గాని
వానినే గోరనేల నా • పతి యెఱిఁగియు
నిట్లు వానికిఁ జేయఁగా • నేల సఖియ॥ 44

టీక. శివ, సఖియ = ఓహితురాలా, సారంగధరుఁడు = శంకరుఁడు, చిత్రాంగిన్ = అరుదైన యవయవములు గలదానిని, ఆర్యన్ = పార్వతిని, అన్నన్ = పొరవశ్యము నొందినస్త్రీని, చేరఁగనేల=సమీపింపనేటికి, వద్దన్నఁ

గాని = శంకరుఁడు బైరాగి వేషము తోఁడవచ్చి శివుఁడు నీకుఁదగిన వాఁడు కాదని నప్పటికిని, వానినేగోరనేల = ఆశంకరునే కోరనేటికి, నాపతియొఱిఁగియున్ = నా భర్తయైన హిమవంతుఁడు శివుఁడెంతటివాడైనది తెలిసినవాఁడయ్యెను, (అనఁగా బీదవాడనియనుట) ఇట్లన్ = ఈ విధముగా, వానికిఁజేయఁగానేల = ఆశంకరునికి బిడ్డనిచ్చి వివాహము సేయఁబూననేటికి, అకట = విచారకరము

టీక చంద్ర॥ సఖియ = ఓ హితులారా, సారంగధరుఁడు = చంద్రుఁడు, చిత్రాంగిన్ = చిత్రావయవము గల దానిని, అర్యన్ = పది యాఱేండ్ల పడుచును, నన్నుఁ జేరఁగనేల = నాదగ్గరఁ జేరియుండనేటికి, వద్దన్నఁగాని = వలదని చెప్పినను, వానిచేఁ గోరనేల = నేనా చంద్రుని గోరనేటికి, నా పతియొఱిఁగియున్ = నా భర్తయైన బృహస్పతి తెలిసికొనినవాఁడై, ఇట్లు వానికిఁ జేయఁగానేల = ఈ విధముగా నా చంద్రునకు నపకృతిఁ జేయనేటికి, అకట = విచారము.

టీక. సారంగ॥ సఖియ = ఓ ప్రియులారా, సారంగధరుఁడు నాకొడుకు, చిత్రాంగిన్ = నా సవతియైన చిత్రాంగిని, అర్యన్ = పదియాఱేండ్ల పడుచు దానిని, అన్నన్ = పొందవశ్యము బొందిన స్త్రీని, చేరఁగనేల = సమీపింపనేటికి, వద్దన్నఁగాని = భావ్యము గాదు వలదని నప్పటికిని, వానినే గోరనేల = అట్లు వలదని వానినే కోరనేటికి, నాపతి యొఱిఁగియున్ = నా భర్తయైన రాజనరేంద్రుఁ డెవరిగుణమెట్టిదైనది తెలిసిన వాఁడయ్యెను, ఇట్లు వానికిఁ జేయఁగానేల = ఈ విధముగా వానిని వెలిసాల పాలుజేయనేటికి, అకట = విచారకరము

గీ॥ కట్టుకొన మంచి వస్త్రముల్ ✦ బెట్టుకొనఁగ
దివ్యమగు సొమ్ములునులేక ✦ తిరిపెగాని
భంగి నాకఁడ మనెడు సా ✦ రంగధరునిఁ
జెలువదరిఁజేరి నంతనే ✦ వలచుటేల॥ ౪౬

టీక. శివ॥ కట్టుకొన మంచి వస్త్రముల్ = కట్టుకొనుటకుమేలైన వలువలును, పెట్టుకొనఁగ దివ్యమగు సొమ్ములును లేక = పెట్టుకొనుటకు మనోహరమైన భూషణము లు లేని వాఁడై (అనఁగా తోళ్లన్ గట్టుకొనువాఁడును, పాములను సొమ్ములుగాఁ బెట్టుకొనువాఁడు నైనందున ననుట) తిరిపెగానిభంగిన్ = భిక్షుకుని విధముగా, ఆకరన్ = అల్లావిశయించున (అనఁగా నీశాన్యవిశ యగుదు ననుట) మనెడు = జీవించునట్టి, సారంగధరునిన్ = శంకరుని, చెలువ = ఆపార్వతి యను కలికి, దరిఁజేరినంతనే = సమీపమునకు వచ్చిన మాత్రమునకే, వలచుచేల = కామముఁ జెందనేటికి

టీక. చంద్ర॥ చెలువ = ఓ కలికి, నాకరన్ = నావద్ద, మనెడు = జీవించెడు, సారంగధరునిన్ = చంద్రుని, దరిఁజేరినంతన్ = సమీపించినంత మాత్రమునకే, వలచుచేల = నేను కామింపనేటికి, తతిమ్మావిషయము సుగమము

టీక. సారంగ॥ చెలువ = అయందగత్తెయగు చిత్రాంగి, దరిఁజేరి నంతనే = సమీపించినంతనే, వలచుచేల = కామింపనేటికి, తతిమ్మావిష యము చంద్రకథకు సమానము.

గీ॥ నాదు భర్తకు దుర్బోధ • నము లొనర్చి
నట్టి దా చిన్న చెలియె యో • నంట చెప్పి
నంతనే నమ్మి యిటుసేయ • నగునె విభుఁడు
మంచియో చెడ్డయో విచా • రించ వలదె॥ 46

టీక. శివ చంద్రకథలలో, అచిన్న చెలియె యోనంట = అకనపడునట్టి చిన్న చెలికత్తియయేనఁట, అనియును, సారంగధరకథలో, ఆచిన్న భార్య యేనఁట, అనియును గ్రహించునది, తతిమ్మావిషయము మూఁడిఁట సమము సుగమము.

క॥ ఆ కరిపురాలు నన్నుఁ బ
రాకుగనైనఁ జెఱఁబెట్ట • రాదా యిలపై
నాకదలి పట్టి నిటులఁ జీ
కాకొనరింపగనె యేమి • కసి దీరనగున్॥ 47

టీక, శివ చంద్ర కథలలో, నన్నుఁ బరాకుగనైనఁ జెఱఁబెట్టరాదా = ప్రమాదముననైనను నన్ను నిర్బంధపెట్టరాదా, అనియును, సారంగధరకథలో నన్నుఁ బ్రమాదముననైనను కారాగృహమునఁ బెట్టరాదా, అనియును, శివసారంగధర కథలలో, నాకు + అదలిపట్టిన్ = నాకు భయపడి కూతురిని, కొడుకును, చంద్రకథలో, ఆ కదలిపట్టిన్ = తొల్లి సముద్రుని కొడుకైన చంద్రుని యరిగ్రహించునది, తక్కిన విషయము మూడిఁట సమము సుగమము.

క॥ నాపతి యిపు డొనరించిన
యీపనిఁ దొలఁగింపఁజేయు • టెట్లొకొ యెదియున్
దోపదిఁక నేమిసేతును
కూపముఁ జొచ్చెదన విసము • గొని సచ్చెదనా॥ 48

టీక. సుగమము

క॥ అని చింతింపుచుఁ దన నా
ధునకున్ బోధించినట్టి • తొయ్యలిఁ జిత్రాం
గిని చిన్న చెలిని గని యి
ట్లని దూషింపఁగఁ దొడంగె • నతికోపమునన్॥ 49

టీక. శివ చంద్ర కథలలో, చిత్రాంగిని = చిత్రావయవములుగల దానిని, చిన్నచెలిని = చిన్న చెలికత్తియను, సారంగధర కథలో, చిత్రాంగి యను దానిని, తనమగని ముద్దుచెలియను, అనిమాత్రము భేదము, తక్కిన్ విషయము మూడిఁట సమము సుగమము.

గీ॥ ఓ కిరాతకురాల చీ ♦ నీకుఁ దగునె
జనులు మెచ్చెడు ననసూయ ♦ గనిన పట్టి
కిట్టి యపకార మొనరింప ♦ నెట్లు హృదయ
మొప్పెఁ దత్పాతకము నీకుఁ ♦ దప్పఁబోనె॥ 50

టీక. శివ సారంగధర కథలలో, అనసూయఁ గనినపట్టికిన్ = అసూయ రహితమును గాంచిన నాకూతురికి, నాకొడుకునకు, అనియును, చంద్ర కథలో, అనసూయాదేవి కన్నకుమారునకు, అని మాత్రము భేదము, తతిమ్మా విషయము మూఁడిఁట సమము సుగమము.

గీ॥ నాపతికి లేనిపోనివి ♦ నమ్మఁ జెప్పి
మంచి బిడ్డల కిక్కట్టు ♦ లొందఁ జేసి
కట్టకడ కేమియును మూట ♦ గట్టుకొందు
వీవు మాత్రము చిరమోదు ♦ వే నెలంత॥ 51

టీక. సుగమము

ఆ॥ వె॥ చిన్ననాటనుండి ♦ పెంచి పెద్దను జేసి
నీ కడుపునఁ బెట్టి ♦ నీకు విడువ
నాయె నిటులఁ జేయ ♦ నాయమ యెపుడేని
ఎగ్గునిడెనె తా వ ♦ హింపుమనుచు॥ 52

టీక. శివకథలో, ఆయమ = ఆ పార్వతీదేవి, అనియును, చంద్ర సారంగధర కథలలో, నాయమ = నీకు న్యాయమా, అనియును, శివకథలో తావహింపుమనుచున్ = నీవు పూనుమటంచు, ఎగ్గునిడెనె = కీడు నిడినదా, అనియును, చంద్ర సారంగధర కథలలో, తాన్ = అతఁడు, ఎగ్గునిడెనె = కీడు నిడినాడా, వహింపుమనుచున్ = పూనుమటంచు, అనిమాత్రము భేదము, తతిమ్మా విషయము సుగమము

క॥ గురునకు సారంగధరునిఁ
బొరి గొనునంత నుడిఁజెప్పి ♦ పొన్నారి తనం
బిరవొంద నుంటి వియ్యది
సరసమె నీ కెనుల మంట ♦ చల్లారనఁటే॥ 53

టీక శివ॥ గురునకున్ = రాజునకు (అనఁగా గిరిరాజున కనుట) లేక, పార్వతితండ్రికి, సారఁగధరునిన్ = శంకరుని, పొఁరిన్ = దృఢముగా, కొనునంత నుడిఁజెప్పి = చేకొనునంతటి మాటచెప్పిన దానవై, తతిమ్మా విషయము సుగమము

టీక. చంద్ర॥ గురునకున్ = బృహస్పతికి, సారంగధరునిన్ = చంద్రుని, పొరిగొను నంత నుడిఁజెప్పి = చంపు నంతటి మాటఁజెప్పి, తతిమ్మా విషయము సుగమము.

టీక సారంగ॥ గురునకున్ = తండ్రికి, లేక, రాజునకు, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము.

ఆ॥ వె॥ నాదుభర్త యింటఁ ♦ బాదం బిడిన నాడె
గుజగుజలను జేసి ♦ కొంప కిట్టి
పాటుఁ దెచ్చినావు ♦ పాడు గాకుందువే
ఉసురు దగులకున్నె ♦ యొరులఁ జెఱుప॥ 54

టీక. సుగమము.

ఆ॥వె॥ సకియ వనుచు నీదు ♦ సబ్బాయి మాటలు
నమ్మి మోసపోయె ♦ నాదుభర్త
అతని వలన నింద ♦ కైన దోసము లేదు
నీవె యింత జేసి ♦ నావు గదవె॥ 55

టీక సుగమము.

క॥ అని దూఱుచు నుండినఁ గ
న్గాని యాచెలి యామెతోడ • గొణుగుచుఁ గసి ని
ట్లని బదులుఁ బల్కఁ దొడఁగెను
వనితా యిటు దుడుకు నుడులు • పలుకఁగఁ దగునా 56

టీక సుగమము.

గీ॥ నిందమోసితిఁ జాలదే • యిందు విషయ
మరయ నీపతికే నిసు • మంత యేని
కల్ల నొడివిన నాకె య • ఘంబు దవులు
లేక యూరక తిట్టిన • నీకె తవులు॥ 57

టీక శివ సారంగధర కథలలో, ఇందు విషయము = ఈ విషయమును గూర్చి, అనియును, చంద్రకథలో, చంద్రుని విషయమై, అనియును మాత్రము భేదము, తతిమ్మా విషయము మూడిఁట సమము సుగమము.

ఆ॥వె॥ నీవు నీమగండు • నెఱి మంచి వారలే
ఇతరులే కదా గ • ణింపఁ జెడుగు
లౌరె మ్మంచిమాటె • నోరుండె ననుచును
మంది నాడి పోసు • కొందు వేల॥ 58

టీక సుగమము

గీ॥ ప్రేమతోడను నీవును • బెంచుకొనిన
పట్టిఁ జెడగొట్ట నేఁ దల • పెట్టలేదు
నాతిరో యేరుఁజేసు కొ • న్నయది వార
లనుభవింపక తీరునే • యవనిలోన॥ 59

టీక సుగమము

క॥ పదఁటి సారంగధరుని
నదవది నెఱిఁగియును నీదు ♦ నాథుం డిటులే
ర్పదఁ జేసెఁ బదుల దూఱినఁ
గదు పాతకి మీవు మాటఁ ♦ గట్టు కొననెకా॥ 60

టీక సుగమము.

ఆ॥వె॥ అనుచు నేగెనంత ♦ నా రసాధర గురు
జాయఁ గాంచియుఁ బ్రియ ♦ సఖి యిటులనె
సాధ్వి వినగదమ్మ ♦ సారంగధరుఁడు సా
మాన్యుఁ డగునటమ్మ ♦ మాన్యుఁడమ్మ॥ 61

టీక శివ॥ ఆ రసాధరగురు = ఆ భూధరశ్రేష్ఠుని యొక్క (హిమవంతుని యొక్కయనుట) జాయఁ గాంచియుఁ = భార్యయైన మేనకాదేవిని జూచి, తతిమ్మా విషయము సుగమము.

టీక చంద్ర॥ ఆ రసాధరన్ అయొక్క యమృతరసము వంటి పెదవి గల దానిని, గురుజాయన్ = బృహస్పతి భార్యయైన తారను, లేక, మధురసము వంటి పెదవిగల బృహస్పతియొక్క భార్యను, తతిమ్మా విషయము సుగమము.

టీక, సారంగ॥ ఆ రసాధర = ఆ భూధరునియొక్క (అనఁగా రాజనరేంద్రుని యొక్క, గురుజాయన్ = పెద్దభార్యను (రత్నాంగి ననుట) తతిమ్మా విషయము సుగమము.

సీ॥ అరివర్గమున కార్తి ♦ నెరపి పాటిఁగఁ దోలి
కువలయంబునకు మేల్ ♦ గూర్చుచుండు

పంకజాతులను గ • ర్వము డింద ముడిగించి
సద్గణంబును మహా • సక్తి నేలు
దోష గుణముల స • త్తుగ విశదమొనర్చి
విబుధుల నెపుడు జీ • వింపఁ జేయు
పగలువచ్చిన మంచి • పడుట కాదని ప్రీతి
మిత్రమండలి తోడ • మెలఁగుచుండు

గీ॥ రాజ రాజునకెన్న ని • రంతరంబు
హితముగా నుండుటయె ముఖ్య • వృత్తిగాని
అల్పకార్యము సరిపడ • దతని కమ్మ
రాజమాత్రుఁడె ఘనుఁడు సా • రంగధరుఁడు॥ 62

టీక శివ॥ అరివర్గమునకున్ = శత్రుసముదయమునకు, ఆర్తి నెరపి = దుఃఖమును వ్యాపింపఁజేసి, పొలుఁగఁ దోలి = తఱిమివైచి, కువలయంబునకున్ = భూవలయమునకు, మేల్ గూర్చుచుండున్ = శుభము నూన్చుచుండును, పంకజాతులను = పాపజాతి వారలను, గర్వము డిందముడిగించి = పొగరుసశింప ముడుచు కొనఁజేసి, సద్గణంబును = శ్రేష్ఠులైన ప్రమథులను, మహాసక్తి నేలున్ = మిక్కిలి యపేక్షతోఁ బాలించును, దోషగుణములన్ = దుష్టగుణములను, సత్తుగ పిశదమొనర్చి = సత్యముగా స్పష్టపరచి, విబుధులనెపుడు జీవింపఁజేయున్ = దేవతల నెల్లవేళలను బ్రతుకున ట్లొనరించును, పగలువచ్చిన మంచిపడుటకాదని = విరోధమువచ్చినచో మంచియగుట దుర్లభమని, ప్రీతిన్ = ప్రేమచే, మిత్రమండలి తోడ మెలఁగుచుండున్ = హితసముదయముతోడ వర్తింపుచుండును, ఎన్నన్ = ఎంచిచూడఁగా, రాజరాజునకున్ = కుబేరునకు, నిరంతరంబున్ = ఎల్లప్పుడును, హితముగా నుండుటయె = స్నేహముగా నుంటయే, ముఖ్యవృత్తిగాని = ప్రాధాన్యమైన నడవడియగునే కాని, అతనికి = ఆ శంకరునకు, అమ్మ = ఓ తల్లీ, అల్పకార్యము సరిపడదు = నీచకృత్యము సరిపడునది కాదు, రాజమాత్రుఁడె =

సామాన్యప్రభువులవంటి వాఁడా (కాదనుట), సారంగధరుఁడు = శంకరుఁడు, ఘనుఁడు = మహాత్ముఁడగును

టీక చంద్ర॥ అరివర్గమునకున్ = చక్రవాకపక్షుల సముదయమునకు, ఆర్తినెరపి = దుఃఖమును వ్యాపింపఁజేసి, పాఱఁగఁదోలి = పరుగెత్తిపోవునట్లుఁ జేసి, కువలయంబునకు మేల్ గూర్చుచుండున్ = కలువకు శుభములొనగూర్చుచుండును, పంకజాతులను = పద్మములను, గర్వము డిందమడిగించి = పొగరు నశింప ముడుచుకొనఁజేసి, సద్గణంబను = నక్షత్రసముదయమును, మహాసక్తినేలున్ = మిక్కిలి యపేక్షతోఁ బాలించును, దోష = రాత్రియొక్క, గుణములన్ = స్వభావములను (అనఁగాఁ జీకట్లననుట), సత్తుగన్ = సత్వముగా, విశదమొనర్చి = తెల్లగా నొనరించి, విబుధుల నెపుడు జీవింపఁజేయున్ = దేవతల నెల్లవేళల బ్రతుకునట్లొనర్చును (అనఁగాఁ జంద్రుఁ డమృతకళల నొసంగి సురల బ్రతికించు ననుట ప్రసిద్ధము), పగలువచ్చిన మంచి పడుట కాదని = దివసము రావడము తోడనే బాగుపడుట కాదని, ప్రీతిన్ = ప్రేమచే, మిత్రమండలితోడ మెలఁగుచుండున్ = సూర్యమండలము వెంబడిగా వర్తింపుచుండును, ఎన్నన్ = ఎంచిచూడఁగా, నిరంతరంబున్ = ఎల్లప్పుడును, రాజరాజునకు = చంద్రునకు, హితముగా నుండుటయె = మేలుగా నుండడమే, ముఖ్యవృత్తిగాని = ప్రాధాన్యమైన నడవడియగునే కాని, ఆమ్మ = ఓ తల్లీ, అతనికి = ఆ చంద్రునకు, అల్పకార్యము సరిపడదు = నీచపుపని సరిపడునది కాదు, సారంగధరుఁడు = చంద్రుఁడు, రాజమాత్రుఁడె = సామాన్యమైన రాజనామముగల వాఁడా, ఘనుఁడు = మహానుభావుఁడు.

టీక. సారంగ॥ సద్గణంబును = సాధుసముదయమునకు, దోష గుణములన్ = కావ్యదోషముల యొక్క గుణములను (అనఁగా సారంగధరుఁడు వ్యాకరణవేత్తయని గ్రహింపనది), విబుధులకు = పండి

తులకు, రాజరాజునకున్ = తండ్రియైన రాజనరేంద్రునకు, తతిమ్మా విషయము శివకథకు సమానము

సీ॥ తమ పురాకృత సుకృ ♦ తమున సారంగధ
రుండబ్బెఁగాని పే ♦ రొండు గాదు
అతఁ డెన్నఁగఁ గల ♦ ధౌతధాముఁడు కలా
నిధి శంకరుండు స ♦ న్నేల దాత
జైవాతృకుండౌను గావున నెపుడేని
యతనికి మృత్యుభ ♦ యంబులేదు
కడచిపోయిన యట్టి ♦ కార్యంబునకుఁ జింత
యేల నీకిపుడేమి ♦ యొగ్గుగలిగె
గీ॥ నజుఁడెవరి కెట్లు వ్రాసెనో ♦ యట్లు జరిగి
తీరవలయును గాని చిం ♦ తింప వేరు
తీరు జరుగునె యిది నీకుఁ ♦ దెలియకున్నె
యనుచు నోదార్చు చెలికి ని ♦ ట్లనియె దేవి॥ 63

టీక శివ॥ సారంగధరుండబ్బెన్ = ఈశ్వరుఁడు లభించినవాఁ డాయెను, కలధౌతధాముఁడు = వెండిని గృహముగాఁ గలవాఁడును, కలానిధి = విద్యానిధియైన వాఁడును, శంకరుండున్ = శంకర నామము గలవాఁడును, సన్నేల = మంచిప్రభువైన వాఁడును, దాత = ఇచ్చువాఁడును, జైవాతృకుండౌను = దీర్ఘాయుష్మంతుఁడగును, అతనికి మృత్యుభయంబులేదు = ఆ యీశ్వరునకు మృత్యువుయొక్క భీతి లేదు (అనఁగా మృత్యుంజయుఁడనుట), తతిమ్మావిషయము సుగమము

టీక. చంద్ర॥ సారంగధరుండబ్బెన్ = చంద్రుఁడు లభించిన వాఁ డాయెను, కలధౌతధాముఁడు = వెండివంటి శరీరము గలవాఁడును, కలానిధి = కాంతులకు స్థానభూతమైన వాఁడును, శంకరుండున్ = శ[illegible] వాఁడును, సన్నేల = నక్షత్రములకు ప్రభు

వైనవాఁడును, దాత = ఇచ్చువాఁడును, జైవాతృకుండౌను జైవాతృకనామము గలవాఁడగును. అతనికి మృత్యుభయంబు లేదు — ఆ చంద్రునకు మృత్యువు యొక్క భీతిలేదు, తతిమ్మా విషయము సుగమము

టీ౩. సారంగ। కలధౌతధాముఁడు = బంగారువంటి శరీరము గలవాఁడును, కలానిధి = విద్యల కాటపట్టయిన వాఁడును, శంకరుం డుఁ = పళకలఁడైన వాఁడును, సన్నీతి = సాధుప్రన ప్రభువును, దాత = ఇచ్చువాఁడును, జైవాతృకుండౌను = దీర్ఘాయుష్మంతుఁ డగును, అతనికి మృత్యుభయంబు లేదు = ఆ సారంగధరునకు మృత్యు దేవతయొక్క భయములేదు, తతిమ్మా విషయము సుగమము.

గీ॥ దాన కానున్న పనిగాక ♦ పోనిమాట
నిక్కమే యగు నన్నిట ♦ నేర్పరి యగు
నా పితుని శాసనముఁగాద ♦ నంగవశమె
జరుగ నీయంచు నుండు నా ♦ జాయఁ గాంచి॥ 64

టీక సుగమము, మూఁడిట సమము, ముందరి పద్యముతో నన్వయము.

క॥ ఇల గోధరగురుఁ డపు డో
వెలఁదీ సారంగధరుని ♦ విషయంబిఁకఁ జిం
తిలకుము నే నక్రమమున్
జలుపను వేల్గను మటంచు ♦ సైరణఁ జేసెన్॥ 65

టీక శివ॥ అపుడు = ఆ సమయమునందున, ఇలగోధర గురుండు = ఆ పర్వతశ్రేష్ఠుడు (హిమవంతుఁడనుట), ఓ వెలఁదీ = ఓ కాంతా, సారంగధరుని విషయంబు = శంకరుని విషయమై, ఇఁకఁ జింతిలకుము = ఇంక మీదట నీకుయోచింపఁ బనిలేదు, నేనక్రమమున్ జలుపను = యుక్తముగాని పనినే నొనర్చువాఁడను కాను, మేల్గ

నుము = ఈ మేలుకార్యమునుఁ జూడుము, అటందు నైరణఁజేసెన్ = ఇట్లనిసి యౌదార్యుఁ జేసినవాఁ డాయెను

టీక చంద్ర॥ అలగోధర గురుఁడు = ఆ స్వర్గభర్తయైన యింద్రునకు గురువగు బృహస్పతి, మెల్గనుము = వనసముకొందుము, తతి మ్మావిషయము శివకథకు సమానము

టీక సారంగ॥ అల గోధర గురుఁడు = ఆ ధరణీశరశ్రేష్ఠుడు (రాజనరేంద్రుఁ డనుట), మెల్గనుము = నీకగు నుపకారమును వీక్షింపుము, తతిమ్మావిషయము చంద్రకథకు సమానము

గీ॥ అంతఁ దత్సురుచిరమణి ♦ యనుఁగుఁ జెలిని
గాంచి నీవు కల్యాణోప ♦ కాననంబు
నకును సారంగధరుని తో ♦ డుకొని రమ్మ
టంచు సెలవీయఁ జెలి యేగి ♦ యతనిఁ జేరి॥ 88

టీక శివ॥ అంతన్ = అటుపిమ్మట, తత్ = ఆయొక్క, సురుచిరమణి = మనోజ్ఞమైన రత్నము గలవాఁడు, లేక, మనోహరము నంచున రత్నమువంటి వాఁడు (అనఁగా హిమవంతుఁ డనుట), అనుఁగుఁ జెలినిగాంచి = ముఖ్యమైన చెలికానింగని, కల్యాణ = వివాహ సంబంధమైన, ఉపకాననంబునకును = ఉపగృహమునకు (అనఁగాఁ గల్యాణమండపమున కనుట), నీవు సారంగధరుని తోడుకొని రమ్మటంచున్ = శంకరుని నీవు వెంబడించుకొని రమ్మని, సెలవీయన్ = అనుజ్ఞనీయఁగా, చెలియేగి = చెలికాడు పోయి, అతనిఁజేరి = ఆ శంకరుని దరిఁజేరిన వాఁడై, ఇఁక ముందరిపద్యముతో నన్వయము

టీక. చంద్ర॥ అంతన్ = అటుమీదట, తత్సురుచి = ఆ మంచి కాంతిగలవానియొక్క, (అనఁగా బృహస్పతి యొక్క యనుట),

రమణి = భార్యయైన తారాదేవి, అనుఁగుఁ జెలినిగాంచి = ముఖ్యమైన చెలికత్తియను జూచి, చెలి గబ్బము, చలికానిచిని. చలికత్తియకును జెల్లునని గ్రహింగునది, నీవు = నీవు, కల్యాణ = శుభమైన, ఉపకాననంబు = ఉద్యానవనమునకు, సారంగధరుని తోడుకొనిరమ్మంటంచున్ = చంద్రుని వెంటఁగొని రమ్మని, సెలవీయన్ = అనుజ్ఞనీయఁగా, చెలియేగి = చెలికత్తెపోయి, అగనిఁజేరి = ఆ చంద్రుని జేరినదియై

టీక సారంగ॥ కల్యాణోపకాననంబునకును = శుభమైన, లేక, బంగారు సంబంధమైన యుపగృహమునకు (అరఁగాఁ గదేరికనుట), రతిమ్మా విషయము శివకథకు సమానము

ఆ॥వె॥ సద్గణేశరాజ • సారంగధర పతి

సమయ మనియుఁ దార • సత్వరముగ

నిన్ను వెంటఁ గొనియు • నన్నుఁ గల్యాణోప

కాననమునఁ జేర్పఁ • గ నిట కనిపె॥ 67

టీక. శివ॥ సద్గణేశ = శ్రేష్ఠులైన ప్రమథనాయకా, రాజసారంగ = రాజకుంజరా, ధరపతి = పర్వతనాథుఁడైన హిమవంతుఁడు, సమయమని = లగ్నమునకు వేళయటంచు, ఉదార సత్వరముగన్ = అధిక వేగముగా, నిన్ను వెంటగొనియున్ = నిన్నుఁదోడ్కొని, కల్యాణోపకాననమునఁ జేర్పంగన్ = కల్యాణ మండపము నందునఁ జేర్చుటకు, ఇటనున్ = ఇచ్చోటికి, నన్నున్ = నను, అనిపెన్ = పంపించినవాఁడాయెను.

టీక. చంద్ర॥ సద్గణేశ = నక్షత్రాధీశ్వరా, రాజ = రాజనామము గలవాఁడా, సారంగధర పతి = జింకతాల్పరియైన యో ప్రభుఁడా, సమయమనియున్ = మంచి తరుణమటంచు, తార = తారాదేవి, సత్వరముగ్గ నిన్ను వెంటగొనియున్ = వేగముగా నిన్నుఁదో

దొడ్కొని, కల్యాణోపకాననమునఁ జేర్పఁగన్ = శుభమైన యుపవనమునకుఁ జేర్చుటకు, ఇటకున్ = ఇచ్చటికి, నన్నున్ = నను, అనిపెన్ = పంపించిన దాయెను.

టీక సారంగ ॥ సద్గణేశ = పండిత గణాధీశ్వరా, రాజ = ఓ క్షత్రియుఁడా, సారంగధర = ఓయి సారంగధరుఁడా, పతి = ప్రభువైన రాజ నరేంద్రుఁడు, సమయమని = వాయిదా తరుణమటంచు, ఉదారసత్వరముగన్= అధికవేగముగా, నిన్ను వెంటఁగొనియున్ నిన్నుఁదోడ్కొని, కల్యాణోప కాననమునఁ జేర్పఁగన్ = కచేరికి జేర్చుటకు, ఇటకున్=ఇచ్చటికి, నన్నున్= నను, అనిపెన్ = పంపించినవాఁ డాయెను.

గీ॥ కాన దయసేయుఁ డనిన స • ద్గణవరుండు
సిద్ధముగ నుంటిననుచు వేం • చేయు నంత
నొకతె చెలికత్తె రాజాజ్ఞ • నొంది పోయి
గురుసతిని తోడుకొని వచ్చి • కూర్చెనందు ॥ 68

టీక శివ॥ కానన్ = కాబట్టి, దయసేయుఁ డనినన్ = వేంచేయుఁ డనఁగా, సద్గణవరుండు = శ్రేష్ఠులగు ప్రమథయుక్తుఁడైన పెండ్లికొడుకు, లేక, శ్రేష్ఠుఁడైన ప్రమథాధీశ్వరుఁడు (శంకరుఁ డనుట), సిద్ధముగ నుంటిననుచున్ = ఆయత్తమై యుండినాడ నటంచు, వేంచేయునంతన్ = వచ్చుచున్నంతలో, రాజాజ్ఞనొంది = హిమవంతుఁడనే ప్రభువాజ్ఞను గైకొని, ఒకతె చెలికత్తె = ఒకానొక చెలికత్తియ, పోయి, యేగినదియై, గురుసతినిన్ = అధికురాలైన పార్వతీదేవిని, తోడుకొనివచ్చి = వెంబడింపుకొనివచ్చి, అందున్ = ఆ కల్యాణమంటపము నందున, కూర్చెన్ = ఒనగూర్చిన దాయెను.

టీక చంద్ర॥ కాన దయసేయుఁడనినన్ = కావున రాండి యనఁగా, సద్గణవరుండు = ఆ నక్షత్రాధీశ్వరుఁడైన చంద్రుఁడు, సిద్ధముగ నుంటిననుచున్ = అందులకు సంసిద్ధముగా నున్నానని, వేంచేయు నంతన్ = వచ్చుచున్నంతలో, చెలికత్తె = చెలికత్తియ, ఒకతె = ఒక్కతె (అనఁగా నేకాకియై యనుట), రాజాజ్ఞనొందిపోయి = చంద్రుని యనుజ్ఞను గైకొనియరిగి, గురుసతిని తోడుకొనివచ్చి = బృహస్పతి భార్యయైన తారను వెంటఁగొనివచ్చి, అందున్ = ఆ యుపవనము నందున, కూర్చెన్ = కార్చిన దాయెను

టీక. సారంగ॥ కాన దయసేయుఁడనినన్ = కాబట్టి రాండి యనఁగా, సద్గణవరుఁడు = సాధుగణశ్రేష్ఠుఁడైన సారంగధరుఁడు, సిద్ధముగనుంటి ననుచున్ = ఆయత్తముగా నున్నానటంచు, వేంచే యునంతన్ = వచ్చునంతలో, ఒకతె చెలికత్తె = ఒకానొక చెలిక త్తియ, రాజాజ్ఞనొంది పోయి = రాజనరేంద్రుని యనుజ్ఞను గైకొని యరిగి, గురుసతిని = రాజుభార్యను (చిత్రాంగి ననుట), తోడుకొనివచ్చి = వెంటఁగొనివచ్చి, అందున్ = ఆ కచేరియందున, కూర్చెన్ = ఒనగూర్చిన దాయెను

గీ॥ కూర్చి సారంగధరునకున్ ♦ గురుసతికిని
చన నెదుర్కోలుఁ జేయించి ♦ చంద్రశాల
దిగిచి నంతనె యమరమం ♦ త్రి గనుఁగొనియు
గోధరేంద్రునిఁ జేరి వా ♦ క్రుచ్చె నిట్లు

టీక శివ॥ కూర్చి = ఇట్లు కూడబెట్టి, సారంగధరునకున్ = శంకరునకును, గురుసతికిని = అధికురాలైన పార్వతీ దేవికిని, చనన్ = తగునట్లుగా, ఎదుర్కోలుఁ జేయించి = ఎదుర్కోలుఁ వేడుకఁ జే యించి, చంద్రశాలన్ = పై మేడయందున (అనఁగాఁ గల్యాణమండ పమునందనుట), దిగిచినంతనె = విడియించినతోడనే, అమరన్ =

ఒప్పునట్లుగా, మంత్రి గనుఁగొనియున్ = సచివుఁడు జూచి, గోధరేం
ద్రుని జేరి = పర్వతనాయకుడైన హిమవంతుని జేరి, ఇట్లు =
ఈ క్రిందఁ జెప్పఁబోవు విధముగా, వాక్రుచ్చెన్ = వచియించినవాఁ
డాయెను.

టీక. చంద్ర॥ కూర్చి = ఇట్లు కూడఁబెట్టి, సారంగధరునకున్
= చంద్రునకును, గురుసతికిని = బృహస్పతి భార్యయైన తారకును,
చనన్ = పోవుటకు, ఎదుర్కొఁగాఁ జేయించి = అటునుంచి చంద్రుని
నిటునుంచి తారను నెదుర్కొనునట్లుఁ జేసి, చంద్రశాలన్ = చంద్రుని
యింటిలో దిగి నంతనె = దించినంతనే, అమరమంత్రి గనుఁ
గొనియున్ = బృహస్పతి తెలుసుకొని, గోధరేంద్రుని జేరి = స్వర్గ
భర్తయైన దేవేంద్రునిఁ జేరి, లేక, వజ్రధరుడైన యింద్రునిఁ జేరి,
ఇట్లు = ఈ విధముగా, వాక్రుచ్చెన్ = చెప్పినవాఁడాయెను.

టీక. సారంగ॥ కూర్చి = ఇట్లు నొనగూర్చి, సారంగధరున
కున్ = సారంగధరుఁడను వానికిని, గురుసతికిని = అతని తండ్రి
భార్యయైన చిత్రాంగికిని, ఎదుర్కొఁగాఁ జేయించి = ఎదుర్కొని యుండు
నట్లుఁ జేసి (అనఁగాఁ బ్రముఖముగా నసుట), చనన్ = తగునట్లుగా,
చంద్రశాల దిగినంతనె = ఆ చదేరిపై మేడయందు విడియించి
నతోడనే, అమరన్ = ఒప్పునట్లుగా మంత్రి గనుఁగొనియున్ = ప్రధా
నుఁడు జూచి, గోధరేంద్రునిఁ జేరి = భూభర్తయైన రాజనరేంద్రునిఁ
జేరి, ఇట్లు = ఈ విధముగా, వాక్రుచ్చెన్ = చెప్పినవాఁడాయెను

ఆ॥వె॥ ధీర గోధరేంద్ర • సారంగధరుఁడు నా
సతియు నిపుడు చంద్ర • శాల కరుగు
దెంచి చేరినారు • తిలకింపఁగదవె యిం
కేమి సేయవలయు • నిందుఁగూర్చి॥

టీక. శివ॥ ధీర గోధరేంద్ర = ధైర్యవంతుఁడవైన పర్వత నాయకా, సారంగధరుఁడున్ = శంకరుఁడును, ఆ సతియున్ = ఆ పార్వతీదేవియును, ఇప్పుడు = ఈ సమయమునందున, చంద్రశాల కరుగుదెంచి చేరినారు = మన చంద్రశాలకువచ్చి చేరియున్నారలు (అనఁగాఁ గల్యాణ మండపమున కనుట), తిలకింపఁగదవె = చూడఁగదె, ఇందుఁగూర్చి = ఈ వివాహకార్యమును గుఱించి, ఇంకేమి సేయవలయున్ = ఇఁక నేమి యొనర్పవలయును

టీక. చంద్ర॥ ధీర = ఓ ధైర్యవంతుఁడా, గోధరేంద్ర = వజ్రధారివైన మహేంద్రా, సారంగధరుఁడున్ = చంద్రుఁడును, నా సతియున్ = నా భార్యయును, ఇపుడు = ఈ సమయమునందున, చంద్రశాల కరుగుదెంచి చేరినారు = చంద్రుని యింటికిఁ జేరినారలు, తిలకింపఁగదవె = చూడఁగదె, ఇందుఁగూర్చి = చంద్రుని గుఱించి, ఇంకేమి సేయవలయున్ = ఇఁక నేమి యొనర్పవలయును.

టీక. సారంగ॥ ధీర గోధరేంద్ర = ధైర్యమునందుఁ బర్వతనాయకుఁడైన హిమవంతునివంటి వాఁడా, లేక, ధీర = ధైర్యవంతుఁడా, గోధరేంద్ర = భూభర్తలలో శ్రేష్ఠుఁడవైన వాఁడా (అనఁగా రాజ నరేంద్రుఁడా యనుట), తిలకింపఁగదవె = చూడఁగదె, సారంగధరుఁడున్ = నీ కుమారుఁడైన సారంగధరుఁడును, ఆ సతియున్ = ఆ సాధ్వియును (అనఁగాఁ జిత్రాంగియు ననుట), ఇపుడు = ఈ సమయమునందున, చంద్రశాల కరుగుదెంచి చేరినారు = పై మేడకువచ్చి చేరియున్నారలు, ఇందుఁగూర్చి = ఈ విషయమును గుఱించి, ఇంకేమి సేయవలయున్ = ఇఁక నేమి యొనర్పవలయును

సీ॥ గోత్రవర్ధనుఁడవు • గోధర నాథుండ
వఖిలాధికారివి • యగుట వలన

నెఱింగించి నాథ! దా ♦ మీ సుహూర్తమునందు
దార సత్వరముగ ♦ నారసి యింక
భార్యా వియోగ మే ♦ ర్పడనట్లు సారంగ
ధరుఁ గడ తేర్పు వి ♦ ధంబుఁ దెలిసి
కల్యాణమును జేయఁ ♦ గావలె నాకు స
మ్మత మిదియే యంచు ♦ మంత్రి పలుక

గీ॥ వినియు గోధర వరుఁడు నె ♦ మ్మనమునందు
సామ మీ కార్యమునకును ♦ సేమ మొసఁగు
నంచు భావించి యొక భృత్యుఁ ♦ గాంచి వాని
తోడ నిటువలె వచియింపఁ ♦ దొడఁగె నపుడు॥ 71

టీక. శివ॥ గోత్రవర్ధనుఁడవు = పర్వతములను వృద్ధిచేయువాఁడవు, లేక, పర్వతములలో పెంపొందిన వాఁడవు, గోధర నాథుండవు = పర్వతనాయకుఁడవు, అఖిలాధికారివి యగుటవలనన్ = సర్వాధికారము గలవాఁడవగుటవలన, ఎఱిఁగించెదాన్ = తెలిపెదను, దామ = అమరు, ఈముహూర్తమునందు = ఈ నిశ్చయింపఁబడిన శుభముహూర్తమున, ఉదార సత్వరముగ నారసి = అధిక శీఘ్రముగా యోచించి, ఇఁక భార్యావియోగ మేర్పడనట్లున్ = ఇంకమీఁద భార్యకేమి గలుగనట్లుగా (అనఁగా శంకరుఁడు భార్య నశించినవాఁడైనందున గనుక, సారంగధరున్ = ఈశ్వరుని, కడతేర్పువిధంబుఁ దెలిసి = రక్షించువిధము నెఱింగి, కల్యాణమును జేయఁగావలెన్ = వివాహము నొనర్పవలయును, నాకు సమ్మతమిదియేయంచున్ = నాకిష్ట మియ్యదియే యటంచు, మంత్రి పలుకన్ = సచివుఁడిట్లు వచియింపఁగా, వినియున్ = ఆ ల్లించి గోధరవరుఁడు = పర్వతనాథుఁడైన హిమవంతుఁడు, నెమ్మనమునందున్ = హృదయము

నందున, సామ మీ కార్యమునకును సేమ మొసఁగు నంచున్ = ఈ వివాహ కార్యమునకు సామవేదము శుభము నిచ్చునటంచు, భావించి = ఎంచుకొని, ఒకభృత్యుఁ గాంచి = ఒకానొక సేవకునిఁజూచి, అపుడు = ఆ సమయమునందున, వానితోడన్ = ఆ సేవకునితోడ, ఇటు వలెన్ = ఈవిధముగా, వచియింపఁ దొడఁగెన్ = చెప్పఁజూనిన వాఁ డాయెను.

టీక. చంద్ర॥ గోధర = వజ్రధారివైన యో యింద్రా, గోత్ర వర్ధనుఁడవు, పర్వతముల నరికినవాఁడవును, నాథుఁడవు = ప్రభుఁడవును, అఖిలాధికారివి = సర్వాధికారము గలవాఁడవును, అగుటవలనన్ = ఐనందువల్ల, ఎఱిఁగించినాఁడన్ = తెలిపినాడను, తాము = తమరు, ఈ ముహూర్తమునందున్ = ఈ కాలమునందున, తారన్ = నా భార్యమైన తారను, సత్వరముగ నారసి = శీఘ్రముగా వెదకి, ఇఁకన్ = ఇఁకమీఁదట, భార్యావియోగ మేర్పడనట్లున్ = భార్యకు నాకు వెడబాటు లేకుండునట్లుగా, సారంగధరున్ = చంద్రుని, కనతేర్పు విధంబు దెలిసి = చంపురీతి తెలిసికొని, కల్యాణమును జేయఁ గావలె నాకు = నాకు మేలుఁ జేయఁగా వలయును, సమ్మతమిదియే యంచు మంత్రిపలికెన్ = నాయిష్ట మియ్యదియే యటంచు బృహస్పతి వచియింపఁగా, వినియున్ = ఆలకించి, గోధరవరుఁడు = వజ్రధారియైన ప్రభువు, లేక, స్వర్గభర్తయైన ప్రభువు (ఇంద్రుఁడనుట) నెమ్మనమునందున్ = హృదయమునందున, సామ మీ కార్యమునకును సేమ మొసఁగునంచున్ = చంద్రుఁ డొనర్చిన పనికి చతుర్విధోపాయము లలో సామోపాయము శుభము నిచ్చునటంచు, భావించి = ఎంచుకొని, ఒకభృత్యుఁగాంచి = ఒకానొక సేవకుని జూచి, అప్పుడు = నాడు, వానితోడన్ = ఆ సేవకునితోడ, ఇటువలెన్ = ఈ

విధముగా, వచియింప దొడఁగెన్ = చెప్పఁబూనినవాఁ డాయెను, చతుర్విధోపాయము లనఁగా, సామము, దానము, భేదము, దండము, లని గ్రహించునది.

టీక॥ సారంగ॥ గోత్రవర్ధనుఁడవు = కులవర్ధనుఁడవును, గోధరనాథుఁడవు = రాజరాజువును, అఖిలాధికారివి = సర్వాధికారము గలవాఁడవును, అగుటవలనన్ = ఐనందువల్ల, ఎఱిగించినాఁడన్ = తెలిపినాఁడను, తామీ ముహూర్తమునందున్ = తమరీ కాలమునందున, దారన్ = భార్యయైన చిత్రాంగిని, సత్వరముగ నారసి = శీఘ్రముగా విచారించి, ఇఁకన్ = ఇఁకమీఁదట, భార్యావియోగ మేర్పడనట్లున్ = నీకును భార్యకు నెడబాటు గలుగనట్లుగాను, సారంగధరున్ = నీకుమారుఁడైన సారంగధరుని, కడతేర్చువిధంబుఁ దెలిసి = రక్షించువిధము నెఱింగి, కల్యాణమును జేయఁగావలెన్ = శుభ మొనర్పఁగావలయును, నాకు సమ్మతమిదియే యంచున్ = నా యిష్ట మియ్యదియే యటంచు, మంత్రివలుకన్ = సచివుఁడు వచియింపఁగా, వినియున్ = ఆలకించి, గోధరవరుఁడు = రాజనరేంద్రుఁడు, నెమ్మనమునందున్ = హృదయమునందున, సామము = అనుకూలప్రవర్తనరూపమైన యీ యుపాయము, ఈకార్యమునకును సేమమొసంగునంచు = ఈవిచారకార్యమునకు శుభమునిచ్చునటంచు, భావించి = ఎంచుకొని, ఒకభృత్యుఁగాంచి = ఒకానొక సేవకుని జూచి, అపుడు = నాడు, వాని తోడన్ = ఆ సేవకునితోడ, ఇటువలెన్ = ఈవిధముగా, వచియింపఁ దొడఁగెన్ = చెప్పఁబూనినవాఁ డాయెను.

గీ॥ తాను గురుసతిఁ గైకొనఁ • బూనిన పని
నరసి తీర్పఁగ సారంగ • ధరుఁడు ధర్మ
వర్తను సమస్త మెది నె • వ్వానిఁ గోరు
కొనునొ సామము తగుఁగనుఁ • గొనియు రమ్ము॥ 72

టీక శివ॥ తాను = అతఁడు, గురు = అధికురాలైన, సతిన్ = పార్వతిని, కైకొనఁబూనిన పనిన్ = చేపట్టఁ బూనుకొన్న కార్యమును (అనఁగా వివాహము ననుట), అరసి తీర్పఁగన్ = విచారించి చక్కఁబాటు సేయుటకు (వైదికము నడుపుట కనుట), సారంగధరుఁడు = శంకరుఁడు, ధర్మవక్తను = వేదధర్మము పచియించు వానిని, సమస్త వేదినిన్ = సర్వవేదము తెలిసిన వానిని, ఎవ్వానిఁ గోరుకొనునో = ఎవ్వనిఁ గోరుకొంటాడో, సామము తగున్ = సామవేదము తగి యుండును, కనుఁగొనియు రమ్ము = తెలుసుకొని రమ్ము

టీక. చంద్ర॥ తాను = అతఁడు, గురుసతిన్ = బృహస్పతి భార్యయైన తారను, కైకొనఁ బూనిన పనిన్ = చేపట్టఁ బూనుకొన్న కార్యమును, అరసి = విచారించి, తీర్పగన్ = చక్కఁబాటు సేయుటకు, సారంగధరుఁడు = చంద్రుఁడు, ధర్మవక్తను = న్యాయము మాటలాడు వానిని, సమస్తవేదిని = సర్వము తెలిసినవానిని, ఎవ్వానిఁ గోరుకొనునో = ఎవ్వనిఁ గోరుకొంటాడో, సామము తగున్ = సామ దాన భేద దండములను చతుర్విధోపాయములలో సామోపాయ మొప్పును, కనుగొనియు రమ్ము = తెలుసుకొని రమ్ము.

టీక సారంగ॥ తాను = అతడు, గురుసతిన్ = దేవేరిని, కైకొనఁ బూనిన పనిన్ = చేపట్టఁ బూనుకొన్న కార్యమును, అరసి = నే విచారించి, తీర్పఁగన్ = తీర్పు చేయుటకు, సారంగధరుఁడు = నాకొడుకు, ధర్మవక్తను = న్యాయవాదిని (అనఁగా వకీలు ననుట), సమస్తవేదిని = సర్వము తెలిసినవానిని, ఎవ్వానిఁ గోరుకొనునో = ఎవ్వనిఁ గోరుకుంటాడో, సామము తగును = అనుకూలప్రవర్తనరూపమైన యుపాయ మొప్పును, కనుఁగొనియురమ్ము = తెలుసుకొనిరమ్ము.

క॥ అనఁ జని సారంగధరున్
గనుఁగొని గోధర వరాజ్ఞ • గా ధృత్యుఁడటుల్
వినుపింప జియ్య కిట్లను
మని పలికెఁ దొడంగె నాతఁ • డవి యెట్లనినన్॥ 73

టీక సుగమము

క॥ ఏకరణినైన నియ్యెడ
నాకున్ గల్యాణ మొగి నొ • నర్చుట కొఱకా
లోకేశునకే చెల్లును
గాక పరులకెట్లు వశము • గాఁ గల దరయన్॥ 74

టీ॥ శివ॥ ఇయ్యెడన్ = ఇప్పుడు, ఏకరణినైనన్ = ఏవిధముగా నైనను, ఒగిన్ = క్రమముగా, నాకున్ గల్యాణమున్ = నాకు పెండ్లిని ఒనర్చుట కొఱకు = చేయుటకొఱకు, ఆలోకేశునికే చెల్లును గాక = ఆ బ్రహ్మదేవునికే తగునుగాని, అరయన్ = విచారింపఁగా, పరులకెట్లు వశముగాఁ గలదు = ఇతరులకెట్లు శక్యమగును (కానేరదనుట)

టీ॥ చంద్ర॥ ఇయ్యెడన్ = ఈ సమయమునందున, ఏకరణినైనన్ = ఎట్టులైనను, నాకున్ గల్యాణమొగి నొనర్చుట కొఱకు = నాకు క్రమముగా శుభముఁ జేయుటకొఱకు, ఆలోకేశునకే చెల్లును = ఆ జగదీశ్వరునకే తగును, కాక = అట్లుగాక, అరయన్ = విచారింపఁగా, పరులకెట్లు వశముగాఁగలదు = ఇతరులకెట్లు శక్యముగాఁగలదు (కానేరదనుట)

టీక సారంగ ॥ ఇయ్యెడన్ = ఇప్పుడు, ఏకరణినైనన్ = ఏ విధముగా నైనను, నాకున్ గల్యాణమొగి నొనర్పుట కౌఱకు = నాకు క్రమముగా మేలు సేయుటకొఱకు, ఆ లోకేశునకే చెల్లును = ఆ ప్రభువునకే తగును, కాక = అట్లుగాక, అరయన్ = విచారించుటకు, పరులకెట్లు వశమగాఁగలదు = ఇతరుల కెట్లు శక్యముకాఁగలదు (కానేరదనుట)

ఆ॥వె॥ భృత్య సురుచిరమణి ♦ పీడ సత్యము విధి
వలన నెటుల జరుగ ♦ వలెనొ యటులె
జరిగి తీరవలయు ♦ జాగేల కలికి నే
నాయితముగ నుండు ♦ టనుము చనుము॥ 76

టీక శివ॥భృత్య = ఓ సేవకా, సురుచిరమణి = మిక్కిలి మనోహరమైన వారలలో శ్రేష్ఠుఁడా, పిడన్ = వర్ధిల్లగ, విధివలనన్ = బ్రహ్మదేవునివలన, ఎటుల జరుగవలెనొ = ఏవిధము జరుగవలయునో, అటులె జరిగి తీరవలయున్ = ఆ విధముగానే జరిగి తీరవలయును, సత్యము = ఇయ్యదివాస్తవము జాగేల = ఆలస్యముసేయుటేటికి, కలికి నేను = పార్వతియను చేడియయును నేనును, ఆయితముగ నుండుట = సంసిద్ధముగా నుండుట, అనుము = చెప్పుము, చనుము = పొమ్ము

టీక చంద్ర॥ భృత్య = ఓ సేవకా, సురుచిన్ = మంచికాంతి గల దానిని, రమణిన్ = శృంగారవతిని (అనఁగా తారననుట) పీడన్ = వదలువాఁడను కాను, సత్యము = ఇయ్యది వాస్తవము, విధివలనన్ = నిబంధనము వలన, ఎటుల జరుగవలెనొ = ఎటు నడువ వలయునో, అటులె = ఆవిధముగానే, జరిగి తీరవలయున్ = నడచి తీరవలయును, జాగేల = ఆలస్యమేటికి, కలికి = యుద్ధమునకు, నేనా

యితముగ నుండుట = నేను సంసిద్ధముగా నుండుట, అనుము = చెప్పుము, చనుము = పొమ్ము.

టీక సారంగ॥ భృత్య = ఓ సేవకా, సురుచిరమణి = మిక్కిలి మనోజ్ఞమైన వారలలో రత్నప్రాయుఁడా, పీ దసత్యమున్ = సత్యము నుమ పీడువాఁడను కాదు, విధి వలన నెటుల గురుగపలెనో = నిబంధనము వలన నెట్లు కానున్నదో, అటులె జరిగి తీరవలయున్ = అట్లేయై తీరవలయును, జాగేల = ఆలసించుటేటికి, కలికి నేను = చిత్రాంగి యను చేడియయును నేనును, ఆయితముగ నుండుట = సిద్ధముగా నుండుట, అనుము, చెప్పుము, చనుము = పొమ్ము.

క॥ కావున గోధరవరునకు
నీవరుదెంచియును నేడు • నేఁ బల్కి నటుల్
గా వివరింపు మటన్నన్
సేవకుఁ డటు గోధరేంద్రు • జేరి వచించన్॥ 76

టీక. గోధరవర, గోధరేంద్ర శబ్దములు, శివ చంద్ర సారంగధర కథలలో వరుసగా, భూధరనాయకుఁడైన హిమవంతుఁడు, వజ్రధారియైన యింద్రుఁడు, భూభర్తయైన రాజనరేంద్రుఁ డని గ్రహించునది. తతిమ్మా విషయము మూఁడిఁట సమము, సుగమము.

గీ॥ జానుగా నంతలో దివ్య • మౌని రతిని
తెలిసి వాక్పతి పటుఁడు నీ • తిజ్ఞుఁ డలఘు
భృగువు సారంగధరుఁ గృత • కృత్యుఁ జేయ
నెంచి యేడ్తెఱఁ దోడ్పడ • నేగుదెంచె॥ 77

టీక శివ॥ అంతలోన్ = ఆలోపల, జానుగాన్ = అందమగు నట్లుగా, దివ్యమౌ = మనోజ్ఞమైనట్టి, నిరతిని = మిక్కిలి యనక్తితో,

తెలిసి = ఎఱిఁగినవాఁడై, వాక్పతి = బ్రహ్మదేవుఁడు, పరుఁడు = పరమాత్ముఁడు, నీతిజ్ఞుఁడు = న్యాయ మెఱిగినవాఁడు, అలఘు భృగుపున్ = అధికుఁడైన శంకరుని, సారంగధరున్ = జింకతాల్పరి యైన వానిని, కృతకృత్యుఁ జేయనెంచి = కృతార్థునిఁగాఁ జేయం దలంచి, ఏడ్తెఱన్ = శీఘ్రముగా, తోడ్పడనేగుదెంచెన్ = సాయుపడ వచ్చినవాఁ డాయెను, భృగు శబ్దము శంకరునకుఁ జెల్లుననుటకు ని భృగుః శుక్రే ప్రపాతేచ జమదగ్నౌ పినాకిని, అని విశ్వము.

టీక చంద్ర॥ అంతలోన్ = అప్పట్టున, జానుగాన్ = అందముగు నట్లుగా, దివ్యమౌని = నారదునియొక్క, రతిని = అనురాగము వలన, తెలిసి = ఎఱిఁగినవాఁడై, వాక్పతి పరుఁడు = బృహస్పతికి శత్రువైనవాఁడు, నీతిజ్ఞుఁడు = న్యాయముఁ దెలిసినవాఁడు, అలఘు = అధికుఁడైన, భృగుపు = శుక్రాచార్యుఁడు, సారంగధరుఁ గృతకృత్యుఁ జేయనెంచి = చంద్రునిఁ గృతార్థునిఁ జేయఁగాఁ దలంచి, ఏడ్తెఱఁ దోడ్పడన్ = యుద్ధమందు సహాయపడుటకు, ఏగుదెంచెన్ = వచ్చినవాఁ డాయెను

టీక సారంగ॥ అంతలోన్ = ఆ సమయమందున, జానుగాన్ = అందముగా, దివ్యమౌ నిరతిని = మనోజ్ఞమైన యాసక్తితో, తెలిసి = తెలిసికొనినవాఁడై, వాక్పతి = చతురముగా మాటలాడు వాఁడు, పరుఁడు = ఉత్కృష్టుఁడైన వాఁడు, నీతిజ్ఞుఁడు = నీతిజ్ఞుఁడను మంత్రి, అలఘు = గొప్పయందున, భృగుపు = శంకరునివంటి వాఁడు, సారంగధరుఁ గృతకృత్యుఁ జేయనెంచి = సారంగధరుని కృతార్థునిఁ జేయఁగాఁ దలంచి, ఏడ్తెఱన్ = శీఘ్రముగా, తోడ్పడ నేగుదెంచెన్ = సహాయపడ వచ్చినవాఁడాయెను

గీ॥ అపుడు గోధరవరుఁడు న • యార్జవుఁ డనఁ
బరగు వాక్పతి నేడ్తెఱ • పని కుపక్ర

మించు టొప్పగు నన సమ్మ ♦ తించి యతఁడు
పరికరంబుల భృత్యుల ♦ వలనఁ గూర్చె॥ 78

టీక. శివ॥ అపుడు = ఆ సమయమునందున, గోధరవరుఁడు = హిమవంతుఁడు, నయార్ణవుఁ డనఁ బరగు = నీతి సాగరుఁ డనఁగాఁ బ్రసిద్ధమైన, వాక్పతిన్ = బ్రహ్మదేవుని, ఏడ్తెఱ పనికి = అతిశయమైన కార్యమునకు, (అనఁగా వివాహ కార్యమున కనుట), ఉపక్రమించు టొప్పగు ననన్ = మొదలుఁ బెట్టుట తగుననఁగా, సమ్మతించి = అంగీకరించి, అతఁడు = ఆ బ్రహ్మదేవుఁడు, భృత్యులవలనన్ = సేవకులవలన, పరికరంబులన్ = వివాహమునకు కావలసిన యుపకరణములను, కూర్చెన్ = కూడ పెట్టిన వాఁడాయెను.

టీక చంద్ర॥ అపుడు గోధరవరుఁడు = నాడు వజ్రధారియైన ప్రభువు (ఇంద్రుఁడనుట), నయార్ణవుఁ డనఁ బరగు వాక్పతిన్ = నీతి సాగరుఁ డనఁగాఁ బ్రవర్తిల్లునట్టి బృహస్పతిని, ఏడ్తెఱ పనికి = యుద్ధ కార్యమునకు, ఉపక్రమించు టొప్పగు ననన్ = ప్రారంభించుట బాగగు ననఁగాఁ, అతఁడు = ఆ బృహస్పతి, సమ్మతించి = అంగీకరించి, పరికరంబులన్ = యుద్ధోపకరణములను, భృత్యులవలనన్ = సేవకుల వలన, కూర్చెన్ = కూడబెట్టిన వాఁడాయెను

టీక సారంగ॥ అపుడు గోధరవరుఁడు = నాడు రాజనరేంద్రుఁడు, నయార్ణవుఁ డనఁ బరగు = నయార్ణవుఁ డను పేరుతో ప్రసిద్ధమగు, వాక్పతిన్ = చతురముగా మాటలాడు మంత్రిని, ఏడ్తెఱ పనికి = అతిశయమైన కార్యమునకు, లేక, శీఘ్రమైన కార్యమునకు (అనఁగా విచారణ కార్యమున కనుట), ఉపక్రమించు టొప్పగు ననన్ = మొదలు పెట్టఁ దగ ననఁగా, అతఁడు = ఆ నయార్ణవుఁడు, సమ్మ

తించి = అంగీకరించి, పరికరంబులన్ = విచారణమునకు కావలసిన యుపకరణములను, భృత్యులవలనఁ గూర్చెన్ = సేవకులవలన కూడ బెట్టినవాఁ డాయెను

వ॥ ఇట్లుఁ గూర్చి వేదోక్త ధర్మ ప్రకారంబుగా కార్యంబు నడుప
నుద్యమించి యందలి ముఖ్యులగు వారలకు హెచ్చరిక సేయు
నవసరంబున 79

టీక సుగమము మూడిఁట సమానము

గీ॥ అమర వరుఁడను గన్నియ • గమకమున వ
రిష్ఠ కల్యాణ పీఠో ప • రిన్ దనర్చి
యున్న నాస్థానమున నేరి • కెన్న తరము
గాని బలఁగము వచ్చిన • ల్గడల నిండె॥ 80

టీక శివ॥ అమరన్ = సిద్ధముగా, వరుఁడును = పెండ్లికొమరుఁడును, కన్నియ = పెండ్లికూతురును, గమకమునన్ = యత్నముతో, వరిష్ఠ = మిక్కిలి శ్రేష్ఠమైన, కల్యాణ పీఠోపరిన్ = పెండ్లి పీటల మీదట, తనర్చియున్నన్ = అతిశయించి యుండగా, ఆ స్థానమున నేరికిన్ = అచ్చోట నెవ్వరికిని, ఎన్నతరముగాని బలఁగమువచ్చి = గణుతింప శక్యముగాని బంధుజన మరుగుదెంచి, నల్గడల నిండెన్ = నాల్గు దిక్కుల నిండుకొని యుండెను.

టీక. చంద్ర॥ అమరవరుఁడును = దేవేంద్రుఁడును, కన్నియ = క్రొత్తయగు, గమకమునన్ = యత్నముతో, వరిష్ఠ = మిక్కిలి శ్రేష్ఠమైన, కల్యాణ పీఠోపరిన్ = బంగారు పీఠముమీద, తనర్చియున్నన్ = ఒప్పుచుండగా, ఆ స్థానమున నేరికిన్ = అచ్చోట నెవ్వరికిని, ఎన్నతరముగాని బలఁగము వచ్చి = లెక్కింప నలవిగాని సైన్య మరుదెంచి, నల్గడఁ నిండెన్ = నాల్గువైపుల నిండుకొనియెను

టీక. సారంగ॥ అమరన్ = ఒప్పునట్లుగా, వరుఁడును = రాజ నరేంద్రుఁడును, కన్నియ గమకమునన్ = నూతన ప్రయత్నముతో, వరిష్ఠ కల్యాణ పీఠోపరిన్ = శ్రేష్ఠమైన బంగారుపీఠముమీద, తనర్చి యున్నన్ = విజృంభించియుండఁగా, ఆస్థానమున నేరికిన్ = రాజసభ యందున నెవ్వరికిని, ఎన్నతరముగాని బలఁగము వచ్చి = ఎంచ వశము గాని పరివారము వచ్చి, నల్గడల నిండెన్ = నలుదెసల నిండికొని యుండెను.

గీ॥ అంత వాక్పతి యనెడు న • యార్థవుండు
వరుస సారంగధరు నూత్న • వాసముఁ గనఁ
గలికి వసనము నటె కాంచఁ • దెలిపి మఱియు
మంజు సమయోక్తుల వచించె • మంత్రి యగుట॥ 81

టీక. శివ॥ అంతన్ = అటుమీదట, వాక్పతి యనెడు నయా ర్థవుండు = బ్రహ్మదేవుఁ డనునట్టి నీతిసాగరుఁడు, వరుసన్ = క్రమ ముగా, సారంగధరు నూత్నవాసముఁ గనన్ = శంకరుని నూత్న వస్త్రమును వహించునట్లును, కలికిన్ = పార్వతియను దేవిని, అటె = ఆ విధముగానె, వసనమున్ = వస్త్రమును, కాంచన్ = వహింపఁగా, తెలిపి = ఎఱింగించి (అనఁగా వధూవరులను నూతనవస్త్రములను వహించు నట్లుగా ననుట), మఱియున్ = మరల, మంజు = మనోజ్ఞమైన, సమయోక్తులను, ఆ సమయమునకుఁదగిన వేదోక్తులను, మంత్రి యగుటన్ = వేదమంత్రములు దెలిసినవాఁ డగుటవలన, లేక, కలిగిన వాఁ డగుటవలన, వచించన్ = ఉచ్చరించినవాఁ డాయెను.

టీక చంద్ర॥ అంతన్ = అటుమీదట. వాక్పతి యనెడు నయార్థ వుండు = బృహస్పతి యను నీతిసాగరుఁడు, వరుసన్ = క్రమ ముగా, సారంగధరు నూత్నవాసముఁ గనన్ = చంద్రుని నూతన

నివాసమును గాంచుటకును, కలికి = యుద్ధమునకు, వసనమున్ = ఉనికిని, అటకాంచన్ = అచ్చటనే పఠయుటకును, తెలిపి = ఎఱిఁగించి, మఱియున్ = అనంతరమును, మంజు = మనోహరములగు, సమయోక్తులన్ = అప్పటికి తగినమాటలను, మంత్రియగుటన్ = ఇంద్రునకు మంత్రియైనందున, వచించెన్ = పలికినవాఁ డాయెను

టీక. సారంగ॥ అంతన్ = పిమ్మట, వాక్పతియనెడు నయార్థపుండు = చతురముగా మాటలాడువాఁ డనఁదగు నయార్థపుఁడు, వరుసన్ = క్రమముగా, సారంగధరు నూత్నవాసముఁ గనన్ = సారంగధరునిదియైన క్రొత్తవస్త్రమును చూచునట్లుగను, కలికి = చిత్రాంగియును చేడియయొక్క, వసనమున్ = ఉనికిని, అటె కాంచన్ = అట్టులనే చూచునట్లును, తెలిపి = ఎఱిగించి, మఱియున్ = వెండియు, మంత్రియగుటన్ = ప్రధానుఁడైనందున, మంజు సమయోక్తుల వచించెన్ = మనోజ్ఞమైన సమయానుకూల వాక్యములు పల్కినవాఁ డాయెను.

గీ॥ గురు రుచిరమణి సారంగ • ధరు నటఁగని
తా జగద్బంధు సాక్షి కం • దర్పవైరి
కోరనుచు సత్యవాణినిన్ • వీడననుచు
వెసఁ బ్రమాణంబుఁ జేయించె • విధి యయారె॥ 82

టీక. శివ॥ అటన్ = అచ్చట (అనఁగా నా కల్యాణ మండపమునం దనుట), విధి = బ్రహ్మదేవుఁడు. గురు రుచి = మిక్కిలి కాంతిగల, రమణిన్ = చేడియను (అనఁగాఁ బార్వతి ననుట) సారంగధరున్ = శంకరుని, కని = చూచి, తాన్ = ఆతడు, జగద్బంధు సాక్షి = వాయుమిత్రుఁడైన యగ్నిసాక్షిగా, కందర్పవైరి = మన్మథవిరోధియైన శంకరుఁడు, కోరనుచున్ = చేరిమి యనుచును, సత్యవాణిన్ = సత్యమైన వాక్కులుగల పార్వతిని, వీడనుమన్ = వదలిపెట్ట ననుచును,

వెసన్ = శీఘ్రముగా, ప్రమాణంబుఁ జేయించెన్ = ఒట్టుఁబెట్టించిన వాఁ డాయెను. అయారె = ఆశ్చర్యము, జగచ్ఛద్మము వాయుపు నందును భువనములందును వర్తించునని గ్రహించునది, అనఁగా శంక రుఁడే నాకు సహాయమని పార్వతితోడను, పార్వతిని విడనాడనని శంకరునితోడను బ్రహ్మదేవుఁడు తానుచు వారలతో ప్రమాణముఁ జేయించెనని తాత్పర్యము.

టీక. చంద్ర॥ అటన్ = అచ్చట (అనఁగాఁ ఇంద్రుని నివాస మునం దనుట), గురు = బృహస్పతియొక్క రుచిరమణి = కాంతియుక్తమైన చేడియ (అనఁగా తార యనుట), సారంగధరున్ = చంద్రుని, కని = చూచి, తాన్ = తాను, జగద్బంధుసాక్షి = సూర్యునిసాక్షి, కందర్పవైరి తోడనుమన్ = శంకరుని తోడటందును, సత్యవాణి = ఓ సత్యవాక్యములు గలదానా, నిన్ వీడననుచున్ = నిన్ను వదలిపెట్ట ననుచును, ఆయారె = ఆశ్చర్యము, వెసన్ = శీఘ్రముగా, ప్రమా ణంబుఁ జేయించెన్ = ఒట్టుఁబెట్టించెను, విధి = దురదృష్టము

అనఁగా నోసత్యవాణి సూర్యునిసాక్షి శంకరునితోడు నిన్ను వీడ ననుమని చంద్రునితో తార ప్రమాణముఁ జేయించెనని తాత్పర్యము.

టీక. సారంగ॥ అటన్ = అచ్చట, (కచేరితో ననుట) కని = చూచి, తాన్ = అతఁడు (నయార్థపుఁడను మంత్రియనుట), గురు = రాజుయొక్క, రుచి రమణిన్ = కాంతియుక్తమైన చేడియను, (చిత్రాంగి ననుట), సారంగధరున్ = సారంగధరుఁ డను యువరాజును, జగద్బంధు సాక్షి = సూర్యునిసాక్షి, కందర్పవైరి తోడనుమన్ = శంకరుని

తోఁదటంచును, సత్యవాణిఁనెన్ = సత్యవాక్యమును, వీకననుదున్ = వదిలిపెట్టినటంచును, వెసన్ = శీఘ్రముగా, విధి యయారె = అహహో దురదృష్టము ప్రమాణంబుఁ జేయుంచెన్ = ప్రమాణమును చేయుందిన వాఁడాయెను.

గీ॥ అమర విభుఁ డంత కార్యక్ర ♦ మమును నడుపు
టవసరంబని సలుప సా ♦ గ విజయేచ్ఛ
నిరుగడల నుండు వాదన ♦ పరుల వాద
నంబులటఁ జెలరేఁగె ఘ ♦ నంబు గాఁగ॥ 88

టీక శివ॥ అమరన్ = ఒప్పునట్లుగా, విభుఁడు = బ్రహ్మ దేవుఁడు, అంతన్ = పిమ్మట, కార్యక్రమమును నడుపుట = వివాహ కార్యక్రమమును జరుపడము, అవసరంబని = అగత్యమటంచు, సలుప సాగన్ = చేయుచుండఁగా, విజయేచ్ఛన్ = మిక్కిలి గెలుపు కోర్కెతో, ఇరుగడల నుండు వాదనపరుల = రెండువైపుల నుండి వాద, ము సేయువారియొక్క, వాదనంబులు = మంగళవాద్యములు, అటన్ = అచ్చట, ఘనంబుగాఁగన్ = అతిశయించునట్లుగా, లేక, మేఘమనునట్లుగా, చెలరేఁగెన్ = విజృంభించిన వాయెను, విభుశబ్దము బ్రహ్మకు చెల్లునని గ్రహించునది

టీక చంద్ర॥ అంతన్ = పిమ్మట, అమరవిభుఁడు = దేవేంద్రుఁడు, కార్యక్రమమును నడుపుట = యుద్ధకార్యక్రమమును జరిగించుట, అవసరంబని = అగత్యమటంచు, సలుపసాగన్ = అట్లుచేయుటకు బయలుదేఱఁగా, విజయేచ్ఛన్ = మిక్కిలి గెలుపు కోర్కెతో, అటన్ = అచ్చట, ఇరుగడలనుండు వాదనపరుల వాదనంబులు = రెండువైపులనుండు వాద్యపరులయొక్క వాద్యములు (అనఁగా రణభేరీప్రముఖము లనుట), ఘనంబుగాఁగన్ = అతిశయించునట్లుగా, చెలరేఁగెన్ = విజృంభించిన వాయెను

టీక. సారంగ॥ అంతన్ = పిమ్మట, అనురన్ = ఒప్పునట్లుగా, విభుండు = రాజనరేంద్రుఁడు, కార్యక్రమము నడుపుట = వివాహ కార్యక్రమమును జరిగించుట, ఆవసరంబని = అగత్యమటంచు, సలుపసాగన్ = చేయుచుండఁగా, విజయేచ్ఛన్ = మిక్కిలి గెలుపు తలంపుతో, ఇరుగడలనుండు వాదనపరుల వాదనంబులు = రెండు ప్రక్కలనుండు న్యాయవాదులయొక్క వాదనములు (అనఁగా ప్లీడరుల వాదనము లనుట), ఘనంబుగాఁగన్ = అతిశయించునట్లుగా చెలరేగెన్ = విజృంభించిన వాయెను.

గీ॥ అంత సారంగధరుఁడు మ • హాపవిత్ర
కలితహృదయత గురుసతి • కంఠమందు
లలిత మంగళసూత్రము • నలరఁ జేయు
నప్పుడా వధూమణి రాగ • మందె నహహ ॥ 84

టీక. శివ॥ అంతన్ = అటుమీదట, సారంగధరుఁడు = శంకరుఁడు, మహా = అధికతరమైన, పవిత్రకలిత హృదయతన్ = యజ్ఞోపవీతముతో నొప్పిన వక్షస్థలత్వముచే, గురుసతి కంఠమందు = ఘనురాలైన పార్వతీదేవి గళమునందున, లలిత = మనోజ్ఞమైన, మంగళసూత్రము నలరఁజేయు నప్పుడు = పుస్తెను ప్రకాశింపఁ జేయుసమయమునందున, ఆ వధూమణి = ఆ పెండ్లికూతురు, అహహ = ఆశ్చర్యము,, రాగమందెన్ = సంతోష మొందినదాయెను

టీక. చంద్ర॥ అంతన్ = పిమ్మట, సారంగధరుఁడు = చంద్రుఁడు, మహా = గొప్పయైన, అపవిత్ర కలితహృదయతన్ = అపరిశుద్ధముతో నొప్పిన స్వాంతత్వముచే, గురుసతి = తారాదేవియొక్క, కంఠమందున్ = సమీపమునందున, లలితమంగళ = మనోజ్ఞమైన శుభమునకు, సూత్రముఁ = ఏర్పాటును, అలరఁజేయునప్పుడు =

ఒప్పునట్లుగాఁ జేయుసమయమునందున, అహహ = ఆశ్చర్యము, ఆ వధూమణి = ఆ నారీరత్నము, రాగమందెన్ = సంతోషమును బొందిన దాయెను.

టీక సారంగ॥ అంతణ = తరువాత, సారంగధరుఁడు = సారంగధరుఁ డనువాఁడు, మహా = గొప్పయైన, పవిత్ర కలితహృదయ తన్ = పరిశుద్ధముతోఁ గూడుకొన్న స్వాంతత్వముచే, గురుసతికంత మందు = తనతండ్రి భార్యయైన చిత్రాంగీ సమీపమునందున, లలితమంగళ = మనోజ్ఞమైన పనములను, మూత్రకమున్ = ఏర్పాటును, అలరన్ = ఒప్పునట్లుగా, చేయుచున్నప్పుడు = ఒనరించు సమయమునందున, ఆ వధూమణి = ఆ నారీరత్నము (అనఁగాఁ జిత్రాంగియనుట) అహహ = ఆశ్చర్యము, రాగమందెణ = కోపముఁ బొందినదాయెను,

గీ॥ తార లక్షత రాగముల్ • దగఁ గరగ్ర
హణ మిషణ బూని యొకరిపై • నరయ నొకరు
పైచుకొనుచున్న వారలా • వైపు నుండి
చూచువారల కపుడుగా • దోచిరంత ॥ 85

టీక శివ॥ తారలు = ముత్యములు, అక్షతరాగముల్ దగణ = సేసఁబ్రాల యెఱుపులొప్పియుండఁగా, కరగ్రహణ మిషణ = వివాహ వ్యాజముతో (అనఁగా ముత్తెపుతలఁబ్రాల ననుట), పూని = వహించి, అరయణ = విచారింపఁగా, ఒకరిపైనొకరు ప్రచుకొనుచున్న వారలు = ఒకరిమీదనొకరు వేసుకొనునట్టి వాండ్రు (అనఁగా వధూవరు లనుట), ఆవైపునుండి చూచువారలకు = ఆప్రాంతమున నుండి కాంచు వారికి, అపుడుగాఁ దోచిరి = యాశ్చర్యముగాఁ దోచినవారైరి, అంతణ = పిమ్మట.

టీక చంద్ర॥ తారలు = వారలు, అక్షతరాగముల్ దగణ = భాశముగాని సంతోషము లొప్పియుండఁగా, కరగ్రహణమిషన్ =

చేపట్టిన నెపమును, పూని = వహించి, అరయన్ = విచారింపఁగా, ఒకరిపైనొకరు వైచుకొనుచున్ = ఒకరిమీద నొకరు వేసుకొనుచుండఁగా, వారలు = వాండ్రు, (అనఁగా దారాచంద్రు లనుట), ఆ వైపునుండి చూచువారలకున్ = ఆ ప్రదేశము నుండి వీక్షించునట్టి వారికి, అరుదుగాఁ దోఁచిరి = ఆశ్చర్యముగాఁ దోఁచినవారలైరి, అంతన్ = పిమ్మట.

అనఁగా దారా చంద్రులు సంతోషముతోఁ దాము వచ్చిన విషయమైన నెపము నొకరిపైనొకరు పెట్టుకొను చుండఁగాఁ జూచు వారల కెంతో చిత్రమాయెనని తాత్పర్యము.

టీక॥ సారంగ॥ తారలు = వారలు (అనఁగాఁ చిత్రాంగీ సారంగధరు లనుట), అక్షతరాగమున్ దగన్ = నాశముగాని తామసము తొప్పియుండఁగా, కరగ్రహణమిషన్ = చేపట్టబోయి నాదన్న నిందను, పూని = వహించి, అరయన్ = విచారింపఁగా, ఒకరిపై నొకరువైచుకొనుచున్నన్ = ఒకరిమీద నొకరు మోపుకొనుచుండఁగా, వారలు = వాండ్రు, ఆ వైపునుండి చూచువారలకున్ = ఆ ప్రాంతమున నుండి కాంచువారికి, అరుదుగాఁ దోఁచిరి = ఆశ్చర్యముగాఁ దోఁచినవారలైరి, అంతన్ = పిమ్మట.

గీ॥ కోర్కె వాక్పతియనఁ జెల్లు ♦ గురుఁడు భవ్య
రమణిఁగని తమిఁజెంది సా ♦ రంగధరుని
దరికి విచ్చేసి శ్రుతివినఁ ♦ దగనితీరు
వర్ణనార్థము క్రమతోడఁ ♦ బలికె మఱియు॥ 88

టీక శివ॥ కోర్కెన్ = వాంఛతో, వాక్పతియనఁ జెల్లు గురుఁడు = సరస్వతీనాథుఁడనఁగా నొప్పునట్టి కులముపెద్ద (అనఁగా సురజ్యేష్ఠుఁడనుట), భవ్యన్ = పార్వతిని, రమణిఁగని తమిఁజెంది =

విలాసవతిని గాంచి వలపునొందినవాఁడై సారంగధరుని దరికి = శంకరుని చెంతకు, విచ్చేసి = వచ్చినవాఁడై, శ్రుతిన్ = వేదమును, వినఁదగనితీరున్ = వినకొప్పని ధర్మముగా (అనఁగా వివాహకర్మలోని మంత్రముగాక యపరకర్మలోని మంత్రముగా ననుట), వర్ధనార్థము = వృద్ధియగుకొఱకు, భ్రమతోడఁ బలికెన్ = భ్రాంతిచే వచియించిన వాఁడాయెను. మఱియున్ = అనంతరమునను

టీక చంద్ర॥ కోర్కెన్ = వాంఛతో, వాక్పతియనఁజెల్లు గురుఁడు = వాచస్పతి యనఁగాఁ దగునట్టి బృహస్పతి, భవ్యరమణిఁ గని తమిఁజెంది = మనోజ్ఞమైన భార్యను జూచి వలపునొందిన వాఁడై, లేక, త్వరనొందినవాఁడై, సారంగధరుని దరికిన్ = చంద్రుని సమీపమునకు, విచ్చేసి = ఏగుదెంచిన వాఁడై, వర్ధనార్థము = నరుకుటకొఱకు, శ్రుతిన్ = చెవిచేత, వినఁదగని తీరు = వినుట కొప్పని విధముగా, భ్రమతోడన్ = భ్రాంతితో, పలికెన్ = వచియించిన వాఁడాయెను, మఱియున్ = అనంతరమున.

టీక సారంగ॥ కోర్కెన్ = వాంఛతో, వాక్పతియనఁజెల్లు గురుఁడు = చతురముగా మాటలాడువాఁ డనఁగాఁ దగినట్టి రాజు (రాజనరేంద్రుఁ డనుట), భవ్యరమణిఁగని = మనోజ్ఞమైన భార్యను జూచి, తమిఁజెంది = మోహమునొందిన వాఁడై, లేక, అపేక్ష నొందినవాఁడై, సారంగధరుని దరికి = సారంగధరుని చెంగటికి, విచ్చేసి = వచ్చినవాఁడై, వర్ధనార్థము = నరుకుటకొఱకు, భ్రమతోడన్ = భ్రాంతితో, శ్రుతివినఁదగని తీరు = చెవియొగ్గియాలింప నొప్పని విధముగా, పలికెన్ = వచియించెను, మఱియున్ = అనంతరమున.

గీ॥ వీఁడు దోసముఁ జేసిన • వాఁ డటంచు
 సతి నపేక్షించినది మదిన్ • స్పష్టమైన

గురువిధిని గాంచి సారంగ • ధరుఁ డతనికి
దండ మొనరింపఁ బూనె నెం • త ఘనుఁ డహహ॥ 87

టీక. శివ॥ వీఁడు = ఇతఁడు, (బ్రహ్మదేవుఁ డనుట), దోసముఁ జేసినవాఁడటంచున్ = తప్పునొనర్చినవాఁడని, సతినపేక్షించినది = పార్వతి నపేక్షించిన విషయము, మదిన్ = హృదయమునందున, స్పష్టమైన = వెల్లడిగాఁగా, గురున్ = తండ్రిని, విధిన్ = బ్రహ్మను, లేక, గురువిధిన్ = అధికుఁడైన బ్రహ్మదేవుని, కాంచి = చూచి, సారంగధరుఁడు = ఈశ్వరుఁడు, అతనికిన్ = ఆబ్రహ్మదేవునకు, దండ మొనరింపఁ బూనెన్ = వధముఁ జేయఁబూనినవాఁ డాయెను. అహహ = ఆశ్చర్యము, ఎంతఘనుఁడు = ఎంత గొప్పవాఁడు.

టీక. చంద్ర॥ వీఁడు = ఇతఁడు (చంద్రుఁడనుట), దోసముఁజేసిన వాఁడటంచున్ = అప్రియము నొనర్చిన వాఁడని, సతినపేక్షించినది = భార్యనపేక్షించిన విషయము, మదిన్ స్పష్టమైన గురువిధిన్‌గాంచి = హృదయమున విశదపడిన బృహస్పతి విధమును జూచి, సారంగ ధరుఁడు = శంకరుఁడు, అతనికిన్ = ఆ చంద్రునికి, దండ మొనరింపఁ బూనెన్ = వధఁ జేయఁ బూనుకొన్న వాఁ డాయెను, అహహ = ఆశ్చర్యము, ఎంతఘనుఁడు = శంకరుఁ డెంతగొప్పవాఁడు, లేక, సారంగధరుఁడు = చంద్రుఁడు, అతనికిన్ = ఆ బృహస్పతికి, దండమొన రింపఁబూనెన్ = వధముఁ జేయఁ బూనుకొన్న వాఁడాయెను, ఎంత ఘను డహహ = ఆశ్చర్యము చంద్రుఁ డెంతగొప్పవాఁడు.

టీక. సారంగ॥ వీఁడు = ఈ సారంగధరుఁడు, దోసముఁ జేసిన వాఁడటంచున్ = అప్రియము నొనర్చినవాఁడని, సతినపేక్షించినది = భార్యనపేక్షించినట్టి విషయము, మదిన్‌స్పష్టమైన గురువిధినిగాంచి = హృదయమునకు నచ్చునట్లు ఋజువైన తండ్రివిధమును జూచి, సారంగ ధరుఁడు = కుమారుఁడు, అతనికిన్ = ఆ తండ్రికి, దండమొనరింపఁబూనెన్

= నమస్కారముఁ జేయఁ బూనినవాఁడాయెను, అహహ, ఆశ్చర్యము, ఎంత ఘనుఁడు = ఎంతమహాత్ముఁడు

వ॥ అంతఁ బుణ్యజనపాలక విప్రముఖు లవ్విధికి సారంగధరునిఁ
దప్పింప సముత్థానంబుఁ జేయు నవసరంబున నజ్జగద్గురుండు. 88

టీక శివ॥ అంతన్ = అదట, పుణ్యజనపాలక = కుబేరుఁడు, విప్రముఖులు = మొదలైన వారలు, 'అవ్విధికి = ఆ బ్రహ్మకు, సారంగ ధరుని దప్పింపన్ = శంకరునివలని భయమును తొలగఁజేయుటకు, సముత్థానంబుఁ జేయు నవసరంబునన్ = యత్నమొనర్చు సమయము నందున, అజ్జగద్గురుండు = ఆ శంకరుఁడు, ముందరిపద్యముతో నన్వయము.

టీక చంద్ర॥ అంతన్ = అటుపిమ్మట, పుణ్యజనపాల = రాక్షసపతి, కవి = శుక్రుఁడు, ప్రముఖులు = మొదలైనవారలు, అవ్వి ధికి = ఆ జరుగుచున్న విధమునకు, సారంగధరుని దప్పింపన్ = చంద్రుని దప్పించుటకు, సముత్థానంబు జేయు నవసరంబునన్ = యుద్ధము సేయు సమయమునందున, అజ్జగద్గురుండు = ఆశంకరుఁడు, లేక, ఆ బృహస్పతి.

టీక. సారంగ॥ పుణ్యజన = పుణ్యాత్ములు, పాలక = రాజులు, విప్ర = బ్రాహ్మణులు, ముఖులు = మొదలైనవారలు, అవ్విధికిన్ = ఆ జరుగుచున్న విధమునకు, అజ్జగద్గురుండు = ఆ రాజనరేంద్రుఁడు, తతిమ్మా విషయము శివకథకు సమానము

గీ॥ వీని నాత్మజుఁ డనుచు భా • వించుకొన్న
యందులకు నా సతి నపేక్షఁ • జెంది కాంచ

నొప్పునేయని సుపద క • రోత్తమాంగ
ఖండనముగాఁగ శాసించఁ • గషవోక॥ 89

టీక. శివ॥ వీనిన్ = ఈ బ్రహ్మను, ఆత్మజుఁడు = పరమాత్ముఁడు, అనుచు భావించుకొన్న యందులకున్ = అని యెంచుకొన్నందుకు, ఆసతి నపేక్షఁజెంది కాంచన్ = ఆ పార్వతి నపేక్షించి చూడఁగా, ఒప్పునేయని = తగునాయటంచు, కషవోక = కసిబోక, సుపదకర = సచ్చిహ్నితరమైన, ఉత్తమాంగ = శిరంబును (అనఁగా నైదు తలలలో నొకతల ననుట) ఖండనముగాఁగన్ = తెగిపోవునట్లుగాఁ శాసించన్ = శిక్షించినవాఁడాయెను.

టీక. చంద్ర॥ వీనిన్ = ఈ చంద్రుని, ఆత్మజుఁ డనుచున్ = పుత్రుఁడీ యటంచు, భావించుకొన్న యందులకున్ = ఎంచుకొన్నందుకు, ఆపేక్షఁజెంది = కోరిక నొందినవాఁడై, ఆసతిన్ = ఆ తారయను చేడెను, కాంచన్ = వహింపగా, ఒప్పునేయని = తగునాయని, కషవోక = కసిబోక, సుపద = సదంశమైన, కరోత్తమాంగ = కిరణోత్తమదేహమును, ఖండనముగాఁగన్ = తునుకలగుటకు, శాసించన్ = శిక్షించినవాఁడాయెను, ఇఁక బృహస్పతి యైనచో, నా సతిన్ = నా భార్యను, కాంచన్ = వహింపఁగా, ఒప్పునేయని = తగునాయటంచు, కషవోక = కసిబోక, సుపద = సదంశమైన, కరోత్త మాంగ = కిరణోత్తమ శరీరమును, ఖండనముగా,గాన్ = తునుకలగునట్లుగా, శాసించెన్ = శపించినవాఁడాయెను.

అనఁగా పురాణభేదము వలన బృహస్పతి చంద్రుని ఖండశిరునిగా శపించినట్లుఁగూడా కనుపడుచుండుటచేత నిచ్చట ద్వివిధముగా నుండునట్లు రచింపఁబడెనని గ్రహించునది.

టీక. సారంగ॥ వీనిని = సారంగధరుని, ఆత్మజుఁ డంచున్ =

కుమారుఁడటంచు, భావించుకొన్న యందులకు = ఎంచుకొన్నందుకు, నాసతిన్ = నా భార్యయగు చిత్రాంగిని, ఆపేక్షఁజెంది, తాంచన్ = ఆశతోఁజూడఁగా, ఒప్పనేయని = చెల్లునా యటంచు, కను వోక = తామసము దగ్గిపోనివాఁడై, సుపద = మంచి పాదములు, కరోత్తమ — హస్తశ్రేష్ఠములనెడి, అంగ = అవయవములను, ఖండనము గాఁగన్ = నరుకునట్లుగా, శాసింపన్ = శిక్షఁజెప్పిన వాఁడాయెను.

వ॥ అట్టియెడ.

చ॥ ఉరగవిభుండు మస్తకము • లొగ్గె హరిద్విరదాష్టకంబు స
త్వరగతిఁ బర్వతోత్తె వసు • ధారలమొల్లఁ జలించ గట్లు ద్రి
మ్మరి జలధుల్ గలంగె గిరి • మన్ దృఢసాంద్రమువిచ్చ మిన్ను గా
వరిగొనెఁ దారకోత్కరము • పెల్లున డుల్లె విదారకమౌ గదా॥ ౯౦

టీక. సుగమము, మూడింట సమము.

వ॥ అంత నారాజు మరలఁ దజ్జీవహరణమునకై శాసింప నుద్యుక్తుండై నట్లగుపడినందున భయభ్రాంత చిత్తుండై మతిమంతుఁడనఁ దగు జన్నిగట్టప్ప యబ్బాయటంచు పల్కి నరేశ్వరా నీ వింత తామసం బూనినటో లోకంబుఁ భరింపనగునే యిదియేటాలు శాంతింపుమని హస్తమున్ బట్టుకొనిన నాపురుషోత్తమునిన్ ధిక్కరింపఁజాలక నతఁడు వెనుకంజవేయుచున్న సమయంబున. ౯౧

టీక. వ॥ అంతన్ = పిమ్మట, ఆ రాజు = ఆ ప్రభువు (చిత్రపతియగు శంకరుఁ డనట), మరలన్ = తిరుగ, తత్ = అబ్బాహ్వ యొక్క, జీవహరణమునకై = ప్రాణమును హరించుట కొఱకు, శాసింపన్ = శిక్షింపుటకు, ఉద్యుక్తుడైనట్లగుపడినందునని = యత్నిం

చినట్లు కనుపడుచుండుట వలన, భయభ్రాంత చిత్తుండై = భీతియు భ్రాంతియు కూడుకొన్న హృదయముఁ గలవాఁడై, మతిమంతుఁడనఁ దగు = బుద్ధిమంతుఁడన నొప్పునట్టి, జన్నిగట్టభ్బ = బ్రహ్మతంత్రిడయైన విష్ణుఁడు, అబ్బాయటంచువచ్చి = కష్టమని యెగుఁదెంచినవాఁడై, సదీశ్వరా = ఓ మంచి శంకరుఁడా, తక్కిమ్మా విషయము సుగమము

టిక చంద్ర॥ అంతన్ = పిమ్మట, తత్ = ఆ శంకరుని యొక్క, జీవహరణమునకై = ప్రాణమును హరించుటకై, లేక, తత్ = ఆ యొక్క, జీవహరణమునకై = బృహస్పతి నాశనమునకై, మరలన్ = తిరుగ, ఆ రాజు = ఆ చంద్రుఁడు, శాసింపన్ = శిక్షించుటకు, ఉద్యుక్తుండైనట్లగుపడినందునన్ = యత్నించినట్లు కనుపడినందున, మతిమంతుఁ దనఁదగు = బుద్ధిమంతుఁడన నొప్పినట్టి, జన్నిగట్టు = బ్రహ్మదేవుఁడు, అబ్బాయబ్బా యటంచు వచ్చి = అయ్యయ్యో యటంచు వచ్చినవాఁడై, సదీశ్వరా = ఓ నక్షత్రనాయకా, ఆ పురుషోత్తముని = ఆ పురుషశ్రేష్ఠుని, తక్కిమ్మా విషయము సుగమము

టీక సారంగ॥ అంతన్ = పిమ్మట, ఆ రాజు = ఆ రాజ నరేంద్రుఁడు, మరలన్ = తిరుగా, తత్ = ఆ సారంగధరుని యొక్క, జీవహరణమునకై = ప్రాణమును హరించుటకై, శాసింపన్ = శిక్షించుటకు, ఉద్యుక్తుండైనట్లగుపడినందున = ప్రయత్నించినట్లు కనుపడుట వలన, మతిమంతుఁ దనఁదగు = మతిమంతుడనఁగా నొప్పునట్టి, జన్నిగట్టు = బ్రాహ్మణుఁడు (అనఁగా మతిమంతుఁడను మంత్రి యనుట), సదీశ్వరా = ఓ ప్రభూత్తమా, తక్కిమ్మా విషయము సుగమము

గీ॥ అచటఁ గనుఁగొన్న వారల • యందుఁ గొంద
రవనిలోఁ దప్పునె యఘం • బెవరికేని

రమణికై యెంతలెనసె సా • రంగధరుఁడు
సాహసికుఁడైనఁ దా గురు • ద్రోహిగాడె॥ 93

టీక శివ॥ సారంగధరుఁడు = శంకరుఁడు, రమణికై = పార్వతియను చేడియకొఱకు, ఎంతలెనసెన్ = ఎంతటి భారమును బూనెను, సాహసికుఁడైనన్ = సాహసవంతుఁడై సప్పటికిని, గురుద్రోహి గాడె = తండ్రి కపకారముఁ జేసినవాఁడు గాకపోవునా (అగుననుట), తతిమ్మావిషయము సుగమము, పురాణభేదములవలన శంకరుఁడు బ్రహ్మపుత్రుఁడని గ్రహింపనది

టీక చంద్ర॥ గురుద్రోహిగాడె = గురువునకు ద్రోహము జేసినవాఁడు గాకపోవునా, తతిమ్మావిషయము సుగమము.

టీక సారంగ॥ శివకథకు సమానము.

గీ॥ అనుచు మతికొంద రట్లు గా • దతఁ డహీన
గుణుఁడు ప్రశమిత దోషుఁడు • కువలయాప్తుఁ
డరిభయంకరుఁ డతిధీరుఁ • డగుటవలన
నేరు సారంగధరు నొంప • లే రటంద్రు॥ 94

టీక శివ॥ అహీనగుణుఁడు = ఆదిశేషు నల్లెత్రాడుగా గలవాఁడు, ప్రశమితదోషుఁడు = మిక్కిలి శమింపఁజేయఁబడిన పాపములు గలవాఁడు, కువలయాప్తుఁడు = భూవలయమునకు మిత్రుఁడైనవాఁడు, అరిభయంకరుఁడు = శత్రువులకు భయంకరమైన వాఁడు, అతిధీరుఁడు = మిక్కిలి స్వాతంత్ర్యము గలవాఁడు, తతిమ్మావిషయము సుగమము

టీక చంద్ర॥ అహీనగుణుఁడు = గొప్పస్వభావము గలవాఁడు, ప్రశమితదోషుఁడు = మిక్కిలి శమింపఁ జేయఁబడిన నేరములు

గలవాఁడు, కువలయాప్తుఁడు = కలువలకు చెలికాఁడు, అరిభయంకరుఁడు = చక్రవాకములకు భయంకరమైనవాఁడు, అతిధీరుఁడు = మిక్కిలి ధైర్యముగలవాఁడు, తక్కిన విషయము సుగమము.

టీక సారంగ॥ అహీనగుణుఁడు = గొప్పగుణము గలవాఁడు, అతిధీయుఁడు = గొప్పవిద్వాంసుడు, తక్కిన విషయము శివకథకు సమానము.

గీ॥ రాజ నాతలవరులు సా ♦ రంగధరుని
పర విజేయుని సత్వసం ♦ పన్ను సురుచి
రాబ్జ నొప్పించి కొనిపోయి ♦ యోజ గాన
విదళిత విపత్కరునిగఁ గా ♦ వించిరి తమి॥ 95

టీక రాజన్ = ఒప్పిదముగా, వరులు = ఆ పెండ్లికి వచ్చిన వారిలో శ్రేష్ఠులు, సారంగధరునిన్ = జింకతాల్పరిని, పర విజేయుని = శత్రువులచేత జయింపఁగాని వానిని, సత్వసంపన్నున్ = దేహబలమే సంపద్గాఁ గలవానిని, సురుచిర = మిక్కిలి మనోజ్ఞమైన, అబ్జన్ = అబ్జసంబంధమైన వానిని (శంకరు ననుట), ఒప్పించి = సమ్మతి పరచి, ఆ తలన్ = ఆ బ్రహ్మశిరస్సును, కొనిపోయి = తీసుకపోయి, ఓజన్ = క్రమముగా, కానన్ = కాంచునట్లుగను, విదళిత = మిక్కిలి ఖండింపఁబడిన, విపత్కరునిఁగన్ = అపత్కరము గలవానినిఁగా, తమిన్ = అపేక్షతో, కావించిరి = చేసినవారలైరి.

టీక. చంద్ర॥ రాజన్ = ఒప్పిదమగునట్లుగా, ఆతలన్ = అటు పిమ్మట, వరులు = ఆ యుద్ధమునందుగల బ్రహ్మాది సురశ్రేష్ఠుఁ, సారంగధరునిన్ = జింకతాల్పరిని, పరవిజేయునిన్ = శత్రువులకు

జయింపఁగాని వానిని, సర్వసంపన్నున్ = దేహబలమను సంపదతోఁ గూడుకొన్నవానిని (చంద్రుననుట), సురచిర = మిక్కిలి మనోజ్ఞమైన, ఆజిన్ = యుద్ధమునందున, ఒప్పించి = సమాధానపరచి, ఓజ = ఉపాధ్యాయుఁడగు బృహస్పతి, కానన్ = కాంచునట్లుగా, కొనిపోయి = యుద్ధమునుండి వెనుకకు మరలించుకొనిపోయి, తమిన్ = అపేక్షతో, విదళిత = మిక్కిలి ఛేదింపఁబడిన, విపత్కరునిఁగన్ = ఆపద కరముగల వానినిగా (అనఁగా నితరులకు బాధకరుఁడు గానట్లుగా ననుట), కావించిరి = చేసినవారలైరి

టీక సారంగ॥ రాజన్ = ఒప్పునట్లుగా, ఆ తలవరులు = ఆ రాజనరేంద్రుని సంబంధమైన తలారివాండ్రు, పరవిజేయునిన్ = ఇతరులకు జయింపఁగాని వానిని, సత్వసంపన్నున్ = సత్వగుణమను సంపదతోఁ గూడుకొన్న వానిని, సరుచి రాజిన్ = మంచి కాంతుల సముదయముగల వానిని, సారంగధరునిన్ = సారంగధరుఁడనువానిని, నొప్పించి కొనిపోయి = నొవ్వఁజేయుచు తీసుకొనిపోయి, ఓజన్ = క్రమముగా, కానన్ = అరణ్యములో, తమిన్ = రాత్రియందున, విదళిత = మిక్కిలిఖండింపఁబడిన, వి = చక్కనైన, పత్ = కాళ్ళను, కరునిఁగ = హస్తములు గలవానినిఁగా (అనఁగాఁ జక్కనైన కాళ్ళుఁ జేతులను ఖండింపఁబడిన వానినిఁగా ననుట), కావించిరి = చేసినవారలైరి.

వ॥ ఇట్లు గావించి వారలు సారంగధరుం డేమునో యటంచు దాపున నుండి నిరీక్షింపుచుండిన నతండు శల్యఖండ పదహానిని గావల సెనని విచారమొందుటయు నంతఁ దద్విధిగని గగనంపువాణి వచియింపం దొడంగె నది యెట్లనినను 96

టీక శీప॥ ఇట్లుగావించి = ఈవిధముగా కాంతునిఁ జేసిన

వారలై, వారలు = ఆ పెండ్లి పెద్దలు, సారంగధరుం డేమనుకో యటంచు = శంకరుఁ డేమంటాడో యనుచు, దాపుననుండి నిరీక్షింపు చుండినన్ = సమీపమునందుండి యెదురు చూచుచుండఁగా, ఆతండు = ఆ శంకరుఁడు, శల్యఖండ = ఎముకముక్కలే, పద = కారణమైన, హారిని గావఁ సెనని = హారముగా గలవాఁడను గావలసివచ్చెనటంచు (అనఁగా శిరచ్ఛేదముఁ జేసినందుల బ్రహ్మహత్యా పాతక నివారణార్థము కపాలమాలను శంకరుఁడు ధరించినాడని పురాణప్రసిద్ధము), విచారమొందుటయున్ = ఆలోచనముఁ జెందుటయును, అంతఁ దద్విధిఁ గని = పిమ్మట బ్రహ్మదేవుని గాంచి, గగనంపువాణి = దుర్లభ మైన సరస్వతీదేవి, వచియింపం దొడంగెన్ = ఈ విధముగాఁ బలుక సాగిన దాయెను, అదియెట్లనినను = అయ్యది యేలాగందే

టీక చంద్ర॥ అతండు = ఆ చంద్రుఁడు, శల్య = విశేష దుఃఖ కారణమగు, ఖండ = తునుకలైన, పద = కిరణములచేత, హారినిఁ గావలసెనని = ఒప్పునట్టివాఁడను గావలసె నటంచు, విచార మొందుట యున్ = చింతనొందుటయును, అంతన్ = పిమ్మట, తద్విధిగని = ఆ బ్రహ్మదేవుఁడు గాంచి, గగనపు వాణిన్ = దుర్లభమైన వాక్యముతో తతిమ్మా విషయము పైకథకు సమానము

టీక సారంగ॥ దాఁపుననుండి = చాటుననుండిన వారలై, నిరీక్షింపుచుండినన్ = చూచుచుండఁగా, ఆతండు = ఆ సారంగధరుండు, శల్య = విశేషదుఃఖ కారణమగు, ఖండపద = తునుకలైన పాదములచే, హారినిఁగావలసెనని = ఒప్పునట్టివాఁడను గావలసెనటంచు, విచార మొందుటయున్ = దుఃఖ మొందుటయును, అంతన్ = అటు మీదట, తద్విధిఁగని = ఆ విధమును గాంచి, గగనంపువాణి = ఆకాశ వాణి, వచియింపం దొడంగెన్ = పల్కసాగిన దాయెను, అది

యెట్లనినను = అయ్యది యేలాగంటే, తతిమ్మావిషయము పై కథలకు సమానము

గీ॥ ఓయి సద్వర కాంతము • నొందుమీవు
చేడె వలచుట నీకింత • చేటు మూఁడెఁ
బూర్వకృత కర్మమెటుఁ దప్పి • పోవు ననుచుఁ
దొలుతటి చరిత్ర మొప్పుగాఁ • దెలిపి మఱియు॥ 97

టీక. శివ॥ ఓయిసద్వర = శ్రేష్ఠుఁడవైన యో నాథా (ఓ బ్రహ్మదేవా యనుట), చేడెన్ = పార్వతియను చేడియను, వలచుట నీకింత చేటుమూఁడెన్ = మోహించుటవలన నీకింతటి నాశము గల్గినది, తతిమ్మా విషయము సుగమము

టీక చంద్ర॥ ఓయి సద్వర = ఓ నక్షత్రనాయకా, చేడెన్ = తారయను చేడియను వలచుటన్ = వలచినందువలన, తతిమ్మా విషయము సుగమము

టీక సారంగ॥ ఓయి సద్వర = ఓ ధీరవరా, చేడెవలచుట నీకింత చేటుమూఁడెన్ = చిత్రాంగియను చేడియ నిన్ను మోహించుటచే నీకింతటి నాశము గల్గినది, పూర్వకృతకర్మ మెటుఁదప్పిపోవును = తొల్లి చేసిన పాపకర్మ మెట్లు తొలఁగిపోవును, అనుచున్ = అటంచు, తొలుతటి చరిత్రమొప్పుగాఁ దెలిపి = పూర్వజన్మమున నొకరి కాళ్ళుసేతులు నరికించినావను గాథను చగురీతి నెఱింగించినవాఁడై, మఱియున్ = అనంతరమునను, ఇఁక ముందుపద్యముతో నన్వయము.

క॥ నీ నీ గంధముఁ బాయుట
జైవాతృకుఁడనఁగ మఱియుఁ • జతురాస్యుఁ డనన్
భావింప న పదకరుఁడనఁ
గా వెలయు సవార్థియేల • కాంత విడఁగదే॥ 98

టీక. శివ॥ సీసీ గంధముఁ బాయుటన్ = ఈ యుపద్రవము తొలుగుటవలన నీవు, భావింపఁగా = తలంపఁగా, శైవాశ్రుఁడనఁగఁగా = దీర్ఘాయుష్మంతుఁ డనంగను, చతురాస్యుఁ డనన్ = నాలుగు మోములవాఁ డనంగను (అనఁగా నైదవమోము తెగిపోయినందున ననుట), సుపదకరుఁడనఁగా = సుశబ్దములఁ గలిగించునాఁ డనంగను (అపశబ్దములు గల ముఖము పోయినందున ననుట), వెలయుదువు = ప్రకాశింతువు. కాంత = ఓ నాథా, ఆర్తియేల = దుఃఖమేటికి, విడఁ గదే = వీడంగదవే.

టీక చంద్ర॥ చతురాస్యుఁడనన్ = చతురవాక్యములు గలవాఁడనంగను, సుపదకరుఁ డనఁగాన్ = సదుద్యోగమైన కిరణములు గలవాఁ డనంగను (అనఁగా తస్గుట హెచ్చుట స్వాభావిక మగు కాంతులు గలవాఁడనఁగా ననుట), కాంతన్ = తారయను చేగియను, విడఁగదే = నీడంగదవే, తతిమ్మా విషయము శివకథకు సమానము

టీక సారంగ॥ కాంత = ఓ రాజా, సుపదకరుఁ డనఁగాన్ = మంచి కాళ్ళు సేతులు గలవాఁడనంగను (అనఁగా మరల కాలు సేతులు రాగలవనుట), వెలయుదువు = ప్రకాశింతువు, ఆర్తియేల = దుఃఖమేటికి, విడఁగదే ' = వీడంగదవే, తతిమ్మావిషయము చంద్ర కథకు సమానము.

క॥ అన దాపునఁ గలవారలు
విని గోనాథునకు నటులె • వివరించిన నా
ఘనుఁ డమల భాషఁ జిత్రాం
గిని దారు సఖీలలామఁ • గినిసియుఁ గనియున్॥ 99

టీక. శివ॥ అనన్ = ఇట్లు బ్రహ్మతో సరస్వతి పల్కఁగా, దాపునఁ గలవారలు విని = చెంతనుండిన వారాలకించి, గోనాథు

నకున్ = భూదేవికి నాథుఁడైన విష్ణునకు, అటులె = ఆ విధముగనే, వివరించినన్ = తెలుపఁగా, ఆ ఘనుఁడు = ఆ విష్ణుఁడు, అమల భాషన్ = నిర్మలమైన సరస్వతీదేవిని, చిత్రాంగిని = చిత్రావయవములు గలదానిని, చారు నఖీలలామన్ = మనోజ్ఞమైన నారీవతంసమును, కినిసియున్ = సమీపించి, లేక, కోపపడి, కనియున్ = చూచిన వాఁడై, ఇఁక ముందరి పద్యముతో నన్వయము

టీక చంద్ర॥ గోనాథునకున్ = స్వర్గనాయకుఁడైన యింద్రునకు, అటులె వివరించినన్ = అట్లే చెప్పగా, ఆ ఘనుఁడు = ఆ యింద్రుఁడు, అమల భాషన్ = స్వచ్ఛమైన మాటలుగల దానిని, చిత్రాంగిని = అపుదైన శరీరముగల దానిని, చారు = బృహస్పతియొక్క, సఖీల లామన్ = ప్రేయసీవతంసమును (అనగా తార నచుట), కినిసియుఁ గనియున్ = సమీపించిచూచి, శతిమ్మావిషయము పైకథకు సమానము

టీక. సారంగ॥ అనన్ = ఇట్లు సారంగధరునితో నాకాశవాణి పల్కఁగా, దాఁపునఁ గలవారలు విని = దాటుననుండి చూచుచున్న తలారు లాలకించి, గోనాథునకున్ = భూనాయకుఁడైన రాజ నరేంద్రునకు, అటులె వివరించిన = ఆ యాకాశవాణి పల్కినట్లుగానే తెలుపఁగా, ఆ ఘనుఁడు = ఆ రాజనరేంద్రుఁడు, అమల భాషన్ = స్వచ్ఛమైనమాటలు గలదానిని, చిత్రాంగిని = చిత్రాంగి యను భార్యను, చారు = మనోజ్ఞమైన, సఖీలలామన్ = ప్రేయసీవతంసమును, కినిసియుఁ గనియున్ = సమీపించి, లేక, కోపముతో జూచినవాఁడై,

గీ॥ నాస ప్రేలిడుకొని యెంత • మోసగత్తె
పటల నాథునకిటు లప • యశముఁ గూర్పఁ
దగునె చంపఁగ రక్షింప • మగువలె సుమి
నిన్ను నమ్మఁగ వచ్చునే • నిర్మలాంగి॥ 100

టీక సుగమము; మూడింటసమము.

క॥ సతి నీవే వలచుట స
త్పతి కాంతిలు మనుచుఁ దేట • పడ నతను సర
స్వతి నుడువ నా తలవరులు
శ్రుతులారఁగ వినిరి గాన • శుభమఁటె నీకున్ 101

టీక శివ॥ అతను = అధికమైన, సరస్వతి = ఓ సరస్వతీదేవీ, సతిన్ = పార్వతీదేవిని, ఈవే వలచుటన్ = నీవేమోహించినందున, సత్పతి = ఓమంచిమగఁడా, కాంతిలుమనుచున్ = ఊరడిల్లుమటంచు, తేటపడన్ = అందరి కిష్టమగునట్లుగా, నుడువన్ = నీవుపల్కఁగా, అతల = అవలప్రదేశమున గల్గినట్టి, వరులు = శ్రేష్ఠులు, శ్రుతు లారఁగ వినిరిగాన = చెవులార విన్నారు గావున, శుభమఁటె నీకున్ = నీకుశ్రేయమఁటవే.

టీక చంద్ర॥ సతి = ఓ కొమ్మా, నీవే వలచుటన్ = నీవే మోహించినందువలన, సత్పతి = నక్షత్రనాయకుఁడు, కాంతిలు మను చున్ = ఓర్పుఁజెందుమటంచు, తేటపడన్ = స్పష్టమగునట్లుగా, అతను = అధికమైన సరస్వతిన్ = పలుకుతో, నుడువన్ = వచియిం పఁగా, అతలవరులు = అద్దరిశ్రేష్ఠులు (అనఁగాఁ బాతాళ బాలకు లనుట), శ్రుతులారఁగ వినిరిగాన = చెవులార విన్నారు గావున, శుభ మఁటె నీకున్ = నీకు మేలఁటవే.

టీక. సారంగ॥ సతి = ఓకొమ్మా, నీవేవలచుటన్ = నీవే మోహించినందున, అతను సరస్వతి = అశరీరవాణి (అనఁగా నాకాశ వాణి యనుట), సత్పతి = సారంగధరునితో నోమంచిరాజా, కాంతిలు మనుచున్ = ఊరకిల్లు మటంచు, తేటపడన్ = స్పష్టమగునట్లుగా •

నుడువన్ = వచియింపఁగా, ఆ తలవరుఁ = ఆ తలారివాండ్రు, కానన్ = అరణ్యమునందున, శ్రుతులారఁగ వినిరి = చెవులార విన్నా రలు, శుభమఁట నీకున్ = నీకు మేలఁటవే

కII అనవుడుఁ దత్కామిని యి
ట్లను గోనాథునకు నో మ ♦ హా ప్రభు వినుమా
నననను కొననేలా ఘనుఁ
డనఁదగు పరమేష్ఠి యెఱుఁగ ♦ డా యీ విధమున్॥ 102

టీక శివ చంద్ర కథలలో, గోనాథునకున్ = విష్ణుమూర్తికిని, యఱద్రునకనియును, సారంగధర కథలో, భూనాయకుఁడైన రాజ నరేంద్రున కనియును మాత్రము భేదము, తతిమ్మావిషయము సుగ మము; మూడిఁట సమము

గీII అరవలసి యెందువేళావి ♦ యైన పనికి
నాత్మయోజింపఁగా లాభ ♦ మగుదె దేవ
తప్పు నీదని తామన్న ♦ నొప్పుకొనెనె
నేడు మాత్రము విను నుడు ♦ లాడరాదె॥ 103

టీక. శివ చంద్రకథలలో, నేఁడుమాత్రము = ఇప్పుడు మాత్రము, విను నుడులు = వినునట్టి మాటలు (అనఁగా శ్రావ్యవాక్యములనుట), ఆడరాదె = పల్కరాదా, అనియును, సారంగధర కథలో, నేడు మాత్రము = ఇప్పుడు మాత్రము, విను = ఆకాశము, నుడులాడ రాదె = మాటలాడరాదా, అనియును భేదము, తతిమ్మావిషయము సుగమము; మూడిఁట సమము.

వII ఇట్లనిన నవల మఱియు గగనంపు నుడి సభ్యులెల్ల నాలింపఁగాఁ
బల్కుచుం దొడంగె నది యెట్లన్నను 104

టీక శివ చంద్ర కథలలో, ఇట్లనిన నవల = ఈ విధముగాఁ బల్కిన చేడియ (అనఁగా సరస్వతియు, తారయు ననుట); మఱియున్ = వెండియును, గగనంపు నుడిన్ = దుర్లభమైన వాక్యముతో, సభ్యులెల్లరాలింపఁగా = ఆ సభయందుండిన వారందరు విను నట్లుగా, పల్కం దొడంగెనది యెట్లన్నను = వచియింపసాగిన దాయె నయ్యది యేలాగంటే

టీక. సారంగ॥ ఇట్లనిఁన్ = చిత్రాంగి యిట్టుపల్కఁగా, అవలన్ = అటుపిమ్మట, మఱియున్ = మఱి, గగనంపు నుడి = ఆకాశవాణి, తతిమ్మా విషయము పైకథలకు సమానము.

క॥ భూరి సభాసదులారా
దూరీకృత పాపులార • దోర్బలులారా
సారంగధరుని యందున
నేరం బిసుమంత లేదు • నిక్కము సుండీ॥ 105

టీక సుగమము; మూఁడిఁటు సమము

గీ॥ అనిన వినియుఁ బ్రజాపతి • కినిసి వచ్చి
గోలితోఁ బడఁ జేయుటే • ఖ్యాతి యనుచుఁ
దార నటు సల్పి సారంగ • ధరుని సంగ
తిన్ గనన్ మదినెంతో చిం • తింపు చుండె॥ 106

టీక శివ॥ అనిన వినియు = సరస్వతి యిట్లుఁ బల్కఁగా నాలకించి, ప్రజాపతి = బ్రహ్మదేవుఁడు, కినిసివచ్చి = కోపము జెంది వచ్చినవాఁడై, గోలిన్ = ఆడుదానిని, తోఁబడఁ జేయుటే = తోఁబడునట్లొనర్చుటయే, ఖ్యాతియనుచున్ = కీర్తియటంచు, దారన్ = భార్యను (సరస్వతి ననుట), అటుసల్పి = ఆ విధముగానే తోఁబడఁ జేసి, సారంగధరుని = శంకరుని యొక్క, సంగతిన్ గనన్ = స్నేహ

మును గాంచుటకు, మదినెంతో = హృదయములో నెంతయో, చింతింపుచుండెన్ = చింతఁ జేయుచుండినవాఁ డాయెను.

టీక, చంద్ర॥ అనిన వినియున్ = తార యిట్లు బల్కఁగా నాలకించి, ప్రజాపతి = బ్రహ్మదేవుఁడు, కినిసివచ్చి = సమీపించివచ్చిన వాఁడై, గోతిన్ = ఈ చేడియను, లోఁబఱచేయుటే ఖ్యాతియను చున్ = లోఁబడుదానినిగా జేయుటయే కీర్తియటంచు, దారన్ = తారయను కాంతను, అటు సల్పి = ఆ విధముగాఁ జేసి, సారంగధరుని సంగతిన్ గనన్ = చంద్రుని సంగతిఁ దెలుసుకొనుటకు, మదినెంతో చింతింపుచుండెన్ = ఆత్మలో నెంతయో యోచింపుచుండిన వాఁడాయెను.

టీక సారంగ॥ అనిన వినియున్ = ఆకాశవాణి యిట్లు వచింపఁగా నాలకించి, ప్రజాపతి = జననాయకుఁడు (రాజనరేంద్రుఁడనుట) కినిసివచ్చి = కోపముజెంది వచ్చినవాఁడై, గోతికోఁబడఁ జేయుటే = గొయ్యికోపలఁ బడవేయించుటయే, ఖ్యాతియనుచున్ = కీర్తి యటంచు, దారన్ = చిత్రాంగియను భార్యను, అటుసల్పి = ఆ విధముగా గొయ్యిలో వేయించి, సారంగధరుని సంగతిన్ = సారంగధరుఁడను తన కొడుకు విషయము దెలుసుకొనుటకు, మదినెంతో చింతింపుచుండెన్ = మనస్సులో నెంతయో చింతఁజేయుచుండిన వాఁడాయెను

గీ॥ అంత సారంగధరుఁ జేరి • యనిమిషాధి
నేత యతివర్యుఁ డారసి • నీతియగునె
గురున కిటుసల్ప కాంతముఁ • గొను మనుటయు
ననిమి షాధిపుతో నిట్టు • లనియె నతఁడు॥ 107

టీక శివ॥ అంతన్ = పిమ్మట, అతివర్యుఁడు = మిక్కిలి శ్రేష్ఠుఁడు, అనిమిషాధినేత = దేవేంద్రుఁడు, సారంగధరుఁ జేరి = శంకరుని జేరినవాఁడై, అరసి = విచారించి, గురునకిటు సల్పన్ = నీ తండ్రియైన బ్రహ్మ కీవిధముగాఁ జేయఁగా, నీతియగునె = నీకు న్యాయమగునా, శాంతముఁ గొనుమనుటయున్ = శాంతినొందుమంచుఁ బల్కుటయును, అతఁడు = ఆ శంకరుఁడు, అనిమిషాధిపుతోన్ = దేవేంద్రునితోడ, ఇట్టులనియెన్ = ఈ విధముగాఁ బల్కినవాఁడాయెను

టీక చంద్ర॥ అంతన్ = పిమ్మట, అతివర్యుఁడు = మిక్కిలి శ్రేష్ఠుఁడు, అనిమిషాధినేత = దేవేంద్రుఁడు, సారంగధరుఁ జేరి = చంద్రునిఁ జేరినవాఁడై, అరసి = విచారించి, గురునకిటు సల్పన్ = బృహస్పతికిట్లుఁ జేయఁగ, నీతియగునె = నీకు ధర్మమగునా శాంతముఁ గొనుమనుటయున్ = శాంతిపహింపుమంచుఁ బల్కుటయును, అతఁడు = ఆ చంద్రుఁడు, అనిమిషాధిపుతోన్ = దేవేంద్రునితోడ, ఇట్టులనియెన్ = ఈ విధముగాఁ బల్కినవాఁడాయెను.

టీక. సారంగ॥ అంతన్ = పిమ్మట, యతివర్యుఁడు = యతి శ్రేష్ఠుఁడు, అనిమిషాధినేత = మత్స్యనాథుఁడనువాఁడు, సారంగధరుఁ జేరి = సారంగధరుని కడకువచ్చిన వాఁడై, అరసి = అతని పూర్వోత్తరములు విచారించి, గురునకిటుసల్పన్ = నీతండ్రియైన రాజనరేంద్రునకు నిన్నిట్లుఁజేయఁగా, నీతియగునె = న్యాయమగునా, శాంతముఁ గొనుమనుటయున్ = నీ వోర్పుఁజెందుమని పల్కుటయును, అతఁడు = ఆ సారంగధరుఁడు, అనిమిషాధిపుతోన్ = ఆ మత్స్యనాథునితోడ, ఇట్టులనియెన్ = ఈ విధముగాఁ బల్కినవాఁడాయెను.

క॥ మీవలన సుపదకరముల
నేవదయఁగ వలెనటంచు ♦ నిజముగ మదిలో
భావించుకొంటిఁ గావున
నావిధిఁ గావింపవలయు ♦ నతిహితమెనయన్॥ 108

టీక శివ॥ మీవలనన్ = తమవల్లన, సుపదకరములన్ = సదుద్యోగమైన కాంతులను, నేవదయఁగ వలెనటంచున్ = నేను బడయ వలయునని, నిజముగన్ = వాస్తవముగా, మదిలోన్ = నామతి యందున, భావించుకొంటిఁ గావునన్ = తలంచుకొంటిఁ గాబట్టి, ఆ విధిన్ = అబ్రహ్మదేవుని, అతి = మిక్కుటమగు, హితము = స్నేహము, ఎనయన్ = నే నొంధునట్లుగా, కావింపవలయున్ = ఒనర్చింపవలయును

టీక చంద్ర॥ మీవలనన్ = మీదేవతలవలన, సుపద = సత్కారణమైన, కరములన్ = కప్పములను, నే వదయఁగ వలెనటంచున్ = నేను బడయవలయునని, నిజముగన్ = వాస్తవముగా, మదిలోన్ = నాహృదయమునందున, భావించుకొంటిని = తలంచుకొంటిని, కావునన్ = కాబట్టి, అతిహితమెనయన్ = మిక్కిలి లాభము నొందునట్లు, ఆ విధిన్ = ఆ విధముగా, కావింపవలయున్ = చేయవలయును.

టీక. సారంగ॥ మీవలనన్ = తమ వలన, సుపదకరములన్ = మంచి కాళ్ళు చేతులను, నేవదయఁగ వలెనటంచున్ = నేను వహింప వలయునని, నిజముగన్ = సత్యముగ, మదిలోన్ = మనస్సునందున, భావించుకొంటిఁ గావున = తలంచుకొన్నాను కాబట్టి, అతిహితమెనయన్ = మిక్కిలి క్షేమము నొందునట్లు, ఆవిధిఁ గావింపవలయున్ = ఆవిధముగా నొనరింపవలయును.

ఆ॥వె॥ అనిన నాలకించి • యనిమిష జ్యేష్ఠుఁడుఁ
దా పరేష్టి సత్ప • దకరహితము
నందుమనుచుఁ బ్రీతి • నొందించె సారంగ
ధరుని బ్రహ్మవేత్త • పరముఁ డగుట॥ 109

టీక శివ॥ అనిన నాలకించి = ఇంద్రునితో శివుఁ డిట్లనుట విన్న వాఁడై, అనిమిష జ్యేష్ఠుఁడు = బ్రహ్మదేవుఁడు, తా = తాను, పరేష్టిన్ = శ్రేష్ఠమైన కోర్కితో, సత్పదకర = సదుద్యోగకరమైన, హితమున్ = స్నేహమును, అందు మనుచున్ = వహింపు మటంచు, సారంగధరునిన్ = శంకరుని, బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు, వేత్త = తెలిసినవాఁడును, పరముఁడు = పరమాత్ముఁడును, అగుటన్ = అఘటవలన, ప్రీతినొందించెన్ = ప్రేమఁజెందించినవాఁ డాయెను

టీక చంద్ర॥ అనిన నాలకించి = ఇంద్రునితోఁ జంద్రుఁ డిట్లనుట విన్నవాఁడై, అనిమిషజ్యేష్ఠుడు = బ్రహ్మదేవుఁడు, తా = తాను లేక, తాము, పరేష్టిన్ = రాజసూయమునందున, సత్పద = సుచిహ్నమైన, కరహితము నొందుమనుచున్ = కప్పముయొక్క లాభమును బొందుమటంచు, సారంగధరుని = చంద్రుని, బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు, వేత్త = తెలిసినవాఁడును, పరముఁడు = పరమాత్ముఁడు, అగుటన్ = అనందువలన। ప్రీతినొందించెన్ = సంతోషము నొందఁజేసినవాఁ డాయెను.

టీక సారంగ॥ అనినన్ = సారంగధరుఁ డిట్లనఁగా, అనిమిష జ్యేష్ఠుఁడు = మత్స్యనాథుఁడు, ఆలకించి = విన్నవాఁడై, తాపరేష్టిన్ = తాను కోరినకోర్కెను, సత్పదకరహితమున్ = మంచి కాలుసేతుల లాభమును, అందుమనుచున్ = వహింపుమటంచు, బ్రహ్మవేత్త

= బ్రహ్మజ్ఞానియును, పరముఁడగటన్ = ఉత్కృష్టుఁడు నగుటవలన, సారంగధరుని = సారంగుఁడను వానిని, ప్రీతిన్ = ప్రేమచేత, ఒందించన్ = ఒందునట్లొనర్చినవాఁడాయెను.

సీ॥ అంతఁ బ్రజాపతి • యడఁకువన్ సారంగ
ధరుని సత్వరముగఁ • బురికిఁ జేర్ప
దొరకొనెఁగానలో • నరసి తానటుఁ గాన
రామికిఁ దన కలు • కేమొ కలదు
దాఁపున నుండెఁ గ • దా యొకపరి హెచ్చ
రించియుఁ జూతు న • టంచుఁ దండ్రి
సారంగధర యుప • కారంబు నీకు నేఁ
దలఁపను చూడవే తాత నగుదు

గీ॥ గురుని యందున భక్తిచే • కొమ్మ నీవె
ధన్యుఁడవు జయాన్వితముగాఁ • దరలి చేరి
పురజనంబుల కుత్సవం • బు ఁగనఁ జేయు
మనుచుఁ బలుకుచు నుండిన • యట్టివేళ॥ 110

టీక శివ॥ అంతన్ = పిమ్మట, ప్రజాపతి = బ్రహ్మదేవుఁడు, అడఁకువన్ = వినయముతో, సారంగధరుని = శంకరుని, పురికిఁ జేర్పన్ = కైలాసమను పట్టణమునకుఁ జేర్చుటకై, దొరకొనెఁగాన = ప్రయత్నించెను గాఁబట్టి, లోనరసి = మదిలో విచారించినవాఁడై, తానటుఁ గానరామికి = ఆ శంకరుఁడట్లు పురిఁజేరు యత్నమున్నట్లగుపడ నందుకు, తనకు = ఆ శివునకు, అలుకు = భయము, ఏమొ కలదు = ఏమియో కద్దు, దాపుననుండెఁ గదా = సమీపమున నుండినాఁడుగదా, ఒకపరి = ఒక్కసారి, హెచ్చరించియుఁజూతు

నటంచున్ = మందలించి కనుఁగొందునని, తండ్రి = జనకుఁడైన బ్రహ్మదేవుఁడు, లేక, ఓయయ్యా, సారంగధర = ఓ శంకరా, అప కారంబు నీకు నేఁదలఁపను = నీకేలాటి కీడుఁజేయఁగాఁ దలంచువాఁడను కాను, తాతనగుదున్ = నీ తండ్రినౌదును, లేక, నే బ్రహ్మనగు దును, చూడవే = నావంకఁ గాంచవే, నీవె ధన్యుఁడవు = నీవే పుణ్య వంతుఁడవు, గురునియందునన్ = తండ్రియగు నాయందున, లేక, కులము పెద్దనగు నాయందున, భక్తిచేకొమ్ము = విశ్వాసముగై కొనుము, జయాన్వితముగాన్ = పార్వతీ సమేతముగా, తరలిచేరి = బయలుదేరి ప్రవేశించి, పురజనంబులకున్ = నీపట్టణవాసులైన ప్రజలకు, ఉత్సవంబుఁ గనఁజేయుము = ఊరేగింపుఁ జూడఁజేయుము, అనుచుఁ బల్కుచునుండిన యట్టివేళన్ = అని యిట్లు వచియింపుచున్నట్టి సమయమునందున, ఇఁక మందరిపద్యముతో నన్వయము

టీక. చంద్ర॥ గురునియందున భక్తిచే = బృహస్పతియందున భక్తితో, కొమ్మనీవే = తారయను కొమ్మనీయఁగదే, ధన్యుఁడవు = పుణ్యవంతుఁడవు, జయాన్వితముగాఁ దరలిచేరి = జయముతోఁ గూడుకొన్నవాఁడవై బయలుదేరి ప్రవేశించి, పురజనంబునకున్ = పౌరులకు, ఉత్సవంబుఁ గనఁజేయుము = పండుగ నొందఁజేయుము. తతిమ్మావిషయము శివకథకు సమానము.

టీక. సారంగ॥ ప్రజాపతి = రాజనరేంద్రుఁడు, సారంగధరు నిన్ = కొడుకును, పురికిఁజేర్ప దొరకొనన్ = పట్టణమునకుఁ జేర్పఁగోఁ బ్రయత్నించెను, కానలో నరసి = అరణ్యములో వెదకినవాఁడై, కానటుఁగానరామికిన్ = సారంగధరుఁ డాప్రాంతమునఁగనుపడకుండినందు లకు, అలుకేమొ కలదు = భయమేమియో కద్దు, దాఁపుననుండెఁగదా = దాగియున్నాడుగదా, తాతనగుదున్ = నీతండ్రినౌదను, గురుని యందున భక్తిచేకొమ్ము = తండ్రియందున భక్తిఁ గైకొనుమా, తతిమ్మా విషయము చంద్రకథకు సమానము.

గీ॥ నగి ప్రజాపతితో గగ • నంపువాణి
నుడివె నిట్లని యోజియ్య • తడయకిపుడె
చనుము తావచ్చునది మఱి • సత్యమనిన
సంతసమునఁ బ్రజాపతి • సనె నయారె॥ 111

టీక శివ చంద్రకథలలో॥ ప్రజాపతితో = బ్రహ్మదేవునితో, నగి = నవ్వినవాఁడై, గగనంపువాణిన్ = దుర్లభమైన వాక్యముచేత, ఇట్లని = ఈ విధముగా, నుడివెన్ = బల్కినవాఁ డాయెను, ఓజియ్య = ఓదేవా, తడయకిపుడె చనుము = జాగుసేయక యిప్పుడే పదా, తావచ్చునది = తాను వచ్చునట్టివిషయము, మఱి = ఇఁకను, సత్యమనినన్ = యథార్థమని పల్కఁగా, ప్రజాపతి = ఆబ్రహ్మదేవుఁడు, అయారె = ఆశ్చర్యము, సంతసమునన్ = సంతోషముతో, చనెన్ = ఒప్పినవాఁ డాయెను.

టీక సారంగ॥ గగనంపువాణి = ఆకాశవాణి, నగి = నవ్వినదై, ప్రజాపతితోన్ = రాజనరేంద్రునితోడ, ఇట్లని = ఈ విధముగా, నుడివెన్ = పల్కినదాయెను, ఓజియ్య = ఓరాజా, తడయకిపుడె చనుము = ఆలస్యముసేయక నేడే పొమ్ము, తాన్ = ఆసారంగధరుఁడు, మఱి = అనంతరము, వచ్చునది = వచ్చునట్టిది, సత్యమనినన్ = వాస్తవమనఁగా, అయారె = ఆశ్చర్యము, ప్రజాపతి = రాజు, సంతసమునన్ = సంతోషముతో, చనెన్ = పోయినవాఁ డాయెను.

గీ॥ అంత సారంగధరుఁడు క • ల్యాణమగుటఁ
బొసఁగ జోతల ముదిత హృ • త్పూర్వకముగ
గురున కర్పించి సెలవుఁ గై • కొనియుఁ దనదు
పురికి విజయాన్వితంబుగాఁ • బోవునపుడు॥ 112

టీక. శివ॥ అంతన్ = పిమ్మట, సారంగధరుఁడు = శంకరుఁడు, కల్యాణమగుటన్ = పెండ్లియైనందున, ముదిత = సంతోషింపఁబడిన, హృత్పూర్వకముగన్ = హృదయపూర్వకముగా, పొసఁగన్ = ఒప్పునట్లుగా, జోతలన్ = నమస్కారములను, గురునకున్ = తండ్రియైన బ్రహ్మకు, అర్పించి = ఒసంగినవాఁడై, సెలవుఁగైకొనియున్ = అజ్ఞఁదీసుకొని, తనదుపురికిన్ = తనపట్టణమునకు, విజయాన్వితంబుగాన్ = పార్వతీసమేతముగా, పోవునపుడు = ఏగుసమయమున

టీక చంద్ర॥ అంతన్ = పిమ్మట, సారంగధరుఁడు = చంద్రుఁడు, కల్యాణమగుటన్ = శుభమైనందున, పొసఁగన్ = ఒప్పునట్లుగా, జోతలన్ = నమస్కారములను, ముదితన్ = తారయనుచేడియను, హృత్పూర్వకముగన్ = మనస్ఫూర్తిగా, గురునకున్ = బృహస్పతికి, అర్పించి = ఒసంగినవాఁడై, సెలవుఁగైకొనియున్ = అజ్ఞఁదీసుకొని, విజయాన్వితంబుగాన్ = మిక్కిలి గెలుపుతోఁ గూడుకొన్నవాఁడై, తనదు పురికిన్ = తనపట్టణమునకు, పోవునపుడు = ఏగు సమయమున.

టీక సారంగ॥ కల్యాణమగుటన్ మేలైనందున, గురునకున్ = మత్స్యనాథుఁడను గురువునకు, విజయాన్వితంబుగాన్ = మిక్కిలి గెలుపుతోఁ గూడినవాఁడై, తక్కిమ్మవిషయము శివకథకు సమానము.

క॥ బూరుగలు పొదల మేళము
లారూఢిన్ దగఁ దిలోత్త • మాదులు తాళ
శ్రీరాగంబుల దొరయఁగ
నౌరా రంభాదులాడ • హరువుగఁ జోఁపన్॥ 113

టీక. శివ॥ బూరుగలు పొదలన్ = బూరుగలను వాద్యవిశేషములు పొదలుచుండగా, మేళములు = సన్నాయిలు, ఆరూఢిన్

దగన్ = ఎక్కుడుగా నొప్పుచుండఁగా, తిలోత్తమాదులు = తిలోత్తమ మొదలైన యప్సరసలు, తాళ = తాళములచేతను, శ్రీరాగంబులన్ = శ్రీరాగమను రాగముచేతను, దొరయఁగన్ = [ప్రకాశింపుచుండఁగా, ఔరా = ఆశ్చర్యము, రంభాదులాడన్ = రంభ మొదలైన యప్సరస్త్రీలు నాట్యముఁ జేయుచుండఁగా, హరువుగఁదోఁపన్ = మనోహరముగాఁ దోఁచుచుండఁగా

టీక చంద్ర॥ శివకథకు సమానము, ఈ వేడుకలు దేవేంద్ర బృహస్పతులుండినచోట జరుగుచుండెనని గ్రహించునది

టీక సారంగ॥ బూరుగలు = బూరుగ చెట్లును, పొదలమేళములు = పుష్పుల పొదలయొక్క కలియికలును, అగూఢిన్ దగన్ = ఎక్కుడుగా నొప్పియుండఁగా, తిలోత్తమాదులు = మంచిబొట్టుగు చెట్లు మొదలైనవి, తాళ = తాటిచెట్లయొక్కయు, శ్రీ = మారేడు చెట్లయొక్కయు, రాగంబులన్ = అనురక్తులతో, దొరయఁగన్ = అంటుకొనియుండగా, ఔరా = ఆశ్చర్యము, ఆడ = అచ్చోటున (అనఁగా సారంగధరుఁడుండిన యడవిలో ననుట), రంభాదులు = అరఁటి చెట్లు మొదలైనవి, హరువుగఁదోఁపన్ = మనోజ్ఞముగాఁ [ఐత్యక్షమగుచుండఁగా, ముందరిపద్యముతో నన్వయము, బూరుగనెడి శబ్దము శాల్మలీవృక్షమునకు వాద్యవిశేషమునకును జెల్లుననుటకు, సాంబనిఘంటువుతోఁ జూడనగును.

గీ॥ అమర పున్నాగ నాగ దై ♦ త్యాది దివ్య
తరులనుండియు సారంగ ♦ ధరుఁడు తరలి
పురమునకు విజయాస్వితం ♦ బుగను జేరఁ
జూడవచ్చిరి పౌరులు ♦ చోద్యమె కద॥ 114

టీక. శివ॥ అమర = దేవతల పున్నాగ = పున్నాగులు,

నాగ = నాగులు, దైత్య = రాక్షసులు, ఆది = మొదలైన, దివ్య
తరుల నుండి = శ్రేష్ఠకరులైన వారలలోనుండి, విజయాన్వితంబుగను =
పార్వతీసమేతముగా, తరలి = బయలుదేరి, పురమునకున్ = కైలాస
పట్టణమునకు, చేరన్ = చేరుకొనఁగా, పౌరులు = ఆ పురము నందలి
వారలు, చూడవచ్చిరి = దర్శింపవచ్చినవారలైరి, చోద్యమె కద =
ఆశ్చర్యమే కదా.

టీక. చంద్ర॥ సారంగధరుఁడు = చంద్రుఁడు, విజయాన్వితం
బుగను = మిక్కిలి గెలుపుతోఁగూడిన వాఁడై, పురమునకున్ =
ఇంటికి, చేరన్ = పోవఁగా, తతిమ్మా విషయము శివకథకు సమానము.

టీక. సారంగ॥ అమర = పొగడచెట్లు, పున్నాగ = పొన్నచెట్లు,
నాగ = నాగకేసరపు చెట్లు, దైత్య = చండమనునోషధులు, ఆది =
మొదలైన, దివ్యతరులనుండి = ఒప్పైన వృక్షములలో నుంచి, విజ
యాన్వితంబుగను = మిక్కిలి గెలుపుతోఁ గూడుకొన్నవాఁడై, సారంగ
ధరుఁడు = సారంగధరుఁడనువాఁడు, తరలి = బయలుదేరి, పురము
నకున్ = రాజమహేంద్రమను పట్టణమునకు, చేరన్ = రాఁగా,
పౌరులు = పురజనులు, చూడవచ్చిరి = దర్శింపవచ్చిన వారలైరి,
చోద్యమె కద = ఆశ్చర్యమే కాదా.

గీ॥ పత్రమయమున సారంగ • ధరునిఁ గాంచి
తాత సంతసమంది యా • తనికి పెక్కు
వేడుకలు జరిగించియు • విబుధతతికి
కామితార్థములిడె నెంత • ఘనుఁడయారె॥ 115

టీక. శివకథలో, తాత = బ్రహ్మయనియును, చంద్ర సారంగ
ధర కథలలో, తండ్రియనియును, శివ చంద్రకథలలో, విబుధ
తతికి = దేవతా సమూహమునకనియును, సారంగధర కథలో, పండిత

సముదయమున కనియును మాత్రము భేదము, తతిమ్మా విషయము సుగమము.

గీ॥ అంత సారంగధరున క • త్యంతప్రీతి
శోభనము సలిపి గురు ప • ట్టాభిషేక
మీవిఁక శివాన్వితముగఁ గా • వే యటన్నఁ
దాతఁ గనుఁగొని యాతఁ డీ • రీతిఁ బలికె॥ 11

టీక శివ॥ అంతన్ = పిమ్మట, సారంగధరునకున్ = శంకరునకు, అత్యంతప్రీతిన్ = మిక్కిలి ప్రేమచేత, శోభనము సలిపి = నిషేక ముహూర్తమొనరించి, గురు = అతిశయమైన, పట్టాభిషేకమున్ = రాజ్యాభిషేకమును, ఈవిఁకన్ = నీవింకమీదట, శివాన్వితముగన్ = పార్వతీసమేతముగా, కావేయటన్నన్ = కాఁగదవే యటంచుఁ బల్కఁగా, తాతఁ గనుఁగొని = బ్రహ్మదేవునిఁ జూచి అతఁడు = ఆ శంకరుఁడు, ఈ రీతిఁబలికెన్ = ఈ విధముగా వచించినవాఁడాయెను

టీక. చంద్ర॥ అంతన్ = పిమ్మట, సారంగధరునకున్ = చంద్రునకు, అత్యంత ప్రీతిన్ = మిక్కిలి ప్రేమచేత, శోభనముసలిపి = శుభమునొనరించి, శివాన్వితముగన్ = మంగళయుక్తముగా, ఈవిఁకన్ = నీవింకను, గురుపట్టాభిషేకమున్ = గురువట్టముఁగట్టుకొనువాఁడవు, కావేయటన్నన్ = కాఁగదవేయని పల్కఁగా (అనఁగా నత్రి యతీంద్రుఁడైనందున యత్యాశ్రమముఁ దీసుకొమ్మనె ననుట), తాతఁగనుఁగొని = తండ్రియైన యత్రిమహర్షిని గాంచి, అతఁడు = ఆ చంద్రుఁడు, ఈరీతిఁ బలికెన్ = ఈవిధముగా వచించినవాఁ డాయెను

టీక సారంగ॥ అంతన్ = తరువాత, సారంగధరునకున్ = కుమారునకు, అత్యంత ప్రీతిన్ = మిక్కిలి సంతోషముతో, శోభనము సలిపి = శుభమునుజేసి, గురు = అధికతరమైన, పట్టాభిషేకమున్

= రాజ్యాభిషేకమును, శివాన్వితముగన్ = మంగళయుక్తముగా, ఈ వీఁకన్ = సీవింకను, కావెయట్నన్ = కాఁగదవే యనఁగా, కాకఁగనుఁగొని = తండ్రియైన రాజనరేంద్రునిఁ జూచి, అతఁడు = ఆ సారంగధరుఁడు, ఈరీతిఁ బలికెన్ = ఈ విధముగాఁ బల్కినవాఁ డాయెను.

గీ॥ అయ్య యాలింపఁ గదవె నా • కచల పదము
ముఖ్యమగు నన్యమేల నే • మోదమునను
సద్గణంబులు గొలువ సు • సమయ మెఱిఁగి
యెట్టులైనను పట్టముఁ • గట్టుకొందు॥ 117

టీక. శివ॥ అయ్య = నాయనా, ఆలింపఁగదవె = ఆలకింపఁగదే, నాకు + అచలపదము = నాకు పర్వతస్థానము, ముఖ్యమగుణ = ప్రాధాన్యమగును, అన్యమేల = ఇతర మెందులకు, సుసమయ మెఱిఁగి = మంచిసమయముఁ దెలుసుకొని, నేమోదమునను = నేను సంతోషముతో, సద్గణంబులు గొలువ = శ్రేష్ఠులైన ప్రమథులు సేవింపఁగా, యెట్టులైనను = ఏవిధముననైనప్పటికి, పట్టముఁ గట్టుకొందుణ = పట్టాభిషిక్తుఁడ నగుదును.

టీక చంద్ర॥ అయ్య = నాయనా, ఆలింపఁగదవె = వినఁగదే, నాక = ఆకాశమునందున, చలపదము = చలించునట్టిస్థలి, ముఖ్యమగున్ = ప్రాధాన్యమగును, అన్యమేల = నాకితరమెందుకు, నేమోదమునను = నేను సంతోషముతో, సద్గణంబులు గొలువన్ = నక్షత్రసముదయములు గొలుచుచుండఁగా, సుసమయమెఱిఁగి = మంచి తరుణమును తెలుసుకొని, ఎట్టులైనను = ఏ విధముచేత నైనప్పటికిని, పట్టముఁ గట్టుకొందున్ = పట్టాభిషిక్తుఁడ నగుదును (అనఁగా నాకాశమునననుట),

టీక సారంగ॥ అయ్య = ఓ యయ్యా, అలింపఁగదనె = ఆలకింపఁగదే, నాకు + అచల పదము ముఖ్యమగుఁగా = నాకు చలించని స్థితి ప్రాధాన్యమగును అన్యమేల = ఇతరము నాకేటికి, సుసమయ మెఱిఁగి = మంచి సమయమును తెలుసుకొని, ఎట్టులైనను పట్టము గట్టుకొందున్ = ఏవిధముచేతనైనను పట్టాభిషిక్తుఁడ నగుదును. (యత్యాశ్రమపట్టము ననుట),

గీ॥ కాన నీవింక సంతతిన్ • గాంచి సత్య
పాలకుఁడు ప్రజాపతి గుణ •శీలుఁ డనఁగ
నలరఁగదె యంచుఁ దల్లిదం • డ్రులకు మ్రొక్కి
ఒనర సారంగధరుఁ డట • నుండి చనియె॥ 118

టీక. శివ॥ కానన్ = కాబట్టి, నీవింక సంతతిన్ గాంచి = నీ విఁకమీఁదట సంతానమును వహించి (అనఁగా సనత్కుమారాదిసంతానముననుట), సత్యపాలకుఁడు = సత్యలోకమును పాలించువాఁడును, ప్రజాపతి = ప్రజానాథుఁడును, గుణశీలుఁడనఁగన్ = ఆచారమైన గుణముల గలవాఁడనఁగా, అలరఁగదె = ఒప్పుఁగదవే, అంచున్ = అనిపల్కుచు, తల్లిదండ్రులకు మ్రొక్కి = సరస్వతీ బ్రహ్మలకు సమస్కరించి, ఒనరన్ = ఒప్పుగా, సారంగధరుఁడు = శంకరుఁడు, అటనుండి చనియెన్ = అచ్చటనుండి పోయినవాఁడాయెను

టీక చంద్ర॥ కానన్ = అరణ్యమునందున, నీవింక సంతతిన్ గాంచి = నీవిఁకమీఁదట సంతానమును జూచి, (అనఁగా దత్తాత్రేయ దూర్వాసుల ననుట), సత్యపాలకుఁడు = సత్యమును పాలించువాఁడును, ప్రజాపతి = నవబ్రహ్మలలో నొకఁడును, గుణశీలుఁడనఁగన్ = గుణమునందు శీలముగలవాఁడనఁగా, అలరఁగదె = ఒప్పుఁగదవే, అంచున్ = అని పల్కుచు, తల్లి దండ్రులకున్ = అనసూయాత్రులకు, మ్రొక్కి = నమస్కరించి, ఒనరన్ =

ఒప్పునట్లుగా, సారంగధరుఁడు = చంద్రుఁడు, అటనుండి చనియెన్ = అచ్చటనుండి పోయినవాఁ డాయెను.

టీక. సారంగ॥ కానన్ = కాబట్టి, నీవింక సంతతిన్ గాంచ = నీవిఁక సంతానమును గని, సత్యపాలకుఁడు = సత్యము పాలించువాఁ డును, ప్రజాపతి = జనరాయకుఁడును (అనఁగా రాజనరేంద్రుఁ డదివరకు పుత్రునిపైని చింతతో మంత్రిని రాజ్యమేలుమని యుచ్చియున్నా డని గ్రహించునది), గుణశీలుఁడ నఁగన్ = గుణములకుం దాదారము గలవాఁ డనఁగా, అలరఁగదె యంచు = ఒప్పుఁగదవే యటంచు, తల్లిదండ్రులకు మ్రొక్కి = రత్నాంగీ రాజనరేంద్రులకు నమస్కరించి, ఒనరన్ = ఒప్పునట్లుగా, సారంగధరుఁడు = సారంగధరుఁ డను వాఁడు, అటనుండి చనియెన్ = అచ్చటనుండి పోయినవాఁ డాయెను

గీ॥ అంత సారంగధరు కృపన్ ♦ స్వాంతమలర
నమరినట్టి యదృష్టమే ♦ మందు నహహ
అల్ల గురుదారకు నల ర ♦ త్నాంగికి నల
సతికి కొన్నాళ్ళకు కుమార ♦ జననమయ్యె॥ 119

టీక శివ॥ అంతన్ = పిమ్మట, సారంగధరు కృపన్ = ఈశ్వ రానుగ్రహము వలన, స్వాంతమలరన్ = హృదయము సంతసించు నట్లుగా, అహహ = ఆశ్చర్యము, అమరినట్టి యదృష్టమేమందున్ = సిద్ధించినటువంటి భాగ్యము నేమి చెప్పుదును, అల్ల గురుదారకున్ = ఆ యతిశయుఁడైన శంకరుని భార్యకు, అల రత్నాంగికిన్ = ఆ రత్న ప్రాయమైన శరీరముగల దానికి, అల సతికిన్ = ఆ పార్వతీదేవికి, కొన్నా ళ్ళకు = కొన్నిదినములకు, కుమారజననమయ్యెన్ = కుమారస్వామి పుట్టినవాఁ డాయెను.

టీక. చంద్ర॥ సారంగధరు కృపన్ = చంద్రుని యనుగ్రహము

వలన, అబ్జ సరుదారకున్ = ఆ బృహస్పతి భార్యకు, అలసతికిన్ = ఆ చేడియకు, కుమార జననమయ్యెన్ = కొడుకు బుట్టినవాఁ డాయెను, తతిమ్మా విషయము శివకథకు సమానము

టీక. సారంగ॥ అబ్జ గురుదారకున్ = ఆ రాజపత్నికి, అం రత్నాంగికిన్ = ఆ రత్నాంగియను దానికి, అలసతికిన్ = ఆ పతివ్రతకు, కుమార జననమయ్యెన్ = కొడుకు బుట్టినవాఁ డాయెను, తతిమ్మా విషయము శివకథకు సమానము

గీ॥ అల కుమారుఁడు జన్మించి ♦ నపుడు పుడమి
యలరె జలనిధులుప్పొంగె ♦ నాకసమున
దేవదుందుభులును మ్రోసె ♦ దివిజు లంతు
వృష్టి గురిపించిరానంద ♦ మెనసి భళిరె॥ 120

టీక సుగమము

గీ॥ ఆ కుమారుని ధీవరు ♦ లరసి మెచ్చి
బుధుఁడు హరివర్ధనుం డని ♦ పొగడుమంట
హరిని వర్ధిల్లఁ జేయుమ ♦ టంచు పీడి
గురుఁడు నిజసతీయుక్తుఁ ♦ డై కూర్మిఁ దనరె॥ 121

టీక. శివ॥ ఆ కుమారునిన్ = ఆ కుమారస్వామిని, ధీవరు లరసి మెచ్చి = బుద్ధిశాలురు జూచి మెచ్చుకొని, బుధుఁడు = పండితుఁడు, హరివర్ధనుండని = ఇంద్రుని వృద్ధిఁబొందించువాఁ డటంచు, పొగడుచుంటన్ = స్తోత్రముఁ జేయుచుండుట వలన, గురుఁడు = తండ్రియైన శివుఁడు, హరిని = దేవేంద్రుని, వర్ధిల్లఁ జేయుమటంచున్ = వృద్ధిఁబొందింపు మటంచు, పీడి = వదలిపెట్టి, నిజసతీయుక్తుఁడై = తన పార్వతీదేవితో కూడుకొన్నవాఁడై, కూర్మిన్ = మైత్రితో, తనరెన్ = ఒప్పినవాఁ డాయెను.

టీక. చంద్ర॥ ఆ కుమారునిన్ = ఆ పిల్లవానిని, ధీవరు లరసి మెచ్చి = బుద్ధిశాలులు జూచి మెచ్చుకొని, బుధుఁడు = ఇతఁడు బుధుఁడనువాఁడు, హరివర్ధనుండని = చంద్రునిచేతవృద్ధి నొందిన వాఁడని, లేక, చంద్రుని వృద్ధిఁబొందించు వాఁడని (అనఁగాఁ జంద్రవంశము ననుట), పొగడుచుండఁగన్ = ఎంచుచుండుట వలన, హరిని = చంద్రుని, వర్ధిల్లఁ జేయుమటంచు వీకి = వృద్ధిఁబొందించు పొమ్మని వదలి పెట్టి, గురుఁడు = బృహస్పతి, నిజసతీయుక్తుఁడై = తన భార్యయైన తారతోఁ గూడుకొన్నవాఁడై, హర్షిన్ = సంతోషముతో, తనరెన్ = ఒప్పినవాఁడాయెను.

టీక. సారంగ॥ ఆ కుమారునిన్ = ఆ పిల్లవానిని, ధీవరు లరసి మెచ్చి = బుద్ధిశాలులు జూచి మెచ్చుకొని, బుధుఁడు = పండితుఁడు, హరివర్ధనుండని = విష్ణువర్ధనుఁ డనువాఁడని, పొగడుచుంటన్ = కొనియాడుచుండుట వలన, హరిని = పోషకర్తయైన విష్ణుని, వర్ధిల్లఁజేయుమటంచు వీడి = నాకొడుకును పోషింపుమని వదలిపెట్టి (అనఁగా విష్ణునిమీద భారమువేసి వదలిపెట్టె ననుట), గురుఁడు = తండ్రి, లేక, రాజు (రాజనరేంద్రుఁడనుట), నిజసతీయుక్తుఁడై - తన భార్యతోఁ గూడుకొన్నవాఁడై, కూర్మిఁదనరెన్ = మైత్రితో నతిశయించిన వాఁడాయెను, (రాజనరేంద్రునకు విష్ణువర్ధనుఁడను కుమారుఁ డొకఁడు గలిగినాఁడన్నందుకు కన్యకా పురాణముతోఁ జూడుఁడు)

గీ॥ వారి ముగ్గురి చరితలీ • తీరు నెసఁగ
హరుని భూతిని సారంగ • ధరుని నీలిఁ
బరసి చంద్రుని హసియించి • పొరఁజాలి
సదమలంబగు కీర్తిఁ గాం • చుదురు గాత॥ 122

టీక. సుగమము.

ఆశ్వాసాంతములు

చ॥ శివశివ రాతి రాతి శ్రిత ♦ జీవన జీవన యాత్మ యాత్మ బాం
ధవధవ రాజిరాజిత ప ♦ దావర దావర ధీరధీర దీ
నవనవ సంతసంతత సు ♦ నందన నందన భాను భాను గౌ
రవరవ కాండకాండద ని ♦ రంజన రంజన కాయకాయజా॥ 128

టీక శివ = శుభమైన, శివరాతి = శంకరాప్తుఁడగు కుబేరుని వంటి, రాతి = ఈవిగలవాఁడా, శ్రితజీవన = ఆశ్రితులకు జీవనమైన వాఁడా, జీవ = బృహస్పతివంటి, నయ = నీతియుక్తమైన, ఆత్మ = బుద్ధిగలవాఁడా, ఆత్మబాంధవ = ప్రాణస్నేహితులైన, ధవరాజి = రాజసమూదయముచేత? రాజిత = ప్రకాశింపఁబడిన, పదా = స్థానము గలవాఁడా, వరదా = కోర్కెల నిచ్చువాఁడా, వర = శ్రేష్ఠమైన, ధీర = పర్వతమువంటి, ని ధీరో విదుషి ై లేఽపి సముద్రే ధైర్య వత్యపి, అని విశ్వము ధీర = ధైర్యముగలవాఁడా, దీనవన = దీన జనులనే యరణ్యమునకు, వసంత = వసంతునివంటి వాఁడా, సంతత = నిరంతరమును, సునందన = మంచి సంతానముయొక్క (అనఁగా కృతి వన తటాకాది సప్తసంతానముల యొక్క యనుట), నందన = సంతోషముగలవాఁడా, భాను = సూర్యునివంటి, భాను = కాంతులు గలవాఁడా, గౌరవ = గురుత్వమైన, రవ = ధ్వనులయొక్క, కాండ = సముదయమునందున, కాండద = మేఘమువంటివాఁడా, నిరం జన = దోషరహితమైన, రంజన = రంజించునట్టి, కాయ = శరీరము నందున, కాయజా = మన్మథునివంటివాఁడా

క॥ ధామాతి భూతి సోమా
సోమాత్మజ శూర శూర ♦ శుచికరధామా
ధామాకర ధనసోమా
[illegible] ॥ 129

టీక ధామ = ప్రభావమైన, అతిభూతి = అధికైశ్వర్యము నందున, సోమా = ఈశ్వరునివంటివాఁడా, సోమాత్మజ = శివుని కొడుకైన కుమారస్వామివంటి, శూర = సాహసముగలవాఁడా, శూర = సూర్యునివంటి, శుచికర = పవిత్రకరమైన, ధామా = కాంతిగల వాఁడా, ధామ = గృహమునకు, ఆకర = ఆధారమైన, ధన = ద్రవ్యమునందున, సోమా = కుబేరునివంటివాఁడా, సోమాత్మజ = కుబేరుని కొడుకైన నలకూబరునివంటియు, భూరి = బంగారు వంటియు, భూరిసుందర = అధికసుందరమైన, ధామా = శరీరము గలవాఁడా,

ఉత్సాహ॥ సురభి సురభి రాజరాజ • సూనుసూను దానదా
సరస సరస ధర్మధర్మ • జాతజాత రూపరూ
పరమపరమ ధిషణధిషణ • భానుభాను తాచ్యుతా
శరధిశరధి తారతార • చంద్ర చంద్ర సద్యశా॥ 126

టీక సురభి = మనోహరమైన, సురభి = కామధేనువును, రాజరాజ = కుబేరుని, సూనుసూను = సూర్యునికొడుకైన కర్ణుని, దాన = ఈవిని, దా = ఛేదించువాఁడా, లేక, కామధేను కుబేర కర్ణుల యీవివంటి యీవిగలవాఁడా, సరస = రసయుక్తమైన, సరస = పరిహాసముగలవాఁడా, ధర్మ = న్యాయమునందున, ధర్మజాత = యమనందనుఁడైన ధర్మరాజువంటివాఁడా, జాతరూప = బంగారువంటి, రూపరమ = వర్ణసంపదగలవాఁడా, పరమ = ఉత్కృష్టమైన, ధిషణ = బృహస్పతివంటి, ధిషణ = బుద్ధిగలవాఁడా, భాను = సూర్యుని వంటి, భా = కాంతిగలవాఁడా, నత = కొనియాడఁబడిన, అచ్యుత = విష్ణుమూర్తిగలవాఁడా, శరధి = సముద్రమును, శరధి = అంబులపొదిగల యీశ్వరుని వంటియు, తార = వెండివంటియు, తార = ముత్యమువంటియు, చంద్ర = కర్పూరమువంటియు, చంద్ర = చంద్రునివంటియు, సత్ = నక్షత్రమువంటియు, యశా = కీర్తిగలవాఁడా,

సీ॥ ననుసాకినట్లు మా • తను పితను సాక నా
కవకాశము లభించ • నట్టి ఋణము
సాంబమూర్తి వరప్ర • సాదంబుఁగొని తన
ననిశమున్ ధ్యానింప • నట్టి ఋణము
విశ్వకర్మాన్వయా • విర్భూతినై కుల
వ్యాపారములుఁ జేయ • నట్టి ఋణముఁ
దావకాస్థాన వి • ద్వత్కవినై భవ
దర్థం బనుభవించు • నట్టి ఋణముఁ

గీ॥ దీర్చుకొనుటకుఁ గాంక్షి • లియను నేనుఁ
దల్లిదండ్రులఁ బేర్కొని • దర్పకారి
కథను శిల్పచమత్కృతి • గలుగఁ గూర్చి
తమకుఁ గృతినిచ్చినాఁడ గ • ద్వాల తేఁడ॥ 126

టీక. సుగమము

చ॥ అమరఁగఁ బెక్కుమంది గని • యర్థము గాదను నీదుత్ర్యర్థికా
వ్యముగలలాభ మేమియని • యల్పులుపల్కుదు రగ్రజాతి వ
ర్జమును దరిద్రులెల్లఁగొనఁ • జాలదురే తమటోటి సాధ్యభౌ
మములుఁ దానిఁ గైకొనరె • మత్కృతినట్లె బుధుల్ గ్రహింపరే॥

టీక సుగమము.

మ॥ అతి చిత్రంబుల కాటపట్టన మహా • త్ర్యర్థి ప్రబంధంబనన్
బ్రతిపద్యంబు రసాస్పదంబగననన్ • భాసిల్లు చున్నట్టి మ
త్కృత సారంగధరీయమున్ గొనుము వృ • త్తిన్‌జేసియర్పించితిన్
దత గద్వాల పురీశముష్టిపలి సీ • తారామభూపాలకా॥ 128

టీక. సుగమము

క॥ ఈ త్ర్యర్థకావ్య మతిపై
చిత్ర్యం బెవరేని పరనఁ • జేసిన విన్నన్
శీఘ్రత్యంబకుఁ డిడుఁ గావుత
ధాత్ర్యారోగ్యాయురర్థ • తతి సంతతులన్॥ 129

గీ॥ మంగళంబగు నీదు సా • మ్రాజ్యమునకు
మంగళంబగు నీ కుటుం • బమ్మునకును
మంగళంబగు నీకు నీ • మహిమలకును
దానజితకల్ప భూజ గ • ద్వాలరాజ॥ 130

టీక సుగమము.

గద్యము.

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధ చతుర్విధకవితా విచిత్ర
విశ్వకర్మకుల పవిత్ర భద్రదత్తగోత్ర వోరూరి
వంశాబ్ధి కైరవమిత్ర రామలక్ష్మాంబా సుబ్బయా
చార్య తృతీయ పుత్ర కవిసింహ బిరుద
పాత్ర బుధజనానుమతి
కాశీపతి ప్రణీతంబైన
సారంగధరీయం
బను త్ర్యర్థికావ్యంబునందుఁ
జ తు ర్థా శ్వా స ము స ం పూ ర్ణ ము.



# SARANGADHARIYAMU

## A TRYARTHI KAVYA in TELUGU

BY 'KAVISIMHA' POKURI KASIPATYAVADHANULU

'కవిసింహ' శ్రీ పోకూరి కాశీపత్యవధానులు గారు (1892 - 1974) గుంటూరు జిల్లా - పల్నాటి తాలూకా – బోదిలవీడు గ్రామంలో జన్మించారు జననీ జనకులు లక్ష్మాంబా సుబ్బయాచార్యులు

కాశీపతిగారు ఇరవైయేళ్ళు నిండీ నిండకముందే చతుర్విధ కవితా ప్రావీణ్యం సంపాదించారు అచిరకాలంలోనే గద్వాల సంస్థానంలో ఆస్థాన కవిగా నియమితులైనారు

దాదాపు 60 దాకా వ్రాసిన వీరి గ్రంథాలలో – నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానం, సిద్ధయోగి చరిత్ర, త్రింశదర్థ పద్యరత్నం, శౌరి శైశవలీల, సుజ్ఞాన ప్రబోధిని, నరసింహ నిరసన స్తుతి, శ్రీశైలమల్లీశ్వర శతకం ము॥ ముఖ్యంగా పేర్కొన దగినవి.

వీరు వివిధ సంస్థానాలలో తమ కవితా పాండిత్యం ప్రదర్శించి అనేక బిరుద సన్మానాలు పొందారు 'కవిసింహ' బిరుదం గద్వాల సంస్థానాధీశుల నుండి పొందిందే కనకాభిషేక, గజారోహణ, 'గండపెండేర సత్కారాదులు కూడా పలుచోట్ల పొందారు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారు రాష్ట్రపతి నిలయం నుండి వీరికి చేసిన సత్కారం స్మరణీయం

శ్లేషయమకాది శబ్దాలంకార విలసితంగా, ఆశు గర్భ చిత్ర బంధ కవితా విస్తృతంగా – ధ్వని విరాజితంగా కవితల్లి ప్రాచీనాంధ్ర కవితా సంప్రదాయాలకు అనర్ఘ సేవ లందించిన పండితకవి శ్రీ కాశీపత్యవధానులు